మధ్య రంధ్రము ఏర్పడును. రెండు చేతులతోను చేయుము. మిగిలిన మూడు వ్రేళ్లను నేరుగా పెట్టుము. ఇట్టి చేతులను తొడలపై బోర్లా నుంచుము. ఈ స్థితి చిన్ముద్ర యనబడును. పూరక కుంభక రేచకములను పది సైకిళ్ళు చేయుము. ఈ విధంగ చేయుటవలన శరీరము యొక్క నాభి క్రిందిభాగమున గల చిన్న నాడులన్నియు శుద్ధియై, వాటిలో ప్రాణశక్తి ప్రవహించి ఉత్తేజము లగును.

చిన్మయ ముద్ర - ఆసనములోనే యుండుము. చేతి చూపుడు వ్రేలును బొటనవ్రేలును కొనలందు జత చేర్చుము. రెండు వేళ్ల మధ్య రంధ్రము ఏర్పడును, రెండు చేతులతోను చేయుము. మిగిలిన మూడు వ్రేళ్లను అరచేతిలోకి పిడికిలివలె ముడువుము. ఇట్టి చేతులను తొడలపై బోర్లానుంచుము, ఈ స్థితి చిన్మయముద్ర యనబడును. పూరక కుంభక రేచకములను పది సైకిళ్ళు చేయుము. ఈ విధంగ చేయుటవలన శరీరముయొక్క నాభికి పై భాగమునను హృదయమునకు క్రిందిభాగమునను గల చిన్న నాడులన్నియు శుద్ధియై, వాటిలో ప్రాణశక్తి ప్రవహించి ఉత్తేజములగును.

**ఆదిముద్ర** - ఆసనములోనే యుండుము. చేతి బొటన వ్రేలును చూపుడువ్రేలు అడుగుభాగమున నుంచుము. బొటనవ్రేలు పై మిగిలిన నాలుగువ్రేళ్లను ఉంచి పిడికిలి బిగించుము. రెండు చేతులతోను చేయుము. ఇట్టి చేతులను తొడలపై బోర్లానుంచుము. ఈ స్థితి ఆదిముద్ర యనబడును. పూరక కుంభక రేచకములను పది సైకిళ్ళు చేయుము. ఈ విధంగ చేయుట వలన శరీరము యొక్క హృదయస్థానమునుండి తల పై భాగము వరకు గల చిన్న నాడు లన్నియు శుద్ధియై, వాటిలో ప్రాణశక్తి ప్రవహించి ఉత్తేజము లగును.

# నిజం



రచయిత :

**శ్రీ కరణం జ్యోతి, బి. ఏ.,**

డిప్యూటి తాసిల్దార్,

6-37 విజయలక్ష్మినగర్ కాలనీ, సంతపేట - 517004.

చిత్తూరు టౌన్ - (ఆం. ప్ర.)

**1998**

# నిజం (NIJAM)

రచయిత :
శ్రీ కరణం జ్యోతి, బి. ఎ.,
డిప్యూటి తాసిల్దార్,
6-37 విజయలక్ష్మినగర్ కాలనీ,
సంతపేట - 517004.
చిత్తూరు టవున్, (ఆం. ప్ర.)

ప్రథమ ముద్రణ : 1,000 ప్రతులు.

అక్టోబరు : 1998

మూల్యము : రూ. **50/-**



ముద్రణ :
శ్రీ బాలాజీ ప్రెస్,
గాంధీరోడ్డు, చిత్తూరు - 517001.

# ముందుమాట

విజ్ఞానం అవధులు లేనంతగ పెరిగింది. కాని విజ్ఞానం అందరికీ అందుబాటులో లేదు. విజ్ఞానం ఎంత పెరిగిందో సమాజంలో ఆర్థిక సామాజిక అసమానత్వాలు అంతగా పెరిగినాయి. సమానత్వాన్ని పొందేందుకు ముందు వెనుకలు ఆలోచన లేకుండ మానవుడు తప్పులు చేయు చున్నాడు. ఆశాపాశాలతో అసంతృప్తి అశాంతి చోటు చేసుకొనుచున్నాయి. ఈ విధంగ దారి తప్పిన మానవుని అదుపు చేసేందుకు పోలీసు, న్యాయ, జైళ్ళ వ్యవస్థలు మిక్కుటముగ స్థాపింపబడినవి. అరాచకాలు అశాంతి పెరిగినందులకు ఈ మూడు వ్యవస్థలే నిదర్శనం.

ఆర్థికవేత్తలు, రాజకీయనాయకులు ఉన్న సంపదను అందరికీ పంచిపెట్టవలెనని తద్వారా సమానత్వాన్ని సాధించాలని ఎన్నెన్నో ప్రణాళికలు వేయుచున్నారు. అభివృద్ధి

కార్యక్రమాలను గణనీయంగ అమలుచేయు చున్నారు. రాజరికాలు, నియంతృత్వాలు, సోషలిజాలు, కమ్యూనిజాలు, ప్రజాస్వామ్యాలు గాగల వివిధ పద్ధతులతో ప్రయోగాలు చోటుచేసుకొన్నాయి. కాని ఈ ప్రయోగాలు ఆర్థిక సామాజిక అసమానత్వాలను తొలగించలేక పోతున్నాయి. ఆర్థిక సామాజికల సమానత్వం జ్ఞానంతోనే కలుగుతాయి గాని విజ్ఞానంతో కలుగవు. విజ్ఞానం వస్తుతృప్తిని అందజేస్తుంది గాని మానసిక సంతృప్తిని ఇవ్వజాలదు. జ్ఞానం ఆత్మ సంతృప్తిని తద్వారా నిత్య మనశ్శాంతిని ఇస్తుంది. విజ్ఞానం అవసరమేగాని జ్ఞానాన్ని వీడిన విజ్ఞానం నిష్ప్రయోజనం.

అదేవిధంగా మానవుడు తలా ఒక సిద్ధాంతాన్ని పట్టుకొని ఆ సిద్ధాంతాల వ్యాప్తికోసం తన స్వార్థం కోసం సాటి మనిషిని పీల్చి పిప్పిచేస్తున్నాడు. రకరకాల గుణాలు, దుర్బుద్ధులు గల మనుష్యులు విచ్చల విడిగా వదయాడు చున్నారు. పుట్టిన మానవులందరూ మంచి గుణములు కల వారైతే అవని బాగుపడుతుంది. పోలీసు, న్యాయ, జైళ్ళ వ్యవస్థలతో పనియుండదు. ఈ మూడు వ్యవస్థలపై పెట్టు పెట్టుబడులు ఇతర అభివృద్ధి కార్యక్రమాలకు వినియోగించ వచ్చును.

మరియు కోకొల్లలుగ గర్భస్రావాలు, అల్పాయు ష్కులు, అర్ధాయుష్కులు నైన సంతానాలను పొందు చున్నాము. నిండా నూరేండ్లు జీవించే వారిని వ్రేళ్ళపై

లెక్క పెట్టవచ్చును. ఈ దుఃఖాన్ని దుర్గతిని నివారించి పూర్ణాయుషుగల సంతానాన్ని పొందుట ఎంతో అవశ్యం.

అవతార పురుషులు మొదలుకొని అల్లాటప్పా జనం వరకు గల సకల మానవులు తల్లి గర్భాల నుండే జనించేది. మట్టిలోకే పోయేది. కాని ఒకడు ధనవంతుడు, ఇంకొకడు దరిద్రుడు, ఒకడు నాయకుడు ఇంకొకడు కూలివాడు, ఒకడు అధికారి ఇంకొకడు నౌకరు. అదృష్టం హెచ్చుతగ్గులతో నుంటేనే సృష్టి నడుస్తుంది. సృష్టి నడవాలంటే అదృష్ట భేదం ఉండవలసిందే. కాని తక్కువ అదృష్టం ఉన్నవారు ఎక్కువ అదృష్టవంతులుగ కాకూడదా? మానవునికి అదృష్టభేదం ఎందుకు కలుగుతుంది? దీనిని నివారించే ఉపాయం ఉన్నదా? ఈ దిశగా ఎందుకు ప్రయత్నం చేయరాదు? తద్వారా సమానత్వాన్ని ఎందుకు సాధించరాదు?

తలవ్రాతను వ్రాసేదెవరు? ఇందులో మనిషి పాత్ర ఎంత? తలవ్రాతను మనుషులే ఎందుకు వ్రాయరాదు? సద్గుణవంతులు, అదృష్టవంతులు, పూర్ణాయుష్కులు గల సంతానాన్ని ఎందుకు పొందరాదు? అవతార పురుషులు, కారణజన్ములు ఆ అమ్మల కడుపులలోనే ఎందుకు పుట్టవలె? మన అమ్మల కడుపులలో కూడ పుట్టవచ్చును గదా!

పై వాటిని సాధించాలంటే జ్ఞానాన్ని అనుసరించాలి. జ్ఞానాన్ని వదలి సాధించుకో దలచు విజ్ఞానం వ్యర్థం.

జ్ఞానాన్ని అనుసరిస్తూ విజ్ఞానాన్ని అవలంబిస్తే ఆత్మ సంతృప్తి, మానసిక వికాసం, స్థిరబుద్ధి, చక్కటి అవగాహన కలుగుతాయి. తద్వారా స్వార్థం నశిస్తుంది, సమాజ సేవ అలవడుతుంది. సమానత్వం కలుగుతుంది. ఎల్లెడలా శాంతి స్థాపిత మౌతుంది. అద్దాని వలన విశ్వసౌభ్రాతృత్వం వసుధైక కుటుంబం ఏర్పడుతుంది. కావున "నిజం" నమ్మండి, మనసా వాచా కర్మల జ్ఞానాన్ని అనుసరించండి విజయాన్ని పొందండి.

జై మానవాళి

తేది : 01—3—1998
స్థలము : చిత్తూరు–517004

కరణం జ్యోతి.
రచయిత.

' Registered Parcel

Chittoor.
12—3—1998

)

The Secretary to Government,
General Administration (Services) Department,
Government of Andhra Pradesh,
HYDERABAD.

:spected Sir,

Sub:— The A.P. Civil Services (Conduct) Rules 1964–Permission for publication of the book titled "NIJAM" (Telugu) Permission under Rule 13 Sought for.

---

I submit that I am now working as Deputy Tahsildar, :venue Department, Chittoor District. I am put in 31 ars of service in the Department. During my service, ıave practised writing of small books in Telugu. I have w written a book in Telugu titled as "NIJAM". This ok deals with details of common interest and philoso- ical knowledge, useful for human community.

In this connection I submit that as a Government rvant, permission of Government is necessary for the blication of books other than literary, artistic or ientific character. But this book 'NIJAM' is purely of erary value, requiring no permission of the Govt. as per idelines issued in G,O. Ms. No. 553, G. A. (Ser. C) :pt. dt. 8—8—1974. However in academic interest and

to be on the safer side, I am applying for permission of the Govt. for publication of the book "NIJAM" under Rule 13 of the A.P Civil Services (Conduct) Rules 1964. I, therefore, request that the Government may kindly accord permission for me for publication of the book "NIJAM" at an early date. I enclose herewith a copy of the manuscript of the book 'NIJAM" for the purpose and as required Synopsis in English for the book is also pasted on the wrapper.

I further submit that since the book is purely of literary and philosophical character, I am going ahead with the publication of the book, in anticipation of grant of permission by the Government. I also submit that I shall abide by other Rules regarding payment of Income Tax etc.

I request early orders in the matter.

Encl:— Bound Book "NIJAM" Telugu Manuscript.

Yours faithfully,

Sd-

( K. JYOTHI )

From

**K. JYOTHI**, B A.,
Deputy Tahsildar (on long leave)
6-37, Vijayalakshmi Nagar Colony,
SANTHAPET-517 004,
Chittoor Town.

# Synopsis in English for the book 'NIJAM" (The Truth)

Wisdom is existing in Vedas, Upanishads, Ramayana, Maha Bharatha, Bhagavatham etc. ancient Indian literatures. Wisdom can be acquired by performing Yoga & Pranayama. Vasishta, Viswamithra, Vyasa, Suka etc. Maharshis performed yoga & pranayama, acquired wisdom and helped humanity a lot. Till Dwapara Yuga, wisdom was the breathing of the people, on which account Dharma existed. Until Kurushethra War all kingdoms in the entire world were looking forward towards India for guidance. In this war, great destruction took place both to man-power and material. It took more than 4,000 years for other country people to withstand and to survive stably. After this, they thought of India, India's greatness etc. Avathara Purusha Sri Krishna inspired them a lot. A thought came to them as to why God bornes always only in India, Maharshis exist only in India and why India dominated the world. The answer for them was the existence of Vedas etc. in India. Hence they thought of becoming wise. For this purpose they were in need of Vedas etc. literature Therefore, they made efforts to conquer India through several voyages, battles etc. They took literature and looted wealth. They developed science & technology through the bookish knowledge from out of the Vedas etc. literature. The result is the present science & technology.

In fact through wisdom acquired from Vedas, man becomes mental satisfaction, achieve mental peace. But the science & technology gives only material civilisation but not mental civilisation. No doubt science & technology improved the standard of living but man is ambitious more and more to acquire wealth, property, power etc. To achieve this goal man is doing all sorts of mischievous deeds at the cost of cohumanbeing. Science & Technology is necessary but without wisdom it is a failure. Hence, Yoga & Pranayama should compulsorily be performed by each and every person to get self satisfaction and mental

peace. Wisdom is always safer whereas science & technology is oneside beneficial and on the other side destructive by weapons, autom bombs etc.

Lady is the mother to ladies, gents, Avathara Purushas, Maharshis etc. Fate is written during pregnancy period of nine months. Abortions, child deaths, middle aged deaths can be avoided by wisdom. Avathara Purusha births can be had even now with wisdom. All these are in the hands of parents, particularly ladies. Hence, ladies should be properly trained and motivated to give births to characterhood children. Thus, if all human births are characterhood, mental peace, mental satisfaction prevails.

When all humanbeings in the world are mentally satisfied, there will not be any problem for the existence. Casteisms, religious quarrels, territorial wars can be prevented Everywhere peace and calm remains and thus brotherhood and humanity can be achieved.

The book NIJAM (The Truth) is to achieve the above goals.

(K. JYOTHI)

By Registered Parcel

Chittoor.
05—8—1998

From

**K. Jyothi,** B,A.,
Deputy Tahsildar,
6-37, Vijayalakshmi Nagar Colony,
Santhapet-517 004
Chittoor Town (A.P.)

To

The Press Secretary to the President of India,
Rashtrapathi Bhavan,
NEW DELHI - 100 001

*Respected Sir,*

*I submit that I am working as Deputy Tahsildar, Revenue Department, Chittoor District. I am put in 31 years of service in the Department. During my service I have practised writing of small philosophical books in Telugu. During 1981 I wrote, printed and published "Athma Jyothi" Telugu Philosophical book. The Director of Libraries, A.P., Hyderabad had approved this book. Similarly, during 1982 I wrote, printed and published "Jeevana Jyothi" Telugu Philosophical book. The library authorities in Chittoor District purchased these two books for their branches.*

*Now I have written another Telugu Philosophical book by name "Nijam" (The Truth). Manuscript of "Nijam" along with synopsis in English is submitted herewith. This book "Nijam' deals with details of India's heritage, common interest and philosophical knowledge, useful for entire human community of the world to achieve self-satisfaction and bliss.*

*I request you, Sir, kindly to obtain "Forward" on this book from our Hon'ble President of India and arrange to send me the same so as to enable me to incorporate the Forward in the publication of the book.*

*Thanking you Sir,*

*Yours faithfully,*

Sd-

*(K. JYOTHI)*




राष्ट्रपति का उप प्रेस सचिव
Deputy Press Secretary to the Prasident
Tel. 3793528
Fax. 3017290

राष्ट्र पति सचिवालय
राष्ट्रपति भवन
नईदिल्ली-110004
President's Secretariat
Rashtrapati Bhavan
NEW DELHI-11004

No. D-4/DPS/98

August 19, 1998

Dear Shri Jyothi

*Please refer to your letter dated 5th August, 1998, requesting he Hon'ble President to write a "Foreword" for yaur book 'Nijam" (The Truth).*

*While the President appreciates the request, he ragrets that pressing demands on his time makes it difficult for him to accede to the request.*

*The President extends his good wishes to you.*

*With regards*

Yours sincerely,

Sd-

*(K. Satish Nambudiripad)*

Shri K. JYOTHI
Deputy Tahsildar
Revenue Department,
6 37 Vijaylaxmi Nagar Colony,
Santhapet-517 004
Chittoor Town A.P.

By Registered Parcel

Chittoor.
05—8—1998

From

**K. Jyothi**, B.A.,
Deputy Tahsildar,
6-37, Vijayalakshmi Nagar Colony,
Santhapet-517 004
Chittoor Town (A.P.)

To

The Press Secretary to the Prime Minister of India,
Prime Minister's Office,
NEW DELHI - 100001

*Respected Sir,*

*I submit that I am working as Deputy Tahsildar. Revenue Department, Chittoor District. I am put in 31 years of service in the Department. During my service I have practised writing of small philosophical books in Telugu. During 1981 I wrote, printed and published "Athma Jyothi" Telugu Philosophical book. The Director of Libraries, A.P., Hyderabad had approved this book. Similarly, during 1982 I wrote, printed and published "Jeevana Jyothi" Telugu Philosophical book. The library authorities in Chittoor District purchased these two books for their branches.*

*Now I have written another Telugu Philosophical book by name "Nijam" (The Truth). Manuscript of "Nijam" along with synopsis in English is submitted herewith. This book 'Nijam' deals with details of India's heritage, common interest and philosophical knowledge, useful for entire human community of the world to achieve self-satisfaction and bliss.*

*I request you, Sir, kindly to obtain "Forward" on this book from our Hon'ble Prime Minister, and arrange to send me the same so as to enable me to incorporate the Forward in the publication of the book.*

*Thanking you Sir,*

*Yours faithfully,*

Sd-

(*K. JYOTHI*)

By Registered Parcel

Chittoor.
12—8—1998

From

K. Jyothi, B. A.,
Deputy Tahsildar,
6-37, Vijayalakshmi Nagar Colony,
Santhapet - 517 004
Chittoor Town (A. P.)

To

The Principal Secretary to the Chief Minister of A .P.
Government of A. P.,
Secretariat Buildings.
HYDERABAD - 500 004.

Respected Sir,

I submit that I am working as Deputy Tahsildar, Revenue Department, Chittoor District. I am put in 31 years of service in the Department. During my service I have practised writing of small philosophical books in Telugu. During 1981 I wrote. printed and published "Athma Jyothi" Telugu Philosophical book, The Director of Libraries, A P., Hyderabad had approved this book. Similarly, during 1982 I wrote, printed and published "Jeevana Jyothi" Telugu Philosophical book. The library authorities in Chittoor District purchased these two books for their branches.

Now I have written another Telugu Philosophical book by name "Nijam" (The Truth), Manuscript of "Nijam" along with synopsis in English is submitted herewith. This book "Nijam" deals with details of India's heritage common interest and philosophical knowledge, useful for entire human community of the world to achieve self-satisfaction and bliss.

I request you, Sir. kindly to obtain "Forward" on this book from our Hon'ble Chief Minister of A. P and arrange to send me the same so as to enable me to incorporate the Forward in the publication of the book.

Thanking you Sir,

Yours faithfully,

Sd/-

(K. JYOTHI)

# విషయ సూచిక







# జ్ఞానం - విజ్ఞానం



తపస్సువల్ల గ్రహించినది జ్ఞానం. కృషివల్ల సాధించినది విజ్ఞానం. జ్ఞానం అపారం. విజ్ఞానం పరిమితం. జ్ఞానం మేధో సంపత్తితో తెలుసుకో గలిగినది. కార్యరూపంలో కూడా దీనిని చూడవచ్చును. విజ్ఞానం వస్తురూపంగ వుంటుంది. భగవంతునితోను ప్రపంచముతోను మానవునికి గల సంబంధమును తెలుపునది జ్ఞానం. కేవలం వస్తు ప్రపంచాన్ని అందియ్యగలది విజ్ఞానం. జ్ఞానం ఆత్మ స్థయిర్యాన్ని, ఆత్మ సంతృప్తిని, నిత్యానందాన్ని కలిగిస్తుంది. విజ్ఞానం ఆందోళనను, అసంతృప్తిని, సదాచింతను కలిగిస్తుంది. జ్ఞానం శాశ్వతం. విజ్ఞానం అశాశ్వతం, మరియు రూపాంతరం చెందుతూ యుంటుంది. ఈ సత్యాన్ని తెలిసికొని మానవాళి ముందుకు సాగితే భవిష్యత్తు బాగుంటుంది. విశ్వశాంతి, విశ్వ సౌభ్రాతృత్వం, సమానత్వం, వసుధైక కుటుంబం సాధించాలంటే జ్ఞానాన్ని అనుసరించి, జ్ఞానంతో కూడిన విజ్ఞానాన్ని పాటించాలి. జ్ఞాన రహిత విజ్ఞానం తాత్కాలిక ఉపశమనాన్నిస్తుంది. తర్వాత అశాంతిని మిగిలిస్తుంది.

జ్ఞానం అంటే ఏమి విజ్ఞానం అంటే ఏమి అని మనం తెలుసుకొనుట సముచితం.

ఈ భూగోళం చాల విశాలమైనది, అతి ప్రాచీనమైనది. జీవరాశులు ఈ భూమిపైనే మనుగడ సాగిస్తాయి. సకల సంపదలకూ ఆలవాలమైనదీ ఈ భూగోళమే. భూమి ఉద్భవించినప్పటి

నుంచీ జీవరాశులున్నాయి. అందులో ఉత్కృష్ట జన్మ మానవజాతి. ఈ మానవజాతి అన్ని ప్రాంతాలలో లేకుండెను. అమెరికా ఖండం మినహా మిగతా భూభాగంలో మానవజాతి యుండెడిది. అందులో భరతవర్షం ఒక్కటి, ఈ భరతవర్షం జ్ఞానానికి పుట్టినిల్లు. సంపదలకు నజరా. యుగాల పర్యంతం భరతవర్షం చరిత్ర పుటాల్లో ప్రాముఖ్యాన్ని సంతరించుకొన్నది. భరతవర్షం కేంద్రబిందువుగా సృష్టిసాగింది. ముల్లోకాలతోనేమి, పదునాల్గు లోకాలతోనేమి స్నేహబాంధవ్యాలు నెఱపుచుండినది భరతవర్షం. దేవుళ్లు ఈ భరత వర్షంలోనే అవతారాలెత్తి మానవ మనుగడకు, సృష్టికార్యానికి, లోకహితానికి ఎన్నోన్నో చేశారు. మహర్షులు ఈ భరతవర్షంలోనే పుట్టారు, మనుగడ సాగించారు, లోక కల్యాణానికి శాయశక్తులా కష్టించినారు, తపస్సుచేసి జ్ఞానాన్ని అందించినారు.

మహర్షులు తపస్సు ద్వారా తాము పొందిన జ్ఞానాన్ని భవిష్యత్తుకు అందించారు. వాటికి వేదాలు అని పేరుపెట్టారు. ఇవే మార్గదర్శకాలన్నారు. ఈ వేదాలు అందరికీ అర్థం అయ్యేందుకు గాను వీటిని నాలుగు భాగాలుగ విభజించినారు. అందులో మొదటిది ఋగ్వేదం జ్ఞానాన్ని గురించీ, రెండవదియగు యజుర్వేదం కర్మను గురించీ, మూడవదియగు సామవేదం ఉపాసన గురించీ, నాలుగవది యగు అథర్వణవేదం యంత్ర మంత్ర తంత్ర ఉపాసన మరియు బ్రహ్మజ్ఞానాన్ని గురించీ బోధిస్తాయి. ఈ వేదాలు ధర్మసంరక్షణార్థం లోకకల్యాణార్థం సృష్టి నిరంతరాయ మనుగడకోసం జన్మను తరించుకొనుటకుగాను సృజింపబడినవి.

వేదములు మతగ్రంథములు కావు. ఇవి వివిధ జిజ్ఞాసువులచే యోగతపశ్శక్తివలన క్రోడీకరింపబడిన ఇహపరసూత్ర సమారామములు. సత్యానికి, న్యాయానికి, ధర్మానికి ఆధారములు. సూర్యుని వెలుతురు, వాతావరణము యొక్కగాలి ఏ విధంగ అందరిసొత్తో అదేవిధంగ వేదాలు వేదసారాలు వేదజ్ఞానంకూడ భూమిపై జనించిన

ప్రతి మానవునియొక్క సొత్తు. ఈ వేదాలుకూడ అర్థంకావటంలేదని వాటిని అర్థం చేసుకోవటానికి ఎన్నో ఉపనిషత్తులను అందించినారు మహర్షులు. ఈ వేదాలు ఉపనిషత్తులు ఎన్నో యుగాలుగ చేసిన తపఃఫలంవలన సిద్ధించిన జ్ఞానంతో రచించినవేగాని ఆషామాషిగ అందించినవి కావు.

మహర్షులు వేదాలవలన పొందిన జ్ఞానంతో తపస్సులుచేసి దూరదేశములయందు జరుగుచుండెడి విషయములను వినుచుండిరి, చూచుచుండిరి అనంతాకాశమునసుందు సకలమును కనుగొనిరి. సృష్టి రహస్యములను చెప్పగలిగిరి. కాయసిద్ధిని పొందిరి. అణిమాది సిద్ధులను గడించిరి. నవఖండములయందు సంచరించగలిగిరి. పరకాయ ప్రవేశము చేయగలిగిరి. బ్రహ్మ విష్ణు మహేశ్వరుల సాక్షాత్కారములను పొందగలిగిరి. త్రిమూర్తులలోకాలకు పోగలిగిరి. సృష్టికి ప్రతిసృష్టి చేయగలిగిరి. తాము పొందిన జ్ఞానశక్తులతో దుష్టులకు శాపము లిచ్చుచుండిరి, శిష్టులకు వరముల ననుగ్రహించుచుండిరి.

రాజులు వేదాల నాధారంగ మహర్షులను తమ ఆస్థాన గురువులుగ మంత్రులుగ కులగురువులుగ నుంచుకొని తమరాజ్య రక్షణ, తమరాజ్య విస్తరణ గావించుకొన్నారు. ఆయుధసంపత్తిని పెంచుకొన్నారు. దండచక్రము, ధర్మచక్రము, కాలచక్రము, విష్ణుచక్రము, ఐంద్రము, వజ్రము, శివశూలము, బ్రహ్మశీర్షము, ఐషీకము, బ్రహ్మము, మోదకి, శిఖరి, గద, వరుణపాశము, వారుణము, ధర్మపాశము, కాలపాశము, ఆర్ద్రము, శుష్కము, నారాయణము, నాకము, ఆగ్నేయము, శిఖరము, వాయవ్యము, జిహ్మగము, హయశిరము, క్రౌంచము, కంకాలము, ముసలము, కంకణము, కాపాలము, విద్యాధరము, నందనము, అపిరత్నము, మానవము, గాంధర్వము, ప్రశమనము, ప్రస్వాపనము, భాస్కరము, దర్పణము, శోషణము, సంతాపనము, విలాపము, దర్పకము, కందర్పకము,

పైశాచికము, మోహనము, సంవర్తకము, దామనము, సౌమనము, అమోఘము, మౌసలము, తేజఃప్రభ, సత్యము, మాయాధరము, సౌమ్యము, సుదామనము, భగము, శీతము, మానవశితము, అనే అరువది దివ్యాస్త్రాలు; ఇంకను నలబై సాధారణ అస్త్రాలు పొందిన వారై, రాజులు తమ రాజ్యరక్షణకై శత్రుసంహారములు చేయు చుండిరి. ఈ రాజులు వివిధ దేశాధీశులనేగాక ముల్లోకాలను జయించు చుండిరి, పాలించుచుండిరి, దేవతలకు యుద్ధములందు సాయపడు చుండిరి.

మహర్షులు రాజులు కలిసి చాతుర్వర్ణాలను పోషించుచుండిరి. సంగీతము, సాహిత్యము, శిల్పము, నాట్యము, జ్యోతిషము, వైద్యము మొదలగు అరువది నాలుగు కళలను పెంచి రాబోయే తరాలవారికి చిరస్థాయిగ అందించిరి. కవులను, గాయకులను, జ్యోతిష్కులను, వైద్యులను తమ ఆస్థానాలలో నియమించుకొని ఆయారంగాలలో పరిశోధనలను చేయించి మానవాళికి మహోపకారం చేసినారు. వీరి ఈ కృషివలన సృష్టికార్యం సక్రమంగ సాగుచుండినది, ధర్మం దర్పణం పడుతుండినది.

యుగాలు గడవనూ, సంవత్సరాలు గతించనూ ఈ విశాల భూప్రపంచం దేశాలుగ విడివడినాయి. ఆచార వ్యవహారాలు విడి వడినాయి. సంస్కృతీ నాగరికతలు వేర్వేరుగ దేశకాల పరిస్థితుల కనుగుణంగ ఏర్పడినాయి. దుష్టత్వం ఎక్కువైంది. దేవుడు ఈ భారతావనిలోనే అవతారా లెత్తుచుండెను. ఈ దేశంలోనేగాక ఇతర దేశములందు కూడ దుష్టశిక్షణ శిష్టరక్షణలు చేయుచుండెను. లంకాధీశుడు రావణాసురుడు, ప్రాగ్జ్యోతిష పురాధీశుడు (ప్రస్తుత ప్రాన్సు) నరకాసురుడు ఇందులకు ఉదాహరణలు. కాలగమనంలో యుగాలు ప్రాముఖ్యం వహించినాయి. ద్వాపరయుగంలో వివిధ దేశాధీశులు శత్రుమిత్రులైనారు. మహాభారత యుద్ధమే ఇందుకు తార్కాణము.

మహాభారత యుద్ధానంతరం మిగిలింది ఏమి? పిల్లలు, వృద్ధులు, స్త్రీలు, వితంతువులు, సర్వవినాశనం, శోకం. భారత యుద్ధానంతరం ప్రపంచంలోని ప్రజలందరూ చాలా కష్టంగ దీనంగ మనుగడసాగించినారు. వీరందరు ఒక సమస్థితికి వచ్చుటకు సుమారు మూడు వేలు సంవత్సరములు పట్టినవి. తమకాళ్ళపై తాము నిలబడినారు. అప్పుడు తమకంటూ ఒక మతాన్ని, సంస్కృతిని, నాగరికతను ఏర్పరచుకొన్నారు. కొందరైతే తమదేశంలో పుట్టిన మహాత్ముల పేరిట మతాల నేర్పరచుకొన్నారు. ఇంకొందరు ఇతర దేశాలలోపుట్టిన మహాత్ముల పేరిట మతాల నేర్పరచుకొన్నారు. భారత దేశస్థులు మాత్రం తమ సంస్కృతిని, నాగరికతను, మతాన్ని పూర్వంలాగే అనుసరిస్తూ వచ్చినారు. ఈ ఇతర దేశస్థులు ముఖ్యంగ భారతగడ్డకు పశ్చిమంగ నున్నవారు తిరిగ్గ భారత దేశంగురించి, వేదాలగురించి, వేదాలలోని జ్ఞానాన్నిగురించీ ఆలోచించినారు. భారత దేశపు ఉచ్ఛస్థితికి కారణం వేదాలు, ఉపనిషత్తులని రూఢి చేసుకొన్నారు. ఎలాగైనా వేదాలను, ఉపనిషత్తులను పొందాలని ఆరాటపడినారు. వీటిలోని జ్ఞానాన్నిపొంది భారతమాతవలె తాము తమ దేశాలుకూడ అభివృద్ధి చెందాలని స్వయం సమృద్ధిసాధించాలని ఉబలాటపడినారు. శ్రీకృష్ణావతారం, భారతయుద్ధంలో శ్రీకృష్ణుని పాత్ర వీరిని ఇందుకు పురికొల్పింది

ఇంకేముంది. భారతభాగాని కానుకొనియున్న దేశస్థులు భారతావనిపై దండెత్తినారు. ధనరాశులను, బంగారాన్ని, వజ్ర వైడూర్యాదులను కొల్లగొట్టారు. కవులను పండితులను తమ దేశాలకు తరలించుకపోయూరు. వేదసారాన్ని, జ్ఞానాన్ని, ఉద్గ్రంథాలను ఎత్తుకపోయూరు. సముద్రతీరానగల పాశ్చాత్య దేశస్థులు సముద్రయానంద్వారా భారత దేశాన్ని కనుగొనాలని, భారత దేశాన్ని చేరాలని ఎన్నో ప్రయత్నాలుచేసారు. ఈ ప్రయత్నంలో భాగంగా సువిశాల ప్రపంచాన్ని కనుగొన్నారు. భారతావనిని

కూడ కనుగొన్నారు. కైవసం చేసుకొన్నారు. సామదానభేద దండో పాయాలతో భరతవర్షాన్ని ఆక్రమించినారు. సర్వం దోచుకొన్నారు. భరతమాత స్వంతమైన జ్ఞానాన్ని పొందాలని వేదాలను ఉపనిషత్తు లను ఉద్గ్రంథాలను మదించినారు. జ్ఞానాన్ని వదిలినారు. విజ్ఞానాన్ని పొందినారు. యావత్ప్రపంచానికీ విజ్ఞానాన్నందించినారు.

జ్ఞానం నిగూఢం. గురూపదేశం వలననే జ్ఞానాన్ని పొంద నగును. ఇతర దేశస్థులకు గురువులు లేరు. గురువులు లేని గురురహిత వేద పఠనం వేదసారగ్రహణం వట్టిపుస్తక జ్ఞానం మాత్రమే. ఫలితం విజ్ఞానంగ మారింది. ఈ విజ్ఞానానికి పరిమితులున్నాయి. ఎట్లంటే రూపాయనాణెమునకు ఒకవైపు నాణెపుఅంకె మరొకవైపు రాజముద్రలున్నట్లు విజ్ఞానానికి ఒకవైపు ప్రగతి మరొకవైపు వినాశనం. మనిషికి నీడవలె విజ్ఞానానికి లాభనష్టములు అభివృద్ధి నాశనములున్నవి. భారతయుద్ధంలో ద్రోణాచార్యుడు నారాయణా స్త్రాన్ని ప్రయోగిస్తాడు. ఏవైనా ఆయుధములు ధరించినవారు మాత్రమే ఈ నారాయణాస్త్రంచేత అపాయం పొందుతారు. ఆయుధ విసర్జనచేసినవారినీ నారాయణాస్త్రం ఏ హానీచేయదు ఎందు కంటే మంత్రోపాసనచేత ఈ నారాయణాస్త్రం ప్రయోగింపబడు తుంది. మంత్రసిద్ధివలన నిర్ణీతలక్ష్యాన్ని నెరవేరుస్తుంది. ఈ సామర్థ్యం జ్ఞానం అనబడుతుంది. కాని విజ్ఞానంవలన పొందిన ఆటం బాంబు వగైరాలను పేల్చితే ఏమవుతుంది? శత్రువూ మిత్రువూ. తనవారు పరాయివారు అనే తరతమభేదం లేకుండ అందరినీ నాశనం చేస్తాయి.

జ్ఞాన విహీన విజ్ఞానం వెర్రితలలు వేస్తున్నది. మానవ మను గడకు, సులభసుఖ జీవనానికి ఎన్నెన్నో సౌకర్యాలను కనిపెట్టినారు. అందరికీ అందించినారు. కాని విజ్ఞానం ఎంత మేలుచేస్తుందో అంత కన్న ఎన్నోరెట్లు కీడుచేస్తుంది, చేస్తూయున్నది. విజ్ఞానం వలన కలిగిన సౌకర్యాలు ఎంతైనా చాలటంలేదు. విశ్వమానవ సాభ్రా

వేదాలను విభజించినవాడూ, భారత భాగవత అష్టాదశ పురాణాలను రచించినవాడూ, నిఖిల నిష్ఠాగరిష్ఠుడూ, అద్వైతుడూ అయిన వ్యాసమహర్షి స్థిరనివాసము జర్మనీదేశము. తన ఏకైక ముద్దుల కుమారుడు శుకునికి జ్ఞానసందేహ నివృత్తి నిమిత్తం భారతదేశంలో యున్న మిథిలానగర పాలకుడు జనకమహారాజు కడకు పంపుతాడు. శుకుడు ఒక సంవత్సర కాలం కాలినడకన ప్రయాణించి మిథిలానగరాన్ని చేరుతాడు. మిథిలానగరం మునుపు భారతదేశపు అంతర్భాగమే అని అందరికీ తెలుసు. వేదవిభజకుడు, భారత భాగవత, అష్టాదశపురాణాల రచయిత, పాండవుల శ్రేయోభిలాషి, శ్రీకృష్ణ పరమాత్మ సన్నిహితుడైన వ్యాసమహర్షి తన దేశస్థుడు, చాలా గొప్పవాడు (ఆర్యుడు) కాబట్టి జర్మనీదేశస్థులు ఆర్యులు, జర్మనీ దేశము ఆర్యదేశము అన్నాడు హిట్లరు.

ఈ హిట్లరుయొక్క ఆర్యసిద్ధాంతము సరియైనదే కాని హిట్లరు చేసిన పొరపాటు ఏమిటంటే వ్యాసుని మానవాభ్యుదయాన్ని మరచినాడు. వశిష్ఠుడు విశ్వామిత్రుడు, కణ్వుడు ఆదిగాగల కోకొల్లలైన ఋషులు జన్మించిన భారతవర్షము ఆర్యులకన్న ఎన్నిరెట్లు గొప్పదో అని హిట్లరు ఆలోచించలేదు. శ్రీరామచంద్రుడు, శ్రీకృష్ణుడు, బుద్ధుడు ఆదిగాగల అవతార పురుషులు జనించిన భరతవర్షం ఎంత ఉచ్ఛమైనదో గ్రహించలేదు. ఒక వ్యాసుడు జనించినాడని గర్వించిన హిట్లరు ఎందరో వ్యాసులను (ఋషులను) కన్న భారతవర్షం ఎంత మాననీయమైనదో మరచినాడు హిట్లరు. ఆ ఒక్క వ్యాసమహర్షి తన దేశాన్ని విడిచి సుదూరంలో యుండే భారతదేశానికి ఎందులకు మేలుచేసినాడు, ఎందులకు నిరంతర సంబంధ బాంధవ్యాలు నెఱపినాడు అని ఊహించలేదు. అసలు వ్యాసుడు జన్మించినది భారతదేశంలో నేయనేది మరచినాడు. చెడుదైన విజ్ఞానాన్ని (తన సిద్ధాంతాన్ని) నమ్మినాడు.

పాలు నీరు రెంటినీ కలిపితే పాలేగాని నీరుకాదు. దీనిని హంసకు పెట్టితే హంస పాలను మాత్రం సేవించి నీటిని వేరుగ వదిలేస్తుంది. ఇది జ్ఞానంతో కూడిన పని. ఈ విధంగ హిట్లరు వ్యాసుని మంచినే గ్రహించియుంటే మంచిచేసి యుండెడివాడు, మహనీయుడయ్యేవాడు. కాని నీటిని గ్రహించి పాలను వదలినాడు. పామరుడైనాడు. చరిత్రహీనుడైనాడు, ప్రపంచాన్ని నిలువెత్తు ముంచాడు. ఇది అజ్ఞానంతో కూడిన విజ్ఞానం.

జ్ఞానంలోయున్న విజ్ఞానాన్ని ప్రస్తుత విజ్ఞానంలోయున్న విజ్ఞానాన్ని ఇక్కడ తర్కించితే బాగుంటుంది.

భూమిగుండ్రంగ నున్నదనియు ఆదిశేషునితలపై మిణుగురు పురుగువలె నిత్యం తనచుట్టు తాను తిరుగుచున్నదనియు భాగవతములో వర్ణింపబడియున్నది. అదే భాగవతంలో భూమి వైశాల్యం, పరిమాణము వగైరాలు చెప్పబడియున్నవి. అదే భూమికి దిగువగా భూగోళగర్భమందు ఏడులోకాలున్నాయనియు, భూమినుండి ఏ ఏ లోకం ఎంతెంతదూరంలో యున్నవనియుకూడ చెప్పబడింది. ఇది జ్ఞానం. కాని మనం విజ్ఞానంవల్ల భూమిగుండ్రంగ నున్నదనిమాత్రం చెప్పగలిగాము. మిగిలిన విషయాలు చెప్పలేక పోతున్నాం.

స్వాయంభువ మనువుపుత్రుడు ప్రియవ్రతుడు సూర్యునివెంట తన రథంలో ఏడుసార్లుపోవుటవలన భూమి అక్కడక్కడచీలి జడుము లేర్పడి సప్తసముద్రములు సప్తఖండము లేర్పడినవని భాగవతంలో చెప్పబడియున్నది. ఇది జ్ఞానం. సప్త సముద్రాలు సప్త ఖండములు ఏవిధంగ ఏర్పడినవని ఇంతవరకూ ఎవరూ చెప్పలేకపోవుట విజ్ఞానం.

రామాయణం కిష్కింధా కాండలో కిష్కింధనుండి సీతాన్వేషణకై దూతలను నలుదిక్కులాపంపుతూ సుగ్రీవుడు ఆయా దారులలో గల దేశాలను ఆనవాళ్ళుగ పేర్కొనడం జ్ఞానం. మనం

భూయానాన సముద్రయానాన దేశాలను కనిపెట్టి వాటిని సర్వే చేయించి ఆ దేశాలను క్రొత్తగా కనిపెట్టినట్లు ఢంకా కొట్టడం విజ్ఞానం.

పాలసముద్ర మథనానంతరం లభించిన అమృతాన్ని త్రాగే టప్పుడు రాహు కేతువులు సూర్యచంద్రులకిచ్చిన శాపమే సూర్య చంద్రగ్రహణములు. ఇవి జ్ఞానం. సూర్యచంద్ర గోళాలకు రాహు గ్రహం అమావాస్య పూర్ణిమలనాడు అడ్డువచ్చునందున గ్రహణము లేర్పడుననుట విజ్ఞానం.

పుణ్యంచేసి పునీతులైనవారు తేజోరూపంగ నక్షత్రమండ లంలో నివసింతురనుటయు, ఈ నక్షత్రవాసులు తమ పుణ్యఫలం అయిన తర్వాత అధోగతిపాలై క్షీణించి జన్మరాహిత్యాన్ని పొందుదు రనుట జ్ఞానం. విలీనాకాశంలో అంతులేని నక్షత్రగోళాలు నిరం తరం మండుచున్నవనియు, కదలుచున్నవనియు, భూమిపై బడుటకు అధోముఖముగ అతివేగముగ వచ్చుచున్నవనియు, భూమిపై బడి సర్వనాశనం చేస్తాయని సిద్ధాంతరీకరించుట విజ్ఞానం. ఈ నక్షత్రాలు ఏవిధంగ జనించుతాయని చెప్పకపోవుట విజ్ఞానం. నక్షత్రాలు అధోముఖమై ప్రయాణిస్తూ మధ్యలోనే అంతమౌతాయనుట జ్ఞానం. ఈ నక్షత్రాలు భూమిపై బడుతాయనుట అర్థరహిత విజ్ఞానం.

తిథి, వారము, నక్షత్రము, కరణము, యోగము, రాసులు, లగ్నములు, దినము, పక్షము, మాసము, ఋతువులు, ఆయనములు, సంవత్సరము, యుగములు ఏవిధంగ ఏర్పడినవని భారతీయులు చెప్పుట జ్ఞానం. వీటన్నింటినీ ఒప్పుకొని వీటినే అనుసరిస్తూ అదే భారతీయులు చెప్పిన ఈశ్వరుడు, విష్ణువు, బ్రహ్మ, శక్తి, సృష్టి, దేవుడు వగైరాలను విస్మరించుట విజ్ఞానం.

భూమిపై కూర్చొని తపస్సుచేస్తే ఆ చేసిన తపశ్శక్తిని భూమి ఆకర్షిస్తుంది. కాబట్టి ఏదైనా ఆధేయము దానిపై జింకచర్మం

దానిపై దర్భచాప, దానిపై తెల్లనిగుడ్డ పఱచి అద్దానిపై కూర్చొని తపస్సుచేస్తే భూమ్యాకర్షణకు గురికాకుండ చేసిన తప శ్శక్తి ఆ వ్యక్తికి కలుగుతుందని భారతంలో చెప్పుట జ్ఞానం. భూమికి ఆకర్షణశక్తి యుంది కాబట్టి బరువుగల వస్తువులన్నియు ఎగురవేస్తే కూడ భూమిపై బడతాయని సిద్ధాంతరీకరించుటవిజ్ఞానం.

నీటితో దీపంవెలిగించవచ్చునని బ్రహ్మంగారు కాలజ్ఞానంలో చెప్పినది జ్ఞానం. నీటిద్వారా విద్యుదుత్పత్తి చేయడం దీపాలు వెలిగించడం విజ్ఞానం.

ఆకాశంలో సూర్య, చంద్ర, అంగారక, బుధ, గురు, శుక్ర, శని, రాహు, కేతువులను నవగ్రహములున్నవని భార తీయులు చెప్పినది జ్ఞానం. ఈ తొమ్మిది గ్రహాలున్నవని నిర్ధారించి వ్యోమనౌకలను వ్యోమగాములను ఆయాగ్రహములపై దింపి అచ్చటి వాతావరణ స్థితిగతులను ప్రస్తుతం కనుగొనడం విజ్ఞానం. ఈ తొమ్మిది గ్రహాలూ మానవజీవితాన్ని పుట్టుక నుండి చావువరకు తమతమ ప్రభావాలతో మనుగడ సాధింపజేస్తాయని, ఈ నవగ్రహ ముల ఆధారంగానే జ్యోతిషశాస్త్రం వెలసినదని చెప్పుట జ్ఞానం. ఈ గ్రహాలవలన వస్తురూపంలో ఏమైనా లాభం కలుగునా యని వ్యోమగాముల ద్వారా వ్యోమనౌకల ద్వారా పరిశోధించుట విజ్ఞానం.

పరమేశ్వరుడు అర్ధనారీశ్వరుడని భారతీయులు చెప్పుట జ్ఞానం. అనగా పురుషశరీరము అనబడు ఈశ్వరుడు అర్ధభాగము పురు షత్వము, అర్ధభాగము స్త్రీతత్వముగ నుండును. పురుషుని రక్తంలో పురుషకణములు స్త్రీ కణములు రెండునూ సమపాళ్ళలో నుంటా యనుట, స్త్రీ రక్తంలో స్త్రీ కణములు మాత్రం యుండుననుట విజ్ఞానం.

మహర్షులు తపశ్శక్తిచే దూరశ్రవణం కలిగియుండిరి. అనగా విశ్వంలో ఎక్కడ ఏమిజరుగునో ఆ దృశ్యాలను కూర్చున్నచోటు

నుండే వినుచుండిరి. ఇది జ్ఞానం. మనం రేడియోలను పొందినాము. రేడియోస్టేషన్ లో ఏ విషయం రిలే అవుతుందో ఆ విషయాన్ని మాత్రం మనం వినగలుగుచున్నాము. ఇది విజ్ఞానం.

మహర్షులు దూరదృష్టి కలిగియుండిరి. అనగా విశ్వంలో ఎక్కడ ఏమి జరుగుతుందో ఆ దృశ్యాలను కూర్చున్నచోటునుండే చూచుచుండిరి. ఇది జ్ఞానం. మనం టెలివిజన్‌లను పొందియున్నాము, టెలివిజన్ స్టేషనులో ఏ దృశ్యం రిలే అవుతుందో ఆ దృశ్యాన్ని మాత్రం మనం చూడగలుగుచున్నాము. ఇది విజ్ఞానం.

మహర్షులు తపస్సుచేసి కాయసిద్ధిని పొందిరి. అనగా శరీరమును ఎన్నో వేల సంవత్సరముల వరకు శిథిలము కాకుండ ఆరోగ్యంగ ఉంచుకొనుచుండిరి. ఇది జ్ఞానం. మనం మందులను కనిపెట్టి ఆరోగ్య కేంద్రాలను నెలకొల్పి రోగనివారణ చేయుచున్నాము కాని శరీర నాశనాన్ని నివారించలేక పోతున్నాము.

మహర్షులు తపోబలంతో క్షణాలలో అనుకొన్నచోటికి పోతుండిరి, అన్నిలోకాలకూ సశరీరంతో రాకపోకలు సాగించుచుండిరి. ఇది జ్ఞానం. మనం బస్సులు, రైళ్ళు, విమానాల ద్వారా ప్రయాణాలు సాగిస్తున్నాం. ఏదో ఒకటి రెండు గ్రహాలకు ఇద్దరు ముగ్గురు వ్యోమగాములను పంపుతున్నాం. ఇది విజ్ఞానం.

మహర్షులు తపోబలంతో అణిమాది సిద్ధులను పొందిరి. అనగా సర్వసంపదలను తలచుకొన్నదే పొందుచుండిరి. ఇతరులకు వరముల రూపేణా ప్రసాదించుచుండిరి. కాని ఏనాడూ ఈ సిరిసంపదలను తమ స్వార్థానికి ఉపయోగించుకోలేదు. ఇది జ్ఞానం. కాని మనం ఉద్యోగాలు, వ్యాపారాలు, రాజకీయాలు అడ్డదారులలో పొంది ధనార్జన చేయుచున్నాము. ప్రతి ఒక్కరూ హద్దులేని సంపద ధనంకలిగియుండాలని స్వార్థంతో నానాతంటాలు పడుచున్నాం. ఈ కార్య సాధనకై జరిగిన ప్రగతియంతయూ విజ్ఞానం.

నిస్వార్థపరులు తపోధనులు అవధూతలు ఆశ్రమవాసులునగు మహర్షులు రాజులకు మంత్రులుగనుండి ధర్మపరిపాలనకు దోహద పడుచుండిరి. ఇది జ్ఞానం. ధనబలంకండబలం అధికార కాంక్ష స్వార్థ రాజకీయాలతో మంత్రిపదవులు అలంకరించుట విజ్ఞానం.

మహర్షులు బ్రహ్మ విష్ణు మహేశ్వరులను సాక్షాత్కరించు కొనుట, వారి వారి లోకాలలో వారిని సందర్శించుట జ్ఞానం. మనం మానవజన్మల నెత్తినవారిని అవతార పురుషులు దేవదూతలు అని చెప్పుకొని కొలుచుట విజ్ఞానం.

వశిష్ఠుడు తనవద్ద ఏమియు లేకున్నను తనవద్దగల కామధేనువు సాయంతో గాధి (విశ్వామిత్రుడు) అను రాజుకు అతని సైన్యానికి మృష్టాన్నం పెట్టి ఆతిథ్యం ఇచ్చినది జ్ఞానం. ఈ కాలంలో విజ్ఞానం ఈ విధంగ చేయగలదా!

వశిష్ఠుడు నిరాయుధుడై దర్భపుల్ల సాయంతో గాధిని అతని అపారసైన్యాన్ని ఓడించుట జ్ఞానం. ఈ కాలంలో విజ్ఞానం ఈ విధంగ చేయగలదా.

విశ్వామిత్రుడు శ్రీ రామలక్ష్మణులకు బల అతిబల మంత్ర ముల నుపదేశించి వారికి ఆకలి దప్పులు అలసట లేకుండ చేసెను. ఇది జ్ఞానం. మనం ఆనకట్టలుకట్టి ఎరువులు ఉత్పత్తిచేసి అధికాహా రోత్పత్తి చేయుచున్నాం. ఇది విజ్ఞానం. కాని ఆకలిబాధ తీరిందా!

మహర్షులు ఘోరారణ్యాలలో పర్ణశాలలు నిర్మించుకొని నివసించుచుండిరి. నిరుపేదనుండి రారాజు వరకు ఈ పర్ణశాలలలో విద్యాభ్యాసాలు చేయుచుండిరి. ఆత్మజ్ఞానం వీరి లక్ష్యం. ఇది జ్ఞానం. మనం అధునాతన భవంతులలో అందరికీ విద్య బోధన చేస్తున్నాం. కర్మాగారాలలో వస్త్రోత్పత్తివలె నిరంతరం పట్ట భద్రులను ఉత్పత్తి చేయుచున్నాము. గురుకులాలలో విద్యాభ్యాసం చేసినవారి లక్ష్యం సత్యం న్యాయం ధర్మసూత్రాలను అనుసరించుట.

అధునాతన పట్టభద్రుల లక్ష్యం ధనార్జన, ఉద్యోగం, వ్యాపారం, రాజకీయం, స్వార్థం. గురుకుల విద్యాభ్యాసం జ్ఞానం. ఆధునిక విద్యాభ్యాసం విజ్ఞానం.

మహర్షులు పరకాయ ప్రవేశం చేయుచుండిరి. అనగా తన శరీరమును వదలి తన ప్రాణము (జీవి)తో ఇతర విగతజీవి శరీరంలో ప్రవేశించి చేయవలసిన కార్యములనుచేసి మరల స్వశరీరాన్ని పొందుచుండిరి. ఇది జ్ఞానం. ఈ రంగంలో విజ్ఞానం ఏమియు చేయలేదు.

యోగాభ్యాసం చేసిన శ్రీకృష్ణుడు సాయిబాబా వగైరాలు దేవుని విశ్వరూపాన్ని చూపినారు. ఆత్మబోధ చేసినారు. ఇది జ్ఞానం. మనం ప్రస్తుత విద్య ద్వారా ఏదేదో ప్రగతులు సాధిస్తున్నాం గాని ఆత్మబోధ ఆత్మసాక్షాత్కారదిశగా ప్రయాణించుటలేదు. ఇది విజ్ఞానం.

విశ్వామిత్ర మహర్షి తన తపోబలంతో సృష్టికి ప్రతిసృష్టి చేసినాడు, త్రిశంకు స్వర్గాన్ని సృష్టించినాడు. ఇది జ్ఞానం. విజ్ఞానంతో మనం ఇటువంటి కార్యాలను సాధించలేము. కాకుంటే ఉన్న సృష్టిని నిర్మూలించుటకు అణుబాంబులను కనిపెట్టి యుంచుకొని యున్నాము ఇది విజ్ఞానం.

మహర్షులు తమ తపోబలంతో దేవునివలె వరాల నొసంగు చుండిరి, దేవుణ్ణికూడ శపించుచుండిరి. ఇది జ్ఞానం. మనం వరాలూ ఇవ్వలేము. శాపాలూ ఇవ్వలేము. శాపంబదులు దౌర్జన్యం దమన కాండ చేయగలం. ఇది విజ్ఞానం.

ప్రకృతి సిద్ధమైన ఆకులు, గడ్డలు, పసరులు, మూలికలతో వైద్యంచేసి క్యాన్సర్ వగైరాలను నయంచేయుట జ్ఞానం, కర్మాగారాల ద్వారా మందులను మాత్రలను తయారుచేసి రోగములకు తాత్కాలిక ఉపశమనం పొందుట విజ్ఞానం.

సైకిళ్ళు, స్కూటర్లు, కారులు, జీపులు, బస్సులు, లారీలను నడుపుట విజ్ఞానం.

ఆసనములు వేసి వాయువును కుంభించి వివిధ ముద్రలద్వారా ప్రాణశక్తిని ఆయాశరీర భాగములకు పంపించి శాశ్వత రోగనివారణ చేసికొనుట జ్ఞానం, అల్లోపతి మందుల ద్వారా రోగములను అణచి తాత్కాలిక ఉపశమనం పొందుట విజ్ఞానం.

కాలము రోజుకు 24 గంటలు గంటకు 60 నిమిషములు, నిమిషమునకు 60 సెకండ్లు, ఈ కాలగమనాన్ని సూర్యోదయమును ప్రమాణముగా జ్ఞానంతో నిర్ణయించిరి. దీనికి మెరుగుదు కనిపెట్టడం ఆధునిక విజ్ఞానం తరంకాదు.

యోగశక్తిచే మృతులను సజీవంగ చేసిన సంఘటనలు ఎన్నియోయున్నవి. ఈ ప్రక్రియ జ్ఞానం. విజ్ఞానంతో మృతులను సజీవులను చేయు ప్రక్రియ లేదు.

మానవుని దేహంలోగల నాడులు, రక్త ప్రసరణములు, దశవిధ వాయువులను జ్ఞానంతో కనిపెట్టబడింది, ఈ నాడులలో సుషుమ్న నాడిని కనిపెట్టి సుషుమ్న నాడి ద్వారానే ప్రాణ అపానవాయువులను మూలాధారం ద్వారా సహస్రారమునకు పంపి మోక్షమును పొందు విధమును తెలిపిరి జ్ఞానులు. విజ్ఞానులు సుషుమ్ననాడి గురించిగాని, మోక్షాన్ని గురించిగాని నోరు మెదపరు. ఎందుకంటే సుషుమ్న నాడి విజ్ఞానానికి అందదు.

పూర్వం సూర్యచంద్రుల గమనాన్ని నిలుపుచుండిరి జ్ఞానులు. విజ్ఞానులు ఈ దిశగా ఏమీ చేయజాలరు.

కాయకసరులతోను, గాలి నీరుతోను దేహరక్షణ చేసికొని నిత్యశాంతి, నిత్యయౌవనం బడయుచుండిరి జ్ఞానులు. మసాలా వస్తువులను మత్తుపానీయాలను తీసికొని అహంకార పీడితులై రోగ గ్రస్థులగుచున్నారు విజ్ఞానులు.

పరబ్రహ్మ స్థితియగు, శూన్యకావస్థను శాస్త్రజ్ఞులు కనుగొని
లక్ట్రానిక్స్'' అని పేరుపెట్టారు. ఈ ఎలక్ట్రానిక్స్ ఊహకందని
తశక్తులతో కూడినదని కూడ నుడివినారు విజ్ఞానులు. విజ్ఞానానికి
బ్రహ్మం అందురు. కాన జ్ఞానులు పరబ్రహ్మంయొక్క స్వరూప
భావాలను, శక్తి సామర్థ్యములను, స్థితిలయములను జ్ఞానంతో
ఎగలిగిరి. ఎందువలననగా జ్ఞానానికి మాత్రమే బరబ్రహ్మం
ంబడుతుంది.

జ్ఞానం నిత్యసత్యం, సదా సంతృప్తిని శాంతిని ఇచ్చేది.
•నం పరిమితం అపరిపక్వం, అశాశ్వతం. దీని అంతం దుఃఖం.

మహర్షులు తాము కోరుకొన్న సమయంలోనే స్వచ్ఛంద
ణం పొందుచుండిరి. భీష్ముడే ఇందులకు తార్కాణము అనగా
ణం తమ అభీష్టం ద్వారా జరుగుచుండెడిది. ఇది జ్ఞానం. కాని
స్తుతం ఎంతటి ఉన్నతపదవిలో నున్నవాడైనను, ఎంతటి ధన
తుడైనను, ఎంతటి బలాఢ్యుడైనను తన మరణమును తప్పించు
ాలడు. అధునాతన వైద్యంకూడ ఈ మరణాలను నిలువరింపలేక
ఉన్నాయి. విజ్ఞానంతో ఎంతవైద్యం చేసినా తాత్కాలిక
శమనమేగాని ప్రయోజనం శూన్యం. ఇది విజ్ఞానం.

యయాతిరాజు తనపుత్రుడు పూరునికి తన ముసలితనాన్నిచ్చి
ని యౌవనాన్ని స్వీకరించి సకల భోగాలూ అనుభవించి
దేండ్ల తర్వాత యౌవనాన్ని కుమారునికిచ్చి తన వయోభారాన్ని
కొన్నాడు అదే విధంగ శంతనమహారాజులో ఒక మహిమ
న్నది. అతను వృద్ధులను ఎవరినైనా చేతితో తాకితేచాలు ఆ
ద్ధులు తక్షణమే యువకులుగ మారిపోతారు. ఇవి జ్ఞానం. మన
ానం ఈ విషయాలలో ఏమైనా సాధించగలదా ?

వ్యాసమహర్షి వీర్యం స్ఖలితమైతే చిలుక దానిని మ్రింగి
మహర్షిని ప్రసవిస్తుంది. ఉపరిచరునియొక్క వీర్యం ఆరగించిన
ముద్రంలోని చేప గర్భందాల్చి మత్స్యగంధి (సత్యవతి) అతని

సోదరుడు మత్స్యరాజులను ప్రసవిస్తుంది. ఇవి జ్ఞానం. ప్రస్తుతం పురుషవీర్యాన్ని స్త్రీ గర్భంలో నుంచి పిల్లల్ని పొంది టెస్ట్‌ట్యూబ్ బేబీ అని గొప్పగా చెప్పుకోవడం విజ్ఞానం.

సృష్టికి లిఖితపూర్వకమైన సనాతనచరిత్ర వున్నది. ఆయా కాలాలలో వెలసిన సంస్కృతీ నాగరికతలు తేటతెల్లంగ విపులీకరింపబడియున్నది. ఇది జ్ఞానం. కాని ఐదువేలు సంవత్సరముల నుండి మాత్రము మానవనాగరికత వెలసినదనియు, రాతియుగము లోహయుగము యంత్రయుగములుగ నాగరికత అభివృద్ధి చెందినదని చెప్పుట విజ్ఞానం.

ఈ విధంగ చెప్పుకొనుచూ పోతూవుంటే అంతే వుండదు. మన పూర్వులు అందించిన జ్ఞానాన్ని మరచి మనం విజ్ఞానరూపంలో ప్రస్తుతం పొందుచున్నాము. ఈ విజ్ఞానం వస్తురూపంగ అందుబాటులోనున్నది. కాని జ్ఞానం అపారం అనంతం. విజ్ఞానం పరిమితం. జ్ఞానం ఏనుగంత విజ్ఞానం దోమఅంత. ఈ దోమ అంత విజ్ఞానం కూడ అందరికీ అందుబాటులో ఎక్కడున్నది ? శాంతి ఎక్కడ కలిగిస్తున్నది ?

ఆకాలాలలో ఋషులు అరణ్యాలలో పర్ణశాలలు నిర్మించుకొని జీవనాన్ని గడుపుచుండిరి, తరతమ భేదం లేక జిజ్ఞాసువులు ఈ పర్ణశాలలో విద్యాభ్యాసం చేయుచుండిరి. ముఖ్యంగ తపస్సును నేర్చుకొనుచుండిరి. జ్ఞానాన్ని పొందుచుండిరి. కావున గురుకులవాస విద్యార్థులు నిజజీవితంలో ఆత్మసంతృప్తులై సత్యం న్యాయం ధర్మం తమ ఉచ్ఛ్వాస నిశ్వాసలుగ మోక్షాన్నే ధ్యేయంగ తమ నిజజీవితాలను గడుపుచుండిరి. కాని ప్రస్తుతం ప్రతిపల్లెకు, ప్రతి వీధికి పాఠశాలలు, కళాశాలలు. నీతి మంచిగౌరవం లేవు. కర్మాగారాలలో వస్తూత్పత్తివలె పట్టాలు పుచ్చుకొని విద్యార్థులు విద్యాలయాల నుండి బయటకొచ్చుచున్నారు. సంపాదనే వీరిధ్యేయం.

ఈ సంపాదన లక్ష్యసాధనకు ఎన్నియో అక్రమమార్గాల ననుసరిస్తు న్నారు. వీళ్ళని నియంత్రించుటకు లెక్కలేనన్ని పోలీసుస్టేషన్లు, విచారించుటకు అంతులేని న్యాయస్థానాలు, శిక్షించుటకు అంతకు మించి కారాగారములు, అందరూ మానవులే మనవాళ్ళే. వీరిని నియంత్రించుటకు పోలీసుస్టేషన్లు న్యాయస్థానాలు కారాగారాలు మనకు కావలయునా ? మనం అందరూ మనుష్యులమే కద ! మనలో కొందరు తప్పులు చేయనేల, వారిని దండించుటకు మనలో కొందరు వుండనేల ? ఈ వ్యవస్థ వాంఛనీయమా? సత్ఫలితాల నిస్తున్నాయా !

లోకాలు అరువదినాలుగు అన్నారు. మన జ్ఞానానికి అవగాహనమైనది పదునాల్గులోకాలు మాత్రమే. ఈ లోకాలలో జనించి పాపములు (తప్పులు) చేసినవారిని విచారించి దండించుటకు యమ ధర్మరాజు యున్నాడనిరి. పూర్వకాలాలలో రాజులే న్యాయాధిపతులు దండనాధీశులు. తప్పులుచేసిన వారిని సభాముఖంగ విచారించి శిక్షలు వేయుచుండిరి. యమధర్మరాజుగాని రాజులుగాని అధర్మంగ శిక్షలు వేసిన దాఖలాలు లేవు.

అందరూ తల్లుల గర్భాలనుంచి పుట్టిన మానవులమే. కాని గుణగణాలు అదృష్టం ఆయుష్షులు అందరికీ సమానంగ లేవే! ఒకే రాసిలో పుట్టినవారు విభిన్నగుణాలతో నున్నారు. ఒకేరాసిలో పుట్టినవారు దరిద్రులుగ కొందరు ధనవంతులుగ కొందరు పాలింపబడేవారుగ కొందరు పాలించువారు కొందరుగ నున్నారు. అదే విధంగ గర్భస్రావాలు, శిశుమరణాలు, అర్ధాయుష్కులు, పూర్ణాయుష్కులుగ పుట్టుచున్నారు. వీటి నన్నిటిని అధిగమించి గుణగణాలు అదృష్టం ఆయుష్షులను అందరికీ సమానంగ అందించే విజ్ఞానం వున్నదా ? లెక్కకు మిక్కిలిగ ధనాన్ని వెచ్చించి అభివృద్ధిని సాధిస్తున్నాము. అందరికీ ఈ అభివృద్ధి సమానంగ పంచిపెట్టినామా? పంచిపెట్టగలమా ?

గుణగణాలు అదృష్టం ఆయుష్షులలోగల వ్యత్యాసాలకు కారణం మనం రూపొందించుకొన్న విజ్ఞానమే. ఈ విజ్ఞానం వస్తూత్పత్తికి దోహదపడిందిగాని వ్యక్తి బుద్ధులను మార్చుటకు దోహదపడలేదు. వ్యక్తి బుద్ధిని మార్చని విజ్ఞానంగాని జ్ఞానంగాని వృధా అవుతాయి. మానసికంగ తృప్తిపడితేనే మానవులలో సమానత్వం వస్తుంది. శాంతి నెలకొంటుంది.

వేదాలు, ఉపనిషత్తులు, అష్టాదశపురాణాలు, వగైరాలన్నియు అర్థం కావష్టేవని, ఆచరణ కష్టసాధ్యమని కలియుగ మానవులు తరించు మార్గమేమిటి యని వేదవ్యాసుడు సుదీర్ఘంగ ఆలోచించినాడు. కలియుగంలో అధర్మం నాలుగు పాదాలతో నడుస్తుందని ఆయనకు తెలుసు. కావున కలియుగమానవులు తరించుటకు వేదవ్యాసుడు మహాభారతాన్ని, మహాభాగవతాన్ని రచించినాడు. ఈ గ్రంథాలలో మానవులు తరించు రహస్యాలను ఎన్నింటినో సోదాహరణంగ వివరించినాడు. కలియుగంలో గురువులు అరుదుగానుందురు, ఉన్న గురువులుకూడ సూక్ష్మరహస్యాలను విడమరచి చెప్పలేరని నిశ్చయించి కలియుగ మానవులు ఈ గ్రంథాలను చదివి అర్థంచేసుకొని ఆచరణలోయుంచి ఐశ్వర్యాన్ని, అదృష్టాన్ని, సద్గుణాన్ని, అనుభూతిని, పూర్ణాయుష్షును, ముక్తిని పొందగలరని విశ్వమానవ మనుగడ దృష్టితో విశ్వశాంతి ఏకైక లక్ష్యంతో భారత భాగవతాలను రచించినాడు వ్యాసమునీంద్రుడు. వేదవ్యాసుని దూరదృష్టికి జోహార్లు.

మానవ జీవితంలో కష్టసుఖాలన్నీ పిండీకృతంచేసి అడుగడుగునా సత్యాన్ని న్యాయాన్ని ధర్మాన్ని చూపించే అద్భుతమైన యదార్థగాథ మహాభారతకథ. ఇందులోగల కష్టసుఖాల్ని అర్థంచేసుకొంటే ఎల్లకాలాలలోను మానవసమూహం నిజమైన ఇహసుఖాన్ని పరతత్వాన్ని పొందగలరు. మహాభారతకథ మనస్సును కరిగించి ఆనందములోను దుఃఖంలోను అనుభూతుల్ని కలిగించి

ఇహంలో జీవితధ్యేయాన్ని చూపుతూ పరతత్వం కడకు కొనిపోయి చేరుస్తుంది. కలియుగ మానవులకు వ్యాసమునీంద్రుడు కరుణించి అందించిన కమనీయ రమణీయ గాథ మహాభారతం. ఈ మహాభారతం పంచమవేదం అనికూడ పిలువబడుతుంది.

అదేవిధంగ శ్రీమద్భాగవతం. ఇది సర్వలోక సర్వావస్థల పూజ్యమైన గ్రంథరాజము. జాతి కులమత ప్రాంత దేశలింగ తారతమ్యములతో నిమిత్తంలేకుండ సర్వమానవులకు సత్యాన్ని కరతలామలకంగ చూపించే అద్భుతమైనదే భాగవతగ్రంథం. మానవుని మాధవునిగ తీర్చిదిద్దు మహదాయకము, సర్వ సిద్ధాంత సమన్వయ సారమిూ శ్రీమద్భాగవతము.

ఈ భారత భాగవత గ్రంథములలో కథలరూపంగ మానవునికి గుణగణాలు, అదృష్టం, ఆయుష్షు ఏవిధంగ సంక్రమిస్తాయి, దైవము అంటే ఏమి ఆదైవాన్నిపొందు విధమెట్లు అని సోదాహరణంగ వివరింపబడియున్నది. మనం ఈ గ్రంథాలను కథల దృకృథంతోనే చదివెదముగాని అందులోగల సూక్ష్మాలను గ్రహించుట లేదు, ఆచరించుట లేదు, ఫలితాలను పొందుట లేదు. వ్యాసుని సందేశాన్ని సంకల్పాన్ని గ్రహించడంలేదు. ఫలితం లక్ష్యం సిద్ధించ లేదు.

ఈ సందర్భంగ ఒక పురాతన కథను ఇక్కడ ఉదహరిస్తే బాగుంటుందని నా మనోగతం. ఒక కష్టజీవి రోజూ రాళ్ళుకొట్టి కుటుంబపోషణ చేసేవాడు. అతనికి నారాయణునిపై భక్తి ఎక్కువ. కాని నారాయణునిగురించి ధ్యానంచేయుటకుగాని ఆరాధించుటకు గాని అతనికి తీరిక లేదు. తన వృత్తే అతనికి నారాయణుడు. నారాయణుని దర్శించవలెనని నిరంతర తపన. ఒకనాడు నారదమహర్షి అటు దిక్కుగాపోతూ ఇతనికంట బడినాడు. అంతట ఇతను నారదమహర్షిని తనవద్దకు పిలిచినాడు. నారదమహర్షి ఇతనివద్దకు వచ్చినాడు. ఇతను

నారదమహర్షితో "స్వామీ! ఎంతవరకు మీ ప్రయాణం" అని అడిగినాడు. అందులకు నారదమహర్షి తాను వైకుంఠానికిపోతున్నా ననియు, నారాయణుని దర్శించుకొని తిరుగు ప్రయాణం చేయగల ననియు చెప్పినాడు. అందులకీ రాళ్ళుకొట్టే అతను తనకు శ్రీ నారా యణుని దర్శించవలెనని చిరకాల వాంఛగలదనియు, వైకుంఠానికి వచ్చుటకు తనకు తీరికలేదనియు, శ్రీనారాయణునే తనవద్దకు ఒక సారివచ్చి తనకు దర్శన మీయవలసినదిగా తన కోరికను శ్రీ నారా యణునికి తెలుపవలసినదిగా నారదమహర్షికి విన్నవించుకొన్నాడు. నారదమహర్షి అట్లే అని సమ్మతించినాడు.

నారదమహర్షి కొంచందూరం పోగానే అదే దారిలో ఒకడు బక్కచిక్కి మీసాలు గడ్డంతో దర్శనమిచ్చాడు. నారదమహర్షి అతని కంటబడినాడు. అతడు నారదమహర్షికి నమస్కరించి తాను సర్వసంగ పరిత్యాగిననియు, నిరంతరం శ్రీ నారాయణునిగూర్చి తపస్సు చేస్తున్నాననియు, కాని ఎంతకూ ఆనారాయణుడు దర్శనం ఈయలేదనియు, నారదుడెట్లూ వైకుంఠానికి పోతున్నాడు కాబట్టి తనకు శీఘ్ర దర్శనం ఈయవలసినదిగా నారాయణునికీ సిఫారసు చేయవలసినదిగా నారదమహర్షిని ప్రార్థించినాడు. అలాగేనన్నాడు నారదమహర్షి.

మరుసటిరోజు నారదమహర్షి తన తిరుగు ప్రయాణంలో మొదటగా ఈ తాపసినికలసినాడు. తాపసి నారదమహర్షిని కుశలప్రశ్నలు వేసి తన కోరికను నారాయణునికి విన్నవించితివాయనియూ, నారాయణుడు తనకు ఎప్పుడు దర్శనం ఈయగలనని నుడివి నాడనియు అడిగినాడు. అందులకు నారదుడు తానేమో తాపసికోరికను శ్రీనారాయణునికి విన్నవించినాననియు, అందులకాయన సూదిబెజ్జంలో ఏనుగుదూరిననాడు తాను తాపసికి దర్శనమీయగలనని నుడివినాడని తెలిపినాడు. అందులకా తపస్వి నివ్వెఱపోయి సూదిబెజ్జంలో ఏనుగు

దూరదు కాబట్టి తనకు నారాయణుని దర్శనం కలుగదు అని కుండ బద్దలుగా చెప్పి, తన సరంజామాన్నెత్తుకొని ఇంటిదారినిపట్టినాడు.

తర్వాత నారదమహర్షి రాళ్ళుకొట్టే ఆసామివద్దకు వచ్చినాడు. కుశలప్రశ్నలు అనంతరం రాళ్ళుకొట్టే అతను తనకోర్కెగురించి శ్రీనారాయణు డేమన్నాడనియు, తనకు దర్శనభాగ్యం ఎప్పుడు కలుగుతుందని నారదమహర్షిని ప్రశ్నించినాడు. అందులకు సమాధానంగ నారదమహర్షి తాపసికి చెప్పిన విధంగానే సూదిబెజ్జంలో ఏనుగుదూరిననాడు శ్రీనారాయణుడు దర్శనమిచ్చెదనని చెప్పినాడని నుడివినాడు. అందులకే రాళ్ళకొట్టు ఆసామి "అదెంతపనిస్వామీ దేవుడు తలచుకొంటే ఇప్పుడే సూదిబెజ్జంలో ఏనుగుదూరును కద!" అని అన్నాడు. అంతే అతని ప్రగాఢనమ్మకానికి ముగ్ధుడై శ్రీమన్నారాయణుడు అప్పటికప్పుడే వారి ఎదుట ప్రత్యక్షమైనాడు.

పై కథవలన తెలియునదేమంటే అన్నిటికీ ముఖ్యం నమ్మకం. నమ్మకంలేని తాపస్వి తపస్సుచేసికూడ నిరుత్సాహియై తిరుగుముఖం పట్టినాడు. మూఢవిశ్వాసం గాఢనమ్మకం గల రాళ్ళుకొట్టే అతను సంసారియైయుండికూడ తరించినాడు.

అదేవిధంగ భారత భాగవతాలలోగల సూక్ష్మరహస్యాలను వ్యాసమహర్షి అందించినరీతిలో నమ్మకముంచి అందరూ తరించెదరను ఆశాభావంతో మిగిలిన భాగాలు పరికిద్దాం.



# గుణగణములు

గుణగణములు మానవుని ఉన్నతిని తెలియజేస్తుంది. సమాజంలో ఈ గుణగణాలవలన గౌరవమర్యాదలు పేరుప్రతిష్ఠలు కలుగజేయు ముఖ్యమైన భూమికను నిర్వహిస్తాయి. ఒకే తల్లిగర్భంలో జనించిన సంతానం ఒకేవిధమైన గుణాలను కలిగియుండరు. అదే విధంగా ఒకేరాసిలో జనించిన వ్యక్తులు ఒకేమాదిరి గుణగణాలను కలిగియుండరు. గుణగణాలనేది మానవుని జీవితంలో ముఖ్యపాత్రను పోషిస్తుంది. పదుగురికి సహాయకారిగనుండి మన్ననలను పొందే గుణం మంచిదనబడుతుంది. ఇతరులను బాధపెట్టుతత్వం కలిగియున్న గుణగణాల వ్యక్తి ఛీదరింపబడుతాడు. మంచి గుణగణాలుగల మనుష్యులే పుడమిపై యుంటే సృష్టియంతయు మంచిగానే యుంటుంది, చెడు గుణగణాలుగల మనుష్యులే పుడమిపై యుంటే సృష్టియంతయు చెడుగానే యుంటుంది. మంచి గుణగణాలుగల మనుష్యులు కొందరు చెడు గుణగణాలుగల మనుష్యులు కొందరు యుంటే సదా అశాంతి నెలకొలుతుంది.

సంస్కృతీ నాగరికతల అభివృద్ధికి మంచి గుణాలుండాలి, మంచిగుణాలున్న వ్యక్తులుండాలి. మంచిగుణాలుగల మానవులు సమాజానికి ఎంతో సేవచేసియున్నారు. చెడు గుణములుగల మానవులు సమాజానికి ఎంతో కీడుచేసియున్నారు. ప్రకృతి పరులకే అంకితం. సూర్యుడు ఏకచక్రంగల రథం అధిరోహించి నిత్యం పరోపకార్యం చేస్తున్నాడు. ఈ పరోపకార్యంలో స్వార్థం ఏమీ లేదు. ఇది మంచి. ఈ సూర్యుణ్ణి గ్రహణం అనే పేరుతో అడ్డగించే గుణంగలరాహువు దుర్మార్గుడనబడుతాడు. వ్యాసమహర్షి ఏమిఆశించి వేదవిభజనలను చేసాడు ? అష్టాదశపురాణాలను భారత భాగవతము

లను రచించినాడు ? ఇది అతని మంచిగుణము కాబట్టి ఈ క్రియలను చేసాడు. ఇందులో స్వార్థం లేదు. లోకకల్యాణ హితమే ధ్యేయం.

అందరు మానవులూ మంచి గుణగణాలు కలిగియుంటే ఏ బాధాలేదు. ఎల్లెడల తృప్తి శాంతి విలసిల్లుతుంది. అందరూ మంచి వారే పుట్టవలయును, ఉన్నవారు అందరూ మంచివారుగ మారవలె నంటే ఏమి చేయవలయునో ఒకింత పరికింతము.

సృష్టిలో ప్రాణులు నాలుగు విధాలుగ ఉద్భవిస్తాయి అవి ఉద్భిజములు, శ్వేదజములు, అండజములు, యోనిజములు. చెట్లు చేమలు తీగలు వగైరాలు భూమినుండి జనించే ఉద్భిజములు. పూవులు లేకనే ఫలముల నిచ్చుతావి మున్నగు వనస్పతి వృక్షములు, పుష్పించి ఫలించు సస్యములు, ఓషధులు, వెదుళ్ళు,లతలు, దుంపలు, మామిడి మున్నగు ఫలవృక్షములు మొదలగునవి ఇందులోని రక ములు. ఉద్భిజములు చలనరహితములు. ఇవి ప్రకృతి ఆధారజీవులు. అండజములు యోనిజములకు సహాయకారులు ప్రాణాధారములు.

మనుష్యుల తలయందు గలుగు పేను, చెమటయందు జనించు చీలపేను, పశువుల దేహములయందు స్రవించు చెమటలో గలుగు పిడుదు వగైరాలు స్వేదజములనబడును. ఇవి అల్పాయుష్కులు. దేహాన్ని శుద్ధిచేస్తే ఇవి ఉనికిని కోల్పోతాయి.

పక్షులు, సర్పములు గ్రుడ్డునుండి జనించుటవలన అండజము లనబడును. పక్షులు తటస్థములు. ఇవి గ్రద్ద, డేగ, నెమలి, హంస, చక్రవాకము, కాకి, గ్రుడ్లగూబ, కోకిల మున్నగునవి. సర్పములు, తేలు వగైరాలు హానికరములు. ఈఅండజములు ఆహార సముపార్జన ప్రాణరక్షణ జ్ఞానాన్ని కలిగియుంటాయి.

యోనిజములు జంతువులు, మనుష్యులని రెండురకములు. చీలిన గిట్టలు గల వృషభములు, గోవులు, దున్నలు, మేకలు, పందులు, ఒంటెలు మున్నగునవియు, చీలని గిట్టలుగల గుఱ్ఱములు,

గాడిదలు, శరభములు, చమర మృగిములు, బేసిగోళ్ళు గల కుక్క, నక్క, తోడేలు, పిల్లి, పులి, కుందేలు, సింహాము; కోతి, ఏనుగు మున్నగునవియు, మొసలి తిమింగలము మీనములు వగైరా జలచరములు పశుజాతికి చెందినవి. ఇవి పరిమితి జ్ఞానం కలిగియుంటాయి. ఆహారము, గూడు, సంతానోత్పత్తి, ఆత్మ రక్షణ, తమ ఉనికిని కాపాడుకొనుట వీటి లక్ష్యములు.

రెండవ తరగతికి చెందిన యోనిజములు మనుష్యజాతి, వెన్నెముక ఆధారముగ నిర్మింపబడిన దేహములు గలవి. ఆకాశము, వాయువు, అగ్ని, జలము, పృథ్వియనబడు పంచభూతములనుండి పుట్టిన శరీరములుగలవి. జ్ఞాత, మనస్సు, బుద్ధి. చిత్తము, అహంకారము, అనబడు అంతఃకరణములు; శ్రోత్రము, త్వక్కు, చక్షు, జిహ్వా, ఆఘ్రాణములనబడు జ్ఞానేంద్రియములు. వ్యాన ప్రాణ అపాన సమాన ఉదానములనబడు పంచవాయువులు, వాక్కు పాణి పాదము పాయువు ఉపస్థములనబడు కర్మేంద్రియములు, స్థూలసూక్ష్మకారణములనబడు మూడుశరీరములును; జాగ్రత, స్వప్న సుషుప్తలను మూడు అవస్థలున్ను; మూలాధారం స్వాధిష్ఠానం మణిపూరకం అనాహతం విశుద్ధం ఆజ్ఞేయం బ్రహ్మరంధ్రము లనబడు సప్తచక్రముల దొంతరిల్లు మానవదేహం. ఈ సప్తచక్రములలో వరుసగా వినాయకుడు, బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు, జీవుడు, ఈశ్వరుడు, ఓంకారములు అధిదేవతలు. పంచభూతములలో రెండవదియగు గాలి ఉచ్ఛ్వాస నిశ్వాసరూపంగ మానవజాతికి సకల జీవరాసులకు ప్రాణాధారమై యుంటుంది.

మేషము వృషభము మిథునము కటకము సింహాము కన్య తుల వృశ్చికము ధనస్సు మకరము కుంభము మీనము అను పన్నెండు రాశులలో మనుష్య జననము జరుగును. ఈ పన్నెండు రాశులు ఒక్కొక్క ప్రత్యేక స్వభావము కలిగియుండును. ఈ రాశి స్వభావ

ులు ఆయా రాశిలో జనించినవారికి సాధారణంగ కలుగుచుండును.
గాక గుణములకధిపతులగు నక్షత్రములు ఇరువదిఏడు. అవి
శ్విని భరణి కృత్తిక రోహిణి మృగశిర ఆర్ద్ర పునర్వసు పుష్యమి
శ్లేష మఖ పూర్వఫల్గుణి ఉత్తరహస్త చిత్త స్వాతివిశాఖ అనూరాధ
్యేష్ట మూల పూర్వాషాఢ ఉత్తరాషాఢ శ్రవణం ధనిష్ట శతభిషం
ూర్వాభాద్ర ఉత్తరాభాద్ర రేవతి యనునవి. ఒక్కొక్క నక్షత్ర
ును నాలుగు భాగములుగ విభజింపబడినవి. అనగా ఇరువది ఏడు
క్షత్రములు ఒక్కొక్క నక్షత్రము నాలుగు భాగములు వెరసి
ూటఎనిమిది భాగములు. ఆయాభాగములలో పుట్టిన వారికి ఆయా
ుణములు నడవడికలు కలుగుననుట ప్రతీతి.

పై విధంగ కలిగిన ఘటశరీరముతో జనించిన మానవుడు
న మనస్సు, బుద్ధి, చిత్తములను దైనందిన జీవితంలో నుపయో
ించి తాజేయు కర్మక్రియలకు కర్తృత్వము వహించి పుణ్యఫలిత
ములను పాపఫలితములను జీవభావముచే గ్రహించి వాటి ఫలితము
ును మరల జీవునిచే భోక్తగా అనుభవింపజేయుటకుగాను సూర్యుడు,
చంద్రుడు, అంగారకుడు, బుధుడు, గురుడు, శుక్రుడు, శని,
రాహువు, కేతువులను తొమ్మిది గ్రహములను సృష్టింపబడినవి. ఈ
గ్రహములు మానవుని దైనందిన కర్మక్రియలను కూలంకషంగ
కాపుకాస్తుంటాయి. ఎట్లంటే ఒకతను ఉద్యోగం చేస్తుంటాడు.
అతను తనకు అర్హమైన దానికంటె ఎక్కువరోజులు సెలవుపెడతాడు.
జీతంబిల్లు వ్రాసే గుమాస్తా హాజరుపట్టిని తనిఖీచేసి తనంతటతానుగ
అనర్హమైన సెలవుదినాలకు జీతం నిలుపుదల చేస్తాడు. అదేవిధంగ
ఈ నవగ్రహాలు మానవుడుచేయు పుణ్యపాపములను సదా పరిశీలిస్తూ
ఆయా ఫలితాలను మరుజన్మలో నిస్తాయి.

అంటే మానవశరీరాన్ని మానవజన్మనీ ఉత్కృష్టంగ సృష్టించి
కర్మకలాపాలను నియంత్రించుచూ కట్టుదిట్టమైన పర్యవేక్షణఏర్పాట్లు

చేయబడినవి. మానవుడు స్వతంత్రుడు కావచ్చు. జ్ఞాని కావచ్చు. విజ్ఞాని కావచ్చు. కాని తన మనస్సు బుద్ధి చిత్తములను నియంత్రించుకొని ఋజుమార్గంలో ప్రయోగిస్తే ఈ గ్రహముల బారినుండి తప్పించుకొంటాడు.

మానవుడు పుట్టినపుడే అతని భవిష్యత్తును బ్రహ్మదేవుడు నొసట వ్రాసియుంటాడు అని అంటారు. అందరూ కూడ అదే అనుకొంటాం. దీనికే తలవ్రాత నొసటివ్రాత అని కూడ అంటాం. మనిషి పుట్టిన తేదీ, వారం, నక్షత్రం, తిథి, రాశి, లగ్నం వగైరాలను రాశిచక్రంలో నవగ్రహముల పాత్రను విశ్లేషించి మానవుని భవిష్యత్తును, భూతకాలాన్ని, వర్తమానాన్ని చెప్పునది జ్యోతిష శాస్త్రం. అనగా మానవుడు తల్లిగర్భంలో నున్నప్పుడు బ్రహ్మదేవుడు తలవ్రాతను వ్రాస్తాడు అనికదా అర్థం. అంటే మానవ జీవితానికి పునాదియైన గర్భం చాలా ముఖ్యమైనదని తేటతెల్లంగా తెలియుచున్నది.

జన్మించబోయే శిశువుకు జీవితంలో కలుగు అదృష్టదురదృష్టములు, కష్టసుఖములు, సుఖదుఃఖములు, ఆయుష్షుమరణము, వ్యాధి ఆరోగ్యము, సంపద దారిద్ర్యము, వివాహము, సంతానము, గుణాగణములు, నడవడికలు, వృత్తులు, మొదలగునవి యన్నియు గర్భస్థ శిశువు నొసటవ్రాసిన తర్వాతనే శిశుజననం కలుగుతుంది. రికార్డు స్టేషనులో పాటలను క్యాసెట్టులో రికార్డుచేస్తారు. ఆ క్యాసెట్‌ను రేడియో పరికరములో పెట్టగా ఇదివరకు క్యాసెట్‌లో రికార్డుచేసిన పాటపాడుతుంది. వేరేపాట పాడదు. అదేవిధంగా గర్భస్థ శిశువునకు గర్భంలో వ్రాయబడిన నొసటి వ్రాతను (బ్రహ్మవ్రాతను) ఏవిధంగా వ్రాయబడునో, జననానంతరం నిజజీవితంలో అ ఫలితాలనె ఆ జీవి అనుభవించును.

గర్భస్థ శిశువుకు తలవ్రాతను బ్రహ్మదేవుడు వ్రాస్తాడా లేక మనమే వ్రాస్తామా అని తర్కించవలసియున్నది. బ్రహ్మ వ్రాసిన నొసటి వ్రాత విధియనబడుతుంది. విధిని ఎవ్వరూ అతిక్రమించలేరు. కాని బుద్ధిబలం చేత విధిని అతిక్రమించ వచ్చునని యొక నానుడి యున్నది. కావున గర్భస్థ శిశువుకు నొసటి వ్రాతను బుద్ధిబలం చేత బ్రహ్మదేవుని బదులు మనమే ఎందులకు వ్రాయరాదు. ఆ విధంగ వ్రాసేందుకు వీలుకలుగుతుందా అని పరిశీలిస్తే తేలేదేమంటే తలవ్రాతను వ్రాసేది తలిదండ్రులేగాని బ్రహ్మకాదు మరియొకరు కారు. బుద్ధిబలం వుంటేనే ఇది సాధ్యం. బుద్ధిబలంతో ఎటువంటి గుణగణాలుగల సంతానం కావలయునో నిశ్చయించుకొని అటు వంటి సంతానాన్ని పొందవచ్చును.

బుద్ధిబలాన్ని ఉపయోగించుటెట్లో ఈ క్రింది ఉదాహరణ తేటతెల్లంచేస్తుంది. ఒకరాజుకు ఇరువురు సంతానం. ఒక కుమార్తె ఒక కుమారుడు. కుమార్తె జీవితాంతం పడుపు వృత్తితో జీవించ వలెననియు, కుమారుడు జీవితాంతం ఒంటెద్దు బండిని బాడుగకు తోలుకొని జీవించునని బ్రహ్మలలాట లిఖితంగయున్నవి. రాజు జాతకాలు జ్యోతిష్యం ద్వారా ఈ లలాట లిఖితాలు కనుకొని దిగాలు పడినాడు. కాని మంత్రి చాలా తెలివైనవాడు అమిత బుద్ధిశాలి. మంత్రి రాజుకు ధైర్యం చెప్పాడు. బ్రహ్మలలాట లిఖితానికి తాను విరుగుడు చేస్తానని నొక్కి చెప్పాడు. రాజు కుమార్తె కుమారులకు యుక్తవయసు వచ్చింది. పరరాజులు ఈ దేశాన్ని ఆక్రమించినారు. రాజు, కుమార్తె, కుమారుడు, మంత్రి మారు వేషాలతో ప్రక్క దేశంలో నుండసాగిరి. ఒకరోజు ఎవరో ఒక అనామకుడు ఒక ఒంటెద్దు బండిని ఎద్దును తెచ్చి రాజుకుమారునకిచ్చి రోజూ బాడుగ సంపాదించి పెట్టవలసినదిగా కోరాడు. అప్పుడర్థ మైంది అందరికీ బ్రహ్మవ్రాత ప్రారంభమైందని. అప్పుడు మంత్రి

ఆదేశానుసారం ఈ రాజపుత్రుడు ఆ ఎద్దులబండిని అడవిలో వదలి వచ్చినాడు. మరల రెండవరోజు వేరొకతను ఎద్దులబండిని తెచ్చి రాజపుత్రుని రోజూ బాడుగ సంపాదించి పెట్టవలసినదిగా కోరాడు. మరల మంత్రి ఆజ్ఞానుసారం రాకుమారుడు ఈ ఎద్దులబండిని కూడ అడవిలో వదలివచ్చినాడు. ఒక వారంరోజుల వరకు ఇదేవిధంగ ఎవరో ఒకరు ఎద్దులబండిని యివ్వడం, మంత్రి ఆదేశానుసారం రాకుమారుడు వాటిని అడవిలో వదలటం జరుగుచున్నది.

ఇక రాకుమార్తె విషయం పరికిస్తాం. అసలే రాకుమార్తె, అందులోను యుక్తవయసు. ఇంటిలో పూటగడవడం కష్టం. కలిగినవాళ్ళకు ఈ రాకుమార్తెపై నే కన్ను. మంత్రి ఆలోచించినాడు. ఇంటిబైట ఒక సంకేతాన్ని వ్రేలాడదీసినాడు. అందులో ఏముందంటే లక్షదీనారాలు చెల్లించి రాకుమార్తెను పొంద వచ్చునని. లక్షదీనారాలు యిచ్చేవారులేరు. రాకుమార్తెను పొందేవారులేరు.

ఒక వారంరోజులు గడచినవి. బ్రహ్మదేవుడు తాను వ్రాసిన లలాట లిఖితం అమలుకాక నిష్ఫలమగుటను కనుగొన్నాడు. ఖంగు తిన్నాడు. బ్రహ్మవ్రాత ఏమి అది నిష్ఫలమగుట ఏమి? తానేదో విధంగ రోజూపంపిన ఎద్దులబండి అడవిలో వదలబడుచున్నది. రాకుమారి ఏమో లక్షదీనారాలు చెల్లించిన వారితో నుందునని షరత్తు పెట్టినది. లక్షదీనారాలు ఎవరిస్తారు ?

బ్రహ్మదేవుడు తన దివ్యదృష్టితో కనుగొన్నాడు. తన వ్రాతను విఫలంచేసిన దెవరాయని. మంత్రిపుంగవుడే దీనికంతటికి సూత్రధారి అని అర్థమైంది. వెంటనే బ్రహ్మదేవుడు వారున్న చోటికి వచ్చాడు. మంత్రిని అడిగాడు ''ఏమయ్యా! నేను బ్రహ్మదేవుడను. నేను వ్రాసిన లలాట లిఖితం అమలుకాకుండ అడ్డుతగులుచున్నావు'' అని. అందులకు మంత్రి ''స్వామీ। నాదేముంది. నేను నిమిత్తమాత్రుడను, రాజు సంతతి రాచరికంతో బ్రతుకవలసి

ున్నది. కాని మీరే అకార్యంచేసినారు. అందులకు విరుగుడుగా
ుపనిచేసినాను'' అన్నాడు. అప్పుడు బ్రహ్మ మంత్రితో ''ఈ
ుడు లలాటలిఖితాలు అమలు కాలేదని నేను సృష్టి కార్యాన్నంత
ులి ప్రతిరోజూ ఈ విషయంగ మదనపడిపోతున్నాను. అయిన
కోఅయింది. ఇప్పుడు నేనేమిచేయవలయునో మనవిచేయు మయ్యా
ుత్రివర్యా'' అని బ్రహ్మదేవుడు మంత్రిని ప్రాధేయపడినాడు.
ుదులకు మంత్రి బ్రహ్మదేవునితో ''స్వామీ! రాజుకు అతని
'జ్యాన్ని ఇప్పించండి. రాకుమార్తెకు పొరుగూరు రాకుమారు
ితో వివాహం జరిపించండి. రాకుమారుని యువరాజుగ పట్టాభి
క్తుని చేయండి'' అని నుడివినాడు. విధిలేక బ్రహ్మదేవుడు తథాస్తు
ు మంత్రి కోరినవిధంగానే చేసివెళ్ళాడు.

ఇది కేవలం ఒకకథమాత్రమే అగుగాక. కాని ఇందులోని
ాత్మవిషయం ఏమనగా ఇంగితజ్ఞానం దైవమిచ్చిన బుద్ధిబలంతో
'న్ని అవాంతరాలను కూడ మానవుడు ఎదుర్కొని సఫలీకృతుడు
ావచ్చును అనేనీతిని మనం గ్రహించగలము. కాబట్టి తలవ్రాతను
ుద్ధిబలంతో మనం చక్కబెట్టుకోవచ్చును. మన ఇష్టప్రకారం
ార్చుకోవచ్చును అని తెలియుచున్నది.

ఈవిధానాన్ని మనం ఏవిధంగ సాధించి పొందవచ్చును?
ది వరకు మన పూర్వీకులు ఈ దిశగా ఏమైనా ప్రయత్నించినారా?
ులితాన్ని సాధించినారా? ఈ ప్రయత్నాలు ఫలితాలు జ్ఞానంతో
ుడిపడినవా అని ఆలోచించితే జ్ఞానంతో కూడిన ప్రయత్నాలు
ూర్వం జరిగినదనియు, అద్భుతమైన సత్ఫలితాలను సాధించినా
'నియు భాగవత భారతాలలో చెప్పబడియున్నవి.

శ్రీమద్భాగవతంలో ఒక ఘట్టం. హిరణ్యకశిపుడు దేవవిరోధి,
మహావిష్ణువుకు బద్ధశత్రువు. అటువంటి హిరణ్యకశిపునికి కలిగిన

ప్రహ్లాదుడు దేవమిత్రుడైనాడు, విష్ణుభక్తుడైనాడు, పరమ భాగవతోత్తముడైనాడు. ఎందులకీ విధంగ జరిగింది?

హిరణ్యకశిపుడు ఈశ్వరుని గూర్చి తపస్సుచేసి వరాలు పొంది మరల బలగాల్ని కూర్చుకొని తన తమ్ముడు హిరణ్యాక్షుని వధించిన నారాయణుని మట్టుబెట్టవలయునను తలంపుతో తపస్సులకు పోతాడు. ఆ సమయంలో హిరణ్యకశిపుని భార్య గర్భవతి. హిరణ్యకశిపునితో వేగలేక సతమతమౌతుంటే ఇక వానికి గలుగు సంతానంతో ఏవిధంగా కష్టాలు పడాలో యని దేవేంద్రుడు చింతించినాడు. అతనికొక ఆలోచన వచ్చింది. ఆమె గర్భస్థశిశువును జన్మించిన వెంటనే సంహరించితే పీడ విరగడౌతుందని నిశ్చయించినాడు. వెంటనే దేవేంద్రుడు హిరణ్యకశిపుని నగరానికి పోయినాడు. హిరణ్యకశిపుని భార్యను గర్భవతిని రథంపై కూర్చుండబెట్టుకొని దేవలోకానికి పోతున్నాడు

మార్గమధ్యంలో నారదమహర్షి ఎదురుపడినాడు. నారదమహర్షి దేవేంద్రుని అడిగి విషయం తెలిసికొన్నాడు. ఉపాయాన్ని ఆలోచించినాడు. నారదమహర్షి "శిశువును సంహరించుట పాపం. పాపకార్యం చేయకుండ కార్యాన్ని సానుకూలం చేసుకోవాలి. విషయాన్ని తనకు వదలి తనదోవను తాను పోవలసినదిగా" దేవేంద్రునితో చెప్పాడు నారదమహర్షి. దేవేంద్రుడు సమ్మతించి తనదారిన తాను వెళ్ళాడు.

నారదమహర్షి హిరణ్యకశిపుని భార్యను తన ఆశ్రమానికి గొని పోయినాడు. ఆమెకు సకల సౌకర్యాలూ ఏర్పాటుచేసినాడు. ఆమె గదిలో తనవీణను ఉంచినాడు. నారదమహర్షియొక్క వీణ ఎల్లప్పుడూ "నారాయణ నారాయణ నారాయణ" అని దివారాత్రాలూ నారాయణ నామాన్ని ఉచ్చరిస్తూవుంటుంది. గర్భంలోనున్న శిశువు నిదురించదు. జననం వరకు మెలకువతోనే యుంటుంది. హిరణ్య

కశిపుని భార్య గర్భంలోనున్న శిశువు నారదమహర్షియొక్క వీణ ఉచ్చరించు నారాయణ శబ్దాన్ని జననం వరకూ నిరంతరం వినుచుండినది. నారదమహర్షి కూడ నిత్యం శ్రీమన్నారాయణుని గుణగణములు, గొప్పతనములను హిరణ్యకశిపుని భార్యకు తెల్పుతూ యుండెడివాడు. ఒకవేళ ఆమె నిదురించిననూ గర్భంలో యుండే శిశువు నారదమహర్షి చెప్పు ఉపదేశములను, హరికథలను శ్రద్ధగా భక్తితో ఆలకించుచుండెను. ఈ విధంగా నారాయణ నామమును నారాయణ కథలను వినివిని గర్భస్థ శిశువుకు నారాయణునిపై ప్రగాఢ భక్తి ఏర్పడింది. కావున గర్భస్థశిశువు లలాటలిఖితం నారాయణ భక్తునిగ లిఖింపబడినది. ఈ గర్భస్థశిశువు జననానంతరం శ్రీమహావిష్ణువు భక్తుడైన విషయం అందరికీ తెలిసినదే.

ప్రహ్లాదుడు జననానంతరం విద్యాభ్యాసం కొఱకు ఉ
గురువులవద్ద చేర్పించబడ్డాడు గురువులు ఏమి బోధించినను
మస్తిష్కానికి ఎక్కేదికాదు. అతనికి సదా నారాయణుని ధ్యా
తండ్రి ఎన్ని చిత్రహింసలు పెట్టినను ప్రహ్లాదుడు జంకలేదు
చిత్రహింసలు ప్రహ్లాదుని ఏమీ చేయలేక పోయాయి. చి
శ్రీ మహావిష్ణువు నృసింహావతారంతో ప్రత్యక్షమైనాడు. హి
కశిపుని చంపాడు.

ఇక్కడ ఒక సందేహం కలుగవచ్చును. హిరణ్యకశి
తన కుమారుని చిత్రహింసలకు ఎందుకు గురిచేశాడు? ఎం
తన బిడ్డడు, పసిబాలుడు కదా! ప్రహ్లాదుడు గర్భంలో నుం
నారాయణునియొక్క వీణ ఉచ్చరించు నారాయణ శబ్దాన్ని వింట
వుండెను. గర్భస్థ తల్లికూడ నారాయణునిపై ధ్యాస భక్తి క
యుండినది కాని ఆమెకు విధిలేదు నారద మహర్షి దేవేంద్ర
బారినుండి కాపాడి ఆశ్రయం యిచ్చాడు. భర్త రాక్షసుడ
నారాయణుని పరమ విరోధి. తపస్సునుండి తిరిగి వచ్చిన పి

బిడ్డకు ఏ హాని చేస్తాడో యని చింతించుచుండినది. తల్లియొక్క ఈ భయంభావం గర్భస్థ శిశువుపై బడినది. జననానంతరం హిరణ్యకశిపుడు దయాదాక్షిణ్యాలు, కరుణలేకుండ కన్నకుమారుని చిత్రహింసలు పెట్టినాడు హిరణ్యకశిపుడు తాపసి. ఈశ్వరుని సాక్షాత్కరించుకొన్న పరమ శివభక్తుడైనను తన కుమారుడెందులకు నారాయణ భక్తుడైనాడని యోచన చేయలేదు. ఆపదలపాలైనాడు.

ఇక మహాభారతాన్ని అవలోకిద్దాం. అర్జునుడు తన భార్య సుభద్రకు తన విలువిద్యా కౌశలాన్ని అస్త్రప్రయోగ ఉపసంహారాలను చెప్పుచుండెడివాడు సుభద్ర వీటిని సావధానంగా వినుచుండేది. ఒకనాడు మధ్యాహ్నం పూట సుభద్రార్జునులు సుష్టుగా భోంచేసి తాంబూలాలు వేసుకొని పిచ్చాపాటి మాట్లాడుచుండిరి. అప్పటికే సుభద్ర గర్భవతి. తన భర్తను పద్మవ్యూహం గురించి వివరించవలసినదిగా సుభద్రకోరింది. అర్జునుడు పద్మవ్యూహ నిర్మాణము అందులో జొరబడు విధానములను చెప్పుచుండెను. ఆ సమయంలో సుభద్ర భుక్తాయాసంతో నిద్రిస్తున్నది. సుభద్ర నిద్రించు విషయాన్ని అర్జునుడు గ్రహించలేదు. తాను చెప్పుకొనుచూ పోతున్నాడు. పద్మవ్యూహంలో జొరబడు విధానం వరకు చెప్పినాడు.

ఇంతలో మాయావి శ్రీకృష్ణుడు విషయం తెలిసికొన్నాడు. సుభద్రగర్భంలో నున్నవాడు అసురుడు, పూర్వజన్మలో తనకు విరోధి, ఈజన్మలోతనను మట్టుపెట్టుటకు జనించబోతున్నాడు, అటువంటివాణ్ణి పద్మ వ్యూహంలోనే మట్టుబెట్టవలయునని నిశ్చయించుకొన్నాడు. వేగంగా సుభద్రార్జునుల నద్దకు వచ్చినాడు. పద్మవ్యూహంలో జొరబడే విధానంవరకు అర్జునుడు చెప్పిముగించిన సమయానికి శ్రీకృష్ణుడు సుభద్రార్జునులకడకు వచ్చినాడు. పద్మవ్యూహంలో జొరబడిన తర్వాత శత్రుఛేదనంచేసి బయటకు నిష్క్రమించు ఘట్టమును అర్జునుని చే చెప్పనీయక ఏదో అత్యవసరమైనపని యున్నదను మిషమీద

తనను తీసికొనిపోయిన విధం జ్ఞాపకంవచ్చి శ్రీకృష్ణునితో ఈ విష యాన్ని ప్రస్తావించి నిష్ఠురాలాడతాడు.

పై వృత్తాంతాలను పరికిస్తే గర్భస్థ శిశువు బయటి ప్రపంచ విషయాలను ఆకళింపుచేసుకొని జననానంతరం నిజజీవితంలో ఆవిధంగ ప్రవర్తిస్తుంది అను విషయం నారదమహర్షికి, అర్జునునకు, శ్రీకృష్ణునకు మాత్రం తెలియును.

అదే మహాభారత భాగవతాలలో వ్యాసమహర్షి జన్మచరిత మరియొక ఉదాహరణ. మత్స్యగంధి తన నావలో గంగాతీరమునకు ఆవలియొడ్డున నున్న ప్రయాణీకులను ఈవలియొడ్డుకు, ఈవలియొడ్డున నున్న ప్రయాణీకులను ఆవలయొడ్డుకు చేరవేస్తూయుండేది. వశిష్ఠ మహర్షి మనుమడు శక్తిమహాముని కొడుకూ అయిన పరాశరుడూ ఒకనాడు గంగాతీరపు ఈవలియొడ్డునుండి ఆవలియొడ్డును చేరుటకు మత్స్యగంధినావలో ప్రయాణిస్తాడు. ఆప్రయాణపు నావలోనే పరా శరుడు మత్స్యగంధిని కామిస్తాడు, సంభోగిస్తాడు. మత్స్యగంధి గర్భం దాల్చుతుంది. పరాశరముని ఆమెతో వేదవేదాంగవిదుడు, మహిమాన్వితుడునగు కుమారుడు జన్మిస్తాడని చెబుతాడు.

గర్భవతిగా నున్నప్పుడు మత్స్యగంధి సదా పరాశరుని, అతని పలుకులను, అతని రూపాన్ని మరియు తనకు వేదవేదాంగ విదుడగు కుమారుడు జన్మిస్తాడని తలచుకొనుచుండినది. మత్స్యగంధికి నవ మాసాలు నిండినవి. పుత్రజననం కలిగినది. గడ్డం మీసాలతోనున్న చిన్నారిముని జనించాడు. వేదవ్యాసుడుగ ప్రసిద్ధిచెందినాడు. వేద విభజనచేసాడు. అష్టాదశపురాణాలు భారత భాగవతాలను రచించినాడు.

మరియొక ఉదాహరణ ఇది శ్రీకృష్ణావతారం. దేవకి అష్టమ గర్భంలో జనించు పుత్రునిచే తాను చంపబడుతానని కంసుడు తన చెల్లెలు దేవకిని కారాగారంలో నిర్బంధిస్తాడు. దేవకి అష్టమగర్భం

దాల్చింది. ఈ గర్భాన్ని ఏ విధంగ కాపాడుకోవాలని దేవకి ఆలోచనలు. తన గర్భంలోనున్న శిశువు జననానంతరం కంసుని కడతేరుస్తాడు, దుష్టశిక్షణ శిష్టరక్షణ చేస్తాడు, తమకు తమ రాజ్యాన్ని జయించి యిచ్చి తన భర్తను రాజుగా చేస్తాడు అని నిత్యాం మననం చేసుకొంటూ యుంటుంది. ఈ ఆలోచన గర్భస్థ శిశువుపై బడింది. ఈ ఆలోచన గర్భస్థ శిశువుకు లలాట లిఖితంగ మారింది. బిడ్డపుట్టినాడు. కంసుని సంహారం చేసినాడు. తండ్రికి రాజ్యాన్ని జయించి యిచ్చి, ఆ రాజ్యానికి పట్టాభిషిక్తుని చేసినాడు, దుష్టశిక్షణ శిష్టరక్షణ చేసినాడు. మహాభారత యుద్ధాన్ని నడిపినాడు, భూ భారాన్ని తగ్గించినాడు, భగవద్గీతను బోధించినాడు, లీలామానుష దైనాడు, మహావిష్ణువే అయినాడు.

శ్రీకృష్ణుడు ఎన్నో రాజ్యాలను జయించి వారి వారసులకు ఆయారాజ్యాలను అప్పగించినాడు. కాని తాను ఏ రాజ్యానికీ రాజు కాలేదు. ఎందులకావిధంగ జరిగింది? దేవకి తాను శ్రీకృష్ణుని గర్భందాల్చినపుడు ఆగర్భస్థ శిశువు జననానంతరం తమ రాజ్యాన్ని జయించి యిచ్చి తన పతిదేవుణ్ణి పట్టాభిషిక్తుని గావించునని నిత్యాం తలచుచుండినది. ఈ తలంపు గర్భస్థశిశువుపై బడి తలవ్రాతగ మారి జననానంతరం శ్రీకృష్ణుడు తన తలిదండ్రులకు రాజ్యాన్ని జయించి యిచ్చి వారి నా రాజ్యానికి పట్టాభిషిక్తులను గావించినాడు. దేవకి తన గర్భస్థశిశువు కూడ రాజై రాజ్యం ఏలుతాడు అని గర్భంతో నున్నపుడు అనుకొనియుంటే శ్రీకృష్ణుడు తప్పక రాజై యుండి రాజ్యపాలన చేసియుండేవాడు.

పై నుదహరించిన భారత భాగవత వృత్తాంతాలను గాక నా స్వీయానుభవాన్ని కొన్నిటిని ఉదహరిస్తే సమంజసంగ యుంటుంది. అని నాకు తోచుచున్నది. చదువరులు కూడ తమ అనుభవాలను

మననం చేసికొని తర్కించితే నా స్వీయానుభవం నిజమని తేటతెల్ల మవుతుంది.

అది ఒక కుగ్రామం. మా ముందు తరాలవారు పేరు ప్రఖ్యాతులతో బ్రతికిన గ్రామం. మా తండ్రిగారు కుటుంబ పెద్ద. ఆయనకు నలుగురు చెల్లెండ్రు ముగ్గురు తమ్ముళ్ళు. కుటుంబ పెద్దగా తన చెల్లెండ్రకు వివాహం చేసినాడు. అప్పటికి మా తండ్రిగారు ముప్పైఅయిదు సంవత్సరముల అవివాహితుడు. అదే గ్రామంలో ఒకే కులమునకు చెందిన ఇద్దరు వివాహిత స్త్రీలతో మా తండ్రిగారు సంబంధం ఏర్పరచుకొన్నారు. ఆయనకు తన ముప్పైఐదవ ఏట వివాహమైనది. మేము ఐదుగురు కుమారులము, ముగ్గురు కుమార్తెలు కలిగినాము. నేను రెండవవాడిని నా తర్వాత తమ్ముడు. నా ఈ తమ్ముడు గర్భంలో నుండగా మా తండ్రిగారు మా తల్లిని ఆయన సహవాసియైన ఒక స్త్రీని రాత్రివేళలలో ఇంటికి తీసికొని రావలసినదిగా దౌర్జన్యం చేసేవాడు. మా తల్లి ఈ దౌర్జన్యాలకు తాళలేక ఆయన చెప్పిన విధంగ ఆ స్త్రీని ఇంటికి తీసికొని వచ్చేది. మా ఇంటిలోనే మా తల్లి ఎదుటే మా తండ్రి ఆ స్త్రీతో యుండేవాడు. నా తమ్ముడు పుట్టాడు. పెరిగి పెద్దవాడైనాడు. యుక్తవయసు వచ్చింది. వాడు కూడ వేరే వివాహిత స్త్రీతో సంబంధాలు ఏర్పరచుకొన్నాడు. మా తలిదండ్రుల మిగిలిన ఏడుగురు సంతానం నీతిగ బ్రతుకుచున్నారు. అనగా మా తమ్ముడు గర్భంలో నున్నప్పుడు మా తల్లిగారు తన భర్తచేయు అకార్యములను తలచుకొని కుమిలిపోవుచుండెడిది. ఈ చెడు తలంపు గర్భస్థ శిశువుపై బడి తలవ్రాతగ మారి జననానంతరం ఆ శిశువు (మా తమ్ముడు) తన తండ్రివలె అకార్యానికి పాల్పడినాడు

నా మాతామహుడు మహాజ్ఞాని, అవధూత, ఆయన వీరబ్రహ్మంగారి జీవితచరిత్ర, కాలజ్ఞానం, తత్వం, యోగం, ప్రాణాయామం, ధార్మికోపన్యాసములు గురించి పదుగురికీ చెబు

తుండేవాడు. చుట్టుప్రక్కల ఇరవై కిలోమీటర్ల దూరంలో గల గ్రామాదులలో ఆయన నాటకాలు నేర్పించి వీధినాటకాలు వేయించే వాడు. పండరిభజనలు నేర్పి పండరీపుర యాత్రలు చేసేవాడు. ప్రతి పూర్ణిమనాడు గురుపూజలు జరిపించేవాడు భక్తులు చాలా మంది ఆయన కడగట్టు కుమార్తె నాకన్న ఎనిమిది నెలలు చిన్నది. అనగా పై జెప్పిన నా తమ్ముడు మా తల్లి గర్భంలో నున్నప్పుడు మా తాతగారి కడగొట్టు కుమార్తె కూడ మా అవ్వగారి గర్భంలో నున్నది. మా గ్రామం మా తాతగారి గ్రామం చాలాదగ్గర. మా తల్లి మా తాతగారి గ్రామానికి అప్పుడప్పుడూ పోయి వస్తూ వుండేది. మా తల్లిగారు మా అవ్వగారితో తన భర్త పెట్టు చిత్రహింసలను (అనగా తన స్త్రీ సహవాసిని తన ద్వారా తన ఇంటికి పిలిపించుకొని తన కళ్ళెదుటే యుండు అకార్యమును) చెప్పుచూ దుఃఖించేది. మా అవ్వ మా తల్లిని ఓదార్చేది.

మా అవ్వ ఈ విషయంగ చాలా దిగులుపడి తన అల్లుడు ఎంత హేయంగ ప్రవర్తిస్తున్నాడని మనోవేదన పడేది. ఈ వేదన మా అవ్వగర్భంలో యుండే శిశువుపై బడింది. ఈ విషయాలు అంతా ఆ గర్భస్థశిశువుకు తలవ్రాతగ మారింది. శిశుజననమైనది. బాల్యం గడచింది. యౌవనంవచ్చింది. యోగ్యునికిచ్చి వివాహం చేసినారు. మాతండ్రి ఏదైతే ఉద్యోగం చేయుచుండెనో ఈ అల్లుడు కూడ అదే ఉద్యోగం చేసేవాడు. దంపతులు సుఖంగ యున్నారు. ముగ్గురు కుమారులు పుట్టినారు.

పది సంవత్సరములు గడచినవి. ఇంకేముంది. ఈ అల్లుడు కూడ పెద్దల్లుడువలె (అనగా మా తండ్రివలె) ఒక వివాహిత స్త్రీతో సంబంధం ఏర్పరచుకొన్నాడు. ఈ స్త్రీ కూడా మా తండ్రిగారికి సంబంధంయున్న స్త్రీ కులమునకు చెందినదే. ఇతడు తన భార్య ద్వారా తన సంబంధిత స్త్రీని ఇంటికి పిలిపించుకొనుచు రానురాను ఒకే ఇంట్లిలో తనభార్య తనసంబంధీక స్త్రీని ఇరువురిని ఒకేఇంటిలో

ఉంచి కాపురం చేయసాగాడు. భార్య ఏమియు చేయలేక ఆ స్త్రీతో కలసిమెలసి కాపురం వెళ్ళబుచ్చింది.

మా తాతగారు జ్ఞాని, అవధూత అని చెప్పినాను కద. మరి ఆయన కిమా రైకు ఎందులకీ గతి పట్టింది? మా అవ్వగారు గర్భంగ నున్నప్పుడు మా తల్లిగారి బాధలు విని మదనపడుచుండినది. ఈ మనోవేదన గర్భంలోనున్న శిశువుకు లలాటలిఖితమైంది. జననా నంతరం ఈవేదనపడిన బాధలన్నియు జనన శిశువును నిజ జీవితంలో సంభవించి అనుభవింపజేసినాయి. మా తాతగారి భక్తి, జ్ఞానం, వైరాగ్యాలేవియు తన బిడ్డపై చూపలేకపోయాయి.

మా ప్రక్క గ్రామం కుగ్రామమైనా స్త్రీ సంబంధాలు వావి వరుసలులేకుండ కొన్ని కుటుంబాలు మనుగడ సాగిస్తుండినవి. అత్త అల్లుడితో సావాసం, మామగారు కోడలితో సావాసం. కొన్ని సందర్భాలలో స్త్రీలు తమ కుమార్తెలను సావాసగాడికిచ్చి వివాహాలు చేయుచుండిరి, ఇటులుండగా ఒకనాడు ఒకామె వేరే గర్భిణీ స్త్రీతో పిచ్చాపాటీ మాట్లాడుతూ ఈకాలం స్త్రీ తనకుమార్తెను తన సహావాసగాడికిచ్చి వివాహముచేయు విషయం సర్వసాధారణం సహజం అని చెప్పినది. ఈ మాటలు విన్న గర్భిణీ స్త్రీ ఆశ్చర్యపోయినది. ఎందువలనంటే ఈ గర్భిణీ స్త్రీ ఆ ఊరికి క్రొత్తకోడలు. ఈమెకు ఐదు సంవత్సరముల కుమార్తె కూడ. మాటవరుసకు ఈగర్భిణీ స్త్రీ తానుగూడ తనతో సంభాషించిన స్త్రీ యొక్క కుమారునితో సంబంధం పెట్టుకొంటాను, తన కుమార్తె పెద్దదైన తర్వాత తన కుమార్తెను అతనికే యిచ్చి వివాహం జరిపిస్తానన్నది.

ఈ స్త్రీలిరువురూ వేర్వేరు కులములకు చెందినవారు. గర్భిణీ స్త్రీ చాలా పతివ్రత. నవమాసాల తర్వాత కుమారుని కన్నది. శిశువు పెరిగి పెద్దవాడైనాడు. యుక్తవయసు వచ్చింది. వేరేకుల పు కన్యను రహస్యంగా దేవాలయంలో వివాహం చేసుకొన్నాడు.

ఇక్కడ ఆశ్చర్య పడవలసిన విషయమేమంటే ఇతని తల్లి ఏ స్త్రీతో నైతే నీ కుమారునితో సంబంధం పెట్టుకొంటాను, నా కుమార్తె పెద్దదైతే నీ కుమారునికిచ్చి వివాహం చేస్తానని అన్నదో ఆ స్త్రీ యొక్క కులమునకు చెందిన కన్యనే ఇతడు దేవాలయంలో కులాంతర వివాహం చేసుకొన్నాడు.

అనగా ఆపామాపిగ తాను మాట వరుసకు మాట్లాడిన విషయం గర్భస్థ శిశువుపై బడి లలాట లిఖితంగ మారి జననానంతరం నిజ జీవితంలో కార్యరూపం దాల్చింది.

నా ప్రాణ మిత్రు డొకడు పేరుమోసిన బ్యాంకులో స్టేట్ ఆఫీసరుగా యుండేవాడు. తన మేనమామ కుమార్తెను వివాహమాడినాడు. రాష్ట్రరాజధానిలో కాపురం. ఇతని భార్య సదా మగనిపై అనుమానం. సాయంత్రం ఐదున్నరగంటలకల్ల బ్యాంకునుండి భర్త ఇంటికి రాలేదంటే ఈమె నేరుగా ఆ బ్యాంకుకుపోయి తన భర్త గురించి వాకబుచేస్తుంది. భర్త బజారుకో గుడికో పోయి ఆలస్యంగ ఇల్లుచేరితే వేరే యువతితో సరసాలాడి ఆలస్యంగ వచ్చినాడని కీచులాడుతుంది. వీరి కాపురం మేడపైన. భర్త ఏదో విషయంగ క్రింది కాపురాళ్ళ వారితో మాట్లాడితేకూడ ఈమె భర్తను అనుమానించి తగవులాడేది.

ఈ విధంగ ఎందుకు జరుగుచున్నదని ఆరాతీసాను. ఈమెగారి తల్లి తన భర్తపై ఎల్లప్పుడూ అనుమానం పిశాచి, వారింటెదురుగా మంచి దంపతులు కాపురముండిరి. తన భర్తతో ఎదురింటావిడకు సంబంధం వుందని ఈమె భర్తను సదా వేదిస్తుండేది. ఈ తగాదాలు మన కథానాయకి గర్భంలో నున్నప్పుడు జరిగినది. ఆ అనుమాన పిశాచపు సంభవాలన్నీ గర్భస్థ శిశువుపై బడి నొసటివ్రాతగ వ్రాయబడినది. జననానంతరం ఆమె నిజజీవితంలో అపశృతులు పలికినాయి,

నే నున్నప్రదేశంలో ఒక తాసిల్దారు వుండెను. అదేవిధంగ ఒక శాసనసభ్యుడూ వుండెను. ఇద్దరి పేర్లూ ఒకటే. ఇద్దరి కులాలూ

11

ఒకటే. ఇద్దరి రాసులూ ఒకటే. కాని వీరి గుణగణాలలో హస్తి మశకాంతర భేదముండేది. ఎందులకీ విధంగ సంభవించినదని ఆరా తీస్తే తాసిల్దారు తల్లిదండ్రులు సౌమ్యులు, పరోపకారులు, పరుల సొమ్మును తృణపాయంగ చూచేవారు. తన గర్భంలో ఈ తాసిల్దారు పున్నప్పుడు ఆ తల్లి ఈ సద్గుణాలతోనే యుండినది. ఈ సద్గుణాలు గర్భస్థ శిశువుపై బడి తల్ర్వాతగ మారి జననానంతరం నిజ జీవితంలో సద్గుణరాశిగ విరాజిల్లుచున్నాడు.

నా దూరపు బంధువు నాకు సహపాఠకుడైన ఒకతను. ఇతను చాలా అందంగ ఆజానుబాహుడుగ యుంటాడు. ఇతను తన స్వగ్రామంలో నున్నప్పుడు వేరేకులపు కన్యతో సంబంధం పెట్టుకొన్నాడు. ఊరూ వాడ అందరికీ ఈ విషయం తెలుసును. వేయి అబద్ధాలు చెప్పియైనా ఒకవివాహం జరుపవలెనని శుక్రాచార్యుని నీతికదా ! పెద్దలు ఆ కన్యకకు వేరే అతనితో వివాహం జరిపించినారు. అయి ననూ ఆ కన్య వివాహానంతరం కూడ తనపాతప్రియుణ్ణి మరువలేదు. ఎప్పుడుపడితే అప్పుడు తన స్వగ్రామానికి వచ్చి తన పాతప్రియునితో గడుపును. ఈ విషయం ఆ కన్య భర్తకుకూడ తెలుసును. కొట్టినా తిట్టినా వినుటలేదు.

ఇట్లుండగా నా సహపాఠకునికి కూడ వేరే కన్యతో వివాహం అయింది. ఈమె గర్భం దాల్చింది. ఈమెకు తన భర్త పూర్వ చరిత్ర తెలుసు. ఇదిగాక తన కట్టెదుటే ఆ పూర్వ సహవాసి తన భర్తతో అప్పుడప్పుడు గడుపుటను తాను ఎన్నోమారులు చూచింది. నివారించుటకు శక్తిలేదు. మనసులో దిగమింగుకొని యుండేది. ఈ విషయం అంతా గర్భస్థ శిశువుపై బడినది. తల్ర్వాతగ మారింది. నవమాసాల తర్వాత ఆడబిడ్డ జనించింది. పెరిగిపెద్దైంది. వివాహం జరిగింది.

తర్వాత విషయం తెలిసింది. ఈమె భర్త (నా సహపాఠి అల్లుడు) ఇదివరకే వేరే స్త్రీతో సంబంధం పెట్టుకొనియున్నాడని. ఈ విధంగ ఎందుకు జరిగింది? నా సహపాఠి భార్య తన భర్తయొక్క పరస్త్రీ సంబంధమును తాను గర్భంగ నున్నప్పుడు మననం చేసికొనుచూ యున్నందున ఆ విషయం గర్భస్థ శిశువుపై బడి గర్భస్థ శిశువుకు తల వ్రాతగమారి జననానంతరం కార్యరూపం దాల్చింది.

నా దగ్గర బంధువు ఒకామె, ఆమె వివాహమైనపుడు ఆమె ఉమ్మడి కుటుంబం. ఆమె ఆ ఇంటికి పెద్దకోడలు. అత్తమామలు కూడ ఈమెను బాగా చూచుచుండిరి. ఈమెకూడ అత్తిమామలను ఆప్యాయత అనురాగాలతో చూచేది. ఈ విషయం ఈమె గర్భస్థ శిశువుపై బడినవి. తలవ్రాతగ గర్భస్థ శిశువుపై ముద్రబడినది, మగబిడ్డపుట్టినాడు యుక్తవయస్సు వచ్చింది. వివాహం జరిగింది. ఈ కోడలు తన అత్తమామలను చాలా అనురాగ ఆప్యాయతలతో చూచుచున్నది.

పై అత్తగారి మరదికి మేనరికంలో వివాహం జరిగింది. ఇంటిలో ఘర్షణలు ప్రారంభమైనాయి. ఈ తోడికోడలు అత్తమామలను విసుగుకొనేది. అత్తమామలకు తోడికోడలుకు మాటమాట పెరిగేది. ఈ సమయాన పెద్దకోడలు (పై పేరాలో చెప్పబడిన అత్త) రెండవసారి గర్భం దాల్చింది. రెండవ కోడలు ఆమె అత్తమామల పోర్లు గర్భస్థ శిశువుపై బడినది. తలవ్రాతగ మారింది. కుమారుడు పుట్టినాడు. పెరిగి పెద్దవాడైనాడు. యుక్తవయస్సు వచ్చింది. వివాహం జరిగింది. ఇతని భార్య తన అత్తమామలను (అనగా ఈ ఇంటి రెండవకోడలు) విసుగుకొనేది. వీరికి ఎవరు సపర్యలు చేస్తారని సూటిమాటలంటుండేది, అనురాగంతో చూచుకొనే పెద్దకోడలు చీదరించుకొనే చిన్నకోడలు ఎందుకు కలిగినారు! ఈమె గర్భం దాల్చినపుడు ఆయాసమయాలలో కలిగిన మనోభావాలు గర్భస్థ శిశువులపై బడి తలవ్రాతగ మారి జననానంతరం కార్యరూపం దాల్చి ఆ పరిస్థితులనే అనుభవింపజేస్తున్నాయి.

నా మిత్రుడొకడున్నాడు. అను వర్ణాంతర వివాహం చేసుకొన్నాడు. భార్యాభర్తలిరువురు అన్యోన్యంగ కాపురం చేయుచుండిరి. మొదట వీరికి ఒక కుమారుడు కలిగినాడు. జాతక ప్రకారం ఈ కుమారుడు చాలా యోగ్యుడుగ, విద్యావంతుడుగ, కీర్తి ప్రతిష్టలతో, ఉన్నతోద్యోగం చేస్తూ బ్రతుకగలడని యున్నది. ఈ కుమారుడు గర్భంలోనున్నప్పుడు తండ్రి చాలా మంచివాడుగ నుండినాడు. ఈ విషయం గర్భస్థ శిశువుపై బడి తల్వాతగ మారి జననానంతరం నిజ జీవితంలో జరుగనున్నవి.

మరల కొన్నాళ్ళకు పైనా మిత్రుని భార్య రెండవ సారి గర్భం దాల్చింది. ఆ సమయంలో ఇతడు తా చేయని నేరానికిగాను కారాగారంలో బంధింపబడి తప్పుడు కేసులలో ఇరుక్కొన్నాడు. చిట్టచివరకు న్యాయస్థానంద్వారా కేసుల నుండి విముక్తుడైనాడు. ఈ విషయం అంతా ఇతని భార్య గర్భస్థ శిశువుపై బడినవి. ఇతని భార్య తన భర్తకు అన్యాయం జరిగినదని ఎదిరించవలెనని అనుకొనుచుండినది. ఈ విషయం కూడ గర్భస్థ శిశువుపై బడినవి. తల్వాతగ గర్భస్థ శిశువుకు మారింది కుమారుడు జనించినాడు. ఈ రెండవ కుమారుని జాతకం పరిశీలిస్తే ఇతడు తన జీవితంలో పరమదురాత్ముడుగ ఎవరికీ లోబడకుండ తల్లిదండ్రులకు అపఖ్యాతి తెచ్చేవాడుగ బ్రతుకగలడని జ్యోతిష్కులు చెప్పినారు. అంటే మొదటి గర్భం దాల్చినపుడు ఉన్న మంచి పరిస్థితులు మంచి పుత్రుని, రెండవ గర్భం దాల్చినపుడు ఉన్న చెడు పరిస్థితులు చెడు పుత్రుని కలిగించినాయి.

నేను ప్రభుత్వోద్యోగిని. కరువునివారణ స్కీములను తయారుచేయు పని తగిలింది. నాతోబాటు కార్యాలయంలో అధికారితోబాటు అందరు సిబ్బంది ప్రతిరోజూ ఉదయం ఆరుగంటలనుండి మధ్యాహ్నం రెండు గంటలవరకు మరల మధ్యాహ్నం రెండున్నర గంటల నుండి రాత్రి రెండుగంటలవరకు పని చేయుచుంటిమి. ఈ

స్కీమును నిర్ణీతకాల వ్యవధిలో పూర్తి చేయవలసి యున్నందున అందరూ రాత్రింబవళ్ళు కలిసికట్టుగ పనిచేసి నాలుగు నెలలో పూర్తి చేసినాము. ఒక్కొక్కప్పుడు రాత్రి వేళలలో కార్యాలయంలోనే యుండి మరునాడు ఉదయం స్నానపానాదులకు ఇంటికి వచ్చేవాడిని. ఆ కాలంలో నా భార్య మొదటి గర్భం దాల్చింది. కుమార్తె జనించింది. యుక్తవయస్సు వచ్చింది. వివాహం జరిగింది. అల్లుడు ఒక పేరు మోసిన ప్రయివేటు కర్మాగారంలో ప్రొడక్షన్ సూపర్ వైజర్‌గ పనిచేయుచున్నాడు ఇతను చాలావరకూ రాత్రివేళల్లో విధి నిర్వహిస్తూవుంటాడు. కారణం ఏమి ?

నా భార్య గర్భంగ నున్నప్పుడు నేను ఆలస్యంగ అర్ధరాత్రప్పుడు ఇంటికి వచ్చు విషయం, అప్పుడప్పుడు రాత్రివేళల్లో కార్యాలయంలోనే పనిచేయుచు ఇంటికి మరునాడు వచ్చు విషయం గర్భస్థ శిశువుపై బడి జననానంతరం నిజ జీవితంలో రాత్రిపూట ఉద్యోగం చేయు భర్త నా కుమార్తెకు లభించినాడు.

నా భార్య మూడవమారు గర్భం దాల్చింది. నా భార్య ఉద్యోగరీత్యా వేరే పట్టణానికి పోయి ఒక వారం రోజులు నేషనల్ కాడెట్ కార్ప్స తర్ఫీదుపొంది వచ్చింది. కుమారుడు పుట్టినాడు. జాతక ప్రకారం నా కుమారుడు సైన్యంలో ఉన్నతపదవి పొంది యుద్ధంలో పాల్గొంటాడు అని జ్యోతిష్కులు చెప్పినారు. ఎందులకీ విధంగ జరిగింది ? గర్భంగ నున్నప్పుడు నా భార్య పొందిన తర్ఫీదు విషయం గరస్థ శిశువుపై బడి తలవ్రాతగ వ్రాయబడి నిజ జీవితంలో జరుగనున్నది.

అందరికీ జ్ఞాపకం ఉంటుంది. 1996 సంవత్సరంలో ఒక సంచలనవార్త అన్ని వార్తాపత్రికలలో ప్రచురణమైంది. అది ఏమంటే ఒక ఎనిమిది సంవత్సరముల వయస్సు గల బాలుడు మారుతీకారును హైదరాబాద్ నుండి తిరుమలకు 120 కిలో మీటర్ల

12

వేగంతో నడిపినాడని. ఈ సామర్థ్యం ఆ బాలునికి అంత చిన్నవయసు లోనే ఏవిధంగ కలిగింది ? ఇతడు తల్లిగర్భంలో నున్నప్పుడు ఇతని తల్లి తప్పక కారుడ్రైవింగ్ నేర్చుకొని యుంటుంది. ఆ డ్రైవింగ్ నేర్పు గర్భస్థశిశువుపై బడింది. తల్రాతగ మారింది. జననానంతరం బాల్యంలోనే డ్రైవింగ్ నైపుణ్యాన్ని ఆ బాలుడు ప్రదర్శించినాడు

నాకు సోదరి వరుసగల ఒకామె మా ప్రక్క వీధిలో కాపురం ఈమె పేరు 'అ' అని అనుకొందాం. పట్టణంలో చదువు, పట్టణ వాసానికి అలవాటు పడిన ప్రాణం. వివాహమైనది. భర్త ఇంజనీరు అత్తమామలు పల్లెటూరివారు. సభ్యత సంస్కారం కలవారి కాని పల్లెనాగరికత. 'అ' భర్త ఉద్యోగం పెద్ద పట్టణంలో. వివాహ మైనది మొదలుకొని 'అ' అత్తమామలను ఏవగించుకొనేది. నౌకర్లకు ఇచ్చే కనీస మర్యాద కూడ అత్తమామలకు ఇచ్చేదికాదు. 'అ' కు ఒక కుమారుడు కలిగినాడు. డెంటల్ సర్జరీ చేసినాడు. ప్రయివేటుగా ప్రాక్టీసు పెట్టినాడు. మంచి ఆదాయం. ప్రక్క రాష్ట్ర రాజధానిలో పట్టభద్రురాలైన కన్యతో వివాహమైంది. కోరినంత కట్నం ఇచ్చి నారు. వివాహమై ఒకనెల గడచింది. పిల్ల తండ్రి లారీలో సామా నులు వేసుకొని అల్లుడుండే పట్నానికి వచ్చి అల్లుడు కూతురులకు ప్రత్యేక కాపురం పెట్టించినాడు. 'అ' ఆమె భర్త అవాక్కయినారు క్రొత్త దంపతులకు కొడుకు పుట్టినాడు. బిడ్డ పుట్టిన విషయం కూడ అత్తమామల చెవులలో వేయలేదు. అత్తమామలతో ఏలాంటి సంబంధం లేకుండ ఈ క్రొత్త దంపతులు ప్రక్క వీధిలోనే కాపురం చేయుచున్నారు. 'అ' దుఃఖానికి అంతేలేదు. కోడలును దూషించరు "నా కొడుకు సరిగ్గా యుంటే ఈ విధంగ జరుగునా? కోడలు చెప్పినా కూడ కొడుకు బుద్ధి ఏమైంది?" అని 'అ' అందరితో వాపోతున్నది ఈ విధంగ ఎందుకు జరిగింది? అందరికీ అర్థమై ఉంటుంది.

మహాభారతాన్ని మరొకమారు అవలోకిద్దాం. సత్యవతి శంతన మహారాజును వివాహమాడిన యనంతరం తన పుత్రుడు

విచిత్రవీర్యుడు సంతానహీనుడై గతించినందున కురువంశం అంత రించకుండ యుండుటకు గాను తన కోడళ్ళు అంబిక అంబాలికలను వ్యాసుని ద్వారా సంతానం బడయుటకు ప్రయత్నిస్తుంది. అంబిక దుశ్చర్య వల్ల ధృతరాష్ట్రుడు, అంబాలిక ఎహం వల్ల పాండురాజు పుట్టినారు. ఈ విషయాన్ని అప్పటికప్పుడే తెలిసికొన్న సత్యవతి, అంబిక ద్వారా సత్సంతానానికై వ్యాసుని మరొకసారి పురికొల్పు తుంది. అంబిక వ్యాసునితో మరోమారు సంగమించుటకు ఇష్టంలేక తన దాసిని సకలాభరణాలతో ఆ సంగమకార్యానికి నియమిస్తుంది, దాసి శయనాగారంలో నిరీక్షిస్తూవుంటుంది, వ్యాసుడు రాగా నేయథా ప్రకారంగా ఆ దాసి ఎదురేగి ఆయన్ను తోడ్కొని తెచ్చి శయ్యాపై చేర్చి సకలోపచారాలతో ఆయనను పూజించి కామభోగాలలో తేల్చి ఆయనను తృప్తిపరచింది. సంతృప్తుడైన వ్యాసుడు "కోమలీ! నీ యజమానురాలు తనకు మారుగా నిన్ను పంపింది, నీ కిక దాసీత్వం లేదు. నీ గర్భాన సకల ధర్మవిదుడైన కుమారుడు జన్మిస్తాడు" అని పలికి అదృశ్యమౌతాడు. ఈ దాసి గర్భం దాల్చింది, సదా మనస్సులో వ్యాసుని తలచుకొని ధర్మాత్ముడగు పుత్రుడు తనకు కలుగుతాడని మననం చేసుకొంటూ యుంటుంది. ఈ మననం గర్భస్థ శిశువుపై బడి తల్రాతగ మారింది. జననానంతరం శిశు వుకు విదురుడని నామకరణం చేసారు, ఇతడు నీతిజ్ఞుడు, ధర్మాత్ముడు, పరమ భక్తుడైనాడు.

ధృతరాష్ట్రుడు, పాండురాజు, విదురులకు తండ్రి ఒక్కడే. అతడే వ్యాసమునీంద్రుడు. కాని విదురుడు మాత్రం వ్యాసుని వలె ధర్మాత్ముడైనాడు, కారణం ఇతని తల్లి (దాసి) సదా ధర్మాన్ని గర్భస సమయమున నవమాసాలూ మననం చేసుకొనుచుండినది. ఈ మనన విషయాలు గర్భస్థశిశువుపై బడి శిశు జననానంతరం కార్యరూపం దాల్చింది.

సత్యవతి మొదటగా భీష్ముణ్ణి అంబిక అంబాలికల ద్వారా సంతానోత్పత్తికి ప్రయత్నిస్తుంది, కాని భీష్ముడు ఉత్తమ సంజాతుడు కాబట్టి ఆ కార్యానికి ఒప్పుకోలేదు. కాని వ్యాసుడు మహర్షియై యుండికూడ ఈ కార్యానికి ఒప్పుకొన్నాడు, అనగా ఇతని తల్లి బుద్ధులు ఇతనికి సంప్రాప్తించినవి, కాబట్టి తల్లి మాటను వ్యాసుడు జవదాటలేదు.

విశ్వామిత్రుడి ప్రేరణతో కల్మాషపాదుడు రాక్షసావేశంతో వశిష్ఠముని కుమారుడు శక్తి ఆదిగాగల నూరుగురు కుమారులను చంపివేసి ఆ మాంసం భక్షించాడు. వశిష్ఠుడు కడు దుఃఖంతో ప్రాణత్యాగ ప్రయత్నంచేసి విఫలుడై తన ఆశ్రమానికి వెళుతూండగా వెనుకనుండి ఉదాత్త అనుదాత్త స్వరాలతో ఏ మాత్రం పొల్లుపోకుండా వేదాధ్యయన ఘోష శ్రవణపేయంగి వినిపించగా అప్పుడు వశిష్ఠుడు తన కుమారుడు శక్తిలాగ వేదపఠనం చేస్తున్నవాడెవడాయని వెనుదిరిగి చూచాడు. అప్పుడు శక్తిభార్య తన కోడలు అయిన అదృశ్యంతి ఆయనకు కనిపించింది. ఈమె వేదం చదువుట ఏమిటిటోయని ముని విస్మయం చెందగా అదృశ్యంతి మెల్లగాఆయనను మీాపించి ' మునివర్యా నేనెవరో కాదు. మీా కోడలు అదృశ్యంతిని, శక్తి భార్యను, నా గర్భంలో నీ కుమారుడైన శక్తిపుత్రుడు పెరుగుచున్నాడు, పన్నెండేండ్లుగా వాడు గర్భంలోవుండి నిరంతర వేదాధ్యయన శీలుడైన శక్తి వేద ఘోషవింటూ సకలవేదాలు నేర్చాడు'' అని చెప్పింది. కొన్ని రోజులకు అదృశ్యంతి కొడుకును ప్రసవించింది. ఇతడే పరాశరుడు. త్రిజగన్నుతుడై, మదమాత్సర్యాలకు దూరమైనాడు. లోకోద్ధారకుడైన వ్యాసమహర్షికి తండ్రి ఈతడే. జ్యోతిష శాస్త్ర కర్తకూడ ఈతడే.

పై ఉపంతం వలన తెలియున దేమంటే శక్తి మహాముని తన ఆశ్రమంలో నిత్యం యజ్ఞయాగాదులు చేస్తూ వేదపఠనం చేస్తూవుండేవాడు. ఇతని భార్య గర్భందాల్చినపుడు గర్భస్థ శిశువు తండ్రి

పఠించు వేదఘోషలను విన్నందున ఆ తంతు అంతయు గర్భస్థ శిశువుపై బడి తలవ్రాతగా మారినాయి. నవమాసాలు నిండికూడ ప్రసవం కానందున గర్భం నుండే వేద ఘోషను పఠనంచేయ నారంభించాడు గర్భస్థశిశువు.

పై ఉదాహరణలవల్ల అవగతం అయేది ఏమంటే గర్భంలో నున్నప్పుడు తల్లిమననం గర్భస్థ శిశువుపై బడుతుంది. బయటి విష యాలను గర్భస్థ శిశువు శ్రద్ధగ ఆలకిస్తుంది. గర్భస్థ స్త్రీకి తన నిజజీవితంలో కలుగు ఒడుదుడుకులు, అనుభూతులు, గర్భస్థ స్త్రీ నిత్యజీవితంలో చేయు కృత్యములన్నియు గర్భస్థపిండం (శిశువు) పై ప్రభావాల్ని చూపుతుంది. ఇవి అన్నియు కలసికట్టుగా గర్భస్థ శిశువు మెదడులో కంప్యూటర్ కాబడుతుంది. జననానంతరం ఈ కంప్యూ టర్ అయిన విషయాలు నిజ జీవితంలో కార్యరూపం దాల్చుతాయి. ఈ కంప్యూటర్ విషయాలనే నొసటివ్రాత, లలాటలిఖితం, బ్రహ్మ వ్రాత అనే పేర్లతో మనం చెప్పుకొంటాము.

కావున మానవుడుగ పుట్టిన ప్రతి జీవి ఈ తలవ్రాతలనుండి తప్పించుకోజాలడు. చరిత్ర పుటలను తిరుగవేస్తే ఎందరో మహాను భావులు ఇంక ఎందరో దుర్మార్గులు పుట్టియున్నారు. వారివారికి ఆయాగుణగణాలు ఎలావచ్చిందని పరికించితే కారణాలు మనకు కన్పిస్తాయి. సన్మార్గులు కావలయునన్నను దుర్మార్గులు కావలయు నన్నను తల్లి చేతిలో యుందిగాని వేరే విధంగ ఏమియూ కాదు. ప్రపంచంలో ఎందరో పుణ్య పురుషులు, పురాణ పురుషులు, ఆరాధ కులు, అద్వైతులు, మాననీయులు, మహాత్ములు పుట్టినారు. ఈగుణ గణాలు వీరికి కలిగించిన, వీరిని కన్నతల్లులకు జోహార్లు. ఈ తల్లులకు అటువంటి కాలమాన పరిస్థితులను ఏర్పరిచిన వారి భర్తలకు పదే పదే జోహార్లు.



13

# ఆయుష్షు

ప్రతి ప్రాణికి ఆయుష్షు చాలా ముఖ్యమైనది. జీవితంలో ఎన్నో సాధించవచ్చును. కాని ఆయుష్షును సాధించలేరు. అవతార పురుషులు కూడ ఈ ఆయుష్షుకు కట్టుబడే యుండిరి. వారు దైవిక సంభూతులైనా కూడ మరణం పొందవలసిందే. ఈ ఆయుష్షు సమానంగ లేదు. గర్భస్రావములు, శిశు మరణాలు, అల్పాయుష్కము, అర్ధాయుష్కము, పూర్ణాయుష్కులని ఆయుష్షు వివిధరకములు. ఎందులకీ విధంగ ఆయుష్షు జీవి జీవికివ్యత్యాసాలు గలుగజేస్తుంది? దీనికి మూలకారణం ఏమి? ఒకేతల్లి గర్భాన జనించిన సంతానానికి ఒకే విధమైన ఆయుష్షు వుండదు. ఎంత ఉన్నతుడైనా ధీశాలి బలశాలి ధనికుడైనా ఈ ఆయుష్షు నుండి తప్పించుకోలేడు. ఆయుష్షు భేదమునకు కారణం, కర్త ఎవరు? పూర్ణాయుష్షును పొందు మార్గము లేమైనా యున్నవా? ఇదివరకు పూర్ణాయుష్షును పొందు పయత్నాలు ఏమైనా జరిగినవా? పరికిద్దాం అందరూ సుఖిద్దాం.

నాకు వివాహమైనపుడు సుమారు నాలుగు మాసముల రాత్రింబవళ్ళు కార్యాలయంలోనే పనిచేస్తూ మధ్యాహ్నం భోజనానికి అర్ధగంట, రాత్రి నిద్రపోవుటకు పన్నెండు గంటలకు ఇంటికి వచ్చుచుంటిని. అప్పుడప్పుడు రాత్రి అంతయు కార్యాలయంలో పనులు చేసుకొని ఉదయం స్నానపానాదులకు ఇంటికి వచ్చి మరల కార్యాలయానికి వెళ్ళుచుంటిని. అప్పుడు కేంద్రప్రభుత్వము వారి ఆదేశానుసారం జిల్లా అభివృద్ధి ప్రణాళికను తయారుచేసి రాష్ట్ర ప్రభుత్వానికి సమర్పించవలసి యుండినది. ఈ ప్రణాళికను నిర్ణీత కాలంలో తయారుచేసి సమర్పించవలసి యున్నందున కార్యాలయ ప

సిబ్బంది, అధికారి అందరూ రాత్రింబవళ్ళు పనిచేసి మా పనిని మేము నెఱవేర్చినాము. అప్పుడు నా భార్య గర్భవతి. రెండు మాసములైనవి. ఒకనాడు మధ్యాహ్నం కార్యాలయం నుండి నేను భోజనానికి ఇంటికి వచ్చినాను. నా శ్రీమతి నాతో దిగులుగా ఆరోజు ఉదయం తొమ్మిది గంటలప్పుడు గర్భస్రావమైనదని తెలిపినది. నేను కూడ ఎందులకీ విధంగ జరిగినదని చింతించినాను.

భక్తి పుస్తకములు, రామాయణం, భారతం, భగవద్గీత ఉపనిషత్తులు, గొప్పవారి ఉపన్యాస గ్రంథములు, రచనలు, జీవిత చరిత్రలను తీరిక చేసుకొని పదేపదే చదువుట నాకు అలవాటు. భారతం, భాగవతం, రామాయణం, భగవద్గీతలను ఎందరో వారి వారి శైలిలో వ్రాసియున్నారు. అన్ని రకాలును తీసియుంచినాను. ఒక్కొక్క గ్రంథంలో ఒక్కొక్క విధంగ వర్ణనయుంటుంది.

కాని కథ కమామీషు ఒక్కటే. ఈ గ్రంథాలు సద్గ్రంథాల ఆధారంగ నేను ఒక నిశ్చితాభిప్రాయానికి వచ్చినాను. అదేమంటే ఆయుష్షు కర్తలు తల్లిదండ్రులే గాని మరెవరూ కాదని, బ్రహ్మదేవుడు ఆయుష్కర్త అంటారు. ఈ సిద్ధాంతం శుద్ధ అబద్ధం పచ్చి మోసం అని నా అభిప్రాయం.

నా మొదటి సంతానం గర్భస్రావం అగుటకు కూడ కారణం ఏమిటని తెలుసుకొన్నాను. పై ఉద్గ్రంథ సద్గ్రంథాలలో గల కొన్ని రహస్యాలను ఇక్కడ మీ ముందుంచితే మీకు నమ్మకం కలుగుతుంది వేదాలు మనకు అందుబాటులో లేవు. అందుబాటులోయున్న కూడ అవి మనకు అర్థంకావు. అందువలననే వ్యాసమహర్షి వేదరహస్యాలను మహాభారత కథలో ఇమిడ్చి కలియుగ వాసులకు కానుకగ ఇచ్చినాడు. ఈ భారతకథకు అందుకే పంచమవేదం అని కూడ మారుపేరున్నది. భారతకథ తెలియని భారతీయుడు లేడు.

కాని అందులోగల సూక్ష్మాన్ని గ్రహించిన వారిని వేళ్ళపై లెక్కించవచ్చును. భారత కథను నిజ జీవితంలో సమన్వయించుకొని తరచి తరచి చూచిన యెడల సూక్ష్మం అవగాహన అవుతుంది.

హిడింబాసుర వధానంతరం కుంతి ధర్మరాజుల ఆజ్ఞానుసారం భీముడు హిడింబిని భార్యగా స్వీకరించుటకు అంగీకరిస్తాడు. మరియు కుంతీ ధర్మరాజులు హిడింబితో "భీముడితో నీవు పగలంతా యథేచ్ఛగా విహరిస్తూ రాత్రివేళకు తిరిగి భీముణ్ణి మా దగ్గరికి పంపుతూ వుండు" అని చెప్పారు. హిడింబి అలాగే చేస్తానని వారికి మాటిచ్చింది. భీముడు కూడ హిడింబికి పుత్రసంతానం కలిగేవరకూ ఆమెతో సుఖిస్తానని వాగ్దానం చేస్తాడు. ఒక సంవత్సరానికి ఘటోత్కచుడు జనిస్తాడు. అనగా భీమ హిడింబిలు పగలు సంభోగం చేసినారు. హిడింబి గర్భం దాల్చింది. నవమాసాల అనంతరం మగశిశువు పుట్టినాడు. ఘటోత్కచుడని పేరు పెట్టారు, ఘటోత్కచుడు తన ఇరువదియైదవ ఏట యుద్ధంలో మరణించినాడు.

కుంతీదేవి చేసిన సపర్యలకు మెచ్చి దూర్వాస మహాముని ఆమెకు మంత్రోపదేశం చేస్తాడు. ఒక నాడు సూర్యోదయానంతరం కుంతీదేవి దూర్వాసమహాముని ప్రసాదిత మంత్రాన్ని పరీక్షింపదలచి సూర్యుని ఉపాసించి మంత్రోచ్చారణ చేస్తుంది. సూర్యుడు ప్రత్యక్షమౌతాడు. కుంతితో సంభోగిస్తాడు. కుంతీదేవి గర్భం దాల్చుతుంది. నవమాసాల అనంతరం మగ బిడ్డను ప్రసవిస్తుంది. ఇతడే కర్ణుడు. ఇతను మహాభారత యుద్ధంలో తన నలుబది ఐదవ ఏట మరణిస్తాడు.

ద్రౌపదీ పరిణయానంతరం పాండవులైదుగురూ ఒక్కొక్కరూ ఒక్కొక్క సంవత్సరం వంతున ద్రౌపదితో భార్యగా కాపురం చేయుటకు భాగించుకొంటారు. అనగా సంవత్సరం అయిన తర్వాత ద్రౌపది మరుసటి సంవత్సర ప్రారంభపు రోజు ఉదయం మరొక

భర్తకు భార్యగా వెళ్తుంది. ఈ విధంగ ఐదు మంది భర్తల వద్దకూ ద్రౌపది మరు సంవత్సర ప్రారంభపు రోజు ఉదయం వంతుల ప్రకారం భర్తల కడకు వెళ్ళేది. ఈ ఐదుగురు పాండవులకూ ఐదుగురు కుమారులు కలిగినారు. వీరే ద్రౌపదేయులు. ఈ ద్రౌపదేయులయిదుగురూ దుర్యోధన సంహారం రోజు రాత్రి అశ్వత్థామ చేత వధింప బడతారు. అప్పటికి ద్రౌపదేయుల వయస్సు ఒక్కొక్కరికీ పదునైదు ఇరువది సంవత్సరముల లోపు మాత్రమే.

అనగా ద్రౌపది వంతుల ప్రకారం తమ వద్దకు వచ్చినపుడు ఉదయం వేళ అని కూడ తలంపక పాండవులైదుగురూ కామోద్వేగంతో వారి వంతుకు వారు సంభోగించినారు. పగటి పూట సంభోగ కారణంగా ద్రౌపదేయులు అల్పాయుష్కు లగుటకు పాండవులు కారకులైనారు.

వశిష్ఠ మహాముని మనుమడూ శక్తి ముని కుమారుడూ అయిన పరాశరుడు ఒక నాడు గంగానదిని దాటుటకుగాను నావ నెక్కుతాడు. మత్స్యగంధి (సత్యవతి) నావను నడుపుతుంది. నావ పోతుండగా యౌవనం తొణికిస లాడుచున్న మత్స్యగంధిని చూచి పరాశరుడు కామాతురుడై తన కుడి చేతితో ఆమె కుడి చేతిని పట్టుకొంటాడు. అంతట మత్స్యగంధి ఆ మహర్షితో ఇలా అంటుంది. "మహానుభావా! ఈ పని మీ కులానికి గాని శ్రుతానికి గాని తపస్సుకు గాని సదృశమైనది గాదు. మహానుభావుడైన వశిష్ఠ మహాముని పౌత్రులు మీరు. మన్మద పీడితులై మీరిలా చెయ్యటం ఉచితం కాదు. లోకంలో మనుష్య జన్మ దుర్లభం. అందులో బ్రాహ్మణత్వం మరీ దుర్లభం. అన్ని విధాలా ఉత్తములైన మీకు మీన గంధినైన నన్ను చూచి ఈ అనార్య భావం ఎలా కలిగింది? నా శరీరంలో ఏ శుభాన్ని చూచి నా కర గ్రహణం చేశారు? కామాతురులై నా దగ్గరకు ఎలా వచ్చారు? మీ ధర్మాన్ని మీరు పాటించ నక్కర లేదా?"

14

ఆయనను తృప్తిపరచింది. దాసి గర్భందాల్చింది. విదురుడు జన్మించినాడు. ఈ అంబ అంబిక దాసీలతో వ్యాసుడు రాత్రి వేళల్లో సంగమించినాడు. కావున జన్మించిన ధృతరాష్ట్రుడు నూరు సంవత్సరములు, ఇకకొంచెం తర్వాత జన్మించిన (గర్భస్థమైన) విదురుడు నూటపది సంవత్సరములు జీవిస్తారు. అనగా రాత్రివేళ ఎంత ఎక్కువైతే ఆయుష్య మంత ఎక్కువగ యుంటుందని దీని అర్థమౌతుంది.

మా తల్లిదండ్రులకు మేము ఎనిమిదిమంది సంతానం. ఐదుగురు కుమారులు ముగ్గురు కుమార్తెలు. మా ఎనిమిదిమంది ఆయుష్యలు జాతకముల ప్రకారం 74 సంవత్సరముల నుండి 80 సంవత్సరముల వరకుగలవు. దీని కారణం వివరించెదను. మా కుటుంబం చాలా పెద్దకుటుంబం. మరియు ఉమ్మడి కుటుంబం. మా తండ్రిగారు చిరు ఉద్యోగం చేస్తున్నా రాత్రి పగలు పని చేయుచుండిరి. ప్రతి రోజూ రాత్రిపూట ఏ తొమ్మిది పది పదకొండు గంటలకో ఇల్లు చేరుచుండిరి.

నేను మండల రెవిన్యూ అధికారిగ పనిచేయు చుండినపుడు నా క్రింది ఉద్యోగులతో వారి బాగోగులు కుటుంబ విషయాలు కూడ మాట్లాడు చుంటిని. అందులో ఒక ఉద్యోగి తనకు ప్రస్తుతం ఒక కుమారుడు కలడనియు, మొదటి గర్భం చనిపోయిన మగబిడ్డ అనియు తెలిపినాడు. తనకు పిల్లలంటే చాలా ఇష్టమనియు, తనభార్య మొదటిసారి గర్భంగ నున్నప్పుడు ఆట బొమ్మలను విరివిగా కొని ఇంట్లో పేర్చి పుట్టబోయే బిడ్డకోసం చేర్చి పెట్టుచుండినదనియు తీరా చనిపోయిన బిడ్డ ప్రసవమైనదనియు, అందులకు గాను తాను చాలా దుఃఖించి నట్లును చెప్పినాడు.

అందులకు నేను అతన్ని ఎప్పుడైనా ప్రాతఃకాలం అనగా ఉదయం నాలుగు ఆరు గంటల మధ్య సంభోగించినావా యని ప్రశ్నించినాను. అందుల కతడు ఉద్యోగ రీత్యా తాను రాత్రి

వేళల్లో ఆలస్యంగ ఇంటికి చేరుచుంటి ననియు, అలసట వలన ఏదో కొంత తిని పరుండుచుంటిననియు, ఉదయం ఐదు ఆరు గంటల సమయంలో భార్య ఇంటి పనులు చేసికొనుటకు పడక నుండి లేచి నపుడు సంభోగించు చుంటిననియు, తెలిపినాడు. అందులకు నేను అతనితో సంభోగ క్రియ ఒక పవిత్రమైన కార్యం దానిని రాత్రి పూటలలోనే కొనసాగించ వలయుననియు అందువలన ఆ సమయాలలో గర్భం దాల్చిన పిండాలు జననానంతరం పూర్ణాయుష్షుతో జీవించుననియు, అట్లుగాక అర్ధరాత్రి తర్వాత గర్భం నిలిచిన పిండాలు స్రావమౌతా యనియు, ప్రాతఃకాలం గర్భం నిలిచిన పిండాలు మరణించిన శిశు జననాలను కలుగ జేస్తాయనియు, పగటి పూట గర్భం నిలిచిన పిండాలు అల్పాయుష్కం అర్ధాయుష్షుతో జీవించుననియు చెప్పినాను. అందుల కతడు సంతృప్తుడై నాడు.

నేను ఇంకొక ప్రాంతానికి మండల రెవిన్యూ అధికారిగ బదిలీ అయినాను. ఈ క్రొత్త ప్రాంతంలో ఒక యువ రాజకీయ నాయకు డున్నాడు. నాతో బాగానే యున్నాడు. ఇతనికి ఇది వరలో మొదటి గర్భం చనిపోయిన మగబిడ్డ జనించినాడు. నేను మండల రెవిన్యూ అధికారిగ వచ్చిన తర్వాత రెండవ మారు గర్భంగ యున్న తన భార్యకు ఉన్నత వైద్య చికిత్స ఇప్పించి కడు జాగరూకతతో చూచుకొను చుండెను.

కాని కథ మామూలుకే వచ్చింది. చనిపోయిన మగబిడ్డ పుట్టినాడు. ఇతనికి సహాయం చేయవలయునని నేననుకొన్నాను. రెండు నెలల తర్వాత అతనితో ఏకాంతంగ అతని నిత్యకృత్యము ములను గురించి విచారించాను.

అతను ఉదయం ఆరుగంటలకు నిద్రలేస్తాడు, మధ్యాహ్నం వరకు పొలంపనులు ప్రాంతీయ రాజకీయాలు సొంతపనులు చూచు కొంటాడు. మధ్యాహ్నం పన్నెండు గంటలకు జిల్లాకేంద్రానికి

వస్తాడు. ఇతని గ్రామానికి జిల్లాకేంద్రం ఇరవై కిలోమీటర్లు మాత్రమే. జిల్లా కేంద్రంలో వ్యాపారం, రాజకీయం, ఇతరత్రా పనులు చూచుకొని రాత్రి పదకొండు పన్నెండు లేక ఒంటిగంటప్పుడు ఇల్లుచేరతాడు. ఇదే ఇతని నిత్యకృత్యం.

ఇతను ఇంటికి రాత్రి ఆలస్యంగ పోయినపుడు ఇతని భార్య కుటుంబ సభ్యులందరూ నిద్రిస్తూవుంటారు. ఇతను తలుపు తట్టితే పనిమనుష్యులు లేచి ఇతనికి భోజనం పెడతారు. భోజనానంతరం పరుంటాడు. భార్య గాఢ నిద్రలో యుంటుంది ఇతనూ నిద్ర పోతాడు. ప్రాతఃకాలంలో భార్య ఇంటిపనులు చేసికొనుటకు గాను నిద్రలేస్తుంది. అప్పుడితను భార్యను బలవంతంపెట్టి రమిస్తాడు. అందువలన రెండు గర్భములలోని శిశువులు అల్పాయుష్కులై మరణించి జనించినారు. నేనితనికీ సిద్ధాంతాన్ని తెలిపి రాత్రులలో తొమ్మిది పది గంటలకల్ల ఇల్లుచేరి తొమ్మిది గంటల పైన పన్నెండు గంటలలోపు రమిస్తే దీర్ఘాయుషు గల సంతానం కలుగుతుందని, ఈ విధానాన్ని తూచ పాటించవలసినదిగా సలహా ఇచ్చినాను. అతను సిగ్గుతో తల వంచుకొని నా సలహాను ఆచరించుటకు ఆమోదించినాడు. ఈ విషయం జరిగి ఎనిమిది సంవత్సరములైనవి. ఇప్పుడతనికి ఇద్దరు కుమారులు. చక్కగా యున్నారు. కాన్వెంటులో చదువుచున్నారు.

1960 సంవత్సరం వరకు గర్భస్రావాలు శిశుమరణాలు అకాలమరణాలు లేనే లేవని చెప్పవచ్చును. ఎందుకంటే ఇది వరకు ఉమ్మడి కుటుంబాలుండేవి. కొత్తగా వివాహమైన దంపతులు కూడ ఉమ్మడి కుటుంబంలోనే యుండెడివారు. అత్త మామ బావలు మరదళ్ళు ఆడబిడ్డలు అవ్వ తాతలు ఇతరత్రా పిల్లలు ఈ ఉమ్మడి కుటుంబాలలో యుండేవారు. రాత్రివేళలలో భోజనకార్యక్రమాలు ఏ పదిగంటలకో ముగియును. వరుడేమో తన గదిలో నవవధువు

15

కోసం వేయికళ్ళతో ఎదురుచూస్తుంటాడు. కాని ఇక్కడ అత్త గారు నవవధువును ఈ పని చేయుము, ఆ పనిచేయుము అని లేని పోని పనులను కల్పించి ఏ పదకొండు గంటలకో కాని నవవధువును (కోడలిని) నిద్రించుటకు అనుమతించదు. ఆ పైన నవవధువు వరు నితో సంభోగించి నిద్రించును. ఆ సమయంలో గర్భం దాల్చిన సంతానం దీర్ఘాయువులై జీవించుచుండిరి.

కాని స్వాతంత్ర్యానంతరం విజ్ఞానం అభివృద్ధి మనిషి తలసరి ఆదాయం జీవన ప్రమాణాలు పెరిగి ఉద్యోగాలు ఎక్కువైనాయి. అహం ఎక్కువైనది. పెద్ద చిన్న తారతమ్యం నశించినది. వివాహ మైన వెంటనే హనీమూన్ అని విహార ఉల్లాసయాత్రలకు పోతారు. ఆలుమగలు ఇద్దరే వుంటారు. అడిగేవాళ్లు అడ్డుపడేవాళ్ళు వుండరు. తలచినపుడు సమయసందర్భం లేకుండ సంభోగిస్తారు. గర్భస్రావం నుండి చిన్నవయస్సు యుక్తవయస్సు మధ్యమ వయస్సుతో కూడిన ఆయుష్షు గల సంతానాన్ని కంటారు. పిదప వీరు దుఃఖిస్తారు. ఇత రులను దుఃఖింప చేస్తారు.

అకాలమరణాలు, గర్భస్రావాలు, శిశుమరణాలు పట్టణాల్లోనే సంభవిస్తాయి. పల్లెటూళ్ళలో మచ్చుకైనా ఇవి సంభవింపవు. ఎందుకంటే పల్లెటూళ్ళలో సాధారణంగ ఏ పది పదకొండు గంట లకో నిద్రిస్తారు. అదియును గాక ప్రతికుటుంబంలోను ముసలో ముతకో ఎవరో ఒకరు వుంటారు. కాని పట్టణాల్లో ఆలు మగలిద్దర తప్ప వేరేవారెవరూ కుటుంబంలో వుండరు. కావున వీరికి అడ్డు అదుపూవుండదు. విచ్చలవిడితనం విహారం చేస్తుంది. మరియు ఇంటిపనులు చేసుకొనుటకు పల్లెటూళ్ళల్లో కుటుంబ సభ్యులే ప్రాత కాలంలో నిద్రలేస్తారు. పట్టణాల్లో పనిమనుషులు నిద్రలేపి కాఫీ ఇవ్వవలయును. పల్లెసీమల్లో ప్రాతఃకాలం నిద్రలేచుటవలన సంభ గించరు. శిశుమరణాలు వుండవు. పట్టణాల్లో పనిమనిషి యున్న

దున ఆరుగంటలకు నిద్ర లేచేందుకు ముందుగా సంభోగించి పడక గది నుండి బైటకు వస్తారు. శిశుమరణాలు జరుగుతాయి.

ఇటీవల దూరదర్శన్ లో ఒక దృశ్యం చూపారు. అది ఏమంటే జపాన్ దేశంలో ఒక ముసలి వృద్ధుడు నూట ఇరువది రెండు సంవత్సరముల వయసు గలిగి మంచి ఆరోగ్యంతో నున్నాడనియు, అందులకు కారణం అతనికి పొగత్రాగుట, మత్తు పానీయాలు సేవించుట మొదలగు ఏలాటి దురలవాట్లు లేవని తేల్చి చెప్పినారు. ఈ ఉదాహరణను మనం ప్రమాణంగ తీసుకొంటే పప్పులో కాలువేసినట్లే. ఎందుకంటే ఏ దురలవాట్లు లేని ఉత్తమ మానవులు ఎందరో యుండిరి, ఎందరో యున్నారు. కాని వీరు డెబ్బది సంవత్సరముల నుండి నూరు సంవత్సరముల వరకు మాత్రం బ్రతికినారు. ఈ దురలవాట్లే కాకుండ ఇతర అనేకానేక దురలవాట్లు నిత్య కృత్యంగ పెట్టుకొన్న వారిని నేను ఎందరినో చూచాను చూచుచున్నాను. వారిలో నూరు సంవత్సరముల పై బడి బ్రతికిన వారున్నారు.

మహాత్మాగాంధీ, మదర్ థెరిస్సా, రవీంద్రనాథ్ ఠాకూర్, మొరార్జీ దేశాయి, లాల్ బహదూర్ శాస్త్రి, రామకృష్ణ పరమహంస, వివేకానందుడు, చిన్మయానందస్వామి వగైరాలకు ఏ దురలవాట్లు లేవన్న విషయం మన అందరికీ తెలుసును. కాని వీరెవరైనా నూరు సంవత్సరముల పై బడి జీవించినారా? నలభై సంవత్సరముల నుండి ఎనభై సంవత్సరముల లోపే వీరు జీవించిరి.

నా స్నేహితు డొకడు నా కన్న పద్దెనిమిది సంవత్సరములు పెద్దవాడు. ఇతడు రోజూ మత్తుపానీయం లేకుండ నిద్రపోడు. అది కూడ నీరుగాని సోడాగాని కలుపకుండ ఉత్తి మత్తు పానీయాన్ని మత్తు ఎక్కేవరకూ సేవిస్తాడు. కింగ్ సైజ్ సిగరెట్లు రోజుకు నాలుగు ప్యాకెట్లకు తక్కువ కాకుండ కాలుస్తాడు. వయసులో అనేకానేక స్త్రీలతో అక్రమ సంబంధాలు కోకొల్లలు. మంచి ఉద్యోగం చేసి రిటైర్ అయి పది సంవత్సరాలైంది. చూచేవాడికి ఇతను

ముప్ఫైఅయిదు సంవత్సరముల వయసు వాడిగ కనబడతాడు. ఆరోగ్యం చాలా బాగుంది. మరి ఈతని సంగతేమిటి?

అకాల మరణాలు సంభవిస్తుంటాయి. మనం చూస్తుంటాము. ఫలాన అతను అదే పనిగ మత్తు పానీయాలు. త్రాగి త్రాగి చచ్చి నాడని మత్తు పానీయ అలవాట్లు కలవాడిని అంటాము. పొగ త్రాగే వాడు చచ్చితే అదే పనిగ పొగత్రాగి చచ్చినాడని అంటాము. ఏ దురలవాట్లూ లేనివాడు చచ్చితే గుండె ఆగి చచ్చినాడంటాము.

నేను నివసిస్తున్న పట్టణంలో ఒక ప్రభుత్వ న్యాయవాది వున్నాడు. అతనికి చిన్నప్పటినుండీ ఏ దురలవాట్లూ లేవు. చాలా సంస్కారం గల వ్యక్తి, పేరుమోసిన న్యాయవాది. ధనవంతుడు, భూస్థితి కారు బంగళా అన్నీయున్నవి. సన్మార్గుడు. ఇతనికి ఉన్నట్లుండి హార్ట్ అటాక్ అయింది. ఉన్నత వైద్యశాలలో చికిత్స నిమిత్తం బంధువులు చేర్పించినారు. పరీక్షలన్నీ అయినవి. గుండెకుపోయె ఐదు వాల్వులు మూతబడినాయి అని తేలినవి. మామూలుగ ఒక వాల్వు, రెండు వాల్వులు లేక మూడు వాల్వులు మాత్రం మూసు కొంటాయని మనం చాలామంది విషయాలలో విన్నాము. కాని ఏ దురలవాట్లూ లేని ఈ ప్రభుత్వ న్యాయవాదికి ఈ విధంగ ఎందుకు జరిగింది?

పై వాటిని గురించి తెలియుచున్న దేమంటే దురలవాట్లకూ మరణానికి సంబంధం లేదు. మనుష్యులమైన మనమే మన ఆయు వును నిశ్చయించి మరణాన్ని పొందుచున్నాము.

ఇక్కడ బాగా అర్థం అయ్యేందుకు అందరికీ తెలిసిన విషయా ను కొన్నిటిని ఉదహరిస్తే సముచితంగ వుంటుంది. మొరార్జీ దేశాయ్ గారు భారత దేశ ప్రధానిగ నున్నప్పుడు అస్సాం రాష్ట్రం లో హెలికాప్టరులో ప్రయాణిస్తూ వుండగా హెలికాప్టరు కూలి పోయింది. హెలికాప్టరు చోదకుడు అక్కడికక్కడే మరణించి

నాడు. ఇతరులు గాయపడినారు. కాని మొరార్జీ దేశాయ్ గారికి చిన్నగాయం కూడ తగలలేదు. ఆయన క్షేమంగ బయటపడినారు. కాని ఇటీవలే సోము అనే భారత దేశపు రక్షణశాఖ సహాయ మంత్రి అస్సాం రాష్ట్రంలో హెలికాప్టర్‌లో ప్రయాణిస్తూ హెలికాప్టర్ ప్రమాదంలో మరణించినాడు.

సుమారు ముప్పై సంవత్సరము లప్పుడు వార్తా పత్రికలలో ఒక సంచలన వార్త వచ్చింది. రైల్వేగేటు మూసి యున్నది. గేటుకు ఆవలి వైపు ఈవల వైపు వాహనములు నిలిచియున్నవి. ఒక స్కూటరుపై ఇద్దరు ఈవలి గేటువద్ద స్కూటరును నిలిపినారు. వారిరువురు స్కూటరు పైనే కూర్చొని యున్నారు. అప్పుడు ఆకాశంలో ఒక గ్రద్ద బారెడుపొడుగు నాగుపామును ఎత్తుకొనిపోతున్నది. ఆ నాగుపాము గ్రద్ద కాళ్ళ నుండి జారినది. ఆ పాము సరిగ్గా ఈ స్కూటరుపై కూర్చొని యున్న ఇద్దరిపై బడింది. వెంటనే పాము ఈ ఇరువురిని ఒక్కొక్కరికి రెండు మూడు కాట్లువేసింది. గ్రద్ద తటాలున మరల ఆ నాగుపామును తన్నుకుపోయింది. పాము కాటుకు వారిరువురు అక్కడి కక్కడే నురుగులు కక్కుకొని మరణించినారు. రైల్వేగేటుకు ఆవల ఈవల గల బస్సులు కారులు వగైరా వాహనాలలో గల జనులు ఈ దృశ్యాన్ని చూచుచుండగనే అంతయు జరిగిపోయింది. బస్సు రైలు విమాన ప్రమాదాలు సంభవించుట అందులోని ప్రయాణీకులు చనిపోవుట వగైరా లన్నియు ఈ కోవకు చెందినవే. అనగా ఆయుష్షు తీరినవారి సమయాలు ఒకటిగా నున్నప్పుడు వారు వేరే ప్రాంతస్థులు అయినాకూడా ఈ ప్రయాణం అనే నెపంతో ఒకటిగా చేరి ఆ సమయానికి సంభవించిన ప్రమాదంలో ప్రాణాలు వదులుతారు, కావున ఆయుష్షు తీరే సమయానికి మరణం తప్పక వస్తుంది. ఏ ఉన్నత పదవులు బందోబస్తులు అడ్డురావు. ఇది సత్యం.

| శ్వాసలు | నిమిషములు | గంటలు | రాత్రి 12 గం॥ నుండి మరునాడు రాత్రి 12 గంటల వరకు | |
|---|---|---|---|---|
| 600 | 40 | 0-40 | 0000 నుండి | 0040 వరకు |
| 6,000 | 400 | 6-40 | 0040 నుండి | 0720 వరకు |
| 6,000 | 400 | 6-40 | 0720 నుండి | 1400 వరకు |
| 6,000 | 400 | 6-40 | 1400 నుండి | 2040 వరకు |
| 1,000 | 67 | 1-07 | 2040 నుండి | 214 వరకు |
| 1,000 | 67 | 1-07 | 2147 నుండి | 2254 వరకు |
| 1,000 | 66 | 1-06 | 2254 నుండి | 2400 వరకు |
| 21,600 | 1,440 | 24-00 | — | — |

పై అధి దేవతలకు నియమిత కృత్యములు ఏర్పరుపబడినవి. వినాయకుడు స్థిరుడు. భూసంపద, పంటలు, ఇల్లు వాకిలి వగైరాల సంపదలకీయన అధిపతి. కావున వినాయకుని కాలమగు రాత్రి 12 గంటల నుండి 12-40 వరకు గల కాలములో గర్భం దాల్చితే గర్భస్రావ మౌతుంది.

బ్రహ్మ శుక్ల శోణితరూపంలో దేహాన్ని ఇవ్వగలడు. కావున బ్రహ్మ కాలమగు రాత్రి 12-40 గంటల నుండి ఉదయం 7-20 వరకు గల కాలములో గర్భం దాల్చితే దేహం ఏర్పడు తుంది. మరణ శిశువు నుండి బాల్య వయస్సు లోగా మరణం పొందే శిశు జననాలు జరుగుతాయి.

విష్ణువు లోక రక్షకుడు. దుష్టశిక్షణ, శిష్ట రక్షణ, ప్రాపంచిక సుఖాలకు, మనస్సుకు, ఆశాపాశములకు కర్త. కావున విష్ణువు కాలమగు ఉదయం 7-20 గంటలనుండి మధ్యాహ్నం 2-00 గంటల కాలములో గర్భం దాల్చితే బాల్యావస్థ అంతంనుండి యౌవన వయస్సు వరకు గల మధ్యమఆయుష్షు వుంటుంది.

రుద్రుడు సంహారి. జీవులు ప్రాణముల(శ్వాసలను) హరించి, శ్వాసనిస్వాసాలను నిగ్రహించి హృదయ స్పందనను ఆపి మరణాన్ని కలిగించుట ఇతని కృత్యము. కావున రుద్రుని కాలమగు మధ్యాహ్నం 2-00 గంటల నుండి రాత్రి 8-40 వరకు గల కాలములో గర్భం దాల్చితే యౌవనావస్థ నుండి కౌమారావస్థ వరకు గల వయస్సు (ఆయుష్షు) కలుగుతుంది. దీనినే అర్థాయుషు అంటారు. జీవుడు జీవకార్యాన్ని నెఱవేరుస్తాడు. ఆగామి సంచితం ప్రారబ్ధ కర్మలను అనుభవింప జేస్తాడు. జీవుని కాలమగు రాత్రి 8-40 గంటల నుండి 9-47 వరకు గల కాలములో గర్భం దాల్చితే వృద్ధాప్య అవస్థ ప్రారంభం 60 సంవత్సరముల నుండి 80 సంవత్సరముల వరకు వయస్సుగల ఆయుష్షు కలుగుతుంది. ఈశ్వరుడు అందరి అధి దేవతలకు ఉచ్ఛుడు. ఇతని అంశమే సదాశివుడు (జీవుడు), రుద్రుడు, ఈశ్వరుడు సకల సౌభాగ్యాలకు అధిపతి, సకల లోకహితుడు, విరాగి, నిరాడంబరి, సహస్రార చక్రమునకధిపతి యగు పరాశక్తికి భర్త, క్రియా శక్తి గలవాడు, తానే సర్వము సర్వముతానే యైనవాడు, అర్ధనారీశ్వరుడు. ఈ యొక్క ఈశ్వరుని కాలమగు రాత్రి 9-47 గంటల నుండి 10-54 గంటల కాలములో గర్భం దాల్చితే 80 సంవత్సరముల నుండి 100 సంవత్సరముల వరకు వయస్సు గల ఆయుష్షు కలుగుతుంది. సహస్రారంలో గల పరాశక్తి ప్రకృతిమాత, శక్తి స్వరూపము, సకల చరాచర సృష్టికి మూలకారణము, పంచ భూతములకు ఆధారము. వేయి సూర్యుల తేజస్సు గల మహా సాధ్వీ స్వరూపము. ఈ పరాశక్తి (గురుమూర్తి) కాలమగు రాత్రి 11-54 గంటల నుండి 12-00 గంటల కాలములో గర్భం దాల్చితే 100 సంవత్సరముల నుండి 400 సంవత్సరముల వరకు వయస్సు గల ఆయుష్షు కలుగుతుంది.

17

మునకు లోటు ఏర్పడినది. ప్రకృతిని మానవాళికి సమానంగ పంచు టకు జ్ఞానం తోడ్పడుతుంది. విజ్ఞానం ఈ ప్రకృతిని గుత్తాధిపత్యం క్రిందకు తెస్తుంది. గుత్తాధి పత్యాన్ని విడనాడి సమానత్వం పొందు టకు జ్ఞానంతో కూడిన విజ్ఞానం అవసరం. జ్ఞాన హీనమైన విజ్ఞానం సమానత్వాన్ని ప్రసాదింప జాలదు. జ్ఞానం అనగా నేమి? విజ్ఞానం అనగా నేమి? అని వీటి రెండింటి మధ్య గల తారతమ్యాన్ని తెలిసి కొని ఆచరించితే మానవాళి సత్ఫలితాలను పొందగలదు. అది ఎట్లో పరికింతము.

1980 సంవత్సరములో ఒక గౌరవ పార్లమెంటు సభ్యుడు అప్పటి భారతదేశ కేబినెట్ మంత్రిని ఒక ప్రశ్న అడిగినాడు. అది ఏమంటే ఆ కేబినెట్ మంత్రిగారికి చెందిన రాష్ట్ర వాసులే ఎక్కువ మంది ఐ. ఏ. ఎస్ కు ఎంపిక యగుచున్నారనియు, ఇతర రాష్ట్ర వాసులు చాలా తక్కువగ ఎంపికయగు చున్నారనియు ఈ వ్యత్యా సానికి గల కారణం ఏమిటని. అందులకా కేబినెట్ మంత్రిగారు తన రాష్ట్రంలో ఫలానా జీవనది ప్రవహించు చున్నదనియు, ఆ జీవ నది ఎన్నెన్నో అరణ్యాల ద్వారా ప్రవహించేందువల్ల దాని జలం మూలికలతో నిండి యున్నదనియు, ఆ నీటిని తన రాష్ట్ర వాసులు సేవించేందువల్ల వారు సునాయాసంగ తెలివిని పొంది ఐ ఏ. ఎస్ కు ఎక్కువ సంఖ్యలో ఎంపిక యగు చున్నారనియు జవాబిచ్చినారు. ప్రశ్న వేసిన గౌరవ పార్లమెంటు సభ్యుడు సమాధాన పడినాడు. ఇతర గౌరవ పార్లమెంటు సభ్యులు మౌనంగా యుండినారు. అనగా కేబినెట్ మంత్రిగారు చెప్పిన సమాధానంతో అందరూ ఏకీభవించి నారని అర్థం కద!

కాని ఆ రోజులలోనే నాకొక సందేహం కలిగింది. కేబినెట్ మంత్రిగారు చెప్పిన జీవనది రెండు రాష్ట్రాలలో ప్రవహిస్తుంది. ఈ జీవనది పొడవు సుమారు ఆరువందల కిలోమీటర్లు. రెండు

కుమారుడు రైల్వేలో ఆఫీసరు. మా మామగారు నా తండ్రి ఇరువురు ఒకే విధమైన చిరు ఉద్యోగాలు చేయుచుండిరి.

మా మామగారి తమ్ముడు టీచరు ఇతనికి నలుగురు కుమారులు నలుగురు కుమార్తెలు అందరూ నిరుద్యోగులు.

మా దగ్గర బంధువు ఒకాయన మారుమూల గ్రామంలో ప్రాథమిక పాఠశాల టీచరు. ఆయనకు ఇద్దరు కుమారులు, నలుగురు కుమార్తెలు. ఇద్దరు కుమారులు సాధారణ ఉద్యోగం చేయుచున్నారు. నలుగురు కుమార్తెలు ఇంజనీర్లు బ్యాంకు ఆఫీసర్లను వివాహ మాడారు.

మా పినతండ్రిగారికి ఎనిమిది మంది సంతానం. బీదస్థితిలోనే గడపినారు. పెద్దకుమార్తె బ్యాంకు ఆఫీసరుకు భార్య అయి సుఖంగా నున్నది. మిగిలిన నలుగురు కుమార్తెల భర్తలు సాధారణ జీవితం. ముగ్గురు కుమారులు నిరుద్యోగులు.

పై ఉదాహరణలు తెలియజేయున దేమంటే ఒకే గర్భంలో పుట్టిన వారికి కూడ అదృష్టభేదం హస్తిమశకాంతంగ యుంటుందని. ఎందులకీ విధంగ జరిగింది?

మహాభారతంలో ఒక ఘట్టాన్ని పరికిద్దాం. సత్యవతి వ్యాసునితో "నాయనా! ఇప్పుడే రాజ్యం అరాజకంగ యున్నది. ఇంకా కాలయాపన తగదు. రాజు లేకపోతే సర్వకార్యాలకూ హాని కలుగుతుంది. కాబట్టి శీఘ్రమే విచిత్రవీర్యుని కళత్రాలు గర్భవతు లయ్యేలా అనుగ్రహించు" అని నచ్చ చెప్పింది. వ్యాసమహర్షి దానికి సమ్మతించాడు. అప్పుడు సత్యవతి తన కోడలు అంబికకు విషయం చెప్పి "నీ బావ వస్తున్నాడు. సహకరించి వంశాన్ని నిల బెట్టు" అని అంటుంది. సమాదాన పరుస్తుంది. ఋతుమతి శుచిస్నాత యైన అంబిక సర్వాలంకృతయై ఆ రాత్రి శయన మందిరంలో తన బావ భీష్ముడు వస్తాడని నిరీక్షిస్తూ వుంటుంది. ఆ అర్ధ రాత్రి వేళ

కాయకసురులతో జీవనం గడుపవలసి వచ్చింది. సాదాసీదా జీవనం సాగించినాడు వ్యాసుడు.

సాధారణంగ క్రొత్త దంపతులు దీపపు వెలుగులో సంగ మిస్తారు. వెలుగులోనే పరుండి నిద్రిస్తారు. మొదటి గర్భం వెలుగు లోనే యుంటుంది. రెండవ గర్భం నుండి మిగిలిన గర్భాలను చీకటి లోనే అనగా దీపం (లైట్లు) ఆర్పివేసి సంగమక్రియ చేస్తారు. ఎందు కంటే మొదటి శిశువు వీరివద్దనే పరుంటుంది. ఈ బిడ్డ చూస్తుందని సిగ్గుతో దీపం ఆర్పి సంగమ క్రియలను చేస్తారు. దీపం లేకుండానే నిద్రిస్తారు. రెండవ మారు నుండి కలుగు గర్భాలు చీకటిలోనే యుంటాయి. జననానంతరం మొదటి బిడ్డ అదృష్టంగ జీవిస్తుంది. తరువాత కలిగిన బిడ్డలు అదృష్టహీనులుగ నుంటారు. గర్భం దాల్చే సమయం నుండి శిశు జననం వరకు దీపపు (లైటు) వెలుతురువుంటే జీవితాంతం ఆ శిశువు అదృష్టంతోనే బ్రతుకుతుంది. ఇచ్చట అదృష్టం అంటే కూడు, గుడ్డ, గూడులకు ఏలాటి చీకూ చింత లేకుండ గడుపు జీవితం అని అర్థం. గుడ్డి దీపమైతే కొంచం అదృష్టం, ఎక్కువ కాంతితో గల దీపమైతే అపారమైన అదృష్టం కలుగుతాయి.

పాఠకులకు ఒక సందేహం కలుగవచ్చును. నాస్తికులు కూడ భోగభాగ్యాలతో అధికార హోదాలతో నున్నారు కదా అని. కూలి చేసేవారు అడుక్కుతినేవారు కూడ వస్తులు లేకుండ ఏపూటకు ఆ పూట ఏదోవిధంగ సంపాదించి తింటున్నారుకదా! మరి వీరికి ఏవిధంగ ఇది జరుగుచున్నదని ప్రశ్నించ వచ్చును. వీరందరు కూలినాలి చేయువారు అడుక్కుతినేవారు చీకటిలో గర్భం దాల్చిన, చీకటిలో నిదురించి నవమాసములు గర్భంలో యున్నప్పుడు చీకటిలో యున్నం దున కలిగిన సంతానం. పగటిపూట సూర్యుని వెలుతురు గర్భంపై బడినందున ఈ కూలినాలి అడుక్కుతినేందువల్లనైనా వీరికి తిండి దొరకుచున్నది. మరి నాస్తికుల విషయానికి వస్తే వీరి తల్లులు

వెలుతురులో గర్భం దాల్చి వెలుతురులో నవమాసములు గర్భ
దాల్చినందున ఈ నాస్తికులు అదృష్టజీవులుగ మనగలుగుచున్నారు.
ప్రారబ్ధం కూడ వీరికి వరమైంది.

పదవులు, అధికారాలు, ఇతరత్రా ఐశ్వర్యాలు కావలయునం టే
జీవి పూర్వజన్మంలో చేసిన కర్మలు దైవకార్యాలు, పుణ్య
పుణ్యరూపంలో మరుజన్మలో ఫలితాల నిస్తాయి. అది ఈ క్రిం
విధంగ జరుగుతుంది.

దైవాన్ని ఆరాధిస్తే మరుజన్మంలో ఫలితాన్నిస్తుంది గా
ఈ జన్మలో ఎలాటి ఫలితాన్నివ్వదు. పాపపుణ్యాలు చేస్తే మరు
జన్మలో హీనజన్మ ఉత్తమజన్మలకు పునాది వేస్తుంది. పాపపుణ
కర్మల ఫలితములు, దైవ ఆరాధన అర్చనధ్యానములు సంచితాలు
ముడివడి మరుజన్మలో ఫలితాలనిస్తాయి. సంపదలకు పంటల
వినాయకుడు అధిపతి. ఈ వినాయకుని ధ్యానించి ఆరాధన అర్చన
చేయువారు మరుజన్మలో భూములు ఇండ్లు వాకిళ్ళు పంటలు సం
లు గలిగి సౌభాగ్యులుగ నుంటారు. విష్ణువు ధనమున కధిపతి. ధన
లిగినవాడు సుఖిస్తాడు. విష్ణువును ధ్యానించి ఆరాధన అర్చనచేయ
వారు మరుజన్మలో ధనమునకు మూలకారణమగు వర్తకము, వా
ణ్యము, కర్మాగారముల కధిపతులై సుఖింతురు. రుద్రుడు విరా
జీవితంపైన విరక్తిని కలిగించువాడు. కావున రుద్రుని ధ్యానిం
ఆరాధన అర్చనచేయువారు మరుజన్మలో మఠాధిపతులు, పీఠా
తులు, తత్వోపన్యాసకులు, సన్యాసులు, వైరాగులుగ జీవింతుర
ఈశ్వరుని ఆరాధించువారు ఉన్నతపదవులు పొంది అధికారము
సంపద రెండును మరుజన్మలో కలిగియుందురు. ఈశ్వరుడు సక
సృష్టికి సకల సంపదలకు కారణభూతుడు అజేయుడు కావున అ
కారం సౌభాగ్యం కోరువారు ఈశ్వరుని ధ్యానించి ఆరాధిం
అర్చించవలెను. పరాశక్తిస్వయంశక్తి,సకలము ఈమెయే. ఈమె

సకలము. కావున పరాశక్తిని ధ్యానించి ఆరాధించి అర్చించువారు మరుజన్మలో రాజకీయ పదవులను పొందుదురు.

ఈ ధ్యాన ఆరాధన అర్చనలు ఏయే నిష్పత్తిలో చేస్తారో ఫలితాలు కూడ అదేనిష్పత్తిలో యుంటాయి. ప్రాణాయామం ద్వారా యోగప్రక్రియ చేసి బ్రహ్మరంధ్రము ద్వారా అంతిమ శ్వాసను వదలక విఫలులైనవారు కూడ పరాశక్తిని ధ్యానించి ఆరాధించి అర్చించినవారి క్రిందే లెక్క. ఇందుల కొక ఉదాహరణ. వివేకానందుడు ప్రాణాయామంలో విఫలుడైనాడు. కావున ఇందిరా గాంధీ గర్భంలో రాజీవ్ గాంధీగ పుట్టినాడు ఇందిరాగాంధీ కుటుంబం చాలా ఐశ్వర్యవంతమైనది. వీరి తాతలు తమ అపారస్థిరాస్థులను దేశానికి ఉచితంగ దానంచేసినారు. రాజకీయ కుటుంబం. సుమారు ముప్పైసంవత్సరాలు భారత దేశానికి ప్రధానమంత్రి పదవుల నలంకరించిన కుటుంబం. ఇందిరాగాంధీ కూడ భారత దేశపు ప్రధానిగ నుండిరి. ఆమె మరణానంతరం ఎందరో అనుభవజ్ఞులైన నాయకులున్నను ప్రధానమంత్రి పదవి ఏకగ్రీవంగ రాజీవ్ గాంధీనే వరించింది. తనకు రాజకీయాలు వద్దు అని పైలట్ గ స్థిరపడిన రాజీవ్ గాంధీని ప్రధానమంత్రి పదవి వరించుటకు కారణం, ఇతడు పూర్వజన్మంలో చేసిన పుణ్యాం వెంటాడుటవలననే.

ఈ దైవ ధ్యాన ఆరాధన అర్చనల శాతం హెచ్చుతగ్గుల బట్టి మరు జన్మలో ఫలితాలు కూడ హెచ్చుతగ్గులుగ సంభవిస్తాయని చెప్పుకొన్నాము గద. ఉదాహరణకు వినాయకుని నిత్యం తన ఇంటి లోనో గుడిలోనో ధ్యానించి ఆరాధించి అర్చించే వారు మరు జన్మలో పెద్ద భూస్వామిగ మిద్దె మేడలలో పుష్కలమైన పంటలతో నిత్య సౌభాగ్యంతో జీవిస్తాడు. అట్లు గాక ఏదో వినాయక చవితినాడు మాత్రం చేతులెత్తి దండం పెట్టేవాడు అర్థ ఎకరా భూమి, గుడిసె ఇల్లు కలిగి వుంటాడు. నిత్యం వినాయకునికి నైవేద్యం పెట్టేవాడు

మరు జన్మలో డెల్టా భూములను పొందియుంటాడు. నైవేద్య
పెట్టని వాడు కరువుకాటకాలలో యుండే మెట్ట భూములను క
యుంటాడు, విష్ణువుకు నైవేద్యం పెట్టనివారు మరు జన్మలో ఎంత
ధనవంతులైనను అనారోగ్య పీడితులై నిత్యం పస్తులు ఉంటార
రుద్రునికి బలులనిస్తారు. బలుల నీయని వారు మరుజన్మలో బైరాగు
సన్యాసులు అయి ఎవరైనా తమకు ఆతిథ్య మీయగలరా అని ఎదు
చూస్తుంటారు. బలుల నిచ్చిన వారు పీఠాధిపతులు మఠాధిపతు
హరికథా దాసులో ఉపన్యాసకులునై ఎందరి చేతనో ఆతిథ్య
స్వీకరిస్తారు. వీరికి ఆతిథ్య మిచ్చుటకు బారులు నిలిచి యుంటార
నిత్యం రుద్ర నమకం చమకం ఏకాగ్రతతో పఠన చేయువా
ఐఏఎస్, ఐపిఎస్ అధికార్లుగ నుంటారు. అట్లుగాక ఏదో శివరా
నాడు మాత్రం లంకణం, జాగారం చేయువారు ఆఫీసులో జవాను
గుమస్తా ఉద్యోగాలలో నుంటారు. పరాశక్తిని కడు భక్తితో
ఆరాధించు వారు రాష్ట్రపతి, ప్రధానమంత్రి, గవర్నరు, ముఖ
మంత్రి వగైరా పదవులను పొందెదరు. భక్తి ఆరాధనల శాత
తక్కువైతే సర్పంచ్, వార్డు మెంబరుగ అవుతారు.

అందరూ మనుష్యులే యైనను పై జెప్పిన విధంగ వార
అర్చించు దేవుళ్ళ ననుసరించి నిష్పత్తుల ననుసరించి మరు జన్మలో
అదృష్ట భేదాలు వస్తాయి. ప్రధాన మంత్రి, అతని పి ఏ, అతని
అటెండరు, అతని కారు డ్రైవరు ఒకే కార్యాలయంలో పని చేస్తారు
ఒకే కారులో ప్రయాణిస్తారు. కాని అధికారం ఐశ్వర్యం గౌరవం
ఒకరికొకరికి ఎంతో తేడాయున్నది. ఇవన్నియు వారువారు కొలుచు
దేవుళ్ళు, ఆరాధన అర్చన ధ్యానాల ఫలితం వలనను, ఆ హెచ్చు
తగ్గుల నిష్పత్తి పాళ్ళ వలనను కలుగుతాయి.

మరియు పై దేవుళ్ళకు రూపాంతరాలు, మారుపేర్లు ఎన్నెన్నో
యున్నవి. ఆయా మారుపేర్లలో రూపాంతరాలలో వారు ఒక్కొక్క

కార్యాన్ని సాధించినారు. ఒక్కొక్క సిద్ధాంతాన్ని లేవనెత్తారు. ఒక్కొక్క నియమిత కార్యంలోనే వెలుగొందారు. మానవులు ఆయా రూపాంతరాలు గల మూరు పేరు రూపాలలో గల దేవుళ్ళను ధ్యానించి ఆరాధించి అర్చించితే ఆయా దేవుళ్లు సాధించిన త్రోవలో గల వృత్తులలో మరు జన్మలో ఇమిడి రాణిస్తారు.

సాధారణంగ బ్రాహ్మణులు దేవాలయాలలో పూజారులుగ నున్నారు. వీరి వృత్తి నిత్యం ధ్యానం ఆరాధన అర్చనలు. కడు బీద బ్రాహ్మణు లైనను ప్రతి రోజూ దైవాన్ని కొలుస్తారు. కావుననే ఈ పుణ్య కర్మ ఫలితంగ మరుజన్మలో వీరు బ్రాహ్మణులు గానే జన్మించి ఉత్తమ పదవులు పొందుచున్నారు. బ్రాహ్మణులకు దేవార్చన నిత్య వృత్తిగ అనాదిలోనే కేటాయింప బడినది. యోగ ప్రాణాయామాలు వీరి నిత్యవృత్తి. ఇతర కులస్థులు తమ ఇంటి వద్దనే తాము ఎన్నుకొన్న దేవుళ్ళను కొలుస్తారు. దేవాలయాలకూ పోతారు. యోగం ప్రాణాయామం అన్ని కులస్థులకు అన్ని మతస్థులకు జన్మ హక్కు. యోగం ప్రాణాయామాలను అందరూ ఆచరిస్తే పై దేవులందరినీ కొలిచి నట్లువుతుంది. నూటికి నూరు శాతం కృత కృత్యులైతే తేజో మండలంలో నక్షత్ర రూపంగ నుండి ముక్తిని పొంది జన్మ రాహిత్యాన్ని బడయ వచ్చును. అందులో విఫలమైనా లేక చేయు నివృత్తి శాతం తగ్గిననూ ఫరవా లేదు. మరు జన్మలో అధికారం ఐశ్వర్యం పొందవచ్చును.

ఏది ఏమైనా సంచిత కర్మలు పుణ్య రూపంగ అమితంగ యుంటే మరు జన్మలో తల్లి దండ్రులు మంచివారు, మంచి గర్భం దొరుకుతుంది. ఈ జన్మలో, పుణ్య కర్మలు చేసి పుణ్యం సంపాదించుట మన వంతు. పుణ్యగర్భాలు ఆయా నివృత్తి ప్రకారం వాటి అంతటఅవే దొరుకుతాయి.

పరాశక్తి తర్వాత ఈశ్వరుడు పుట్టినాడు. ఈశ్వరుడు వేదాలను సృజించినాడు. తరువాత సదాశివుడు, రుద్రుడు, విష్ణువు, బ్రహ్మ, విఘ్నేశ్వరుడు పుట్టినారు. ఒకరి తర్వాత నొకరు జన్మించినారు. వేద సారానుసారం సృష్టి మనుగడకు ఈ దేవుళ్ళు అవతరించవలసిన అగత్యం ఏర్పడింది. ఈ దేవుళ్ళ జన్మలు అయిన తరువాత సృష్టి ప్రారంభ కార్యం సాగింది. ఆది అనాది అనబడు నదంతయు వ్రాత మూలకంగ గురు ముఖంగ మనకు తెలియు చున్నది. మనం నిన్న పుట్టాం. రేపు పోతాం. ఈ మూడు రోజుల ముచ్చటలో ఆదిని అనాదిని అంగీకరించక పోతే ఆత్మవంచనే అవుతుంది. నమ్మక పోతే ఆ ఆదికి అనాదికి నష్టం లేదు. నమ్మలేని వారికే నష్టం వాటిల్లేది. నిమిత్తమైన మానవుడు తన సృష్టికే మూలకారణాన్ని మరచి పోవడం, తానే సృష్టికర్త అని విర్రవీగడం వినాశనానికే దారితీస్తుంది. సృష్టిలో భూమి ఒక ఆవగింజంత. ఈ ఆవగింజంతలో మానవుడెంతో అనేది జ్ఞాపకం ఉంచుకొని మనుగడ సాగిస్తేనే మంచిది.

వేదాలు ఉపనిషత్తులు దేవునిచే ప్రవచింప బడినవి. మానవ శరీరం దేవునిచే రూపొందించ బడింది. వేదాలలో వినాయకుడు, బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు, ఈశ్వరుడు, సదాశివుడు, ఆదిపరాశక్తి అని దేవుళ్లున్నారని తెలుపబడి యున్నది. ఈ దేవుళ్ళే మానవ శరీరంలో నిగూఢంగ నుండి జీవి కర్మలకు సాక్షీభూతమై ఆయుష్షు, అదృష్టం గుణగణాలు వగైరాలను జీవికి కలుగ జేస్తుంటారు. కావున ఈ దేవుళ్లను ఆరాధించుదాం, మేలు పొందుదాం, విశ్వ శాంతిని స్థాపిద్దాం, విశ్వసౌభ్రాతృత్వాన్ని సాధిద్దాం.

కేంద్ర మంత్రిగారి రాష్ట్రంలో ఈశ్వర సంబంధమైన ఆది పరాశక్తి సంబంధమైన దేవాలయాలు ఎక్కువగ నున్నవి. ప్రజ

లందరు నిత్యం దైవ దర్శనా నంతరమే తమ నిత్యకృత్యములకు పూనుకొంటారు. పురుషులు విబూది ధరించి అపర అవధూతలుగను, స్త్రీలు విబూది ధరించి దానిపై కుంకుమను ధరించి అపర శక్తి స్వరూపిణులుగ కన్పట్టెదరు. వీరిని చూడగానే వీరికి రెండు చేతులతో నమస్కరింప వలెననే భావన ఎవరికైనా కలుగుతుంది. వీరి ఈ ఆరాధన అర్చన ధ్యానాలే ప్రార్థనాలై ఆయా నిష్పత్తి ప్రకారం మరు జన్మలలో వీరు ఉన్నత పదవులు పొందగలుగు చున్నారు. కావుననే కేబినెట్ మంత్రిగారి రాష్ట్రంలో గల వారు అధిక సంఖ్యలో ఐ. ఏ. ఎస్. కు ఎంపిక కాగలుగుచున్నారు.

అదృష్టం లేని జీవితం దుర్భరం, నిరర్థకం. అదృష్టం ఏ ఆకాశాన్నుండో ఊడిపడేది కాదు. మన చేతులలో యున్న మాయ ఇది. కావలసినదంత ఓపిక, గర్భస్థ శిశువుపై గమనిక. ఈ రెండూ యుంటే లోకంలో అదృష్ట జీవులే యుందురు. ఎల్లెడలా అదృష్టము (ఐశ్వర్యము) తాండవిస్తుంది.



# తలవ్రాత

సృష్టి ఆవిర్భావము కారుచీకటి మయము. మేఘములు ఘర్షణ పడినపుడు మెఱుపులు మెరుస్తాయికద. అదేవిధంగా సృష్టి ఆవిర్భావపు కారుచీకటి నుండి వేయి సూర్యుల వెలుగుతో కూడిన తేజోమయ మగు వెలుతురు బయలు దేరుతుంది. ఈ వెలుతురుకు శక్తి యని పేరు. ఇది స్వయం శక్తి. శక్తి ప్రయోజనం పొందాలంటే కార్య రూపం దాల్చాలి. కార్య రూపం దాల్చేందుకు ఈ శక్తే ఒక ప్రక్రియను కనిపెడుతుంది. ఈ శక్తి ప్రక్రియల సంభోగమే సృష్టి కార్యంగా రూపు దిద్దుకొంటుంది. నీటిలో విద్యుచ్ఛక్తి వుంది. విద్యుచ్ఛక్తిని శక్తి యంటాం. విద్యుచ్ఛక్తి కార్య రూపం దాల్చా లంటే జనరేటరులను ఉపయోగిస్తాం. అప్పుడు విద్యుచ్ఛక్తి కార్య రూపం దాల్చి ఎన్నో విధాల ప్రయోజనం సమకూరుస్తున్నదని మన కందరికీ తెలిసిందే. అదేవిధంగా శక్తిని కార్య రూపంలో దాల్చు టకు తోడ్పడు ప్రక్రియకు ఈశ్వరుడు అని నామకరణం చేసారు. శక్తిని కాళి, దుర్గ, చాముండి, ఈశ్వరి, పార్వతి అని వివిధ నామాలతో పిలుస్తారు. ఈ శక్తి స్త్రీగా పరిగణింప బడుతుంది. కార్య రూపంలో గానవచ్చు కార్యము పురుషుడుగ పరిగణింప బడుతుంది. ఈ శక్తి ప్రక్రియల సంభవముల కలయిక అర్ధనారీశ్వరు డనబడుతుంది.

స్త్రీపురుష సంపర్కము వలననే సంతానం కలుగుతుంది. అదేవిధంగా శక్తి (ప్రకృతి) యనబడు సహస్ర సూర్యుల వెలుగు

కారణం. అవుతుంది. చేతనాశక్తి యగు ఈశ్వరుడు కార్యం అవుతుంది. ఈ కారణాకార్య సంపర్కము వలన సృష్టి సృజింప బడుతుంది. ఈ కార్య రూపమగు (క్రియాశక్తి) యగు ఈశ్వరుని పై ఆధారపడుట వలన ప్రకృతిని పరాశక్తి, ఆధారశక్తి యంటారు.

మానవుని దేహములో గల ఏడు చక్రములలో గురుమూర్తి స్థాన మనబడు బ్రహ్మరంధ్రమున ప్రకృతి యనబడే శక్తి నిగూఢమై యుండును. ఈ శక్తి బ్రహ్మరంధ్రమున తేజో రూపంతో దేదీప్యమానంగ ప్రకాశించు చుండును. శక్తి యందు పుట్టిన కార్య శక్తి ఈశ్వర నామంతో భూమధ్య ప్రదేశంలో సర్వ సృష్టి నిలయమై యుండును. కర్ణ స్థానమున కంఠ ప్రదేశమున జీవు డనబడు సదాశివుడు దేహంతో కూడి ఆగామి సంచిత ప్రారబ్ధ కర్మల ననుభవింప జేయుటకు సాక్షీ భూతుడై యుండును. హృదయ స్థానమున రుద్రుడుండి జీవుని జీవింప జేయును. దేహమునకు ఋణం తీరిందే ప్రాణమును హరించి మరణమును కలుగజేయును. ఈశ్వరుడే నామాంతరం చెంది సదాశివుడుగ రుద్రుడుగ వ్యవహరించును. ఎట్లనగా దేశ ప్రధానమంత్రి కేబనెట్‌కు చేర్ మేన్ అంటాము. పార్టీకి నాయకత్వం వహిస్తే ఆ పార్టీ ప్రెసిడెంటు అంటాము. వేరే కమిటీకి నాయకత్వం వహిస్తే ఆ కమిటీ చేర్ మేన్ అంటాము. ఈ విధంగానే ఈశ్వరుడు రూపాంతరం చెంది సదాశివుడుగ రుద్రుడుగ వ్యవహరించి ఆయా కార్యాలను చేయును.

నాభి ప్రదేశమున లోకపాలకుడగు విష్ణువును, పురీషస్థానమున సృష్టికారకుడగు బ్రహ్మయు, గురుస్థానమున ఆధార పురుషుడగు వినాయకుడు అధిదేవతలుగ నియమింపబడిరి. ఈశ్వరుని నుండి వినాయకుడు కలిగినారనుటకు ఇదియే కారణం.

మనం ఎవరినైనా నీ వెవరి సంతానం అని అడిగితే తండ్రి పేరు చెబుతారు. తల్లి ఎంత గొప్పదైనను తల్లిపేరు చెప్పరు.

మనంకూడఅడగం. అదేవిధంగ ప్రకృతి తన భర్తయగు ఈశ్వరుని ద్వారా సంభవించినసదాశివుడు, రుద్రుడు, విష్ణువు, బ్రహ్మ, వినాయకుడు ఎన్ని గొప్పకార్యాలు చేసినా ఆ కార్యములు కార్యఫలములు ఈశ్వరునికే చెందుతాయి గాని వీరికి చెందదు. వీరి స్థానాలుకూడ శరీరంలో భ్రూమధ్యమగు ఉచ్ఛస్థానము నుండి అధోస్థానమగు గుద స్థానమువరకు ఏర్పరుపబడిన కారణం ఇదే.

పై సూత్రము ననుసరించి స్త్రీ నుండి మిగిలిన దేవుళ్ళు జనించిరని తెలియుచున్నది. అదేవిధంగ సృష్టి కార్యానికి స్త్రీ పురుషులిరువురు కారకులని తెలియుచున్నది. స్త్రీ యైనా పురుషుడైనా స్త్రీ నుండే జనించవలెను. ప్రకృతి కార్యములు దాల్చుటకు ఈశ్వరుడు కారకుడైనట్లు సృష్టి కార్యానికి పురుషుడు కారకుడౌతాడు, పై దెల్పిన ప్రకృతి (ఆదిపరాశక్తి) యోగమాత ఈశ్వరుడు, విష్ణువు, బ్రహ్మ నిత్యం యోగంచేస్తూ యోగమాతను దర్శిస్తూ తమ నియమిత కార్యాలను నిర్వర్తించుటకు కావలసిన శక్తిని (సత్తును) పొందుతుంటారు. ఋషులు, మహర్షులు, అవధూతలు, వగైరాలు ఈ యోగమాత దర్శనానికే తపస్సులు, యోగం. ప్రాణాయామాలు చేసేది. ఋషులు యోగమాత దర్శనానంతరమే జ్ఞానాన్ని పొంది మనకు వేదాలు, ఉపనిషత్తులు, అందించింది. కావున స్త్రీరూప మనబడు శక్తి అమిత శక్తివంతమైనది, అనుకరింపదగినది.

మరియు సృష్టిలో జడచేతనాలు రెండూ స్త్రీ పురుష విభాగాలతో కూడియున్న సత్యం అందరూ ఎరిగినదే. అందులో స్త్రీ విభాగం చెడితే సృష్టి చెడుతుంది. చెడు జరుగుతుంది. కావున స్త్రీ యొక్క రక్షణ లాలనపాలన బాధ్యతలు పురుషున కప్పగింప బడింది. పురుషుడు తన ఐహిక ఆముష్మిక ఫలసాధనాలకై భార్య బిడ్డలు స్నేహితులు బంధువర్గం ధనం ఆస్తిపాస్తులు పదవి అనే వాటిని

తప్పక పొందియుండవలెను. పురుషుడు పుట్టునపుడే దేవపితృ ఋణా లతో పుడతాడు. తపో యజ్ఞ యాగాదులవల్ల దేవఋణం తీర్చు తాడు, వివాహంవల్ల సత్సంతానాన్ని పొంది పితృఋణాన్ని తీర్చు తాడు. ఇంటి మంచిచెడ్డలు ఇల్లాలివి, బయట ఆర్జనపాలన పురుషునికి నిర్ణయింపబడినవి. స్త్రీలు భర్తలకు నీడవంటివారు. స్త్రీలు గృహ లక్ష్ములు, వంశోద్ధారకులు. సృష్టిలో స్త్రీ పురుష స్థానాలు విభజింప బడి భరించే భార్యగాని, భరింపబడే భర్తగానీ జీవిత భాగస్వామ్యం సమానత కలవారు కావుననే మానవ సంఘంలో స్త్రీ పురుష స్వేచ్ఛాసంగమం నిషిద్ధమైనది. స్త్రీకి పతియే తల్లి తండ్రి గురువు దైవం రక్షణ.

సృష్టి కార్యానికి సాధన భూతమైన స్త్రీ పురుష కలయిక ఆత్మానంద ప్రసాదిత విశ్రాంతి నిమిత్తం, సత్సంతానోత్పత్తి కొరకు గాని కామం తీర్చుకొనుటకు మాత్రం కాదు. లోక శ్రేయ స్సును దృష్టిలో నుంచుకొని స్త్రీ పై ఎన్నో నిషేధాలు విధింప బడినవి. పురుషునకు వేరొక ఆలంబనకు అంగీకారం తెలిపినది కూడ సదుద్దేశంతోనే. ఆ వేరొక ఆలంబన కూడ వివాహరీత్యానే గాని అడ్డుదారులలో కాదు. సతీ సహగమన సిద్ధాంతం, పాతివ్రత్యం, ఏక పత్నీత్వం కూడ లోక కల్యాణార్థమే.

ప్రకృతికి మూల కారణమైన స్త్రీని, సృష్టికి కారణ భూత మైన స్త్రీని, సర్వ శక్తిమంతమైన స్త్రీని, ప్రకృతికి సృష్టికి ఆధార భూతమైన స్త్రీని, మనం కొలిచి ఆరాధించే దేవుళ్ళకు అమ్మ అమ్మమ్మయైన స్త్రీని లోక కల్యాణార్థం, మానవ మనుగడకోసం విశ్వ శాంతి కోసం, విశ్వ సౌభ్రాతృత్వం కోసం ఏ విధంగ ఉపయో గించు కోవాలని విశదంగ ఎవరూ ఎక్కడా చెప్పియుండలేదు. స్త్రీ జనోద్ధరణ చేయు ఉద్దేశంతో బాల్య వివాహాలను నిషేధించినారు. ఇది మంచి పద్ధతే. కారుణ్య దృక్పథంతో వితంతు వివాహాలను

ప్రోత్సహించినారు. ఇదీ మంచి పద్ధతే. కుల మత వ్యవస్థను రూపు మాపేందుకు వర్ణాంతర వివాహాలను ప్రవేశ పెట్టినారు. కాని స్త్రీని ఒక శక్తి స్వరూపిణిగా, సృష్టి కర్తగా ఎవరూ అనుకోలేరు. సత్సంతానాన్ని స్త్రీ ద్వారా పొంది సకల సౌభాగ్యాలను ఒనగూర్చుకోవచ్చునని ఎవరూ తలంచ లేరు. స్త్రీ అబల అని అనుకొన్నారు అనుకొనుచున్నారు. నీతి జాతి నిజాయితీ గల భర్త కలిగిన స్త్రీ సబల అవుతుంది. దుర్నీతి దుర్మార్గుడు నగు భర్తను కలిగిన స్త్రీ అబల అవుతుంది. పురాణాలలో గల కొన్ని సందర్భాలను మనం ప్రమాణంగ తీసికొని ఆలోచించి ఆచరించితే స్త్రీమూర్తిని ఎలా ఉపయోగించుకొని సత్ఫలితాలను పొందవచ్చునో అర్థమవుతుంది.

మనం భుజించు ఆహారము మూడు భాగములుగ నుంటుంది. కంటికి కనబడునది స్థూలమనియు, అందులో ఇమిడియుండు జిహ్వాకు రుచిని కలిగించు రసము సూక్ష్మమనియు, ఈ రసములోగల సత్తు (శక్తి) అణువనియు చెప్పబడును. ఈ విధంగ త్రిగుణాత్మైన ఆహారము శరీరమునకు మదమును, బుద్ధికి ఆలోచనా శక్తియు, మనస్సునకు చేష్టా శక్తియు కలుగ జేస్తాయి. వీటిలో మదము అధిక మైనపుడు పురుషునకు శుక్లమును స్త్రీకి శోణితమును ఏర్పడును. ఈ శుక్ల శోణితములే పిండోత్పత్తిగ మారుతాయి

స్త్రీ ఋతుమతి యైనది మొదలు పదునారు దినముల వరకు ఋతుకాల మనబడును. ఇందు మొదట మూడు రోజులు సంభోగమునకు నిషేధము. ఆ మూడు రోజులలో సంగమించిన యెడల పురుషునకు తీరని వ్యాధి. ప్రాణ హాని కలుగును. నాలుగవ దినమున పిండోత్పత్తియైన పిచ్చివాడును అనాచారవంతులును పుట్టుదురు. అర్ధ రాత్రి తర్వాత పిండోత్పత్తి యైన గర్భ స్రావమును. ప్రాతః కాలమున పిండోత్పత్తి యైన మరణించిన శిశు జననమును, పగలు పిండోత్పత్తి యైన అల్పాయుష్కులును, సంధ్యా కాలమున పిండో

త్పత్తి యైన అసుర స్వభావులును, రాత్రి కాలమున పిండోత్పత్తి యైన దీర్ఘాయుష్షులును జనింతురు. సంభోగ కాలములో తల్లి కండ్లు మూసికొన్న యెడల గ్రుడ్డివారును, సంభోగ కాలములో స్త్రీ పురుషు లొకరి నొకరు మూసికొన్న మూగవారును, గ్రహణ సమయంలో గర్భస్థ స్త్రీ కదలి ఏ పనులైనా చేసిన యెడల వికలాంగు లును, గర్భాదానము మొదలు గర్భస్థ స్త్రీ చీకటిలో నిదురించిన ఆజన్మ దరిద్రులును, గర్భస్థ స్త్రీ దురాలోచన కలిగి యున్న యెడల అతి తీవ్ర స్వభావులును పుట్టుదురు.

ఋతు కాలములో శుక్లము అధిక మైనపుడు పురుషుడును, శోణితము అధిక మైనపుడు స్త్రీయును, రెండును సమముగ నున్న యెడల నపుంసకులును పుట్టెదరు. ఒక పర్యాయము సంభోగించి తృప్తి తీరక మరల వెంటనే సంభోగము చేసిన యెడల శుక్లశోణిత ముల ఎక్కువ తక్కువల ననుసరించి ఒక పురుషుడు ఒక స్త్రీగాని; ఇరువురు పురుషులు గాని లేక ఇరువురు స్త్రీలు గాని కలుగుదురు. ఇదియును గాక కొందరు స్త్రీలకు యోని కమలమందు పొరలుండి శుక్లము ఆ పొరల యందు శోణితముతో కలిసినపుడు కవల పిల్లలు కలుగుదురు. ఋతు కాలములో బేసి దినములందు రతి సల్పిన పురుషుడును, సరి దినములందు రతి సల్పిన స్త్రీ యును కలుగును. గర్భిణీ స్త్రీ తన దైనందిన కార్యక్రమములలో ఏఏ పనులు చేయునో ఆయా పనుల ప్రభావము గర్భస్థ శిశువు పై బడును. గర్భస్థ స్త్రీ మనసా వాచా కర్మలతో ఏ ఏ తలంపులు కల్గియుండునో ఆ సంగ తంతయు పిండముపై బడి గుణగణములు, మంచి చెడ్డలు, జనన శిశువునకు కలుగును. గర్భస్థ శిశువు తల్లి నిదురించినను స మేల్కొని బయట విషయాలను ఆకళింపు జేసుకొనును.

ప్రస్తుత విజ్ఞానం ఎంతో వెల్లివిరిసింది. ఈ విజ్ఞానాభివృ మనం ఎంతో విర్రవీగుతున్నాం కాని గర్భస్రావాలు, జనించి మ

ణించే శిశువులు, అల్పాయుష్కులు, అర్ధాయుష్కులను కోకొల్లలుగ పొందుచున్నాం. అదేవిధంగ దరిద్రులు గ్రుడ్డివారు, వికలాంగులు జనించుచున్నారు. హంతకులున్నారు హత్యచేయబడే వారున్నారు. ఇతరులను అదేపనిగ హింసించే దుర్మార్గులున్నారు. అహింస అత్యాచారాలు దోపిడీలు కక్ష్యలు కార్పణ్యాలు కామ క్రోధ లోభ మోహ మదమాత్సర్యాలు ఎల్లెడలా తొణికిసలాడుచున్నవి. సత్యం న్యాయం ధర్మం అణగారినవి. ఎందులకీ విధంగ వైపరీత్యం జరుగుచున్నది? మానవులందరూ తల్లుల గర్భాలనుండే జనించెదరు కద! స్త్రీలు గర్భం దాల్చినపుడు ఏ ఏ మనోభావాలతోను తమ దైనందిన జీవితంలో కలుగు ఒడుదుడుకుల వలన కలిగిన ప్రభావాలతోను అనుభూతులు పొంది గర్భస్థశిశువుల నొసటిర్రాతలుగ మారి జననానంతరం ఆయా ప్రభావాలు అనుభూతులు తలవ్రాతరూపంలో తమ నిజజీవితంలో ఆచరణలో పెట్టుచున్నారు. కావున మానవులుచేయు దుష్కృత్యాలు అశాంతి వగైరాలకు కారణం వీరుకాదు, వీరి తల్లులు మాత్రమే. అవగాహన లోపంవల్ల తెలియని తనంవల్ల ఇవి జరుగుచున్నవి. ఈ పరిస్థితిని సరిదిద్ది ఆచరణలో పెట్టితే ప్రపంచం ప్రశాంతంగ సుఖశాంతులతో మనగలుగుతుంది. ఎందరో శిరిడి సాయిబాబాలను, పుట్టపర్తి సత్యసాయిబాబాలను, ఏసుక్రీస్తులను, గౌతమబుద్ధులను, రామకృష్ణ పరమహంసలను, వివేకానందులను, రవీంద్రనాథఠాకూరులను, శ్రీరాములను, శ్రీకృష్ణులను మన తల్లులు లోకానికి అందివ్వగలరు. కావున ఈ విపరీత వైపరీత్యములను అధిగమించుటకు స్త్రీ లోకాన్ని సక్రమంగ వినియోగించుటెట్లో మనం ఆలోచిద్దాం. ఆచరణలో పెడదాం.

స్త్రీ యోని కమలంలో శుక్లము జారిపడిన తర్వాత ఐదు దినములవరకు పిండము నీటిపై బుగ్గవలె తేలియుండును. పది దినములకు గడ్డకట్టి కోడిగ్రుడ్డుకంటె కొంచము చిన్నదగును. ఒక

నెలకు పిండము గట్టిపడి శిరస్సు ఏర్పడును. రెండవ నెలలో అవయవ ములును, మూడవ నెలలో నడుమును, నాలుగవ నెలలో ఇరుపార్శ్వము లును, ఐదవ నెలలో పాదములును వ్రేళ్ళును, ఆరవ నెలలో ముక్కు చెవులు నేత్రములు మొదలగు జ్ఞానేంద్రియములు ఏర్పడును. ఏడవ మాసములో జీవుడు ప్రవేశించును. గుదము లగాయతు బ్రహ్మ రంధ్రము వరకు వెనుక భాగమున ఒక నాడి యుండును. దీనికే వెన్ను పూస యందురు. ఏడవ నెలలో వెన్నుఎముక ఏర్పడును. ఎనిమిది తొమ్మిది నెలలలో పూర్వజన్మ జ్ఞానము కలిగి భూమిమీద పడువరకు (జనించువరకు) ''పూర్వజన్మమున కొంచెమైనను పుణ్యము చేసికొనక పోతిని, అజ్ఞానముచే సంచరించి ఎన్నియో దుష్కృత్యములను చేసి తిని, ఇక ఈ గర్భస్థ నరకకూపము నుండి బయటపడిన పిదప జ్ఞాన మును సముపార్జించి ప్రాపంచిక విషయములలో తిరుగక ముక్తిని పొందుటకు గట్టి ప్రయత్నములను గావింతు'' నని తలచు చుండును. స్త్రీలు నవమాసముల తర్వాత పురుషులు దశ మాసముల తర్వాత జనింతురు. ఈ విధంగ నవ లేక దశ మాసముల యనంతరం గర్భస్థ శిశువు అధోముఖమై తల్లికి ప్రసవ వేదనను కలిగించును. తల్లి యొక్క అపాన వాయువు ప్రసారము వలనను గర్భస్థ శిశువు యొక్క ప్రాణ వాయువు ప్రసారము వలనను శిశువు బయట పడును అనగా జనించును

అప్పుడు శిశువు గర్భంలో తాను తలచుకొన్న పూర్వ జన్మ దుష్కృత్యములను ఈ జన్మలో తా చేయ తలపెట్టిన సత్కృత్యములను మరచి కావు కావు మని ఏడ్చుచుండును. అనంతరం శిశువు పెరిగి పెద్దదై ప్రపంచ విషయము లందు తగులుకొని జీవించును. సంసార సాగరమున మునిగి ఈదులాడును. దైవాన్ని ధర్మాన్ని న్యాయాన్ని సత్యాన్ని మరచి చిందులాడును. తాను గర్భంలో నున్నప్పుడు కలిగిన యనుభూతులు తలవ్రాతగ మారినందున ఆ తలవ్రాతల

ప్రకారం నిజ జీవితంలో నడచుకొనును. వృద్ధాప్యం ఆవహించిన వెనుక సపర్యలు చేయు వారు లేక విలపించును. చివరకు వ్యాధి పీడితుడై దుఃఖించి శరీర శక్తులుడిగి ఆయుష్యు తీరిననాడు దివంగతు డగును. మరల తాను జీవితంలో చేసిన పాపపుణ్య కర్మల ఫలితాలను ప్రారబ్ధ రూపంలో వెంట నిడుకొని తన కర్మానుసారం యోనిజ ములు అండజములు స్వేదజములు ఉద్భిజములలో ఏదో ఒక దానిలో జన్మ నెత్తును. ఈ జనన మరణ జనన ప్రక్రియ నిరంతరం సాగుతునే యుంటుంది.

మానవ మనుగడ ఒడుదుడుకులు లేకుండ పూర్ణాయుషుతో అదృష్టవంతంగ మంచి గుణవంతులుగ బ్రతుకుటకు మనం చేయ వలసిన పని ఏమి ? స్త్రీని స్త్రీజాతిని సానుకూలంగ మలచుకొని ఇక మీద రాబోవు కాలాలలో జనించు మన వారసులు నీతి నిజాయితీగ బ్రతుకునట్లు, సత్యం న్యాయం ధర్మాలను అనుసరించునట్లు, ఇరుగు పొరుగు వారితో కలసి మెలసి జీవించు నట్లు, ఇతర కులస్థులతో మతస్థులతో సోదర సంఘీ భావము కలిగి యుండునట్లు, తల్లి దండ్రు లకు వంశానికి గ్రామానికి దేశానికి విశ్వానికి ఆదర్శంగ యుండి మానవ జాతికే వన్నె తెచ్చే సంతతిని మనం పొందవలయును.

పశు పక్ష్యాదులు సంతానోత్పత్తి చేయుచున్నవి. వీటికి నియమిత కాలము లున్నవి. ఆ నియమిత కాలాలలోనే వీటికి సంభో గేచ్ఛ కలుగుతుంది. సంతానోత్పత్తి జరుగుతుంది. అదే విధంగ వృక్షజాతులు వాటి వాటికి నియమింపబడిన మాసములు ఋతువుల లోనే పరాగ పరపరాగ సంపర్కముల వలన తమ సంతానోత్పత్తిని గావించుకొంటాయి. ఈ నియమిత కాలములైన మాసములు ఋతు వులు తప్పిన యెడల పైర్లు చెట్లు అదనుకు రావు అనే విషయం అందరికీ తెలిసిందే. కాని మానవ జాతి చేసే పని ఏమి ? మానవ జాతికి మాసములు ఋతువులు అనబడే నియమిత కాలములను

స్త్రీ మెట్టినింట వంశోద్ధారణ చేస్తుంది. స్త్రీ చేసే అన్ని కార్యములు మెట్టినింటనే గాని పుట్టినింటికి గాదు. అందుచే స్త్రీ గర్భం దాల్చిన మొదటిమాసం నుండి ఈ క్రింద కనిన విధానాన్ని అవలంభించవలెను.

గర్భస్థ స్త్రీ చే సద్గ్రంథపఠన చేయించవలెను. రామకృష్ణ పరమహంస జీవితచరిత్ర ఆయన ఉపన్యాసములు, రామకృష్ణ మఠం వారిచే ప్రచురింపబడిన అన్ని గ్రంథములు, వివేకానందుని జీవితచరిత్ర ఆయన ఉపన్యాసములు, శిరిడి సాయిబాబా జీవితచరిత్ర ఆయన ఉపన్యాసములు, పుట్టపర్తి సత్యసాయిబాబా జీవిత చరిత్ర ఆయన ఉపన్యాసములు, అష్టాదశ పురాణములు, ఉపనిషత్తులు, రామాయణం, భారతం, భాగవతం, భగవద్గీత, ఖురాను, బైబిలు, బుద్ధుని బోధనలు, ఇవిగాక ప్రపంచవ్యాప్తంగ ఎందరో మహానుభావులు వ్రాసిన సద్గ్రంథములు, రవీంద్రనాథఠాకూర్ రచనలు, ఆయన గీతాంజలి, మొదలగువాటిని గర్భస్థ స్త్రీ చే ఏకాగ్రతతో చదివించవలెను. లేదా ఎవరైనా గర్భస్థ స్త్రీ వద్ద కూర్చొని ఓపిగ్గా చదువవలెను. గర్భస్థ స్త్రీ నిదురించునపుడు కూడ ఎవరైనా ఒకరు పై గ్రంథములను ఆమెవద్ద కూర్చొని చదువవలెను. ఇవియును గాక ఆధునిక విజ్ఞానశాస్త్రములు అనగా ఖగోళము, కంప్యూటరు, టెలివిజన్, గణితం, జీవజంతుశాస్త్రములు, భౌతికన్యాయ ఆర్థిక రాకీయ వగైరా వివిధశాస్త్రములను గర్భిణీ స్త్రీ చే చదివించవలెను. కుటుంబ సభ్యులెవరైనా గర్భిణీ స్త్రీ నిదురించునపుడు ఆమెవద్ద కూర్చొని చదువుచుండవలెను. సైకిలు, స్కూటరు, కారు డ్రైవింగు గుఱ్ఱపుస్వారీ, కరాటే, రైఫుర్రైటింగు, వగైరా తర్ఫీదులను గర్భిణీ స్త్రీకి ఇవ్వవలెను. ప్రాణాయామము, ఆసనములు, యోగములు, శ్వాస మహిమలను, సంగీతము, నాట్యము, చిత్రలేఖనము, జ్యోతిష శాస్త్రములు మరియు ప్రాంతీయ భాష, సంస్కృతము, ఉర్దూ

నిజము చెప్పుట, మంచిమాటలాడుట, హితములను వాక్రుక్కుచ్చుట, ప్రయోజన కరములుగ పలుకుట యను వాక్సద్గుణములను, కలిగియుండును. తీర్థయాత్రలుసలుపుట తప్పు చేయకుండుట దానమిచ్చుటయను శరీర సద్గుణములను కలిగియుండును. సద్భక్తి, అనాసక్తి, తపశ్చింత పరోపకారము, మోక్షము, లోకహితము లనబడు మానసిక సద్గుణములు కలిగియుండును. పరస్త్రీని తల్లివలెను, పరద్రవ్యమును మట్టి పెళ్ళవలెను, సకల జీవరాసులను తనవలెను చూచును. ఇతరులను నిందించడు. ఇతర స్త్రీలతోడను, దుర్మార్గులతోడను సహవాసము చేయడు. ఇతని బుద్ధి నీటిలో విడచిన నూనెచుక్కవలె తేటగా నుండును. సద్గుణ రాసి యగును. ప్రస్తుతమున్న విజ్ఞానాన్ని ఇంకను పెంపొందించును. ప్రజాహితము లోకహితములను కలుగ జేయును. మనం నిత్యం కొలిచే శ్రీరాముడు, శ్రీకృష్ణుడు, ఏసు క్రీస్తు, బుద్ధుడు. అల్లా, సిరిడి సాయి బాబా, పుట్టపర్తి సత్య సాయి బాబా, రామకృష్ణ పరమహంస, వివేకానందుడు, విశ్వామిత్రుడు, వశిష్టుడు, వ్యాసుడు, మొదలగు మహానుభావుల గుణగణములు వారి మహత్వములు ప్రతి శిశువు కలిగియుండును. సంసారంలో యుండి కూడ ప్రతీ శిశువు ఒక్కొక్క జనక మహార్షియగును.

ఈ విధానాన్ని ఇప్పటినుండే అమలు జరిపితే రాబోయే పది సంవత్సరముల నుండి సత్సంతానాలు కలుగుతాయి. ఈ సంతానం వల్ల విశ్వం సుభిక్షంగ, సురక్షితంగ, నిత్య శాంతితో కళకళలాడుతుంది. కైలాసం, వైకుంఠం, బ్రహ్మ లోకం, దేవలోకం వగైరా ఉచ్ఛలోకములలో గల ఆనందము, పరమానందము, పవిత్రము, జ్ఞానము, ఆత్మ తృప్తి ఈ లోకం లోనే ఈ జన్మ లోనే కలుగుతాయి. ఇరవై ముప్పై సంవత్సరములకు కుల మత వ్యవస్థలు, అసమానతలు, పోలీసు న్యాయ జైళ్ళ వ్యవస్థలు అంతమిస్తాయి. ఆయుధ సంపత్తి అవసరమే యుండదు. ఈ వ్యస్థల పై పెట్టు ఖర్చును

# దేవుడు

పరమాణువు నుండి అనంతం వరకు నిగూఢమై నిరాకారమై జననమరణములు నామరూపాలు లేని అతీత శక్తిని దేవుడు అంటారు. అగ్నిలో వేడి ఎట్లున్నదో చరాచరంలో ఈ శక్తి ఆ విధంగ వుంటుంది. ఈ శక్తి సర్వము తానై, తానే సర్వమునై స్వశక్తితో యుండి సృష్టి యనబడు క్రియను సాగిస్తుంటుంది. దేవుడు వున్నాడు కాబట్టి మతాలున్నాయి. మతాలున్నాయి కాబట్టి ఆ యా మత సంబంధమైన చిహ్నాలగు గుళ్ళుగోపురములున్నవి. కాబట్టి పూజలు, అర్చనలు నైవేద్యాలు ధ్యానాలు ఆచరిస్తున్నారు. మతాధిపతులు పీఠాధిపతులు వెలసి దేవుని ఉనికిని చాటుతున్నారు. వేదాలు ఉపనిషత్తులు ఉపవేదాలు, వేదాంగాలు, మతగ్రంథాలు వగైరాలు దేవుని గురించి, దేవునిసృష్టి కార్యం గురించి, దేవుని పొందు విధివిధానం గురించి తెలుపుతున్నాయి. దేవుడు ఒక వస్తువు కాదు. చక్షువుకు కనబడేది కాదు. దేవుని చూడవలెనంటే నియమ నిష్ఠలు పాటించి భక్తి, శ్రద్ధ, ఆసనం, ప్రాణాయామం చేసితే అంతఃచక్షువుతో దర్శించ వీలగును గాని బాహ్య చక్షువులతో చూడ వీలుపడదు.

లోకంలో గల మానవాళి నూటికి నూరు పాళ్ళు దేవుడున్నాడనియే నమ్ముచున్నది నేను దేవుణ్ణి కొలిచినాను నా కష్టాలు తీరలేదు అనే వారు కొందరు, అసలు దేవుడే లేడు, ఉంటే చూపండి

బడిన ఏడు చక్రములలో వెన్నెముక యందుగల సూక్ష్మ నాళముగ సుషుమ్నానాడి ద్వారా ప్రాణాయామ ప్రక్రియతో శ్వాసన ప్రవేశింపజేసిన యెడల నిస్సందేహంగ ఆ దేవుని దర్శన మగును ఆ దేవుడే తానగును. పూర్వం ఋషులు మునులు ఈ ప్రాణాయామ ప్రక్రియ సాధనవలననే దేవుని దర్శించి, తరించిరి, ముక్తిని బొందిరి, మనకు ఆ విధానాన్ని తెలిపిరి.

తల్లి బిడ్డకు తన భర్త తండ్రిగ, అత్తమామలను అవ్వ తాతలుగ, ఆడబిడ్డలను అత్తలుగ, బావమరదులను పెదనాన్న చిన్నాన్నలుగ పరిచయం చేసి నేర్పుతుంది. బిడ్డ ఈ చుట్టరికముగ తన జీవితాంతం అనుసరిస్తుంది. అదేవిధంగ దేవు డున్నాడని ఎందరో మహనీయులు మనకు సోదాహరణంగ తెల్పినారు. గుళ్ళు గోపురాలు అందుకు నిదర్శనంగ కట్టించినారు. కావున మనం కూడ మన తల్లి మాటలను నమ్మినట్లు మన పూర్వీకుల మాటలను, వ్రాతలను, చేతలను అనుభవాల్ని నమ్మి తీరవలెను. వేరే దారి లేదు. నమ్మకమే అన్నిటికీ పునాది.

ప్రహ్లాదుడు తన తండ్రితో దేవుడు సర్వవ్యాపి, ఎల్లచోటులా, ఎల్లవేళలా యున్నాడని అంటాడు. మూఢుడు హిరణ్యకశిపుడు స్తంభంలో యున్నాడా అని అడిగి, ఔనని జవాబు వస్తే స్తంభాన్ని తన్ని చేటు తెచ్చుకొంటాడు. హిరణ్యకశిపుడు శాంతంగ ఓపిగ్గ ప్రహ్లాదుని వివరణ అడిగియుంటే ప్రహ్లాదుడు ఈ క్రింది విధంగ దేవుని దర్శించు పద్ధతిని వివరించి యుండేవాడు.

మానవ దేహం వెన్నుపూస ఆధారమైంది. వెన్ను పూసలో సూక్ష్మాతి సూక్ష్మమైన నాడి వున్నది. మనిషి శ్వాస నిశ్వాసముల ద్వారా ప్రతి రోజూ 21,600 ప్రాణములను లోనికి గైకొనుచు బయటకు వదులుచుండును. ఈ ఉచ్ఛ్వాస నిస్వాసము లనబడే ప్రాణములు మనిషి ఇచ్ఛ లేకుండగ తనంతట తానే లోనికి పోయి

బయటకు వస్తూంటాయి. ఈ ప్రాణములను మానవుడు నియంత్రించి తన అధీనములో నుంచుకొనవలెను. ఆ విధంగ నియంత్రించిన శ్వాసను వెన్నుపూస లోని సుషుమ్న యను సూక్ష్మనాడి ద్వారా కపాలమునకు ఎక్కించవలెను. ఆవిధంగ కపాలమునకు ఎక్కినపుడు శ్వాస ఇది వరకు చెప్పబడిన సప్త చక్రముల లోని వినాయకుడు, బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు, జీవుడు (సదాశివుడు), ఈశ్వరుడు, గురుమూర్తి (పరాశక్తి) కాగల దేవుళ్ళు; అరువదినాలుగు లోకాలూ, అనంత కోటి బ్రహ్మాండ మంతయు దృగ్గోచరమగును. అప్పుడు ఈ మానవుడే దైవ శక్తులు పొంది తానే దేవుడై వరాలిస్తాడు శాపాలిస్తాడు. సృష్టికి ప్రతిసృష్టి చేస్తాడు. విశ్వామిత్రమహర్షి, వశిష్ఠ మహాముని వగైరాలు ఇందులకు ఉదాహరణం. ఇది మొదటిది.

రెండవది తిరుమల శ్రీ వేంకటేశ్వరుని దర్శించుటకు ఏడు కొండలు ఎక్కుతాము గద! ఏడు కొండలకు అర్థం తెలిసిన వారెంద రున్నారు? మొదటి కొండ గరుడాద్రి. గరుడుడు సూక్ష్మ దృష్టి కలవాడు. గరుడుని కనుచూపులు ఆకాశము నుండి భూమిపై గల ఏ చిన్న పాటి వస్తువునైనను స్పష్టంగ చూడగలవు అనగా వేదాలు, ఉపనిషత్తులు, పురాణాలు పుణ్యకథలు, సంసారం, లౌకికం జీవితసారం, పరమార్థహితం, అందులో గల సూక్ష్మ రహస్యాలను కనుగొని విచక్షణా జ్ఞానంతో నిజ జీవితం గడుపువాడు గరుడాద్రిని అధిరోహించ వలెను.

రెండవకొండ అంజనాద్రి. అంజనాదేవి పుత్రుడు ఆంజనేయుడు. ఇతడు అస్ఖలిత బ్రహ్మచారి కావుననే సముద్రలంఘనం, లంకాదహనం, సీతాన్వేషణలు చేసి రామకార్యాన్ని సాధించినాడు. అతి బలవంతుడు, చిరంజీవి. అనగా బ్రహ్మచర్యాలు మాత్రం లేక కనీసం పరదారాగమనం లేకుండ ఏకపత్నీవ్రతుడైన వాడు మాత్రం అంజనాద్రిని అధిరోహించవలెను. మూడవ కొండ శేషాద్రి. ఆదిశేషుడు భూభారాన్ని ఎల్లప్పుడూ తన శిరస్సుపై మోస్తూవుంటాడు.

కావుననే ఈ భూమండలంలో గల జీవరాశులన్నియూ మనుగడ సాగించుచున్నవి; భూభారాన్ని మోయుటకు ఆదిశేషునకు ఏలాటి ప్రతిఫలం లేదు పరోపకారమే పరమధర్మంగ నెంచుకొని ఈ మహా త్కార్యాన్ని శేషుడు వహిస్తున్నాడు. ఈ కార్యాన్ని చేయుటకు శేషుడు ఎంతో శాంతం ఓరిమి కలిగియున్నాడు. శేషుడు శ్రీమన్నా రాయణునికి శయ్యయై యున్నాడు. అనగా సకలసృష్టి సంజాతానికి ఆధారభూతుడైన నారాయణునికి ఆవాసమైనవాడు శేషుడు. దీనర్థం సదా నారాయణుని మనస్సులో పదిలపరచుకొని ధ్యానించువాడు, ఓరిమి శాంతం, పరోపకారమే తమ జీవితపరమావధి యని ప్రతి ఫలాపేక్ష లేక జీవితయాత్ర సాగించేవారు శేషాద్రిని అధిరోహించాలి. జీవకారుణ్యం మానవసేవయే మాధవసేవగ మనుగడసాగించే వారిలో నారాయణుడు స్థిరనివాస ముంటాడు. నాలుగవ కొండ వృషభాద్రి. వృషభము అనగా వేదములు. వేదములు నాలుగు. ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అధర్వణవేదములను నాలుగు వేదములను, అందులో నుండి ఉద్భవించిన ఉపనిషత్తులను నిత్యం ఉపాసించేవాడు, యజ్ఞయాగాదులు నిత్య జపహోమాలు ఆచరించే నిత్యానుష్ఠానులు మాత్రం ఈ కొండను అధిరోహించాలి. ఐదవది నీలాద్రి. నీలంఅంటే నిర్మలం పచ్ఛదనం ఆహ్లాదం కలిగించు నది. ఆకాశం నీలంగ కనబడుతుంది. కాని ఆకాశంలో నీలం లేదు. నీరు నీలంగ కన్పడుతుంది. కాని నీరు నిర్మలంగ యుంటుంది. అదే విధంగ అరిషడ్వర్గాలకు అతీతుడై నిర్మల మనస్కుడై ప్రాపం చిక విషయములలో నిమిత్తమాత్రుడుగ నుండువాడు మాత్రం నీలాద్రిని అధిరోహించవలెను. ఆరవది నారాయణాద్రి. నారాయ ణుడు సర్వభూతాత్ముడు; సర్వలోకహితుడు, సర్వప్రాణి ఆధారము. ?నగా ఇతరుల మేలు కోరువాడు, ఇతరుల బాగోగులను తన బాగో ?లుగ నెంచి వారిని ఆపదలలో ఆదుకొనువాడు, సదా ఇతరులకు ?లుచేయుటే తన ధర్మమని ఎంచి నిజజీవితంలో ఆచరించువాడు

మాత్రం నారాయణాద్రిని అధిరోహించాలి. మరియు నారాయణుడు శేషునిపై పవ్వళిడి సదా యోగనిద్రలో యుంటాడు. కావున నిత్యం యోగం, ప్రాణాయామముల నాచరించువారు మాత్రం నారాయణాద్రిని అధిరోహించవలెను. ఏడవది చిట్టచివరిది వెంకటాద్రి. యమము, నియమము, ఆసనము, ప్రాణాయామము, ప్రత్యాహారము, ధారణ, ధ్యానము, సమాధియనబడు ఎనిమిదినియమములలో నిష్ణాతుడును; దానము, నిదానము, సమాధానము, సమదృష్టి, సమత్వము, ఉదాసీనత్వము లనబడు ఆరు స్వానుభవములను మనసా వాచా కర్మల నాచరించువారు వెంకటాద్రిని అధిరోహించుటకును శ్రీ వేంకటేశ్వరుని దర్శించుటకును అర్హులు.

మానవులు తమ నిత్య జీవితంలో సైకిలు, స్కూటరు, కారు, హెలికాప్టరు వగైరా వాహనములను స్వీయ సౌకర్యార్థం ఉపయోగించుచున్నారు. అదే విధంగ దేవుళ్ళకు కూడ వాహనములు కలవు. స్థూల దృష్టితో గాక సూక్ష్మదృష్టితో తర్కించిన యెడల దేవుళ్ళ వాహనముల అర్థం బోధపడును.

ఎలుక గుణమేమి ? ఇది ధాన్యాన్ని చేర్చిపెట్టుతుంది. వినాయకుడు ధాన్యమున (పంటలకు) కధిపతి. ఏ గృహంలో ఎలుకలుంటాయో ఆ ఇంటిలో మూడు పూటలూ తిండికి లోటు లేకుండ గడుస్తుంది. రైతులకు పంటలు బాగా పండుతాయి. కావుననే ధాన్యముల చేర్చిపెట్టు ఎలుకలు సంపదలకు, భూస్థితికి అధిపతియైన వినాయకునికి వాహనంగ నియోగింప బడింది.

హంస గుణమేమి ? పాలు నీరు కలిపి యుంచిన యెడల హంస పాలను మాత్రం గ్రహించి నీటిని వదిలి వేస్తుంది. బ్రహ్మ జీవి యొక్క పాపపుణ్య ఫలితములను ఆ జీవి యొక్క కర్మాను సారం స్పష్టంగ విభజించి ఆయా ఫలితాలనుబట్టి మరు జన్మల నొసగును. కావుననే హంసను బ్రహ్మకు వాహనంగ నియోగింప బడినది.

గరుడుని గుణమేమి ? తన సూక్ష్మ దృష్టితో లోకమును పరిశీలించును. మంచి చెడు విచక్షణా జ్ఞానం కలిగి యుండును. విష్ణువు తన సూక్ష్మ దృష్టితో జీవుల పుణ్యపాపములను పరికించి దుష్టశిక్షణ శిష్టరక్షణ చేయును. కావుననే గరుడుడు విష్ణువుకు వాహనంగ నియుక్తుడై నాడు.

రుద్రుడు శ్మశాన వాటికలో జీవించును. కపాలమును చేత నిడుకొని యుండును రుద్రుడు సంహార కారకుడు. ప్రాణులను సంహరించి మరణమును కలుగ జేయును. ఎంతటి ఉన్నతు డైనను శ్మశానమే శాశ్వత స్థానమని తెలియ జేయుటకు రుద్రుడు కపాల హస్తుడై శ్మశానంలో యుంటాడు.

వృషభము అనగా వేదములు, ఎద్దు అని రెండర్థములు. ఎద్దుకు కాళ్ళు నాలుగు. నాలుగు వేదములను తన వాహనముగ గలవాడు ఈశ్వరుడు. వేదములను అర్థం చేసుకొని తానే వేదము లైన వాడని యర్థము. కావుననే ఎద్దును ఈశ్వరునికి వాహనముగ నియోగింప బడినది.

ఆదిపరాశక్తికి (పార్వతికి) సింహము వాహనము. సింహము మృగరాజు. పార్వతి త్రిమూర్తుల కన్న శక్తి వంతమైనది. కావున ఈమెకు సింహమును వాహనముగ నియోగింప బడినది.

పార్వతి త్రిశూలధారిణి. త్రిగుణములు, త్రిమూర్తులు ఈమెం కధీనమని దీని యర్థం. ఈశ్వరుడు త్రిశూలధారి. అనగా తాను త్రిమూర్తుల స్వరూపమని యర్థం. ఈశ్వరుని మెడలో నాగుపాము ఆభరణము. మనం పీల్చివదలు ఉచ్ఛ్వాసనిశ్వాసము లనెడి ప్రాణము కత్త్వంలో నాగుపాము అనబడును. ఉచ్ఛ్వాస నిశ్వాసములను సగు ణంగ యామం చేస్తే యోగ మనబడును. ఈ యోగమే నాగుపాము ానబడును. ఈశ్వరుడు సదా యోగం చేస్తుంటాడని నాగాభరణా అర్థం. విష్ణువునకు ఆదిశేషుడు శయనం అనగా విష్ణువు సదా యోగ

నిద్రలో యుంటాడని అర్థం. ఈ విధంగ చెప్పుకొనిపోతే అంతే వుండదు.

దేవుడు సృష్టించిన మానవుడు దేవుని కృపచే మనుగడ సాగించు మానవుడు సైకిలు, స్కూటరు, కారు, హెలికాప్టరు వగైరా వాహనాలను ఉపయోగించుచున్నాడు. కాని సర్వశక్తి మంతుడు, చరాచర సృష్టికి కారణభూతుడైన దేవునికి పై దెల్పిన వాహనముల నియోగించు టెందులకు ? ఈ వాహనములు ఆయా దేవుళ్ళ ఆధ్యాత్మిక మానసిక ప్రవృత్తులకు దర్పణం. వారివారి నియమిత కార్యములకు సంకేతం. నిజంగ దేవుళ్ళకు వాహనాలతో పనిలేదు. వారు తలచుకొన్న తక్షణమే గమ్యస్థానాలలో యుంటారు. సర్వవ్యాపకులు కావున.

మనకొక దేశం వున్నది. ప్రధానమంత్రి వున్నాడు. ఈ దేశంలో ఎన్నో రాష్ట్రాలున్నవి. ప్రతి రాష్ట్రానికి ఒక ముఖ్యమంత్రి వున్నాడు. ఒక్కొక్క రాష్ట్రానికి ఎన్నెన్నో జిల్లాలున్నవి. జిల్లాకు ఒక కలెక్టరు ఉన్నాడు. ప్రతి జిల్లాకు కొన్ని మండలాలున్నవి. ప్రతి మండలానికి ఒక మండల రెవిన్యూ అధికారి ఉన్నాడు. ప్రధానమంత్రి నుండి మండల రెవిన్యూ అధికారి వరకు వారువారు చేయవలసిన పనులను ఆ పనులను చేయుటకు వలయు అధికారములను నిర్దేశింప బడియున్నవి. ఒకరిపనులను మరియొకరు చేయరు, చేయరాదు. అదేవిధంగ ఒకరి అధికారాలను మరియొకరు ఉపయోగించరాదు, ఉపయోగించరు. మండల రెవిన్యూ అధికారి నుండి ప్రధానమంత్రి వరకు గల వ్యక్తులకు పరిధులు, హద్దులు ఉన్నవి. మండల రెవిన్యూ అధికారిపై కలెక్టరు, కలెక్టరుపై ముఖ్యమంత్రి, ముఖ్యమంత్రిపై ప్రధానమంత్రి అధికారాలు కలిగియుంటారు. కాని అధికారముందని క్రిందివారి పనులను పైవారు చేయరు, చేసినా చెల్లదు. ఉదాహరణకు నాకు పుట్టినతేదీ ధృవపత్రము కావలయును. ఈ ధృవపత్ర

మును మంజూరుచేయు అధికారము మండల రెవిన్యూ అధికారిది. కాని నేను కలెక్టరుకో, ముఖ్యమంత్రికో, ప్రధానమంత్రికో అర్జీ యుంచుకొన్న యెడల ప్రయోజనం వుండదు వీరికి పంపిన అర్జీలను పరిష్కార నిమిత్తం మండలరెవిన్యూ అధికారికే వీరుపంపెదరు.

అదేవిధంగ జీవులు చేయుచున్న పాపపుణ్య కర్మఫలితాలను లెక్కగట్టి ఆయా జీవులచే ఫలితములను అనుభవింప జేయుటకు దేవుడు ఒక వ్యవస్థను కనిపెట్టి ప్రవేశపెట్టినాడు. ఈ వ్యవస్థయే నవగ్రహములు. ఇవి సూర్యుడు, చంద్రుడు, అంగారకుడు, బుధుడు, గురుడు, శుక్రుడు, శని, రాహువు, కేతువు అనునవి. జీవి తల్లి గర్భంలో నున్నప్పుడు గర్భస్థస్త్రీ మనసులో తలచుకొను మంచి చెడులు, కార్యరూపంలో గలుగు కష్టసుఖములు, లాభనష్టములు, సుఖదుఖములు, గుణగణములు, అదృష్టము, ఆయుష్షు మున్నగు వాటిని గ్రహించి గర్భస్థ శిశువుకు లలాట లిఖితంగ, నొసటి వ్రాతగ, బ్రహ్మవ్రాతగ ఏర్పరచునవి ఈ తొమ్మిది గ్రహములే. శిశు జననానంతరం ఈ నొసటివ్రాత ఫలితాలను శిశువుకు అందజేసి అనుభవింప జేయునవి ఈ నవగ్రహములే.

ఈ నవగ్రహములు జీవులుచేయు పాపపుణ్య కర్మలను ఎప్పటి కప్పుడు గ్రహించి ప్రారబ్ధము, సంచితము, ఆగామి అను మూడు విధములుగ భాగించి కంప్యూటరైజ్ చేసి యుంచును. కంప్యూటరైజు చేసిన పాపపుణ్యముల రిజల్టుషీటు ప్రకారం మరుజన్మకు పునాదుల నేర్పరచును. పుణ్యములు ఎక్కువైన యెడల మనుష్య జాతిలో చాతుర్వర్ణములలో ఉత్తమ జాతులలో జనింప జేయును. పాపములు ఎక్కువైన యెడల అండజములు, యోనిజములు, ఉద్భిజములలో జనింపజేయును. జననానంతరం నవగ్రహములు జీవికి ప్రారబ్దం అను కర్మానుసారం నిజజీవితంలో ఫలితముల నిచ్చును. ఈ విధానం ఆధారంగానే జ్యోతిష శాస్త్రము ఏర్పడినది.

పై తొమ్మిది గ్రహములు మేషరాశిలో కలిస్తే సృష్టి లయమౌతుంది. ఇవి విడిపోయి రాసులలో సంచరిస్తే సృష్టి కార్యం నడుస్తుంది. సూర్యోదయం కాలాన్ని నడిపిస్తుంది. సూర్యునితో సహా మిగిలిన గ్రహాలు జీవరాసుల పంచభూతముల భవిష్యత్తును నడిపిస్తాయి. త్రిమూర్తులాదిగాగల దేవుళ్ళుకూడ ఈ గ్రహ సంచార ఫలితాలకు లోబడే తమతమ కార్యాలను నిర్వర్తించెదరు. రామ రావణ యుద్ధమును ప్రారంభించుటకు గాను అవతార పురుషుడగు శ్రీరాముడు జ్యోతిష శాస్త్రమును ఆశ్రయించి యుద్ధప్రారంభ లగ్నమును నిర్ణయించుకొని ఆ లగ్నములో యుద్ధమును ప్రారంభించెను. అదేవిధంగ మహాభారత యుద్ధమును ప్రారంభించుటకు దుర్యోధనుడు సహదేవుని వద్ద లగ్నమును నిర్ణయించుకొని ఆ లగ్నములో యుద్ధమును ప్రారంభించెను. విష్ణుమూర్తి అవతారమైన శ్రీకృష్ణుడు బలరామునితో గ్రహస్థితి బాగా లేనందున యాదవుల వినాశనం త్వరలో జరుగగలదని నుడివినాడు. గ్రహగతులు తప్పినవని, యాదవులకు శ్రీకృష్ణునికి కీడు జరుగగలదని ధర్మరాజు అర్జునునితో చెప్పినాడు. పై ఉదాహరణలవలన తెలియున దేమనగా దేవుళ్ళు, అవతార పురుషులు, అవధూతలు అందరూ తాము చేసిన చేసికొన్న పుణ్యపాపముల ఫలితానుసారం గ్రహస్థితికి లోబడి ప్రారబ్ధాన్ని అనుభవిస్తూ జీవనం సాగింతురనియు, వీరందరూ గ్రహముల శక్తుల యొద్ద నిమిత్త మాత్రులనియు తేటతెల్లమగు చున్నది.

ఇక వినాయకుడు స్థిరత్వాన్ని, భూస్థితిని, సంపదలను, పంటలను, ఇల్లువాకిలిని కలుగజేయును. బ్రహ్మ శుక్ల శోణితముల రూపంలో స్థూలశరీరము నిచ్చును. విష్ణువు జఠరాగ్ని రూపంలో జీవికి ఆకలిని కలిగించి, ఆకలి తట్టుకొనుటకు కోరిక, కోరికతీర్చుకొనుటకు క్రోధం లోభం మోహం మదం మాత్సర్యములను కలిగిం

27

చును. వీటిద్వారా జీవి జీవించుటకు తాపత్రయ పడును. తాను శాశ్వతుడను అనుకొని చేయరాని పనులను జీవిచేయును. ఉచ్ఛ్వాస నిశ్వాసములకు ఆధారభూతుడును, జీవి ఆయుః ప్రమాణమును నైన రుద్రుడు ఆయువు నిర్ణీత కాలము దాపురించినపుడు ఉచ్ఛ్వాస నిశ్వాస ముల నిలిపివేసి శరీరమునుండి వెడలిపోవును ఉచ్ఛ్వాస నిశ్వాసములకు ప్రాణమని పేరు. ప్రాణము శరీరము నుండి వెడలిపోగానే ప్రాణము పోయినది అంటాము. అనగా జీవుడు మరణించినాడని యర్థము. సదాశివుడు శరీరమున కధిపతియై జీవుడుగ వ్యవహరించును. ప్రాపంచిక సుఖదుఃఖములలో మునిగి ఆగామి సంచిత ప్రారబ్ధములకు సాక్షీ భూతమైయుండును. అంతయు తానే తానేయంతయు ననుకొనుచు సుఖదుఃఖములు పొందుచుండును. పుట్టినపుడు తెచ్చేది లేదు, గిట్టి నప్పుడు వెంటతీసికొని పోయేది లేదు, పాపపుణ్య ఫలితములు తప్ప. వినాయకుడు, బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు, సదాశివుడు, తమతమ నియమిత కార్యాలను సక్రమంగ ఆచరించునట్లు ఈశ్వరుడు తనిఖీలు చేయుచుండును. వినాయకుడు మొదలు ఈశ్వరుడు ఆది గాగల కారకులకు పరాశక్తి సాక్షీభూతమై సదా శాంతంగ, నిర్మలంగ, నిర్వికారంగ యుండును. ఈ విధంగ దైవసృష్టి యుండగా నాకు కష్టాలు వచ్చినాయి. ఆ దేవుడు కనికరించలేదు, వేనవేలు మొక్కుబడులు తీర్చినాను, లెక్కకు మిక్కుటంగ తీర్థయాత్రలు సలిపినాను, దానధర్మాలు చేసినాను, దైవకృప కలుగలేదని వాపోవుట అవివేకము మూఢత్వము.

ప్రతి గుడిలోను ఈశాన్య దిశగా నవగ్రహముల గుడి యుంటుంది. ఏ దేవుణ్ణి దర్శించినను నవగ్రహముల దర్శనం లేకుండ బయట పోరాదు, ఈ గ్రహాలు మనకు ఇచ్చేది ఏమీ లేదు. కాని పాప ఫలితాలను తగ్గించుటకు గాను వీరికి మనం మొక్కుచుంటాము.

ఉత్తమ జన్మలు కావాలంటే పాపకార్యాలు చేయరాదు. పాపకార్యాలు చేయకుండ మనుగడ సాగించవచ్చును, మనస్సును

నిబ్బరం వుంటే ఇది సుసాధ్యం. పుణ్యకార్యములు చేయుటకు ప్రతి జీవికీ రోజూ ఎన్నెన్నో అవకాశా లుంటాయి. ఈ అవకాశాలను జారవిడుచుకోకుండ మంచిపని అని తోచిన తక్షణమే ఆచరించి ఆ అవకాశాన్ని వినియోగించుకోవాలి. పాపకార్యాలు చేయునపుడు అవి ఆచరణ అవశ్యమైనపుడు శాంతం ఓరిమి వహించి ఊరకుంటే అదీ పుణ్యకార్యమే అవుతుంది. పుణ్యఫలము గాని పాపఫలము గాని అనుభవించ వలసినదే గాని తప్పించుకొనుటకు వీలులేదు. ద్రౌపది తన పూర్వజన్మలో నీటిలో దిగంబరమైయున్న మునికి తన వస్త్రాన్ని చింపి యిచ్చి ఆ ముని నీటి నుండి బయటకు వచ్చుటకు తోడ్పడుతుంది. ఈ పుణ్యకార్యమే ద్రౌపది సభలో కాపాడు తుంది. అనంతమైన చీరలతో భగవానుడు ద్రౌపదీ మానసంరక్షణ చేస్తాడు. ఇక శ్రీరాముడు చెట్టు మరుగున నుండి వాలిని సంహ రిస్తాడు. మరు జన్మలో శ్రీకృష్ణుడుగ అదే శ్రీరాముడు ఒక బోయ వాని చేతిలో చెట్టు మరుగునుండి సంధింపబడిన బాణంతో సంహ రింప బడతాడు. కావున పుణ్యఫలం గాని పాపఫలంగాని ప్రతి ఒక్కరూ భగవంతునితో సహా అనుభవించవలసినదే యని తెలియు చున్నది. ఇదియే కర్మ సిద్ధాంతము.

కావుననే ఋషులు పుణ్యము గాని పాపము గాని చేయకుండ యుండు ప్రక్రియను కనుగొన్నారు. ఆ ప్రక్రియయే యోగాభ్యాస ముతో కూడిన ప్రాణాయామము. ప్రాణాయామ మనగా ఉచ్ఛ్వాస నిశ్వాసముల నిలుపుట. దీనివలన ఆకలిదప్పులు కోరికలుండవు. మనస్సు నశించును. కోరికలు లేనపుడు కార్యము వుండదు. కార్యము లేనప్పుడు ఫలము వుండదు. ఫలము లేనపుడు సుఖముగాని దుఃఖము గాని యుండదు. ఈ స్థితియే మోక్ష మనబడును. దేవునకు కోరికలు లేవు, సుఖదుఃఖాలు లేవు. కావున దేవుని స్థితిని ఋషి పొందును. ఇదియే తత్త్వము, దైవ సాక్షాత్కారము, సమాధి యనబడును

ఒక విషయం జ్ఞాపకం ఉండాలంటే ఆ జ్ఞాపకం చేసుకొనే

వాడు దానిని అనుభవించేవాడు ఒకడే అయివుండాలి. అప్పుడే తన అనుభవాలను జ్ఞాపకం చేసుకోగలుగుతాడు. అట్లు కాకపోతే జ్ఞప్తి అనేది అసంభవం కావున జాగ్రత్స్వప్న సుషుప్త అవస్థలు మూడింటి లోను వుండే అనుభవాలను జ్ఞాపకం చేసుకోగలుగుచున్నాము. అంటే ఈ మూడవస్థలనూ అనుభవిస్తూ వాటికి సాక్షిగా ఉన్నవాడు ఒకడు ఉన్నాడని తెలియుచున్నది. ఆ సాక్షి ఈ మూడవస్థలలోను వుండి అనుభవించి వాటిని తెలిసికొంటున్నవాడే అయినప్పటికీ అతడు ఈ మూడవస్థలకూ అతీతంగానేయున్నాడు. ఆ అతీత తత్త్వమే పరంబ్రహ్మం, తురీయము, సత్ చిత్ ఆనందము, నిత్యసత్యము, నిర్గుణము నిరాకారము మనభావములో భావనలలో దేవుడు.

పై మూడవస్థలలో జాగ్రదావస్థ బ్రహ్మమనియు, స్వప్నావస్థ విష్ణువనియు, సుషుప్తము ఈశ్వరుడనియు, సాక్షి చైతన్యము పరం బ్రహ్మమనియు చెప్పబడును.

మనం మౌనంలో గాని ధ్యానంలో గాని కూర్చొన్నప్పుడు ఆలోచనలు వస్తుంటాయి పోతుంటాయి. వచ్చిన ఆలోచనలు బ్రహ్మమనియు, ఆలోచనలతో కూడియుండుట విష్ణువనియు, వెళ్ళి పోవు ఆలోచనలను వెంబడించుట ఈశ్వరుడనియు, ఆలోచనలు లేని స్థితి పరంబ్రహ్మ మనియు తెలియవలెను.

ఓంకారంలో మూడు భాగాలున్నాయి. మొదటిది కేవలం శబ్దం. అనగా నోటితో ఉచ్చరించు కేవల మంత్రం. రెండవది ఆ అక్షరం మొదటి అర్థం. మూడవది ఓంకార నాదాన్ని మన జీవస్రవంతి గుండా ప్రవహింపజేసి మన ప్రతిక్రియలోను దానిని ఇమిడ్చి దానిని మన స్వరూపస్వభావంగ తీర్చిదిద్దు కోవడం. ఈ ఓంకారం అద్వైతపరమాత్మయైన ఆత్మస్వరూపం. జాగ్రత్ స్వప్న సుషుప్తి తురీయములనెడు నాలుగు అవస్థలలోను ఈ ఆత్మను తెలుసు కోవచ్చును. ఓంకారంలోనున్న అ ఉ. మ్ అనే మూడక్షరాలు

జాగ్రత్ స్వప్న సుషుప్త్యావస్థలకు ప్రతినిధులుగా నున్నాయి ఈ మూడక్షరముల తర్వాత వుండి అక్షరాన్ని ఆవరించివున్న నిశ్శబ్దం నాలుగవది యగు తురీయా వస్థయగు పరంబ్రహ్మం.

మరియు అ - జాగ్రదవస్థ, ఉ - స్వప్నావస్థ, మ - సుషుప్త్యావస్థ. రెండు సార్లు ఓంకారాన్ని ఉచ్చరిస్తే ఆ రెండు ఉచ్ఛారణల మధ్య ఒక నిశ్శబ్దం తప్పని సరిగా ఉంటుంది. ఈ నిశ్శబ్దమే నాలుగవది యైన తురీయావస్థ యగు పరంబ్రహ్మం.

మనం పూరించు శ్వాస బ్రహ్మ, కుంభించు శ్వాస విష్ణువు, రేచించు శ్వాస ఈశ్వరుడు, మరల పూరించుటకు ప్రయత్నించి నపుడు దీనికి పూర్వము గల రేచకము, పూరకముల మధ్య గల నిశ్శబ్దము పరంబ్రహ్మం.

వాయు పూరకము సృష్టి, వాయు కుంభకము స్థితి, వాయు రేచకము లయము. నిశ్శ్వాసము తురీయము.

అ కారము బ్రహ్మ, ఉ కారము విష్ణువు-మ కారము ఈశ్వరుడు, అరసున్న పరంబ్రహ్మం.

అనగా శూన్యకావస్థ తురీయావస్థ పరంబ్రహ్మం అనే నిశ్చల తత్త్వం నిర్వికారం నిర్గుణం నుండి బ్రహ్మ విష్ణు మహేశ్వరులు ఉద్భవించి సృష్టిస్థితిలయ కార్యాలను చేయుచున్నారనియు, సత్ చిత్ ఆనంద స్వరూపమగు పరంబ్రహ్మమే దేవుడని వ్యక్తమగు చున్నది.

కావుననే వశిష్ఠుడు, విశ్వామిత్రుడు ఆదిగాగల వారు తమ తపోబలంతో త్రిమూర్తులను ప్రత్యక్షం గావించుకొనిరి. వారి లోకాలైన సత్యలోకం వైకుంఠం కైలాసాలకు పోగలిగిరి. తురీయా వస్థయగు పరంబ్రహ్మం త్రిమూర్తులవలె ప్రత్యక్షంకాదు. ఎందు కనగా ఇది జ్ఞానంతో తెలిసికోగలిగినది మాత్రం. కావుననే ఈ

స్థితిని పొందుటకు యోగులు తపస్సును ఆచరించి ముక్తులయ్యేది, ఆ పరంబ్రహ్మం నందు ఐక్యమయ్యేది.

దేనిని పొందిన మరల పొందదగినది ఏది ఉండదో, దేనిని చూచిన మరల చూడదగినది ఏది ఉండదో, దేనిని పొందిన మరల ప్రపంచమున జనన ముండదో అదియే పరంబ్రహ్మం. ఏది పరిపూర్ణమైన సత్తు చిత్తు ఆనందమో, ఏది అద్వితీయమో ఆద్యంత రహితమో శాశ్వతమో, ఏది అన్ని దిక్కులకు పైన క్రింద వీటి మధ్య ఏది వ్యాపించి యున్నదో అదియే పరంబ్రహ్మం. ఏది విభజింప సాధ్యము కాదో, ఏది అన్ని దృశ్యవిషయములను నిరసించుట వలన గోచరమగుచున్నదో, పాలయందు వెన్నవలె ఏది సర్వాంతర్యామియై సకలమును వ్యాపించి యున్నదో అదియే పరంబ్రహ్మం.

కావుననే పరంబ్రహ్మం స్థూలము కాదు, సూక్ష్మము కాదు, పొడవు కాదు, పొట్టి కాదు. కావున పరంబ్రహ్మం నామరూపగుణ వర్ణరహితము, నిత్యసత్యము, నిత్యానందము, ఏసుక్రీస్తు చెప్పిన స్వర్గరాజ్యం, బుద్ధుడు చెప్పిన ఆధ్యాత్మికం, కృష్ణుడు బోధించిన భగవద్గీత, వేదములు వక్కాణించిన జ్ఞానం అన్నియూ ఈ పరంబ్రహ్మమే.

జ్ఞానులు ఈ పరంబ్రహ్మమును దిగంబరుడు అని కూడ అంటారు. దిగంబరుడు అనగా వస్త్రములు లేనివాడు. పరంబ్రహ్మం నిరాకారం కాబట్టి వస్త్రములతో పనిలేదు. అనగా బయలు అని అర్థం. దీనికి మరియొక అర్థం కూడ ఉన్నది, అది దిక్కులను వస్త్రములుగా గలవాడు అని అర్థం. దిక్కులు పది. అనగా నిరాకారత్వము, బ్రహ్మాండము అని అర్థం.

ఈ నిరాకార స్థితియగు పరంబ్రహ్మం నుండి శబ్దము పుట్టును. ఈ శబ్దమే సృష్టికి నాంది. ఈ శబ్దమే ఓంకారము. అనగా త్రిగుణ

ముల స్వరూపము, త్రిగుణముల నుండి పంచభూతములు, పంచ భూతములనుండి జీవ తత్త్వాలు ఉద్భవిస్తాయి. పరంబ్రహ్మం ఓంకార మును పొందినపుడు సృష్టి ఆరంభమౌతుంది అని అనుకొన్నాము గదా. అది ఎట్లనగా శీకాయ పొడి, మిరప పొడి వగైరాలను పది ఇరవై రోజులుంచితే అందులో సూక్ష్మక్రిములు చేరుతాయనే విషయం అందరూ ఎఱిగినదే. కొన్ని రోజులకు ఈ పొళ్ళు చెడి పోతాయి. వీటిలో సూక్ష్మక్రిములు ఏ విధంగ ప్రవేశిస్తాయి. ఏ విధంగ ఆ వస్తువుల ఘాటు కారం తత్త్వములకు తట్టుకో గలుగు తాయి అని అందరికీ సందేహం ఆశ్చర్యం కలుగుతాయి. మనం పుట్టినాము. మనకు తెలియకుండానే పెరిగి పెద్దవాళ్లైనాం. ఏ విధంగ పెరిగినాం? ఏ ప్రయత్నము చేయలేదే? మన విజ్ఞానులు పిలిచే ఎలక్ట్రానిక్స్ ప్రోటీన్స్, అనబడే సూక్ష్మతత్త్వము ఈ కార్యాన్ని తనంత తానుగ చేస్తుంది. పరంబ్రహ్మం పరమాణువు అనగా దేనినైతే ఖండించి భాగము చేయలేమో అంత సూక్ష్మమైనది. కంటికి కనబడదు కాని ఉన్నది. ఈ పరంబ్రహ్మం సృష్టికార్యాన్ని సూక్ష్మరూపంగ నడిపిస్తుంది. సృష్టికార్యం నిర్వికారంగ నడుస్తుం దనే దానికి ఇదియే నిదర్శనం. పరంబ్రహ్మం నిర్వికారమైనందున చేతనారహితంగ యుంటుంది. కావున దీనికి స్త్రీ తత్త్వము ఆపా దింపబడింది. ఓంకారము క్రియాశక్తి గలది. కావున త్రిగుణాలు, త్రిమూర్తులు కలిగినవి. అందు వలననే ఓంకారమునకు పురుష తత్త్వము ఆపాదింపబడింది.

దేవుని సహాయం పొందుటకు భక్తి, శరణాగతి రెండవ పద్ధతి. మనస్సు, వాక్కు, కార్యములు త్రికరణములనబడును. ఈ మూడింటిని ఏకమార్గంలో నడిపించి న్యాయం, సత్యం, ధర్మం అను వాటిని త్రికరణశుద్ధితో సదా అనుసరిస్తూ ఏ పరిస్థితులలోను ఈ మూడింటి విషయంలో రాజీపడకుండ యున్నపుడు శరణాగతి వలన

దైవం తనను ఆపదలలో ఆదుకొంటుంది. ఉదాహరణకు కౌరు సభలో ద్రౌపది పెనుగులాడి శక్తిహీనురాలై శరణాగతి వేడింది. తక్షణం దేవుడు ఆదుకొన్నాడు. రుక్మిణీదేవి శరణాగతితో శ్రీకృష్ణుని పరిణయ మాడింది. ప్రహ్లాదుడు శరణాగతితో విజయంసాధించాడు. గజేంద్రుడు శరణాగతితో రక్షింపబడినాడు. సీతాదేవి త్రికరణాలతో పతి శ్రీరామునే స్మరిస్తుంది; ఆ స్మరణే (శరణాగతి) ఆమెకు జయం చేకూరుస్తుంది. హనుమంతుడు సీతాన్వేషణ చేయునపుడు రావణుని మందిరంలో రతిక్రీడల దేలి సొమ్మసిల్లిన అంగనలను, విగతవస్త్ర స్త్రీలను సీతయున్నదా అని తరచి తరచి చూస్తాడు. కాని అతనికి కామేచ్ఛ ఏమాత్రం కలుగదు. తను వచ్చిన కార్యం సాధించుటే అతని లక్ష్యం. త్రికరణాలు శుద్ధిగా యున్నందున సఫలీకృతుడైనాడు. కావున దైవాన్ని పొందాలి అనే ఏకైక ధ్యాసతో త్రికరణశుద్ధిగ శరణాగతి వేడితే తప్పక దైవసాయాన్ని, దైవాన్ని, మోక్షాన్ని పొందుట సుసాధ్యం.

నా భార్య ప్రసూతిగృహంలో రెండవ కుమార్తెకు జన్మ నిచ్చింది. బిడ్డకు ఎడమకాలు ముందుభాగానికి వంగి వ్రేలాడుచున్నది. ఆ సమయంలో నా పెద్దచెల్లెలు పెండ్లి. వివాహకార్య నిర్వహణలో నాకు ఒక నిమిషం కూడ తీరిక లేదు. ప్రసూతి గృహమునకు పోయి తల్లీబిడ్డలను చూచుటకు నాకు తీరిక లేదు. ఏడుకొండల వాడైన శ్రీవేంకటేశ్వరుని తలచుకున్నాను. నేను లేకపోతే వివాహ ఏర్పాట్లలో లోటువస్తుంది. ప్రసూతి గృహమునకు పోలేను, పోయినను నేను చేసేది ఏమిలేదు. కావున బిడ్డను రక్షించి యథావిధిగ నుండునట్లు చేయు భారము నీవే వహించవలెనని శరణాగతి వేడినాను. మనసులోనే వేడుకొన్నాను. చెల్లెలు వివాహమైన రెండవరోజు ప్రసూతి గృహానికి పోయినాను. బిడ్డకు ఎడమకాలు మోకాలివద్ద ముందువైపునకు వ్రేలాడుచుండినది. నాకు నవ్వువచ్చింది. ఏ పాపాలు చేసినానో దేవుడు ఈ విధంగ శిక్షిస్తున్నాడను కొన్నాను.

తల్లీబిడ్డలను ప్రసూతిగృహం నుండి ఇంటికి తీసికొని బయలుదేరి నాను వైద్యులు నాతో బిడ్డను ఈ వైద్యశాలకో ఆ వైద్యశాలకో తీసికొనిపోయి చికిత్స చేయిస్తే నయమవుతుందని సలహాలు నిచ్చిరి. నా భార్య నాతో తాను గర్భిణీగా నున్నప్పుడు వైద్యంచేసిన వైద్యుని సంప్రదించితే మంచిదికదా యని నాకొక సలహానిచ్చింది. ఎందులకు కాదనవలె ? ఏ పుట్టలో ఏ పామున్నదో ! ఆ వైద్యుని వద్దకు పోయినాము. అతను బిడ్డకాలును నిటారుగ పెట్టి వంచినాడు. ఎముక విరిగినట్లు శబ్దంవచ్చింది. బిడ్డ అరచింది. కాని ఎముక విరగలేదు. మోకాలివద్ద తొలగియున్న ఎముక తనయథాస్థానంలో కూర్చుంది. కాలు బాగైంది. దేవుడు కనబడలేదు గాని తాను చేయవలసిన పనిని తానుచేసినాడు. ఇది ఎందువల్ల జరిగినది ? నేను త్రికరణశుద్ధిగ శరణు వేడినందున.

నేను పనిచేసే కార్యాలయంలో ఒక జవానువున్నాడు. సదా దేవుని స్మరిస్తూ వుంటాడు. అదీ కడుభక్తితో. చాలీచాలని జీతం. సంసారాన్ని నెట్టుకు రావాలి. కాబట్టి తప్పులు చేస్తుంటాడు. కాని దైవభక్తిలో తనకు తానేసాటి. అది అతనిసొంతం. అతనికొక పూరిల్లున్నది. ఆ పూరిల్లు కానుకొని ఒకపెద్ద చింత చెట్టున్నది. ఆ చెట్టు కిరువైపులా డాబాఇండ్లు, మూడవ వైపు పూరిల్లు, నాలుగవవైపు వీధి. చెట్టు చాలావయసైనది. తొర్రలు పడి పడిపోవుటకు సిద్ధముగా నున్నది పూరిల్లువైపు వ్రాలియున్నది. పెనుగాలులు వీచునపుడు చెట్టుబాగా ఊగుతుంది. ఏ వైపున పడు తుందో అని అందరికి అనుమానం. చెట్టు పూరిల్లువైపు వ్రా యున్నందున పూరిల్లుపైనే బడుతుందని అందరికీ అనిపిస్తుంది జవానుకు దిగులు మరీను. ఒకనాడీ చెట్టు పగటిపూట పెనుగాలికి నలువైపులా ఊగి వీధిపై బడింది. ఎవరికీ ఏలాటి నష్టం కష్టం కలుగ లేదు. అసలు పూరిల్లుపైనే పడవలసిన చెట్టు వీధిలోపడిందంటే ఎవరూ నమ్మరు. జవాను ఆనందానికి అవధులులేదు.

నా స్నేహితుడు న్యాయవాదిగా నున్నాడు. ఒకనాడీతను తన ముదుసలి తలిదండ్రులతో దూరప్రయాణ నిమిత్తం రైలు టిక్కెట్లు రిజర్వు చేయించుకొన్నాడు. ముగ్గురు రిక్షాలో రైల్వే స్టేషనుకు ఆలస్యంగ బయలుదేరినారు రిక్షా వస్తున్నది. మధ్యలో గల రైల్వేగేటు మూయబడియున్నది. రిక్షా ఆగింది. రైలు పోతున్నది. వీరికి ఆందోళన కలిగింది. రైలు వెళ్ళిపోతున్నది ప్రయాణం నిలిచిపోతుందని అనుకొనుచుండిరి. వీరు ముగ్గురూ శ్రీ పుట్టపర్తి సత్యసాయి బాబాగారి భక్తులు. శ్రీ సాయిబాబాను శరణువేడిరి. రైలు తనంతటదే ఆగింది. ఆదరాబాదరాగా ఈ ముగ్గురూ రిక్షాదిగి సామాన్లతో ఎదురుగానున్న రైలుబోగి నెక్కినారు. ఆ బోగీలో ఒక గడ్డం ఉన్న ముసలాయన వీరి సామాన్లను అందుకొని, ముసలివారికి చేయూతనిచ్చి బోగీలోపల చేర్చినాడు. వెంటనే రైలు కదిలింది. ఈ ముగ్గురూ కూర్చొని ఆ బోగీ నెంబరును విచారించిరి. ఏ బోగీని ఎక్కవలెనో ఆ బోగీనే వీరు ఎక్కినారు. ఆశ్చర్యంకద! వీరు తమ రిజర్వుస్థానాలలో కూర్చొనిరి. వెంటనే తమ సామాన్లు అందుకొని, చేయూతనిచ్చిన ఆ గడ్డం ముసలాయనకు కృతజ్ఞతలు తెల్పుదామని ఆ బోగీలో వెదికినారు. ఆయన కనబడలేదు. తోటి ప్రయాణీకులను విచారించినారు. అటువంటి ఆయనను వారు చూడలేదని ప్రత్యుత్తరమిచ్చినారు. ఇది అన్నిటి కన్న వింతగొలుపు ఆశ్చర్యకర సంఘటన. ఎందులకీ విధంగ జరిగింది? ఈ ముగ్గురూ పుట్టపర్తి శ్రీ సత్యసాయీగారిని శరణు వేడినారు. శ్రీ బాబాగారే గడ్డం ముసలాయన రూపంలో రైలును ఆపి, వీరిని రైలు ఎక్కించినారు. పని అయింది కాబట్టి అదృశ్యులైనారు. శరణాగతి వలన ఈ ముగ్గురికీ కార్యసానుకూలత అసాధారణంగ అనుకూలించింది. ఇది ఇప్పటి సంఘటనే అయి సంభ్రమాశ్చర్యాలు కలిగించుచున్నది కద! దీనికి కారణం శరణాగతి. ఆపదలనుండి

ప్రవేశించదు. శరీరంలోగల ఇడ, పింగళ, బ్రహ్మరంధ్రములలో ఏదోయొక మార్గముగుండ ఈ అంతిమశ్వాస దేహమునుండి వెడలును, జీవుడు తాజేసిన ప్రారబ్ధసంచిత ఆగామి కర్మఫలితముల హెచ్చుతగ్గుల ననుసరించి ఈ అంతిమ శ్వాస జరుగును. మానవ దేహము నవద్వారములు కలిగియున్నది. ఇదిగాక బ్రహ్మరంధ్రము ద్వారా అంతిమ శ్వాసను వదలినవారు తేజోమండలంలో నక్షత్రములుగ జన్మింతురు. పై మార్గాలలో అంతిమ శ్వాసను వెడలనీయకుండ బ్రహ్మరంధ్రము ద్వారా వెడలనంపిన యెడల కోటి సూర్యులకాంతితో నక్షత్రమై తేజోమండలంలో జన్మించును. అనంతకోటి వెలుగులో తానున్నా ఒక వెలుగై నక్షత్రంగ జీవించి పుణ్యఫలము ననుభవించి పుణ్యఫలము తరిగిపోగా వెలుగుపోగొట్టుకొని అధోలోకాలకు దిగుతూ అంత్యమగును. మరల జన్మ ఉండదు.

పూర్వపు ఋషులు మునీశ్వరులు అవధూతలు పుణ్యపురుషులు అనబడేవారు ప్రాణాయామ యోగాభ్యాసములవలన ఉచ్ఛ్వాస నిశ్వాసములను తమ అధీనములో నుంచుకొని తమ కిష్టమైనపుడు బ్రహ్మరంధ్రము ద్వారా శ్వాసను వదలి నక్షత్రరూపాలలో తేజోమండలంలో విహరించుచున్నారు. అశ్విని భరణి యాదిగాగల ఇరువదియేడు నక్షత్రములు, సప్తర్షిమండలం, ధ్రువనక్షత్రం ఆదిగాగల కోటానుకోట్ల నక్షత్రములు ఈవిధంగ ఏర్పడినవే. తేజోమండలంలో నక్షత్రము లెన్నియున్నవో మన విజ్ఞానానికి లెక్కకట్టుటకు వీలులేకున్నది. అనగా మన పూర్వీకులు పావనమూర్తులు ప్రాణాయామ యోగాభ్యాసములు చేసి తమజన్మలను తరించుకొని తేజోమండలంలో నక్షత్రములుగ నున్నారని అర్థం.

సృష్టిలో సూర్యుడు ప్రముఖపాత్ర వహిస్తున్నాడు. సూర్యుడు తన గతిని ఉత్తరాయణం దక్షిణాయనం అని నడుపుతాడు. దక్షిణాదిశ యమునకు, నరకమునకు స్థానములు. ఉత్తరదిశ ఈశ్వరునికి,

కైలాసానికి స్థానములు. పాపం చేసినవారు దక్షిణదిశగా నుండు యమపురియగు నరకానికి, పుణ్యం చేసినవారు ఉత్తరదిశగా నుండు ఈశ్వరుని లోకమగు కైలాసానికి పోతారు. జనవరినెల పదునైదవ తేదీన ఉత్తరాయణం పుట్టి జూలై నెల పదునాలుగవ తేదినాడు అంతమౌతుంది, అదేవిధంగ జూలై నెల పదునైదవ తేదీ నుండి జనవరినెల పదునాలుగవ తేదీ వరకు దక్షిణాయనం ఉంటుంది. ఉత్తిరాయణంలో మరణించినవారు పుణ్యలోకాలకు పోతారు. దక్షిణాయనంలో మరణించినవారు నరకలోకాలకు పోతారు. ఇవి నేను చెప్పునది కాదు మన సద్గ్రంథాలు చెప్పుచున్నవి.

మహాభారత యుద్ధం అక్టోబరునెల ఏడవ తేదీన ఆరంభమై అదే అక్టోబరు నెల ఇరువదినాలుగవ తేదీనాడు ముగుస్తుంది. పది రోజులు విరామం లేకుండ తన బలపరాక్రమాలను ఒడ్డి అక్టోబరు నెల పదహారవ తేదీనాడు భీష్ముడు ఒరిగిపోతాడు. ఆ కాలం దక్షిణాయనం కనుక ఉత్తరాయణం వరకు నిరీక్షించి ప్రాణాలు వదులుతానని భీష్ముడు అంపశయ్యపై యుంటాడు మూడు మాసముల తర్వాత జనవరి నెల పదునైదవ తేదీ నాడు ఉత్తరాయణం పుడుతుంది. ఆ ఉత్తరాయణ ప్రారంభం నాడు పగలు పది గంటలకు భీష్ముడు తన అంతిమ శ్వాసను వదులుతాడు. ఇది పూర్వ కాలపు ఉదాహరణ. ప్రస్తుత ఉదాహరణ. భారత దేశపు మాజీ ప్రధానమంత్రి శ్రీ గుల్జారీలాల్ నందా గారు 15—1—1998 నాడు తన అంతిమ శ్వాసను వదలినారు. అదేవిధంగ ఆంధ్రప్రదేశ్ మాజీ ముఖ్యమంత్రి శ్రీ యన్. టి. రామారావు గారు 18—1—1996 నాడు తన అంతిమ శ్వాసను వదలినారు. వీరిరువురూ తప్పక భీష్మాచార్యుల వారివలె పుణ్యలోకాలకు పోయియుంటారు. అక్కడ సుఖిస్తుంటారు.

అదేవిధంగ మా అన్నమామగారు కుగ్రామ నివాసిగ్రామంలో చుట్టుప్రక్కల గ్రామాదులలో అయనకు మంచివాడు, సౌమ్యుడు, ఉత్తముడు అని పేరున్నది. ఆయన రోజూ యోగాప్రాణాయామములు

చేస్తాడు. దేవుని ఉత్సవాలకు, దేవుని కార్యాలకు ముందుంటాడు. 15—1—1998 నాడు గ్రామంలో గ్రామ దేవత ఉత్సవం జరుప వలసియున్నది. ఈయన అనారోగ్యంతో పడక వేసినాడు. ఉదయం గ్రామపెద్దలు ఈయనను కలిసి ఉత్సవానికి చేయవలసిన ఏర్పాట్లు గురించి సంప్రదించిరి. అందులకీయన ఉత్సవం ఎక్కడ చేసెదరు. సాయంత్రం 5-30 గంటలకు నా ఉత్సవాన్ని చేయవలసియుంటుంది అని అన్నారు. ఊరిపెద్దలు ఏమీ పట్టించుకోకుండ వెళ్ళిపోయి, సాయంత్రం అమ్మవారి ఉత్సవఏర్పాట్లలో నిమగ్నమై యుండిరి. సాయంత్రం 5-30 గంటలకు ఈయన తుదిశ్వాసను వదలినాడు. అందరూ ఆశ్చర్యపోయిరి. ఉదయం ఆయన చెప్పనే చెప్పినాడు. దేవుని కార్యం ఏమి చేయగలరు, నా కార్యాన్ని చేయవలసియుండగా అని, ఈయన మాటలను పట్టించుకోక పోతిమే అని అందరూ ఆశ్చర్య పడేవారే.

మా తల్లిగారు ఒకవారం అనారోగ్యంతో యున్నారు. 24—1—1998 నాడు నేను ఇక ఐదురోజులలో వెళ్ళిపోతాను, బిడ్డలందరూ నావద్దేయుండండి అని అన్నారు, మేము నమ్మలేదు. 29—1—1998 నాడు ఈ రోజు నాకు ఆఖరిరోజు, పెద్దకుమార్తె రాలేదుకద, వెంటనే పిలిపిచ్చండి అని అన్నారు. 30—1—1998 నాడు మధ్యాహ్నం 3-30 గంటలకు తుదిశ్వాసను వదలినారు.

పై ఇరువురు తమ మరణాన్ని ముందుగానే తెలిసికొన్న మహిమాన్వితులు, పూజనీయులు, పుణ్యజీవులు.

జీవులు చేయు పుణ్యపాప కర్మలు నవగ్రహాలచే కంప్యూటర్ చేయబడి మరుజన్మలో ఆ యా ఫలితాలను అనుభవింప జేస్తాయని ఇదివరలో చెప్పుకొన్నాము గద. తల్లి గర్భలో నున్నప్పుడు తల్లి మనసులో తలచుకొను విషయములు, ఆమె దినచర్యలలో గలుగు సంఘటనలు, ఆ జన్మలోనే గలుగును. అనగా జీవి రెండు విధాలుగ ఫలితముల ననుభవించును. మొదటిది తల్లి గర్భంలో నున్నప్పుడు

నొసటి వ్రాత ప్రకారం. రెండవది పూర్వ జన్మ సుకృతం. తల్లి గర్భంలో నున్నప్పుడు లిఖించబడు నొసటి వ్రాతకు తల్లిదండ్రులు బాధ్యులు. పూర్వజన్మ సుకృతానికి జీవి తానే బాధ్యుడు. సుకృతం మూడు విధములు. ఒక్కొక్క జన్మలలోను చేయుచు వచ్చెడి కర్మ ఫలితములు ఆ యా జన్మలలో తరిగిపోయి యింకను మిగిలినది సంచిత మనబడును. నొసటి వ్రాత ప్రకారం మరియు సంచితము రెండును కలిపి అనుభవించునది ప్రారబ్ధ మనబడును. ఈ జన్మలో చేయు కర్మల ఫలితములు ఆగామి యనబడును. అనగా తన జన్మలకు ఆ యా జన్మలలో కలుగు మేలుకీడులకు జీవుడు తానే కారకుడు కర్త యగుచున్నాడు. అదృష్టము, దురదృష్టము, లింగ భేదము, ఆయుష్య భేదము, జాతి భేదము, మత భేదములకు జీవి తాజేయు పాపపుణ్య కర్మల హెచ్చుతగ్గుల ననుసరించిపొందు చున్నాడు. ఇతరు లెవరూ దీనికి బాధ్యులు కారు.

సంచితమును అనుభవించువారిని మనం నిత్యం చూచు చున్నాము. పూర్వజన్మలలో ఏవేవో జన్మలలో పుణ్యకార్యాలు చేసి మనుష్యజన్మ పొంది పూర్వజన్మ వాసనలను కలిగినవారు మన చుట్టూ అనేకమంది యున్నారు. వారివారి ముఖాకృతిని బట్టి వారు పూర్వజన్మలలో ఏమిగ యుండిరోయనియు, వారి ప్రస్తుత స్వభావ గుణములవలన వారు పూర్వజన్మలో ఏమిగ యుండిరో ఈ క్రింది కొన్ని ఉదాహరణల వలన తెలియుచున్నది.

సింహముఖంవంటి ఆకారంగల ముఖాలు గలవారు పౌరుష సాహసం కలిగి యుంటారు. హుందాగ ప్రవర్తించటం, శాంతము. మంచిబుద్ధి, గౌరవ స్వభావము కలిగియుంటారు. ఏనుగు ముఖం వంటి ఆకారంగల ముఖం కలవారు ఋజుప్రవర్తకులు, చాకచక్యం గలవారు; సూక్ష్మదృష్టి దూరాలోచన, విచక్షణా జ్ఞానం కలవారుగ నుంటారు. నియమిత కార్యాన్ని నిక్కచ్చిగ చేసిపెడతారు. ఎద్దు ముఖంవంటి ఆకారంగల ముఖం కలవారు ఇతరులను లెక్క చేయరు.

చాలా నిర్లక్ష్యంగ నుంటారు. కష్టపడి పనిచేస్తారు. బాధ్యత కలిగి వ్యవహారిస్తారు. వెట్టి చాకిరీలు చేస్తారు ఎనుబోతు ముఖంవంటి ఆకారంగల ముఖం కలవారు నిర్లక్ష్యంగ ప్రవర్తిస్తారు. దేహంపై ధ్యాసలేకుండ అడ్డదిడ్డంగ నడుస్తారు. కష్టంగాని సుఖంగాని తెలియదు. అన్నీ సమానమే. ఇతరులకు ఇబ్బంది కలిగే విధంగ ప్రవర్తిస్తారు. గుఱ్ఱమువంటి ఆకారంగల ముఖంగలవారు ఔదార్యము గర్వము, అహంకారము కలిగి యుంటారు. ఒంటెవంటి ఆకారం గల ముఖం కలవారు ఇతరులను దెప్పిపొడుస్తారు. సానుభూతి సహకారం అసలేవుండదు. క్రూరంగ ప్రవర్తిస్తారు.

ఎలుగుబంటి వంటి ఆకారం గల ముఖం కలవారు అసభ్య ప్రవర్తన, ఇతరులను దూషించుట, ఎవరితోను కలియకుండ ఒంటరిగ నుండుట, మూర్ఖత్వము, కలిగియుంటారు. గొర్రె ముఖం వంటి ఆకారం గల ముఖం గలవారు సాధుత్వము, ఇతరులను అనుసరించే స్వభావము, మంచితనము, పెంకితనము కలిగియుంటారు.

కుక్క ముఖం వంటి ఆకారం గల ముఖం గలవారు సాహసము, ప్రేమ యజమానియందు భక్తికలిగి విశ్వాసంగ ప్రవర్తిస్తారు. పిల్లి ముఖం వంటి ఆకారం గల ముఖం గలవారు ఇచ్ఛకాలు చెప్పేవారుగ నుంటారు. గర్వము, అహంకారము, కలిగివుండి పైకి తేనె కురిపించేటట్లు మాట్లాడుతూ వెనుక గోతులు తీస్తారు. గాడిద ముఖం వంటి ఆకారం గల ముఖం గలవారు సోమరితనం గలిగి, బుద్ధిబలంతో చేసేపనులు ఏమీ సరిగా చేయలేరు. శరీర పరిశ్రమలో కూడ నేర్పుగా ప్రవర్తించలేరు. తిండిపోతులుగాను, దుర్గుణాలు గలవారుగనూ ఉంటారు. పంది ముఖం వంటి ఆకారం గల ముఖం గలవారు నిర్లక్ష్యము, అతిగా తినే అలవాటు, మొరటుతనం, దయాదాక్షిణ్యాలు లేకుండ ప్రవర్తించటం కలిగియుంటారు. తోడేలు ముఖంవంటి ఆకారంగల ముఖం గలవారు కపటము, దగా, మోసము, కుట్రచేసే స్వభావము, తగవులాడే తుంటరితనము,

మొరటు ప్రవర్తన కలిగివుంటారు. గుంటనక్కవంటి ఆకారం గల ముఖంగలవారు ధైర్యము, సామర్థ్యము. గర్వముకలిగి యుంటారు. మంచిచెడ్డలను విమర్శించి తెలుసుకొనే శక్తి, ఇతరులను పొగిడి మెప్పించగల నేర్పుకలిగి వుంటారు. కోతిముఖంవంటి ఆకారంగల ముఖం గలవారు జాగరూకత కలిగియుంటారు. పిరికితనం, మోసగించే స్వభావం, చిన్నచిన్న వస్తువులను దొంగిలించే అలవాటు, త్రాగుడు వ్యభిచారము మొదలుగాగల దుర్గుణాలు కలిగివుండి పొగడ్తలకు లొంగిపోతారు.

రామచిలుకవంటి ఆకారంగల ముఖంగలవారు చిలుకముక్కువంటి ముక్కుగలిగి లోభత్వము, అతివాగుడు, దూరదృష్టి లేకపోవుట, స్వల్పజ్ఞానము, సున్నితమైన తత్త్వము కలిగియుంటారు. గుడ్లగూబవంటి ఆకారంగల ముఖంగలవారు ప్రతి విషయంలోను నిగ్రహం కలిగివుంటారు. అన్నిటికీ క్రమపద్ధతిలో వుండే నేర్పుగలిగి వుంటారు. కల్పనాశక్తి యుండదు, సాహసం తక్కువగా యుంటుంది. కాకి ముఖంవంటి ఆకారంగల ముఖంగలవారు సిగ్గు లజ్జ లేకుండ ప్రవర్తిస్తారు అవివేకము, లోభత్వము, అన్నివస్తువులు కావలయునన్న ఆశ వుంటుంది. వీలుగానున్న వాటిని సంగ్రహించుకపోయే దురలవాటు కూడ యుంటుంది.

మనం నిత్యంచూచే మానవులను పరికించితే పై ముఖాకృతులు గలవారు కోకొల్లలు. ముఖాకృతే కాకుండ వారి శరీర నిర్మాణములు కూడ అదేవిధంగ యుంటాయి. వారు నడిచే రీతి పద్ధతి చేష్టలు అడుగడుగునా ఆ లక్షణాలను గోచరింప జేస్తాయి.

జంతువులు పక్షులు ఏ విధంగ పుణ్య కార్యాలు చేస్తాయి అనే సందేహం కలుగవచ్చును. వాటికి దయా దాక్షిణ్యాలు మంచి చెడ్డల విచక్షణా జ్ఞానం వున్నది. ఉదాహరణకు పశువులు, గాడిదలు వీధులలో పరుగెత్తుతాయి. చిన్నపిల్లలు వీధిలో యుంటే వాటికి

హాని చేయక వారిని తప్పించుకొని పోతాయి. అనవసరంగ ఇతర జంతువుల జోలికి పోవు. తమ సంతానాన్ని కడు జాగ్రత్తగ పోషిస్తాయి. ఇటువంటి పుణ్యకార్యాలు, కర్తవ్యనిర్వహణ చేసేందు వల్ల పుణ్యం వస్తుంది. ఆ పుణ్యఫలితం వల్ల ఉత్తమ జన్మ యగు మానవ జన్మ వస్తుంది.

అందరూ మానవులే, కాని వారివారి ప్రారబ్ధాను సారం వారు చేసిన కర్మఫలముల ననుసరించి అదృష్టం, ఆయుష్యు, గుణాగణాలు, వ్యక్తికి సంక్రమిస్తాయి. దేవుడు నిర్ణయించిన కర్మలు కాకుండ విపరీత వికృత కర్మలు చేయ నారంభించిరి మానవులు. ఎట్లంటే మనకొక రాజ్యాంగం వున్నది. ఈ రాజ్యాంగ సూత్ర ములకు వక్ర భాష్యాలు ఆపాదించి అతీతంగ వ్యవహరించు సందర్భాలు ఎన్నో. వీటిని సరిదిద్దేందుకు విరుగుడుగా రాజ్యాంగ సూత్రాలకు సవరణలు చేస్తున్నాం. అదేవిధంగ దేవుడు మానవుని విపరీత వికృత ధోరణులకు విసిగి కర్మలకు నొసగు ఫలితములకు విరుగుడు కనిపెట్టి మానవులచే అనుభవింప జేయుచున్నాడు. అందులో భాగమే కులవ్యవస్థ, దారిద్ర్యం, వికలాంగం మొదలగునవి. అన్ని జీవరాశులలో మానవ జన్మం ఉత్తమం, మానవ జన్మలో బ్రాహ్మణకులం ఉత్తమం అని శ్రీ శంకరాచార్యులవారి ఉవాచ. తక్కువ కులస్థు లనబడేవారు ఎంతటి ధనవంతులైనను, ఉన్నత పదవుల నలంకరించినను వారికి సమాజంలో గౌరవ మర్యాదలు తక్కువే యను విషయం అందరికీ తెలిసిందే. పుణ్య జీవులకు ఉత్తమ తల్లిదండ్రులు కలిగెదరు పాప జీవులకు దుర్వృత్తిగల తల్లిదండ్రులు కలుగుదురు. కావున దంపతులు పుణ్యం చేయవలెను. జీవులూ పుణ్యం చేయవలెను. అప్పుడే మంచి తల్లిదండ్రులు జీవులకూ, మంచి బిడ్డలు దంపతులకూ కలిగెదరు.



# తత్త్వము

పరాపర మందు పరం, పరమందు శివం, శివమందు శక్తి, శక్తియందు నాదం, నాదమందు బిందువు, బిందువందు సదాశివం, సదాశివమందు మహేశ్వరం, మహేశ్వరమందు ఈశ్వరం కలిగెను. దీనినే ఇంకొక విధంగ కూడ చెప్పవచ్చును. అది ఎట్లనగ శుద్ధ బ్రహ్మముగ నుండెడు సర్వసాక్షి యందు అగ్నియందు ఉష్ణము వలె అభిన్నమగు నొక శక్తి కలదు. ఆ శక్తి అతీతబ్రహ్మములో అణగి యుండు నపుడు అది శుద్ధబ్రహ్మమని చెప్పబడును. ఈ శక్తి విజృంభించి శుద్ధబ్రహ్మమును వ్యాపించినపుడు అది పరవ్యాపకములో నున్నందున దానికి పరబ్రహ్మమని పేరు కలిగెను. లక్షణశూన్యముగ నుండు ఈ శక్తి బ్రహ్మము యొక్క సన్నిధానమందు పురుష సమ్ముఖమున స్త్రీకి ఇంపు జనించునట్లు అవికృత సత్త్వరజస్తమో గుణములు కలిగెను. ఈ శుద్ధతత్త్వమునకు ఆనందరూప శక్తి యని పేరు. శుద్ధరాజసమునకు చిద్రూపశక్తియని పేరు. శుద్ధతామసమునకు సద్రూపశక్తియని పేరు ఈ అఖండపరిపూర్ణ సచ్చిదానంద బ్రహ్మమునందు శుక్తిలో రజితము తోచినట్లు మూలప్రకృతి యను నొక శక్తి గలిగినది. ఈ మూల ప్రకృతియును వికృతమైన మూడు గుణములతో కూడియుండును. ఈ మూల ప్రకృతి యొక్క సత్త్వగుణము మాయ యని చెప్పబడును. ఈ మాయయందు నిర్మల జల ప్రతిబింబమువలె బ్రహ్మము లక్షణముతో ప్రతిబింబించును. ఈ ప్రతిబింబ చైతన్యము సర్వజ్ఞుడైన ఈశ్వరుడని చెప్పబడును.

మూలప్రకృతియొక్క సత్త్వగుణ మాయయొద్ద సత్త్వములో సత్త్వము, సత్త్వములో రాజసము, సత్త్వములో తామసములని మూడుగుణములు కలిగినది. అది ఎట్లనగా ఒక కుటుంబంలో గృహ యజమాని తన తల్లికి కుమారుడుగ, భార్యకు భర్తగ, బిడ్డకు తండ్రిగ యుండు విధమువలె. ఆదేవిధంగ మూలప్రకృతియొక్క సత్త్వ గుణ మాయయొద్ద సత్త్వములో సత్త్వము ప్రధానమైనపుడు అందు ప్రతిబింబించిన ఈశ్వరుడు జగమును రక్షించినందు వలన 'విష్ణు'వని చెప్పబడును. మూలప్రకృతి యొక్క సత్త్వగుణ మాయయొద్ద సత్త్వములో రాజసము ప్రధానమైనపుడు అందు ప్రతిబింబించిన ఈశ్వరుడు ప్రపంచమును సృష్టించినందువలన 'బ్రహ్మ' యని చెప్పబడును. మూలప్రకృతి యొక్క సత్త్వగుణ మాయయొద్ద సత్త్వములో తామసము ప్రధానమైనపుడు అందు ప్రతిబింబించిన ఈశ్వరుడు ప్రపంచమును సంహారము చేయుట వలన 'రుద్రు'డని చెప్పబడును.

ఇక మూలప్రకృతియొక్క రాజసగుణము అనేకరూపములై అవిద్య యనిన్ని జీవ కారణ శరీరములనిన్ని ఒకటికొకటి తారతమ్య ములుగ చెప్పబడును. ఈ అవిద్యయందు మలినజల ప్రతిబింబము వలె బ్రహ్మచైతన్యము ప్రతిబింబించును. ఈ ప్రతిబింబ చైతన్య మును కించిజ్ఞులనిన్ని ప్రాజ్ఞులనిన్ని చెప్పెదరు. అవిద్యవద్దను రాజస మున సత్త్వము, రాజసమున రాజసము, రాజసమున తామసము లనెడి మూడు గుణములు కలవు.

మూలప్రకృతి యొక్క రాజసగుణమాయ యొద్ద రాజసమున సత్త్వము ప్రధానమైనపుడు అందు ప్రతిబింబించిన చిదాభాసుడు తత్త్వజ్ఞాన నిష్ఠుడగును. రాజసమున రాజసము ప్రధానమైనపుడు అందు ప్రతిబింబించిన చిదాభాసుడు కామక్రోధపరుడై కర్మనిష్ఠు డగును. రాజసమున తామసము ప్రధానమైనపుడు అందు

ప్రతిబింబించిన చిదాభాసుడు సోమరితనము, నిద్ర, మైకము, మరపు కలవాడగును.

ఇక మూలప్రకృతి యొక్క తామసగుణ మాయకు ఆవరణము విక్షేపములను రెండు శక్తులు గలిగినవి. వీటిలో ఆవరణశక్తి యనునది తత్త్వజ్ఞానినిన్ని, సర్వజ్ఞుడైన ఈశ్వరుణ్ణి వినా తక్కిన జీవులందరికిని శరీరత్రయము, చిదాభాసుడు, సాక్షి చైతన్యము లనబడువాట్ల కొకటి కొకటి భేదము తెలియపఱచక మరుగుచేయును. అందువలన మరుగుపడిన జీవుడు ఇరువదితొమ్మిది తత్త్వములను ఏకీభావముగ భావించి నేను అని అభిమానించును. ఈ అభిమానమే అహంకార గ్రంథియనిన్ని, సంసారబంధమనిన్ని చెప్పబడును.

ఇక విక్షేపశక్తి యందు శబ్దతన్మాత్ర యగు ఆకాశము పుట్టెను, ఆకాశమందు స్పర్శ తన్మాత్రయగు వాయువు పుట్టెను. వాయువునందు రూపతన్మాత్ర యగు అగ్ని పుట్టెను, అగ్ని యందు రసతన్మాత్ర యగు జలము పుట్టెను. ఈ సూక్ష్మపంచభూతములకు కారణమగు విక్షేపశక్తి యందు తామసమున సత్త్వము, తామసమున రాజసము, తామసమున తామసము అను మూడు గుణములు పుట్టినవి. ఈ పంచభూతములనబడు ఆకాశము, వాయువు, అగ్ని, జలము, పృథివి అపంచీకృత భూతములనిన్ని, తన్మాత్రలనిన్ని, చెప్పబడును.

శబ్దం, స్పర్శం, రూపం, రసం, గంధం అనబడు సూక్ష్మభూతము నుండి అంతఃకరణములు 5, జ్ఞానేంద్రియములు 5, వాయువులు 5, కర్మేంద్రియములు 5, మొత్తం 20 సూక్ష్మశరీరములును, పృథివి, అప్పు (జలం) తేజువు, వాయువు, ఆకాశము మొత్తం 5 సూక్ష్మభూతములు పుట్టినవి. అదెట్లనగా ఆకాశము మొదలైన పంచభూతముల యొక్క సాత్త్వికాంశమున భూతమునకు ఒక్కొక్క మాత్రగ మొత్తి

ఒకటిగ చేర్చినది అంతఃకరణము (అంతరింద్రియము) అనబడును. ఈ అంతఃకరణములో ఆకాశ అంశము చేరినందులకు దృష్టాంతము, ఈ అంతఃకరణమున్ను ఆకాశము వలె సకలమైన శ్రవణములకు చోటిచ్చి గ్రహించుచున్నది. ఇట్లు గ్రహించు వృత్తికి జ్ఞాతు అని పేరు. ఈ అంతఃకరణములో వాయు అంశము చేరినందులకు దృష్టాంతము ఈ అంతఃకరణమున్ను గాలి వలె అలసట చెందును. ఇట్లు అల్లల్లాడెడు వృత్తికి మనస్సు అని పేరు. ఈ అంతఃకరణములో అగ్ని అంశము చేరినందులకు దృష్టాంతము ఈ యొక్క అంతఃకరణమున్ను అగ్ని వలె ఇది ఇటువంటిదని తెలియబరచు చున్నది. ఇట్లు తెలియజేయు వృత్తికి బుద్ధి యనిపేరు. ఈ అంతఃకరణములో జలాంశము చేరినందు లకు దృష్టాంతము ఈ యొక్క అంతఃకరణమున్ను జలము వలె విషయములకు ఈడ్చును. ఇట్లు ఈడ్చెడు వృత్తికి చిత్తమని పేరు. ఈ అంతఃకరణములో పృథ్వి అంశము చేరినందులకు దృష్టాంతము ఈ యొక్క అంతఃకరణమున్ను పృథ్వి వలె కఠినముగ నుండి నేను అని అభిమానించును. ఇట్లు అభిమానించు వృత్తికి అహంకార మని పేరు.

మరియు ఆకాశము మొదలైన పంచభూతముల యొక్క సాత్త్వికాంశములో భూతమునకు ఒక్కొక్క మాత్రగ ఎత్తి ప్రత్యేకముగ నుంచునది శ్రోత్రాది జ్ఞానేంద్రియములని చెప్పబడును. వీటియందు శ్రోత్రుడు (చెవి) ఆకాశ అంశమైనందున ఆకాశము యొక్క గుణమైన శబ్దమును మాత్ర మెరుగును. త్వక్కు (చర్మము) వాయు అంశమైనందున వాయువుయొక్క గుణమైన స్పర్శను మాత్ర మెరుగును. చక్షు (నేత్రము) అగ్ని అంశ మైనందున అగ్నియొక్క గుణమైన రూపమును మాత్ర మెరుగును. జిహ్వ (నాలుక) జలాంశ మైనందున జలముయొక్క గుణమైన రుచిని మాత్ర మెరుగును.

ఘ్రాణము (ముక్కు) పృథివి అంశమైనందున పృథివియొక్క గుణమైన గంధము(వాసన) ను మాత్ర మెరుగును. ఇట్లు ఐదున్ను ఒకటి మరియొకదాని గుణమును గ్రహింపజాలదు. అంతఃకరణము నందు ఐదు మాత్రలున్ను ఒకటిగ చేరినందున అవి ఐదు ఇంద్రియముల వలన ఐదు విషయముల నెరుగును. ఈ సత్త్వగుణములో కలిగిన అంతఃకరణము లైదున్ను జ్ఞానేంద్రియము లైదున్ను చేరి మొత్తం పదిన్ని సాత్త్వికాంశ మైనందున జ్ఞానసాధన మాయెను.

మరియు ఆకాశము మొదలైన పంచభూతముల యొక్క రాజసాంశములో భూతమునకు ఒక్కొక్క మాత్రగ ఎత్తి ఒకటిగ చేర్చినది వ్యానాది పంచవాయువు లనబడును. వీటిలో వ్యాన వాయువు ఆకాశ అంశమైనందున ఆకాశమువలె సర్వాంగమును వ్యాపించి యుండును. ప్రాణమను వాయువు వాయు అంశము. హృదయమునుండి ఇడ పింగళ యను నాడీరంధ్రముల ద్వారా ఉచ్ఛ్వాస నిశ్వాస రూపముగ పన్నెండు అంగుళముల ప్రమాణము బయటకు వచ్చి ఆగిపోవుచున్నది. అపాన వాయువు అగ్ని అంశము. గుదస్థానము నుండి ఊపిరిని లోపలికి పీల్చుకొను క్రియగ ప్రాణ వాయువున కెదురుగా నడచుచూ క్రిందికివచ్చి అధోముఖమైయున్న రక్త, సినీవాలి, కుహూ నాడులయందు ప్రవేశించి మలమూత్రములను, శుక్లశోణితములను వెలువరించును. మరియు జఠరాగ్నిగ ఉష్ణముగ గుదమును అనుసరించి నిలిచి భోజనము చేసిన అన్నపానాదులను జీర్ణింపజేయును. సమాన వాయువు జలాంశము, ఇది శరీరము మధ్య నాభిస్థానమున నిలిచి భోజనము చేసిన అన్నపానాదుల సారమును సకల నాడులకు పంచిపెట్టును. ఉదానవాయువు పృథ్వి అంశము, ఇది కంఠము ననుసరించి నిలిచి భోజనముచేసిన అన్నపానాదులను చిలుకను, మ్రింగును. మరియు కంఠము, తాళువులు,

శిరస్సు, దంతములు, పెదవులు, నాశిక, జిహ్వామూలము, వక్షస్థలము నను ఎనిమిది స్థానములచేత మనోసంకల్ప వికల్పములను శబ్దరూపముగా పలికించుటయేగాక నిద్రించు సమయమునందు సకలేంద్రియముల యొక్క బలమును గ్రహించి ఏ కార్యములందు గూడ ప్రవేశింపకుండ జేయును, మరల జాగ్రదావస్థయందు కర్తవ్యోన్ముఖు మొనరించి సకలేంద్రియములను చైతన్యవంతం గావించును. స్వప్నావస్థయందు దృశ్యాత్మకమైన స్వప్న ప్రపంచమును సృష్టించి వాటి అనుభూతులను జీవునికి కల్పించు చుండును. యోగసాధనయందు ఈ ఉదాన వాయువు తేజోరూపమై భాసిల్లి సుషుమ్న నాడీ మార్గముగుండ బ్రహ్మరంధ్రమును చేరును.

ఆకాశము మొదలైన పంచభూతముల యొక్క రాజసాంశములో భూతమునకు ఒక్కొక్క మాత్రగ ఎత్తి ప్రత్యేక ప్రత్యేకముగ నుంచునది, వాక్కు ఆదిగాగల కర్మేంద్రియము లనబడును. వీటిలో ఆకాశము వలన వాక్కు మాట్లాడుట, మ్రింగుట, తినుట మొదలగు కార్యములను చేయును. వాయువువలన పాణి ఇచ్చుట, పుచ్చుకొనుట, ఎత్తుట మొదలగు కార్యములను చేయును. అగ్ని వలన పాదము నిలుచుట, నడచుట, పరుగెత్తుట మొదలగు కార్యములను చేయును. జలమువలన పాయువు మలజలాదులను విసర్జించును. పృథ్వీ మూలముగా ఉపస్థము శుక్లశోణితములను విడచి సుఖమును లుగ జేయును. ఈ ఐదున్ను వేర్వేరుగ నున్నందున అన్యమైన పని చేయజాలవు. వ్యానాది వాయువులైదున్ను ఒకటిగ చేరినందున కర్మేంద్రియములైదింటిమూలముగ ఐదుపనులను చేసి ముగించును. ఈ వాయువులైదున్ను, కర్మేంద్రియములైదున్ను మొత్తము పదిన్ని రాజసాంశములైనందున క్రియాసాధనములైనది.

అంతఃకరణము లైదున్ను, జ్ఞానేంద్రియము లైదున్ను, వాయువులైదున్ను, కర్మేంద్రియములైదున్ను మొత్తము ఇరవై తత్త్వములు సూక్ష్మశరీరములని చెప్పబడును. ఈ సూక్ష్మశరీరము మాయా ప్రతిబింబుడైన ఈశ్వరుని నుంచి అవిద్యా ప్రతిబింబులుగా నుండు జీవులు అనేకులు గాన, వీర్లకు ఒక్కొక్కరికి ఒక్కొక్కటి చొప్పున సృష్టించి యివ్వబడినది. ఈ విధంగ పంచభూతముల యొక్క సాత్త్వికాంశమున్ను, రాజసాంశమున్ను ఖర్చయినవి. తామసము మాత్రము మిగిలినది.

మిగిలిన తమోగుణ అంశముగనుండు పంచభూతములను ఒక్కొక్కటిన్ని రెండుగ విభాగించి మొదటిభాగ మైదింటిలో ఒక్కొక్కటిన్ని నాలుగు నాలుగుగ విభజించి రెండవభాగ మైదింటిలో తన భాగములతో చేర్చక తక్కిన నాలుగు భాగములతో 1/8 భాగము చేర్చుట పంచీకరణ మనబడును. ఇట్లు పంచీకరణము చేసిన స్థూలభూతములో ఆకాశములో స్పర్శ, రూప, రస, గంధములైన నాలుగు గుణములును వెలిపడక అదృశ్యముగ పోవ నిజగుణమైన శబ్దమును, వాయువులో రూప, రస గంధములైన మూడు గుణము లును వెలిపడక అదృశ్యముగపోవ కారణగుణమైన శబ్దమున్ను నిజ గుణమైన స్పర్శమున్ను అగ్నిలో రస, గంధములైన రెండుగుణము లున్ను వెలిపడక అదృశ్యముగపోవ కారణగుణమైన శబ్దస్పర్శమున్ను నిజగుణమైన రూపమున్ను, జలములో గంధగుణము వ్యాపించి యున్నందున అదృశ్యముగ పోవ కారణగుణమైన శబ్దస్పర్శరూప మున్ను నిజగుణమైన గంధమున్ను తోచబడినవి.

పంచీకరణ చక్రమును అర్థమగుటకుగాను క్రింద చక్రముల వివరము వేయబడినది.

# పంచీకరణము

| వరుస నెం. | అంశము | వర్ణము | అదృశ్యమగు గుణములు | కారణ గుణములు | నిజగుణములు |
|---|---|---|---|---|---|
| 1. | ఆకాశము | తెలుపు | స్పర్శ, రూప, రస, గంధములు | — | శబ్దము |
| 2. | వాయువు | నలుపు | రూప, రస, గంధములు | శబ్దము | స్పర్శము |
| 3. | అగ్ని | ఎఱుపు | రస, గంధములు | శబ్ద, స్పర్శములు | రూపము |
| 4. | జలము | నీలము | గంధము | శబ్ద, స్పర్శ, రూపములు | రసము |
| 5. | పృథ్వి | పసుపు | — | శబ్ద, స్పర్శ, రూప రసములు | గంధము |

స్థూల సూక్ష్మ భూతముల నుండి సూక్ష్మ శరీరములు పుట్టి నటుల పంచీకరణము చేసిన స్థూల భూతముల నుండి ఆరు తత్త్వ ములై నాలుగు విధములైన పుట్టుకలై మూడు విధములైన జాతు లుగ నుండే స్థూల శరీరములు పుట్టెను. వీటిలో ఆరు తత్త్వము లేవి యనగా చర్మము, రక్తము, మాంసము నరములు, ఎముకలు, మజ్జ అనునవి. నాలుగు విధములైన పుట్టుకలు ఏవి యనగా జరాయుజ ములు (యోని ద్వారా పుట్టునవి), అండజములు (గుడ్డు ద్వారా పుట్టునవి), స్వేదజములు (చెమట ద్వారా పుట్టునవి), ఉద్భిజములు (భూమి ద్వారా పుట్టునవి). మూడు విధములైన జాతు లేవి యనగా ఇహాలోక బుద్ధి పరలోక బుద్ధి (ప్రపంచము యొక్క గుణమున్ను పరలోక గుణమున్ను విచారించే టటువంటి మనస్సుయొక్క వివే కము) రెండు విధములుగ కలిగినటువంటి నర శరీరము ఉత్తమ జాతి యనబడును. పర లోక బుద్ధిని మరపించి ఇహ లోక బుద్ధిని మాత్రము కలిగినటువంటి పశు, పక్షి మొదలైనవి మధ్యమజాతి యనబడును. ఈ రెండు లోకముల యొక్క బుద్ధిని మరచియుండే వృక్షములు, చెట్లు, తీగెలు మొదలైనవి అధమ జాతి యనబడును.

ఆరు తత్త్వములుగ యుండే స్థూల శరీరములో ఇరవై తత్త్వ ములుగ యుండే సూక్ష్మ శరీరము లుండు విధము ఎట్లనగా -

కర్మేంద్రియములలో వాక్కున్ను, జ్ఞానేంద్రియములలో జిహ్వ యున్ను నోటి యందుండును. వాయువులో ఉదానవాయువున్ను, అంతఃకరణములో మనస్సున్ను కంఠములో నుండును. ప్రాణవాయు వున్ను, బుద్ధిన్ని హృదయములో నుండును. సమానవాయువున్ను, చిత్తమున్ను నాభియందుండును. అపానవాయువున్ను, పాయువున్ను గుదము నందుండును. వ్యానవాయువున్ను, త్వక్కున్ను, అహం కారమున్ను సర్వాంగమును వ్యాపించి యుండును. అంతఃకరణ

ములో జ్ఞాతమున్ను, కంటి కొనలో చక్షురింద్రియమును, చెవిలో శ్రోత్రేంద్రియమును, ముక్కు కొనలో ఆఘ్రాణేంద్రియమును గొంతుకు పై భాగమున ప్రత్యేక ప్రత్యేకముగ నుండును. గొంతుకు క్రిందిభాగమున చేతులు, కాళ్ళు, గుహ్యము, ఉపస్థము వేర్వేరుగ నుండును.

ఇక తత్త్వములు అణగే విధానము ఎట్లనగా సకలజీవుల యొద్ద నుండే స్థూల శరీరమంతయున్ను తమకు ఆధార భూతమైన (పంచీకరణము కాబడిన) స్థూల భూతములతో మడిగి (ముందు గుణములను విడిచి) భూతమాత్రముగ లయించును. ఈ స్థూల భూతములును పంచీకరణములను విడిచి తన్మాత్రగ (సూక్ష్మముగ తమోగుణ భూతములుగ) మారును. దీనిని హిరణ్య గర్భావస్థ (సూక్ష్మభూతముగ నుండు స్థితి) యనబడును. సూక్ష్మశరీర తత్త్వములు ఇరువదియున్ను భూతముల యొక్క సత్త్వరజో గుణములుగ మారును. అదెట్లనగా సకల ప్రాణుల యొద్దనుండే అహంకారమున్ను, ఆఘ్రాణమున్ను ఉదానమున్ను, ఉపస్థమున్ను పృథ్విలో అణగును. చిత్తమున్ను, జిహ్వయున్ను, సమాన వాయువున్ను, పాయువున్ను, పాదమున్ను అగ్నిలో లయించును. మనస్సున్ను, త్వక్కున్ను, ప్రాణవాయువున్ను, పాణియున్ను వాయువులో లయించును. జ్ఞాతున్ను, శ్రోత్రియమున్ను, వ్యానవాయువున్ను, వాక్కున్ను ఆకాశమున లయించును. ఈ విధంగ సూక్ష్మశరీర తత్త్వములు యథారీతిగ తమ పూర్వ స్థితికి కారణమగు త్రిగుణ భూతములగును.

ఈ సూక్ష్మభూతములో పృథ్వి తనచుట్టూయున్న జలములో కరిగి లేకుండపోవును అగ్ని విజృంభించుట వలన అందులో యిగిరి జలము లేకుండపోవును. అగ్ని వాయువులో చలించి ఆరిపోవును. అనగా లేకుండపోవును. వాయువు ఆకాశములో చలనరహితమైం

లేకుండపోవును. ఆకాశము విక్షేపశక్తిలో లయించును. ఆవరణ శక్తియును, విక్షేపశక్తియును మూలప్రకృతిలో తమోగుణ మాత్ర ముగ మఱ్ఱిచెట్టు మఱ్ఱివిత్తనమున అణగినట్లు ఇంకొక సృష్టికి విత్తుగ మాయలోనున్ను, అవిద్యలోనున్ను లయించును. ఈ మాయయును, అవిద్యయును అతి సూక్ష్మమైన మూలప్రకృతియని చెప్పబడు బిందు తత్త్వములో లయించును. ఆ బిందువును పాము అని పేరుపోయి రజ్జు అని తోచినట్లు తనకు అధిష్ఠానమైన బ్రహ్మచైతన్య మాత్ర ముగ అణగును. ఈ బ్రహ్మ చైతన్యమే మొట్టమొదట చెప్పబడిన శక్తియని చెప్పబడును. ఇదియే పరబ్రహ్మం.

ఇట్లు తోచి అణగు తత్త్వములు ముప్పదియారు. అది ఎట్లనగా భూతములు 5, స్థూల శరీర తత్త్వములు 6, సూక్ష్మ శరీర తత్త్వ ములు 20, కారణ శరీరమైన మాయ, అవిద్య 2, వీటిలో ప్రతి బింబించిన ఈశ్వరుడు, జీవి 2, వీటికంత అధిష్ఠాన చైతన్యముగ నుండే బ్రహ్మము 1 చేరి తత్త్వములు మొత్తం 36. వీటిలో భూత ములు 5, మాయ 1, మాయా ప్రతిబింబుడైన ఈశ్వరుడు 1, బ్రహ్మము 1 చేరి మొత్తం 8 తత్త్వములు సకల ప్రాణుల వల్ల సమిష్టిగ అనుభవించబడును. అదెట్లనగా పృథ్వి తత్త్వము ఒకటి లేకున్న ఎవరికిన్ని ఆహారము లేదు. వర్షము లేకున్న ఎవరికిన్ని జలము లేదు. అగ్ని లేకున్న ఎవరికిన్ని పాకము లేదు. వాయువు లేకున్న ఎవరికిన్ని గాలి లేదు. ఆకాశము లేకున్న ఎవరికిన్ని చోటు (అవకాశము) లేదు. మాయయున్ను, మాయా ప్రతిబింబ మున్ను మరణించిన సకల మతస్థులకున్ను దైవము లేదు. బ్రహ్మము లేకున్న ఎవరికిన్ని ఉనికి లేదు. కావున ఈ 8 తత్త్వములు అందరికీ సమిష్టి యని అర్థమగుచున్నది. మిగిలిన తత్త్వములు వేరు వేరు. ఎట్లనగా ఒక స్థూలశరీరము మరణించిన తక్కినవార్లకు

మరణము లేకయుండుట చేతను, సూక్ష్మశరీరము ఒకనికి అంగ వైకల్యము కలిగిన తక్కిన వారలకు రాక యుండుట చేతను, ముక్తులుగ నుండు వశిష్ఠుడు విశ్వామిత్రుడు మొదలైన వార్లకు అవిద్య యున్ను జీవుడున్ను మరణించి యుండగ తక్కిన వార్లకు మరణము లేకుండుట చేతను ఈ 28 తత్త్వములను ఒక్కొక్కరికి వేర్వేరుగ నుండు ననుట నిస్సందేహము.

ఈ యొక్క తత్త్వము 36 లో ఎప్పుడున్ను తనకు అన్యముగ కనబడుచుండు తత్త్వము (ఎఱుక) ఎప్పుడున్ను తనకు అన్యముగ కనబడచే తత్త్వములు 7, తానుగ తనకు అన్యముగ అనుభవించు తత్త్వములు 28. అదెట్లనగా అవస్థాత్రయ సాక్షిగ నుండే బ్రహ్మ చైతన్యము అన్ని అవస్థలలోనున్ను తానుగ కనబడచడము చే తక్కిన తత్త్వముల వలె తనకు అన్యముగ లేనందువల్ల ఆ యొక్క బ్రహ్మచైతన్యము ఒకటియే తానుగనున్నది. పంచభూతములు, మాయ, మాయా ప్రతిబింబములనే ఈ 7 తత్త్వముల యొక్క పనులైన నరుకు, గుద్దు, దున్నడము వగైరాలు ఈశ్వరుని యొక్క కృత్యమైన పంచకృత్యములు. దశావతారము మొదలైనవి ఒకప్పుడున్ను తన పనిగా కనబడచనందున ఈ 7 తత్త్వములున్ను తనకు అన్యమే కాని తాను కావు. మిగిలిన 28 తత్త్వములలో నేను బ్రాహ్మణుడను, నేను క్షత్రియుడను, నేను వైశ్యుడను, నేను శూద్రుడను, నేను సన్యాసిని, నేను మగవాడను, నేను స్త్రీ, నేను నల్లనివాడను అని తానుగ చెప్పుకొనెడి స్థూలశరీరమైన 6 తత్త్వములును, ఒక సమయంలో తనకు అన్యముగ తోచబడు నా ఎద్దు, నా దూడ అనునట్లుగ నా శరీరము బలిసినది, నా శరీరము కృశించినది నా వెంట్రుకలు తెల్లనైనవి, నా శరీరము పుట్టి ఇన్ని సంవత్సరములైనవి, అని తాను వేరు తన స్థూల శరీరము వేరుగ చెప్పబడ

చున్నందునను, నేను చూచినాను, వినినాను, అంటినాను భోగించి నాను, చింతించినాను, నిశ్చయించినాను, క్షేమముగ జీవించుచున్నాను అని తానుగ చెప్పబడుచున్న సూక్ష్మశరీర తత్త్వములు 20, మరియొక సమయములో తనకు అన్యముగ నా ఇల్లు, నా సొమ్ము అనినట్లు నా కాలు, నా మనస్సు, నా బుద్ధి, నా అహంకారము, నా చిత్తము, నా ప్రాణము అని తాను వేరు అవివేరు అని చెప్పబడు చున్నందునను, నాకు తెలియదు, నాకు తెలుసును అని తానుగ వెలిగెడి అజ్ఞానమున్ను చిదాభాసుడున్ను, మరియొక సమయములో తనకు వేరుగ నా అజ్ఞానము నా జీవుడు అనిన్ని చెప్ప బడుచున్నందున ఈ 28 తత్త్వములకున్ను తానుగను తనకు అన్యము గను వెలుగునది చిత్తము.

చంటిబిడ్డ యొక్క కాలు తగిలితే తప్పులేదు. కాని, పెద్ద అయిన తర్వాత ఆ కాలే తగిలితే తప్పుకద? అదే విధంగ పర మార్థమువల్ల యథార్థముగ తాను అనునది ఒకవిధమున్ను, అభ్యా సమువల్ల ఐక్యముచేత తాను అనునది ఒకవిధమున్ను చేరి రెండు విధములు. సాక్షి చైతన్యము తాను అనునది పరమార్థమే గాని అపచారము కాదు. కాని తనకు అన్యముగనుండే ఈ 28 తత్త్వ ములను తాను అనునది స్తంభమును దొంగయనినట్లు, దారమును పాము అనినట్లు పుత్రదారాదులను తాను అనునట్లుగన్ను భ్రాంతియే గాని నిజము కాదు. అందువలన అజ్ఞానకాలము నుండి తాను కాను అని కనబడు తత్త్వములు 28, ఎల్లప్పుడున్ను తనకు అన్యముగ కనబడే తత్త్వములు 7, మొత్తము 35 తత్త్వములను వాటివాటికి చెప్పిన గుణము గుర్తులతో సరిచూచుకొనుటకు 'ఎఱుక' అనబడును. ఘటమును చూచెడివాడు ఘటమునకు బయటనుండి ఘటమును చూచునట్లు 35 తత్త్వములను చూచే గొప్ప శక్తియును 'ఎఱుక'

నెఱిగి, ఆ ఎఱుకయే తానని, తన నిజస్వరూపమని, తానే బ్రహ్మం బని యదార్థముగ నిర్వికల్ప సమాధిలో నెరిగి తెలివిచెందిన వాడే బ్రహ్మ దర్శనము చెందిన ముక్తుడు అని చెప్పబడును.

పై సమాధి స్థితిని బొందుటకు ఈ క్రింద చెప్పబడిన అష్టాంగ విధులను తప్పక పాటించి సఫలుడు కావలెను.

1. యమము :-

1. అహింస మొదటి ధర్మము. ఎట్టి జీవులను చంపరాదు. తన కంటె తక్కువ వారలుగ నున్నను వారి మనస్సు నొచ్చునట్లు ప్రవర్తింపరాదు.
2. ఎల్లప్పుడు సత్యమునే పలుకుట ఎట్టి పరిస్థితులలోను అబద్ధ మాడకుండుట.
3. ఎంతటి నిరుపేదయైనను పరుల సొత్తును దొంగిలింప కుండుట.
4. మోసము చేయకుండుట.
5. ఎట్టి మంచి వస్తువైనను దానియందు ప్రీతి లేకుండుట.
6. తాను చేయు దానధర్మములకు ప్రతిప్రయోజనము ఆశింప కుండుట.
7. పరస్త్రీలను మోహింపకుండుట.
8. అన్ని జీవరాశుల యందును మిక్కిలి దయకలిగి యుండుట.
9. స్వల్ప ఆహార స్వల్పనిద్రతోనుండి యోగాభ్యాసము చేయుచు తన పంచేంద్రియములను వశపరచుకొనుట.

2. నియమము :

1. దేహమును పరిశుభ్రముగా నుంచుకొనుట.
2. అపకారికి ఉపకారము చేయుట.
3. తన దేహముపై అభిమానమునువిడిచిపెట్టుట.
4. కోపము లేకుండ ఎల్లప్పుడు సంతోషముగ నుండుట.

5. తనకు కలిగినంత వరకు తృప్తి చెంది యుండుట
6. వేదాంత విచారణ చేయుట
7. సత్పురుషుల యొక్క సహవాసము చేయుట

3. ఆసనము :

పద్మాసనము, సిద్ధాసనము, వీరాసనము, స్వస్తికాసనము, మయూరాసనము, గోముఖాసనము, కుక్కుటాసనము, సింహాసనము, సుఖాసనము అను ఆసనములను సాధనచేయుచు వచ్చిన యెడల శరీరమునకు వ్యాధి రాకుండయుండును.

4. ప్రాణాయామము :

పద్మాసనము వేసికొని ప్రాణాయామమును ఆచరింపవలెను.

5. ప్రత్యాహారము :

ప్రాణాయామములో దశవిధ నాదములను ఒక్కొక్కటిని ప్రత్యేక పరచి వినుట

6. ధారణ :

గాలిలేని స్థలమున నుంచిన దీపము ఎట్లు కదలక నిలిచి యుండునో అటువలెనే తన మనస్సు నిలిచి యుండునట్లు విషయముల యందు బోనీయక నిశ్చలముగ నిలిపి యుండుట.

7. ధ్యానము :

ప్రాణాయామ ధారణలలో పొందు శ్వాసను కుంభకములో నిలిపి నిర్వికల్ప సమాధియందు తన తనువును తాను మరచి బ్రహ్మానందమున చొక్కియుండుట.

8. సమాధి :

వాయు భక్షణము చేసి, అన్నపానాదులు లేక యుండి పద్మాసనములో కూర్చుండి జాగ్రత్స్వప్నములను దాటి సుషుప్తావస్థ

యాది విషయసుఖములెల్ల తుచ్ఛమనుచు త్రోసి, ఇంద్రియ నిగ్రహమును కలిగియుండుట స్వాధిష్ఠాన చక్రము. సర్వజీవ కరుణ కలిగి సాత్త్వికాహారముతోడ యుండునది మణిపూరక చక్రము. మనల నెవ్వరైన అనరాని మాటలనిన మదిని అంటుకొనక భూమి వంటి ఓర్పు కలిగియుండుట అనాహత చక్రము అనబడును. వాదభేదముల క్రోధమును పెరుగనీయక పరమశాంతి కలిగియుండుట విశుద్ధ చక్రము అనబడును. తగిన స్థలమున జేరి ధారణముగ మనస్సు నిల్పి తపముచేయుట ఆజ్ఞేయచక్రము అనబడును. ఎడతెగని ధ్యానమున నుండుట సహస్రార చక్రము అనబడును. సత్యమార్గము ననుసరించి నిత్యసమాధిని పొంది నిర్వికల్పమున నుండుట ఎనిమిదవ చక్రము అనబడును.

నిర్వికల్ప సమాధికి ఈ క్రింది విషయములు స్వానుభవము. బయటి విషయములను వీడి ప్రణవనాదమును అరయుట దానమనబడును. మనస్సులో సంకల్పము లేకుండ కూర్చుండుట నిదానమనబడును. ఇహాపర సుఖముల నిచ్ఛగింపక ఆత్మలోన విచారింప బూనుకొనుట సమాధాన మనబడును. సర్వము ఆత్మ స్వరూపమని కృపాదృష్టితో నుండుట సమదృష్టి యనబడును. ప్రపంచము పరమాత్మ ఒక్కటే యని మదినుంచుకొనుట సమత్వ మనబడును. ఆత్మలో నిమగ్నమై ఆనందమగ్నుడై మైమరచి యుండుట ఉదాసీనత్వ మనబడును.

సులభ గ్రాహ్యమునకుగాను 25 తత్త్వములు జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు, పంచభూతములు, దేహత్రయాదుల వివరములను తెలియజేయు పట్టీలను ఈ క్రింద వ్రాయబడియున్నవి. ఓపికతో, అర్థవంతంగ చదివి ఆకళింపు చేసుకొనగలరని ఆశిస్తున్నాను.

# 25 తత్త్వముల వివరములు

| వరుస నెం. | తత్త్వ వివరము | ఆకాశ తత్త్వములు | వాయు తత్త్వములు | అగ్ని తత్త్వములు | ఉదక తత్త్వములు | పృథివి తత్త్వములు | సమిష్టి తత్త్వములు |
|---|---|---|---|---|---|---|---|
| 1. | ఆకాశ పంచకము | జ్ఞానం | మనస్సు | బుద్ధి | చిత్తము | అహంకారము | అంతరేంద్రియములు |
| 2. | వాయు పంచకము | వ్యానం | ప్రాణం | అపాన | సమాన | ఉదాన | ప్రాణేంద్రియములు |
| 3. | అగ్ని పంచకము | శ్రోత్రము | త్వక్కు | చక్షువు | జిహ్వ | ఘ్రాణము | జ్ఞానేంద్రియములు |
| 4. | ఉదక పంచకము | శబ్దము | స్పర్శము | రూపము | రసము | గంధము | పంచతన్మాత్రలు |
| 5. | పృథ్వి పంచకము | వాక్కు | పాణి | పాదము | గుహ్యము | ఉపస్థము | కర్మేంద్రియములు |

# జ్ఞానేంద్రియముల వివరము

| వరుస నెం. | ఇంద్రియములు | భూతము | అధిదేవత | విషయము | విధములు | సంఖ్య |
|---|---|---|---|---|---|---|
| 1. | శ్రోత్రేంద్రియము | ఆకాశము | దశదిక్కులు | శబ్దము | క్షరాక్షరములు | 2 |
| 2. | త్వగింద్రియము | వాయువు | రుద్రుడు | స్పర్శము | శీతం - ఉష్ణం - మృదువు కఠినం | 4 |
| 3. | చక్షురింద్రియము | అగ్ని | సూర్యుడు | రూపము | శ్వేత, పీత, హరిత, రక్త, పసుపు, నీలము, పొట్టి, పొడుగు, లావు, సన్నము. | 10 |
| 4. | జిహ్వేంద్రియము | ఉదకము | వరుణుడు | రసము | మధుర, ఆమ్ల, తిక్త, కటు, కషాయ, లవణ | 6 |
| 5. | ఘ్రాణేంద్రియము | పృథివి | అశ్వినీదేవతలు | గంధము | సుగంధము, దుర్గంధము, మిశ్రమ గంధము, గంధరహితము | 4 |

## కర్మేంద్రియముల వివరము

| వరుస నెం. | ఇంద్రియములు | భూతము | అధిదేవత | విషయం | విధము | సంఖ్య |
|---|---|---|---|---|---|---|
| 1. | వాక్కు | నాగవాయువు | సరస్వతి | వచనము | సువాక్యం<br>దుర్వాక్యం | 2 |
| 2. | పాణి | కూర్మ వాయువు | దేవేంద్రుడు | దానము | దానాదానములు | 2 |
| 3. | పాదము | కృకురవాయువు | విష్ణువు | గమనము | గమనా<br>గమనములు | 2 |
| 4. | గుహ్యము | ధనంజయవాయువు | బ్రహ్మ<br>ప్రజాపతి | ఆనందము | ఆనందము<br>కేవలానందము | 2 |
| 5. | ఉపస్థము | దేవదత్తవాయువు | మృత్యువు | విసరనము | విసర్జన | 1 |

## పంచ భూతముల వలన పుట్టిన వివరము

| | | | |
|---|---|---|---|
| 1. | పృథ్వి వల్ల | అస్థి, చర్మము, మాంసము, నరములు, ఎముకలు, రోమములు. | 6 కలిగెను |
| 2. | ఉదకము వల్ల | రక్తము, మూత్రము, శుక్లము, శ్లేష్మము, మెదడు | 5 కలిగెను |
| 3. | అగ్ని వల్ల | క్షుత్తు, పిపాస, నిద్ర, ఆలస్యము, సంగమము. | 5 కలిగెను |
| 4. | వాయువు వల్ల | చలనము, గమనము, తీవ్రము, లజ్జ, మదము. | 5 కలిగెను |
| 5. | ఆకాశము వల్ల | కామము, క్రోధము, లోభము, మోహము, భయము, మాత్సర్యము. | 6 కలిగెను |

# దేహత్రయాదుల వివరము

| వరుస నెం. | దేహ త్రయము | అవస్థా త్రయము | ఆత్మ త్రయము | స్థాన త్రయము | అభిమాన త్రయము | గుణ త్రయము | వర్ణ త్రయము | దైవ త్రయము | మాతృకా త్రయము |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1. | స్థూలము | జాగ్రత్ | జీవాత్మ | నేత్రము | విశ్వుడు | తామసం | రక్త | బ్రహ్మ | అ |
| 2. | సూక్ష్మము | స్వప్నం | అంతరాత్మ | కంఠము | తైజసుడు | రాజసం | శ్వేత | విష్ణువు | ఉ |
| 3. | కారణము | సుషుప్తి | పరమాత్మ | హృదయము | ప్రాజ్ఞుడు | సాత్త్వికం | నీల | రుద్రుడు | మ |

# పదునాలుగు లోకములు

| ఊర్ధ్వ లోకము | | అధో లోకము | |
|---|---|---|---|
| భూలోకం | గుద మందు | అతల | అరికాళ్ళ యందు |
| భువర్లోకం | గుహ్య మందు | వితల | మీగాళ్ళ యందు |
| సువర్లోకం | నాభి యందు | సుతల | మడిమల యందు |
| మహర్లోకం | హృదయ మందు | తలాతల | పిక్కల యందు |
| జలలోకం | కంఠ మందు | రసాతల | తొడల యందు |
| తపోలోకం | భ్రూమధ్య మందు | మహాతల | మోకాళ్ళ యందు |
| సత్యలోకం | లలాట మందు | పాతాళ | గుద మందు |

# సప్త వ్యసనములు

| | |
|---|---|
| తను వ్యసనం | దేహభారము ననుసరించి కలవరించుట. |
| మనో వ్యసనం | మనోవికారము కలిగినపుడు దొంగతనమైనను చేయగోరుట. |
| ధన వ్యసనం | ధనము సంపాదింపవలెనని లోభ కాంక్షతో నుండుట. |
| రాజ వ్యసనం | మనోత్సాహమును పొంది వాహన వస్త్రాభరణములను ధరించి, ఏమో ఎట్లాగో, అవునో కాదో, యని మనంబున చింతించుట. |
| విశ్వ వ్యసనం | మోక్షము సాధించవలెననియు, దివ్యక్షేత్రములకు పోవలెననియు చింతించుట. |
| ఉత్సాహ వ్యసనం | ఉత్సాహము కలిగినపుడు పుత్ర మిత్ర కళత్రాదుల మీద వాంఛించుట. |
| సేవకా వ్యసనం | పోయెదను, వచ్చెదను, ఇచ్చెదను, పుచ్చుకొనెదను అని వినయము పొందుట. |

# దశవిధ నాడుల వివరం

1. ఇడనాడి : అనగా చంద్రనాడి. ఎడమ భాగమం దుండును. శివుడు అధి దేవత.

2. పింగళనాడి : అనగా సూర్యనాడి. కుడి భాగమం దుండును. విష్ణువు అధి దేవత.

3. సుషుమ్నానాడి : అనగా అగ్ని నాడి. మధ్యమం దుండును. బ్రహ్మ అధి దేవత.

4. గాంధారినాడి : కుడి నేత్రమందుండును. ఇంద్రుడు అధి దేవత.

5. హస్తినాడి : జిహ్వా యందును, ఎడమ నేత్రమందును ఉండును. వరుణుడు అధి దేవత.

6. పూషానాడి : కుడి కర్ణ మందుండును. దిగ్ దేవత అధి దేవత.

7. పయశ్వనాడి : ఎడమ కర్ణమందుండును. పద్మోద్భవుడు అధి దేవత.

8. అలంబననాడి : మెడ యందుండును. సన్యాసరుడు అధి దేవత.

9. కుహూనాడి : గుద స్థానమందుండును. భూమి అధి దేవత.

10. శంఖనాడి : నాభి స్థానమం దుండును. చంద్రుడు అధి దేవత.

## దశవిధ వాయువుల వివరం - వాటిలో పంచప్రాణములు.

1 సమాన వాయువు నీలవర్ణం. నాభిస్థాన మందుండి ఆపాద మస్తక పర్యంతమును వ్యాపించి అన్నము మొదలగు సమస్త పదార్థముల యొక్క సారమును సమస్త నాడులకు పంచి పెట్టును.

2. వ్యాన వాయువు గోక్షీర వర్ణం. సర్వాంగమును వ్యాపించి దేహమంతట నిండియుండును.

3. ఉదాన వాయువు సామీరవర్ణం. కంఠ మందుండి కఫము, దగ్గు పుట్టించును. రుచులు గోచరించును. అన్నరసమును ఆత్మకు పానం చేయించును. కలువరించును.

4. ప్రాణవాయువు ఇంద్ర నీలవర్ణం. హృదయమునందుండి అంగుష్టము మొదలు వీణాగ్ర పర్యంతము వ్యాపించి ఉచ్ఛ్వాస నిశ్వాసముల చేత అన్నమును జీర్ణము చేయించును.

5. అపాన వాయువు హరితవర్ణము. గుదస్థాన మందుండి మల మూత్రములను విడిపించి, అధోద్వారమును బంధించి, అన్న రసమును వ్యాపించి. సకల రోమనాడులందు వ్యాపించును.

6. నాగ వాయువు నీలవర్ణము. చలనము లేక గీతారాగాదులను చేయించును, రోమనాడుల యందుండును.

7. కూర్మ వాయువు శ్వేతవర్ణము. పాదముల యందుండి శుష్కమైన దేహమును పుష్టిచేయించును. కన్నులు, నోరు మూయించును తెరపించును, కర్తయై యుండును.

8. కృకరవాయువు రక్తవర్ణము. నాశికాగ్రము నందుండి క్షుతాది ధర్మములను పుట్టించును. గమనా గమనములు చేయించును.

9. దేవదత్తవాయువు స్ఫటికవర్ణము. గుహ్యనేత్రములయం దుండి కూర్చుండిన చోటనే పరుండబెట్టును, లేక నిలిపించును. వ్యక్తముగా మాటలాడించును.

10. ధనంజయ వాయువు నీలవర్ణము, బ్రహ్మస్థానమందుండి కర్ణరంధ్రములో ప్రవేశించి సముద్ర భంగి చిత్రవిచిత్రముగ ఘోషించును. మరణకాలమునకు ముందుగా నిర్ఘోషమై పోవును.

**రాజయోగ భేదములు:-**

సాంఖ్యమనియు, తారకమనియు, అమనస్కమనియు రాజయోగ భేదములు మూడు విధములు

**దశవిధ నాదములు:-**

జలధి నాదం, భేరి నాదం, చిణీ నాదం, మృదంగ నాదం, ఘంటానాదం, కవాళనాదం, కింకిణీనాదం, వేణునాదం, భ్రమర నాదం, ప్రణవనాదం.

**సప్త ధాతువుల వివరము:-**

రసము రుధిరము, మాంసము, మేధస్సు, అస్థి, మజ్జ, శుక్లము, ఈ తత్త్వములతో కూడిన శరీరము.

**అష్టమదములు:-**

కులమదం, చలమదం, ధనమదం, రూప మదం. యౌవ్వన మదం, విద్యామదం, రాజమదం, తపస్సుమదం.

**తాపత్రయముల వివరము:-**

1. ఆధ్యాత్మిక తాపము తలనొప్పి, కడుపునొప్పి, చలిజ్వరముల వల్ల వచ్చెడి ఉపద్రవములు.

2. ఆధిభౌతిక తాపము:— చోర, వ్యాఘ్ర, సర్ప, వృశ్చిక పిపీలకాదుల వచ్చెడి ఉపద్రవములు అగును.

3. ఆధిదైవిక తాపము:— ఎండ, గాలి, వాన, పిడుగులు వీని వల్ల వచ్చెడి ఉపద్రవములు.

## ఓంకార ప్రకరణము

| | | | |
|---|---|---|---|
| అ కారము | బ్రహ్మ | పీత వర్ణం | నాదం |
| ఉ కారము | విష్ణువు | శ్వేత వర్ణం | బిందు |
| మ కారము | శివుడు | కృష్ణ వర్ణం | కళ |

## షడూర్మల వివరము

| | | |
|---|---|---|
| ఆకలి | దప్పి | ప్రాణ ధర్మములు |
| శోకము | మోహము | మనో ధర్మములు |
| జననము | మరణము | దేహ ధర్మములు |

## షడ్భావముల వివరములు

| | | | |
|---|---|---|---|
| అస్థి | గర్భమందుండుట | జాయతే | పుట్టుట |
| వర్ధతే | పెరుగుట | పరిణమతే | వృద్ధిపొందుట |
| అపక్షీయతే | కృశించుట | వినశ్యతే | నశించుట |

| సప్త ద్వీపములు | | సప్త సముద్రములు | |
|---|---|---|---|
| జంబు ద్వీపము | తలలో | లవణ సముద్రం | మూత్రం |
| పక్షి ద్వీపము | అస్థులందు | ఇక్షు సముద్రం | చెమట |
| శాఖ ద్వీపము | శిరస్సున | సుర సముద్రం | ఇంద్రియం |
| శాల్మి ద్వీపము | చర్మమున | సర్పి సముద్రం | శోణితం |
| పుష్కర ద్వీపము | గోళ్ళయందు | దధి సముద్రం | శ్లేష్మం |
| కుశ ద్వీపము | వెంట్రుకలందు | క్షీర సముద్రం | సొల్లు |
| క్రౌంచ ద్వీపము | వెంట్రుకలందు | శుద్ధోదక సముద్రం | కన్నీరు |

# శ్వాస

తత్త్వములు మొత్తం ముప్పై ఆరు, అందులో ముప్పై ఆరో తత్త్వము బ్రహ్మచైతన్యము అని చెప్పుకొన్నాముగదా! ఈ ముప్పై ఆరో తత్త్వమగు బ్రహ్మచైతన్యమును కనుగొనుటకు సాధన ప్రక్రియను పరికిద్దాం.

ప్రతి మానవ శరీరము తన అంగుళము చేత 96 అంగుళముల ప్రమాణముగ నుండును. 8 జానల పొడవు, 4 జానల వలయము, 3½ కోట్లు రోమద్వారములు, 72 వేల నాడులు 32 మూరల పెద్ద ప్రేవు, 92 సంధులు, 70 పెద్ద ఎముకలు, గుండెకాయ, రక్తము, మాంసము, పైత్యము, శ్లేష్మము, శుక్ల శోణితములతో కూడి యుండును, ఇన్నిటికి జీవుడు సాక్షియై యుండును. జీవము వలన పై వాటి కన్నిటికీ కాంతి గలిగి మనుష్యాకారమయ్యెను. 25 తత్త్వములు గల ఈ శరీరములో 7 కమలములు సూక్ష్మముగ నుండును. వాటిని తెలిసికొందాం.

1. మూలాధారము:- ఈ కమలము గుదస్థానమందు వ, శ, ష, స యను నాలుగు దళములు కలిగి పచ్చని రంగుతో న ఆకారముతో పృథ్వినిలయమై, ఘ్రాణాకారము కలిగి, భూమి వలె నాలుగు కోణములతో నొప్పుచుండును. ఈ కమలమునకు అధి దేవత వినాయకుడు.

2. స్వాధిష్ఠానము:- ఈ కమలము మూలాధారమునకు సుమారు రెండు అంగుళముల పై భాగమున బ, భ, మ, య, ర, ల యను ఆరు దళములు కలిగి తెలుపు వర్ణముతో మ ఆకారముతో జలస్థానమై, జిహ్వాకారముతో పక్షి ఆకారము కలిగి యుండును. గురులింగము, క్రియాశక్తి కలిగియుండును. ఈ కమలమునకు అధిదేవత బ్రహ్మ.

3. మణిపూరకము:- ఈ కమలము స్వాధిష్ఠానమునకు మూడు అంగుళముల పైన నాభిప్రదేశమున నాడులను చుట్టుకొని మణివంటి ప్రకాశము కలదై నీలవర్ణముతో డ, ఢ, ణ, త, థ, ద, ధ, న, ప, ఫ, యను పది దళములతో ప్రకాశించును. నేత్రకారణమై పీటికాకృతితో నుండును. అగ్నియుద్భవ స్థానము శివలింగము, జ్ఞానశక్తి కలిగియుండును. ఈ కమలమునకు అధిదేవత విష్ణువు.

4. అనాహతము:- ఈ కమలము మణిపూరకమునకు పది అంగుళముల పై భాగమున హృదయస్థానమందు వా ఆకారమున వాక్కునకు స్థానమై క, ఖ, గ, ఘ, ఙ, చ, ఛ, జ, ఝ, ఞ, ట ఠ యను పండ్రెండు దళములతో లింగాకృతి కలదై, త్వగింద్రియ కారణమై యొప్పుచుండును. నాద ప్రకాశ స్థానము, వాయుముద్ర చరలింగము, బీజశక్తి కలిగియుండును. ఈ కమలమున కధిదేవత రుద్రుడు.

5. విశుద్ధము :- ఈ కమలము అనాహతమునకు పైన పండ్రెండు అంగుళముల దూరములో కర్ణస్థానమున కంఠ ప్రదేశమున మత్స్యాకారము కలిగి అ, ఆ, ఇ, ఈ, ఉ, ఊ, ఋ, ౠ, ఌ, ౡ, ఏ, ఐ, ఓ, ఔ, అం, అః యను పదునారు దళ

చేయువాడు అని అందరూ ఎరిగినదే. మూత్రనాళముల ద్వారా శుక్లశోణిత రూపంగ సంతానోత్పత్తి జరుగును. కావున స్వాధిష్ఠాన మనబడు మూత్రనాళములవద్ద బ్రహ్మను అధిదేవతగ నిర్ణయించింది. విష్ణువు అనగా సర్వులకు సంపత్తు, శక్తి నొసగువాడని యర్థము. ప్రపంచముపై ఆశాపాశములు కలుగజేయువాడు విష్ణువు. ఆహారము యొక్క సారము కడుపునందే జీర్ణింపబడి ఆ సారము దేహమంతటికి సరఫరాయై శరీరము మనగలుగుటకు దోహద పడుచున్నది. జఠ రాగ్ని ఈ కడుపునందే యుండి ఆకలి, ఆకలి వలన కోరిక, కోరిక వలన కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యాలు కలుగు చున్నవి. కావుననే మణిపూరక మనబడు నాభిస్థానమున విష్ణువును అధిదేవతగ నిర్ణయించింది. దేహములో ఏ అంగము పోయినా ఫరవాలేదు. కాని గుండె లేకుంటే జీవితమే లేదు, మరణము తథ్యము. రుద్రుడు అనగా మరణము నిచ్చువాడు. కావున అనా హతము అనబడు హృదయస్థానమునకు రుద్రుని అధిపతిగ నిర్ణ యించింది

మనకు పొరఎక్కినప్పుడు ఆ పొర చెవిలోకిపోయి గుటక తిప్పుకోకుండ చేసి అమితబాధ కలుగజేస్తుంది. ఈ కర్ణకంఠముల కూటమి స్థానమున జీవుడుండును. కర్మేంద్రియములకు, మనస్సుకు సాక్షియై యున్నందున విశుద్ధ స్థానమునకు జీవుని అధిపతిగ నిర్ణ యించినది. మనిషికి ఆలోచనలుపుట్టేది భ్రూమధ్యమునందే. సృష్టికి కారణం మాయ. మాయనుండియే, జీవుడు సృష్టి, త్రిమూర్తులు పుట్టినది. ఈ మాయా చైతన్యమగు ఈశ్వరుని ఆజ్ఞేయచక్రమను భ్రూమధ్యస్థానమున అధిదేవతగ నిశ్చయించినది. శుద్ధ బ్రహ్మము నుండే పై మాయాది వివరములు కలిగినవి. శుద్ధబ్రహ్మమే సర్వవ్యాపకం, అనంతం, గురువు. గురువు అనగా సర్వము తెలిసినవాడు, తెలియని

దానిని తెలియజేయువాడు, మార్గదర్శి. సర్వజ్ఞుడు గురువు. గురువుకు మించిన వారులేరు. అదేవిధంగా శుద్ధబ్రహ్మమునకు మించి వేరే శక్తిలేదు. ఇదే సర్వస్వము, సర్వస్వము ఇదే. కావుననే భ్రూమధ్య స్థానమగు సహస్రారమును గురుమూర్తిని (ఎరుక) అధిదేవత స్థానముగా నిర్ణయించినది.

శరీరములో కుడి ఎడమ భాగములందు ఇడా పింగళయను నాడులు మూలాధారము మొదలు ఆజ్ఞేయము వరకు వ్యాపించి యుండును. ఈ ఇడాపింగళల మధ్య సుషుమ్న యను నాడి ఆజ్ఞేయమునకు పై భాగమున బ్రహ్మరంధ్రము వరకు వ్యాపించి శరీరమధ్య భాగములో ప్రధానమైనదియై రహస్యముగా నుండును. మనిషి పీల్చువాయువు జీవచ్ఛక్తి. ఇదియే ప్రాణవాయు వనబడును. ఈ ప్రాణవాయువు ఆజ్ఞేయ కమలస్థానమందుండి 'స' కారముతో బయలుదేరి మూలాధార కమలస్థానమందు గల 'హ' కారముతో చేరి 'హంస' (సోహం) అను నామముతో పై కనబరచిన ఏడు కమలముల కధిదేవతలగు వారికి ఉచ్ఛ్వాస నిశ్వాసములుగా ఎనిమిది అంగుళముల పొడవు లోనికి పూరకముగను, పండ్రెండు అంగుళముల పొడవు వెలుపలకు రేచకముగను అర్పణచేయుచుండును. పై ఏడు కమలములలోను తనకు తానే నడయాడు ప్రాణవాయువు సోహం' మంత్రమును యోగులు కనిపెట్టి ఆ శ్వాసను ఖర్చుచేయక ప్రాణాయామము ద్వారా కుంభించి నిలిపియున్నందున వారలు మృత్యువునుజయించి వేలసంవత్సరములు, మన్వంతరములు జీవించిరి. ఒక పూరకము ఒక రేచకముచేరి ప్రాణమనబడును.

సృష్టిలో వాయువు అనంతంగయున్నది. కాని మనిషి పీల్చునదిలే గాలి ఎంత? ఈ పీల్చే గాలి నిరంతరం రేచకపూరకములుగా నడయాడుచుంటే మనిషి జీవిస్తాడు. రేచక పూరకాలు నిలిచిపోతే

జీవి మరణించును. శరీరమునకు విలువయుండదు. ఈ రేచకపూరక ములుగ నడయాడు వాయువు ప్రాణమనబడును. ఈ ప్రాణము దైవ దర్శనాన్ని, దైవశక్తులను జీవికి కలుగజేస్తాయి.

ఈ సూత్రాన్ని అనుసరించి, ఆచరించి మునుపు ఋషులు, మహర్షులు అనబడేవారు దేవుళ్ళను దర్శించి దైవశక్తులను పొంది, అనంత జ్ఞానాన్ని విశ్వమానవాళికి అందించినారు. సృష్టి రహస్యా లను ఛేదించినారు. విశ్వాంతరాళమును కనుగొన్నారు. అది ఎట్లో పరికింతము.

నాశికముయొక్క కుడి పుటమునుండి వచ్చు గాలి సూర్య స్వరమనియు, నాశికము యొక్క ఎడమ పుటమునుండి వచ్చుగాలి చంద్ర స్వర మనియు, ఈ రెండు కలియుచోటు త్రికూట మనియు చెప్పబడు తాయి. ఆది, మంగళ, గురు, శని వారములు సూర్య దినములు. సోమ, బుధ, శుక్ర వారములు చంద్ర దినములు. ప్రతి ఒక్కరికిని ఉదయము 4 గంటలనుండి ఉదయం 6 గంటల వరకు ఆ యా వారముల యందలి ఆ యా స్వరములు నడచిన ఎడల ఆ దినమునందు ఎట్టి కష్టములును కలుగవు. అట్లు నడువని యెడల ఎవరితోనైనను కలహము, దేహమునకు ఆయాసము, సరియైన వేళకు భోజనము దొరకకపోవడము, ముల్లు గాని గాయము గాని తగిలి రక్తము కనబడుటయు, అధికారులు కోపగించుకొనుటయు ఆదిగాగల కష్టములు కలుగును. ఆయా వారములలో ఆయా స్వరము ఉదయము 4 గంటలనుండి ఉదయం 6 గంటలవరకు ఆడుచుండిన యెడల ధనలాభము, శుభము, ఆనందము, జయము కలుగుట అట్టి నాడి విపరీతముగ ఆడుచుండిన యెడల ఫలితముకూడ విశేషముగ నుండును. అట్లుగాక ఆయా వారములలో ఇంకొక నాడి ఆడు చుండిన యెడల అశుభ ఫలితములు కలుగును.

నియమిత వారములలో నియమిత స్వరములు నడయాడకున్న ఈ క్రింద తెలిపిన విధముగ శాంతి చేసుకొనవలెను. చంద్ర దిన మందు సూర్య స్వరము నడచిన ఎడల దక్షిణమున గాని పడమట గాని కుడి కాలును ముందు బెట్టి మూడు అడుగులు నడచిన యెడల చంద్రబలమగును. సూర్య దినమందు చంద్ర స్వరము నడచిన యెడల తూర్పున గాని ఉత్తరమున గాని ఎడమ పాదమును ముందు బెట్టి మూడు అడుగులు నడచిన యెడల సూర్య బలమగును. అనగా స్వరభిన్నమైనపుడు రాబోవు ఇబ్బందులు పై శాంతి వలన తక్కువ యగును.

పౌర్ణమి పోయిన పాడ్యమి నాడు ఉదయం 4 గంటల నుండి ఉదయం 6 గంటల వరకు సూర్య స్వర ముండిన ఎడల 15 దినముల వరకు జయము కలుగును. అమావాస్య పోయిన పాడ్యమి, విదియ, తదియలందు ఉదయం 4 గంటల నుండి ఉదయం 6 గంటల వరకు సూర్య స్వర ముండిన యెడల నెల దినముల వరకు జయము కలుగును. ఈ దినముల యందు వారస్వరములతో నిమిత్తము లేదు.

సూర్యుడు ప్రతి రోజూ ఉదయిస్తాడు. కాని ప్రతి రోజూ 6 గంటలకు కాక 6 గంటలకు ముందుగాను 6 గంటలకు తర్వాతను ఉదయిస్తాడు. కావున వారస్వరములు నడుపునపుడు సూర్యోదయ సమయమునకు ముందు 2 గంటలు గల కాలములో వారస్వరములు నడుపవలెను.

చంద్రనాడి ఆడుచున్నప్పుడు తూర్పు దిక్కునకు గాని ఉత్తర దిక్కునకు గాని వెళ్ళకూడదు. సూర్యనాడి ఆడుచున్నప్పుడు దక్షిణపు దిక్కునకు గాని పశ్చిమ దిక్కునకు గాని వెళ్ళకూడదు. ఇతరుల దయను సంపాదించుటకు గాని, మంచి కార్యములు జయములు బడయుటకు గాని చంద్రనాడి ఆడుచున్నప్పుడు బయలుదేరవలెను.

సూర్యస్వరము ఆడుచున్నప్పుడు విద్యాభ్యాసమునకు, దీక్షలకు, వ్యవహారము వ్యవసాయము చేయుటకు, శాస్త్రాభ్యాసమునకు, యుద్ధము చేయుటకు, ధైర్యము చేయుటకు, ఆయుధములు చేయుటకు, ఆదాయము చేయుటకు, మారణ ఉచ్చాటన మోహన స్తంభనము మొదలగునవి చేయుటకు మంచిది. చంద్రస్వరము ఆడుచున్నప్పుడు అశ్వగజరథారోహణములు చేయుటకు, చిత్రములు వ్రాసేటందుకు, నూతన వస్త్రాభరణములు ధరించుటకు, లెక్క వ్రాసేటందుకు, స్థిర కార్యములు చేసేటందుకు, వివాహము ఉపనయనములు చేసేటందుకు, గృహప్రవేశమునకు, రాజసముఖమునకు పోయేటందుకు, విత్తనములు వేసేటందుకు, దేవతా ప్రతిష్టలు చేయుటకు, శుభ కర్మములు చేయుటకు మంచిది. చంద్రస్వరము ఆడుచున్నప్పుడు యోగాభ్యాసము చేయుటకు, దివ్య ఔషధ కషాయములు పుచ్చుకొనుటకు మంచిది. కస్తూరి మిళిత తాంబూలము పుచ్చుకొనిన సకలరోగ హారణమగును. అత్యుష్ణమైన క్షీరమును పుచ్చుకొనిన ఆరోగ్యము. శీతాన్నమును భక్షించిన వాతపిత్త రోగములు ప్రారంభమగును. విషదాహము కలిగిన వేళలో సూర్యస్వరమును త్రిప్పి చంద్రస్వరమును నడిపితే విషదాహము హరించును.

దినము ఒకటికి ఘడియలు అరువది. ఘడియకు విఘడియలు అరువది. పన్నెండు మాసములను ఒక దినమునకు పంచివేసుకొనగా నెల ఒకటికి ఘడియలు ఐదు. ఈ ప్రకారం దినం ఒకటికి పన్నెండు మాసములు తెచ్చుకోవలెను. చైత్రం, జ్యేష్ఠం, శ్రావణం, ఆశ్వయుజం, మార్గశిరం, మాఘము ఈ ఆరు మాసములు సూర్యునివి. వైశాఖం, ఆషాఢం, భాద్రపదం, కార్తీకం, పుష్యం, ఫాల్గుణం ఈ ఆరు మాసములు చంద్రునివి. ఋతువు ఒకటికి ఘడియలు పది. ఇట్లు ఆరు ఋతువులకు ఘడియలు అరువది. వసంతఋతువు, వర్ష

ఋతువు, హేమంతఋతువు, చంద్రునివి. గ్రీష్మఋతువు, శరదృతువు, శశిరఋతువు సూర్యునివి. మేషము, మిథునము, సింహాము, తుల, ధనుస్సు, కుంభము ఈ ఆరు రాసులు చంద్రునివి. వృషభము, కర్కాటము, కన్య, వృశ్చికము, మకరము, మీనము ఈ ఆరు రాసులు సూర్యునివి.

అశ్వని, భరణి, కృత్తిక, రోహిణి, మృగశిర, ఆర్ద్ర, పునర్వసు, ఆశ్లేష, మఖ, పుబ్బ, ఉత్తరాషాఢ, శ్రవణం, ధనిష్ఠ, స్వాతి, విశాఖ, పూర్వాభాద్ర, రేవతి, ఉత్తరాభాద్ర ఈ పద్దెనిమిది నక్షత్రములు సూర్యునివి. ఉత్తర, హస్త, చిత్త, అనురాధ, జ్యేష్ఠ, పుష్యమి, మూల, పూర్వాషాఢ, శతభిషం ఈ తొమ్మిది నక్షత్రములు చంద్రునివి. ఆ దినం ఏ నక్షత్రం అవుచున్నదో ఆ నక్షత్రం మొదలు లెక్కవేసుకోవలెను. అమావాస్యపోయినపిమ్మట పదునైదు తిథులున్నూ చంద్రునివి. పౌర్ణమి పోయిన పిమ్మట పదునైదు తిథులున్నూ సూర్యునివి. ఘడియలు రెండింటికి ఒకతిథి, ఆ రోజు ఏది అగుచున్నదో ఆ తిథి ఉదయం మొదలు లెక్కచేసుకొని పదునైదు తిథులు స్వరమును నడుపవలెను. ఆదివారము, మంగళవారము, గురువారము, శనివారము పగళ్ళు సూర్యునివి, రాత్రిళ్ళు చంద్రునివి. సోమవారం, బుధవారం, శుక్రవారం పగళ్ళు చంద్రునివి, రాత్రిళ్ళు సూర్యునివి.

చంద్రవారము, చంద్రనక్షత్రము, చంద్రరాశి, చంద్రపక్షం, చంద్రతిథి, చంద్రస్వరము కలిగియుండవలెను. చంద్రుని దిక్కు దృష్టపరచుకొని యుద్ధము చేయగా దేవతలనైనా జయించవచ్చును. ఆధారచక్రము, స్వాధిష్ఠానచక్రము, మణిపూరకచక్రము. ఇవి సూర్యునివి. సూర్యప్రదక్షిణ, అధోముఖమై యుండును.

అనాహతము, విశుద్ధము, ఆజ్ఞేయ చక్రములు చంద్రునివి. చంద్ర ప్రదక్షిణము, ఊర్ధ్వముఖమై యుండును.

అదేవిధముగ చైత్రశుద్ధ పాడ్యమి, విదియ, తదియలనాడు ఉదయం 4 గంటల నుండి 6 గంటల వరకు చంద్రస్వరముండిన యెడల ఒక్కొక్క దినమునకు నాలుగు మాసముల చొప్పున జయము కలుగును. పాడ్యమియందు చంద్రస్వరము లేనియెడల హాని కలుగును. విదియ యందు చంద్రస్వరము లేనియెడల ధననష్ట మగును. తదియయందు చంద్రస్వరము లేనియడల మనస్సునకు భయము వాటిల్లును. తరువాత నాలుగవ రోజు నుండి ఎనిమిదవ రోజు వరకు వారస్వరమే నడుపవలెను. చవితియందు వారస్వరము లేకున్న ప్రాణప్రదమైన బంధువులకు భయము వాటిల్లును. పంచమి యందు వారస్వరము లేకున్న ఆరోగ్యము క్షీణించును. షష్టియందు వారస్వరము లేకున్న తన దేశమును విడిచి పరదేశమునకు పోవును. సప్తమియందు వారస్వరము లేకున్న సంతాన నష్టము కలుగును. అష్టమియందు వారస్వరము లేకున్న మరుసంవత్సరము అష్టమి లోపల తన ఆయువు సమాప్తి యగును.

సంవత్సరాది దినమున వారస్వరము ఆడకున్న మూడు సంవత్సరములలో మరణము కలుగును. సంవత్సరాది పాడ్యమిలో వారస్వరము ఆడకున్న రెండు సంవత్సరములలో మరణము కలుగును. సంవత్సరాది, పాడ్యమి, విదియ ఈ మూడు రోజులలో వరుసగ వారస్వరము ఆడకున్న ఒక సంవత్సరమునకు మరణము కలుగును. సంవత్సరాది, పాడ్యమి, విదియలలో ఏ దినమైనను ఒక పగలును ఒక రాత్రియును వారస్వరము ఆడకున్న మూడు సంవత్సరములలో మరణము కలుగును. సంవత్సరాది నుండి వరుసగ పదునైదు దినములు సూర్యనాడి నడువకున్న రెండు సంవత్సరములు మాత్రమే

జీవించును. సంవత్సరాది నుండి మూడు రాత్రులు వరుసగ ప్రాణ వాయువు లేకుండిన ఒక సంవత్సరము మాత్రము జీవించును. చంద్రస్వరము రాత్రి చాలా కాలముండినను, సూర్యస్వరము పగలు చాలా కాలముండినను ఆరు మాసములలో మరణము నిశ్చయము.

స్వరములు వాటంతటవి నడమాడు చుండును. ఈ స్వరమును మానవుడు తనకు అనుకూలముగ మార్చుకొను విధానమును ఈ క్రింద చెప్పబడుచున్నది. (1) ఎడమ చేయిని క్రింద ఊనుకొని కూర్చుని ఎడమ కాలి మీద కుడి కాలి నుంచి రెండు కాళ్ళను సమముగ నుంచుకొని వతికల కూర్చొని కుడిచేతితో కుడి కాలు మడిమ నరమును కదలించు చుండిన యెడల కొంత సేపటికి సూర్యస్వరము నడుచును. తద్వ్యతిరిక్తముగ చేసిన యెడల సూర్యస్వరము నుండి చంద్రస్వరమునకు మారును. (2) కూర్చున్నపుడు ఎడమ నాశికము నందుండి శ్వాసను కుడి నాశికమునకు మార్చవలయునన్న చంక క్రింద ఎత్తుగ నుండెడు పీట నేదైన ఎడమ చేతికిని ఎడమ మోచేతికిని మధ్యనుంచి చంకవద్ద నుండెడు పెద్దనరమును పీటమీద నుంచి అదుముచుండిన యెడల కొన్ని నిమిషములలో ఎడమ నాశికము నందుండెడి శ్వాస కుడి నాశికములోనికి మారును. తద్వ్యతిరిక్తముగా చేసిన యెడల కుడినాశికము నందుండెడి శ్వాస ఎడమ నాశికములోనికి మారును. (3) పరుండునపుడు ఎడమ నాశికము నందుండు శ్వాసను కుడినాశికము లోనికి మార్చవలయునన్న ఎడమ వైపున ఓరగిల బరుండి ఎడమ చేతిని తల క్రింద మడత బెట్టి పరుండిన యెడల ఎడమ నాశికము నందుండి శ్వాస కుడినాశికము లోనికి మారును. తద్వ్యతిరిక్తముగ చేసిన యెడల కుడినాశికము నందుండి శ్వాస ఎడమ నాశికములోనికి మారును. (4) నడచునప్పుడు ఎడమ నాశికము నందుండు శ్వాసను కుడినాశికము లోనికి

మార్చవలయునన్న గొడుగును గాని, చిన్న గుడ్డనుగాని బంతివత్తె చుట్టి ఎడమ చంకలో నుంచుకొని వెళ్లుచుండిన యెడల ఎడమ నాశికము నందుండి శ్వాస కుడినాశికము లోనికి మారును. తద్వ్యతిరిక్తముగ చేసిన యెడల కుడినాశికము నందుండి శ్వాస ఎడమ నాశికము లోనికి మారును.

స్వరములు మార్చు విధానము నాకు వెన్నతో బెట్టిన విద్య, ఆయా వారస్వరములను నడిపి నేనెన్నో లాభములను పొందితిని. వాటిలో కొన్నిటిని మీ ముందుంచుచున్నాను.

1977 వ సంవత్సరంలో నేను రెవిన్యూ ఇన్స్పెక్టరుగ యుంటిని. ఆ తాలూకాకు నాలుగు ఫిర్కాలు. నలుగురు రెవిన్యూ ఇన్స్పెక్టర్లు ఉంటిమి. ఒకనాడు తాలూకా కార్యాలయం నుండి నా వద్దకు అటెండరు వచ్చినాడు. మరునాడు ఉదయం తొమ్మిది గంటలకు జిల్లా కలెక్టరు గారిచే జరుపబడు సమావేశమునకు హాజరు కావలసినదిగా వర్తమానం తెచ్చినాడు. ఉన్నఫళంగ నా వద్ద యున్న పెండింగ్ ఫైళ్ళను, పర్సనల్ రిజిష్టరును తీసికొని తాలూకాఫీసుకు వెళ్ళినాను. అక్కడ హెడ్ క్లర్కు వారు చెప్పినదేమంటే ముందు రోజు జిల్లాకలెక్టరు ప్రక్క తాలూకాలో రెవిన్యూ ఇన్స్పెక్టరుల సమీాతో సమావేశమును జరిపిరనియు, తాలూకా కార్యాలయంలో ఒక గుమాస్తా పర్సనల్ రిజిష్టరును ఫైళ్ళను తీసికొని రెవిన్యూ ఇన్స్పెక్టరుకు పంపిన తేదీని ఆ తపాలు డిస్పాచ్ రిజిష్టరులో నమోదైన తేదీని తర్వాత రెవిన్యూ ఇన్స్పెక్టరుకు ఆ తపాలు చేరిన తేదీని, ఆ తపాలుపై రెవిన్యూ ఇన్స్పెక్టరు చర్య తీసికొని రిపోర్టు పంపిన తేదీని రెవిన్యూ ఇన్స్పెక్టరు పర్సనల్ రిజిష్టరులో తనిఖీచేసి మరల రెవిన్యూ ఇన్స్పెక్టరు రిపోర్టు తాలూకాఫీసుకు చేరిన తేదీ, ఎంత సమయంలో తాలూకాఫీసు గుమాస్తా

చర్యతీసికొన్న, తేదీ వర్గైరాలను చేపట్టినారనియు; ఫలానా రెవిన్యూ ఇన్స్పెక్టరు పర్సనల్ రిజిష్టరు సరిగా లేనందున అక్కడికక్కడే అతనిని రిలీవ్ చేసి ఇకమీదట శాశ్వతంగ అతనిని రెవిన్యూ ఇన్స్పెక్టరుగ నియమించరాదని జిల్లాకలెక్టరు కలెక్టరు కార్యాలయానికి నోట్ పంపించినారనియు తెలిపినాడు.

నేను మూడు నెలలుగ పర్సనల్ రిజిష్టరు వ్రాయలేదు. రిపోర్టులు మాత్రం అప్పటికప్పుడే పంపుతుంటిని. నాకేమో దిగులు లేదు. చాలా ధైర్యంగ నవ్వుతూ యుంటిని కలెక్టరుగారు నా జోలికిరారు అని స్టాఫ్ అందరికీ చెప్పితిని. అందరూ నా పని అయిపోయింది అని అన్నారు. నాకేమో చింతలేదు.

మరునాడు ఉదయం తొమ్మిది గంటలకు ఠంచనుగా జిల్లాకలెక్టరుగారు సమీక్షా సమావేశాన్ని ప్రారంభించారు. మొదట హెడ్ క్వార్టర్స్ రెవిన్యూ ఇన్స్పెక్టరును ఒకగంట సేపు సతాయించినారు. అతని పర్సనల్ రిజిష్టరులోని ఎంట్రీసు బాగానే యుండినది. తర్వాత రెండవ రెవిన్యూ ఇన్స్పెక్టరు, ఆ తర్వాత మూడవ రెవిన్యూ ఇన్స్పెక్టరుల పని తీరు చెరి అర్ధగంట సమీక్ష చీవాట్లుతో జరిగింది. ముగ్గురు రెవిన్యూ ఇన్స్పెక్టర్ల సమీక్ష అయిన వెంటనే జిల్లాకలెక్టరు ఇతర సబ్జెక్టులపై సమీక్ష జరిపి మధ్యాహ్నం పన్నెండు గంటలకు వెళ్ళిపోయినారు. నాలుగవ రెవిన్యూ ఇన్స్పెక్టరు అయిన నన్ను జిల్లాకలెక్టరు గారు మరచిపోయినారు కలెక్టరు గారు వెళ్ళిన తర్వాత తాసిల్దారు, స్టాఫ్ అందరూ నన్ను పొగడ్తలతో ముంచెత్తి అదృష్ట వంతుడివి, తప్పించుకొన్నావు అని చుట్టుముట్టినారు, ఆ విధంగ నేను తప్పించుకొన్న విధంలోగల రహస్యాన్ని చెప్పవలసినదిగా ఒత్తిడి చేసినారు. యథాప్రకారం నేను వారిబారి నుండి తప్పించుకొన్నాను. రహస్యాన్ని చెప్పకుండానే

ఇంతకూ నేను చేసిందేమీ లేదు, ఆ రోజు ఉదయం 4 గంటల నుండి 6 గంటల వరకు ఆ రోజు వారస్వారమును నడిపించితిని.

నా శ్రీమతి ఎప్పుడో 1972 సంవత్సరంలో బి.ఏ., మొదటి సంవత్సరం ప్యాస్ అయింది. ఇంగ్లీషు పేపరు తప్పింది. పరీక్ష బాగా వ్రాసినను తప్పినాను గద అనే బాధతో రెండవ మూడవ సంవత్సరపు పేపర్లు వ్రాయలేదు. మాకు 1973 సంవత్సరంలో వివాహమైంది. అప్పటి నుండి నేను బి.ఏ., పరీక్ష మిగిలిన పేపర్లు వ్రాయవలసినదిగా ఎన్నోమార్లు ఒత్తిడి చేసాను. నాకు ఇష్టం లేదు. నా వల్ల కాదు అని మొరాయించేది. అందులకు నీవు చదవవద్దు, నేను చెప్పినట్లు చేయుము. ఆటోమేటిక్‌గ పాసు అవుతావు అని చెప్పినా కూడ వినేది కాదు. ఇక లాభం లేదనుకొని 1986 సంవత్సరంలో నేను మొదటి సంవత్సరం ఇంగ్లీషు పేపరు రెండవ మూడవ సంవత్సరపు మిగిలిన పేపర్లు అన్నింటినీ పరీక్ష ఫీజులు కట్టివేసినాను. ఎకనమిక్సు మూడవ పేపరుకు సంబంధించిన టెక్ట్స్ బుక్‌ను పరీక్షకు వారం రోజులు ముందు తెచ్చి యిచ్చినాను. నా శ్రీమతి ఈ పుస్తకాన్ని సగభాగం మాత్రం ఒక రీడింగ్ ఇచ్చింది. నా శ్రీమతి హైస్కూలు టీచరుగ పనిచేయుచున్నది. ఉద్యోగం, పిల్లలు, వంట, ఇల్లు అన్నీ చూచుకోవాలి. తీరిక యుండేది కాదు. ఐనను నా ప్రోద్బలంతో చదివేందుకు పూనుకొనేది.

పరీక్షలు రానేవచ్చాయి, నేను టైలర్ వద్దకు పోయి ఒక డస్టర్ కుట్టుకొని తెచ్చినాను. డస్టర్ అంటే బ్లాక్‌బోర్డుపై వ్రాసి దానిని తుడిపేందుకు ఉపయోగించే వస్తువు. పరీక్ష హాలు కూర్చొన్న తర్వాత ఈ డస్టరును ఎడమ చంకలో నుంచుకొనవలెను. అట్లుంచుకొన్న యెడల శ్వాస కుడినాసికలో నడయాడుతూ

ఉంటుంది. పరీక్ష మూడు గంటల సమయం. ఈ మూడు గంటలూ శ్వాస కుడి నాసికలోనే నడమాడునట్లు అప్పుడప్పుడు సరిచూచుకోవాలి. ప్రశ్నలకు జవాబులు తెలుసునో తెలియదో ఆ దేవుడికే ఎఱుక. ఎన్ని ప్రశ్నలకు జవాబు వ్రాయవలెనో అన్ని ప్రశ్నలకూ జవాబు వ్రాయవలెను. ప్రతి ప్రశ్నకూ జవాబు మూడు పేజీలకు తక్కువ లేకుండ వ్రాయవలెను. ఆ మూడు గంటలూ పరీక్ష హాలులో విధిగా కూర్చుండవలెను. నేను నా శ్రీమతికి చెప్పిన ప్రక్రియ ఇంతే. నా శ్రీమతికి నేను నేర్పిన విద్యకూడ ఇదే.

తర్వాత రెండు నెలలకు మూడురోజుల కొకమారు ఒక్కొక్క పేపరు రిజల్టు రాసాగినవి. ఆరు పేపర్లు పాస్ అయినట్లు రిజల్ట్సు వచ్చినది. ప్రతి రిజల్టుకూ నా శ్రీమతి సంతోషం అవధులు దాటేది. ఏమంటే తాను చదవలేదు. కాని పాస్ అవుతున్నాను గద అని. కాని కడపటి పేపర్ ఎకనమిక్స్ థర్డుపేపర్ నెంబరు రిజల్టు షీటులో లేదు. దీని అర్థం ఫెయిల్ అనికద. నేను ఇంటికి వచ్చి విషయం చెప్పినాను. పరీక్ష సమయంలో శ్వాసప్రక్రియ నే చెప్పిన విధంగ జరిగిందా అని ప్రశ్నించినాను. ఖచ్చితంగ అమలు చేసినాను అని బదులిచ్చింది. అందులకు నేను ఫరవా లేదు, మార్క్సు స్టేటుమెంటులో పాసు మార్కులు ఉంటాయి, దిగులు పడకు అని చెప్పినాను. ఇది మధ్యాహ్నం జరిగింది.

నేను రాత్రి ఇంటికి వచ్చినప్పుడు నా శ్రీమతి తప్పిపోయిన పేపర్ గురించి స్కూలులో తన సహ ఉపాధ్యాయినులకు చెప్పితిననియు, మార్క్సు స్టేటుమెంటులో పాసుమార్కులుంటాయని నేను చెప్పిన విషయం తాను వారితో చెప్పినదనియు అందులకు వారు

పకపకా నవ్వి యూనివర్సిటీ చరిత్రలో లేదు. రిజల్టులో ఫెయిల్ అయి మార్కుల స్టేటుమెంటులో పాసయియుండేది, మీ ఆయన ఒక వింతమనిషి అని అన్నారు అన్నది. అందులకు నేను ఓపికపట్టు నీవు నేను చెప్పినట్లు పరీక్షహాలులో నడచుకొనియుంటే మార్కుల లిస్టులో తప్పక పాస్‌మార్కులుంటాయి అన్నాను.

ఒకనెల తర్వాత మార్కుల స్టేటుమెంటులు ఒక్కొక్కటే ఇంటికి వస్తున్నాయి. కవరువిప్పి చూస్తే పాసుమార్కులు. అందరికీ సంతోషం, ఎకనమిక్స్ థర్డ్ పేపరు పరీక్ష చిట్టచివర జరిగింది రిజల్టు కూడ చిట్టచివరన వచ్చింది. మధ్యాహ్నం ఒంటిగంటకు నా శ్రీమతి స్కూలునుండి భోజనానికి ఇంటికి వచ్చింది. తలుపు తెరిస్తే లోపల యూనివర్సిటీ కవరు పడింది. అది ఎకనమిక్స్ థర్డ్ పేపర్ మార్కులిస్టే ఉంటుంది. ఎలాగూ ఫెయిల్ అయినాము దానిని విప్పి చూడరాదు చింపివేయవలెను అని కసిగా ఆ కవరును రెండుగా చింపుటకు ప్రయత్నించి అర్ధ అంగుళం చింపి తర్వాత మనస్సును శాంతపరచుకొని కవరునువిప్పి మార్కుల స్టేటుమెంటును చూచింది. అందులో యాభై ఆరు మార్కులు ఉన్నవి. నా శ్రీమతికిఆనందాలు అవధులు దాటినవి. అంతలో నేనుకూడ భోజనానికి ఇంటికివచ్చాను. విషయం చెప్పింది. మధ్యాహ్నం భోజనాంతరం నా శ్రీమతి స్కూలుకు పోయి ఆ మార్కుల స్టేటుమెంటును సహోపాధ్యాయినులకు చూపినది. అందరూ ఆశ్చర్యపోయినారు.

నేను కలెక్టరు క్యాంపుక్లర్కుగ సుమారు పది సంవత్సరములు పనిచేసినాను. నేను ఉద్యోగంలో చేరేటప్పుడు నా క్వాలిఫికేషన్ S. S. L. C. స్వరముల గురించి నా కదివరకే తెలిసినందున కలెక్టరు క్యాంపు క్లర్కుగ పనిచేయుచూ P.U.C; B.A., లు ప్యాసు అయినాను.

నేను 1936 నుండి 1998 వరకు ఒక ప్రాంతంలో డిప్యూటి తాసిల్దారుగా పని చేసినాను. నేను చాలా చలాకిగా వుండేవాడిని. ఎవరైనా కష్టాలున్నవారు నా వద్దకువచ్చి విషయం చెప్పితే క్లూ ఇచ్చే వాడిని. పని అయ్యేది. ఆ ఏరియావాళ్ళు నాకు 'రథసారథి' అని పేరు పెట్టినారు. 1998 అక్టోబరు మొదటి వారంలో ఒక అబ్బాయి వచ్చినాడు. తాను బి.ఏ. ఫలానా పేపరు రెండుమార్లు బాగా వ్రాసి కూడ పాస్ కాలేదనియు, దీనికి మార్గం ఏదైనా చెప్పవలసినదిగా అడిగినాడు. అక్టోబరు చివరివారంలో పరీక్షకూడ యున్నట్లు తెలిపి నాడు. అందులకు నేను అతనిని టైలర్ వద్ద ఒకడస్టరు కుట్టించుకొని పసుపు, కుంకుమ కర్పూరం, ఊదువత్తి, రెండు అరటిపండ్లు ఒక రూపాయ గురుదక్షిణ ఇమ్మన్నాను. పరీక్షలకు నాలుగు రోజులు ముందుగా వీటిని తెచ్చినాకు ఇచ్చినాడు. వీటిని నేను పూజలో పెట్టి పరీక్ష ముందురోజు ఇస్తాను అని చెప్పినాను. అతనికి శ్వాసను మార్చు విధానాన్ని నేర్పినాను. పరీక్షకు ముందురోజు సాయంత్రం సదరు డస్టరును అతనికి ఇచ్చి పరీక్షాసమయంలో దానిని ఎడమచంక క్రింద నుంచుకొని శ్వాసను కుడినాశిక ద్వారా పరీక్షాసమయం మూడు గంటలూ నడపవలసిందిగాను ఎన్నిప్రశ్నలకు జవాబు వ్రాయవలెనో అన్నిప్రశ్నలకు జవాబు వ్రాయవలసింది గాను, ప్రతి ప్రశ్నకూ కనీసం మూడు పేజీలైనా తోచిన జవాబు వ్రాయవలసినది గాను చెప్పిపంపినాను. అతడు మరుసటిరోజు పరీక్షవ్రాసి ఆ సాయంత్రం నావద్దకు వచ్చి నేను చెప్పిన విధానాన్ని తూచ అవలంబించినట్లు నాతో చెప్పినాడు. తప్పక పాసుఅవుతావు లెమ్మని నేను భరోసా ఇచ్చినాను. జనవరినెలలో రిజల్టు వచ్చింది. ఇతను పాసుఅయినాడు. ఇతని ఆనందానికి అవధులు లేకుండా పోయింది. కనబడిన వారందరితో నేనేదో మంత్రగాణ్ణి, నా మంత్రం సాయంతో అతను పరీక్ష పాసు అయినట్లు అందరికీ చెప్పూచున్నాడు.

అసలు విషయం ఏమంటే పరీక్షాసమయంలో కుడి నాశికలో శ్వాసను నడిపిస్తూ పరీక్షవ్రాస్తే తమకు తెలియకుండానే అన్ని ప్రశ్నలకూ సరియైన సమాధానాలు ఆటోమాటిక్ గా వ్రాస్తారు.

సూర్య చంద్ర స్వరముల యందు ఐదేసి తత్త్వములు కలవు. 16, 12, 8, 4 అంగుళముల పొడవుకల పుడకల కొనలకు దూది చుట్టి ముక్కు పుటమునకు తగిలించి రేచకపువాయువును విడిచిన యెడల వాయువు యొక్క ప్రమాణము తెలియును. సూర్యస్వరము నందు ఆకాశమాదిగాగల పంచతత్త్వములును, చంద్రస్వరమున పృథివి ఆదిగాగల పంచతత్త్వములును ఒక్కొక్క ఘడియ చొప్పున నడచును. లేక అనుభవం పై కూడ ఈ ప్రమాణాన్ని తెలిసికో వచ్చును. పృథివి తత్త్వము 16 అంగుళముల ప్రమాణము. ముక్కు రంధ్రము నడుమ సంపూర్ణముగ నడచును. స్థిరకార్యములు చేయు టకు, ఉద్యోగములో చేరుటకు, దేవాలయములు కోటలు కట్టుటకు, చెఱువులు బావులు త్రవ్వుటకు, తోటలు ఉద్యానవనములు నాటు టకు, గృహప్రవేశములు అభిషేకములు వివాహములు యజ్ఞములు హోమములు గర్భాదానములు వగైరా శుభకార్యములు చేయుటకు, యుద్ధము సంధి చేసికొనుటకు మంచిది. సముద్రయానము చేయుటకు, అన్నిటికీ మంచిది.

అపోతత్త్వము 12 అంగుళముల ప్రమాణము. ముక్కు రంధ్రము కిందికి తాకి నడచును. చరకార్యములు చేయుటకు మంచిది. మేలైన కార్యములు చేయుటకు ప్రయత్నించిన సిద్ధిం చును శుభకార్యములు చేయుటకు మంచిది. అన్ని కార్యములకు శుభము.

తేజోతత్త్వము 8 అంగుళముల ప్రమాణము. నాశిక పుటము పైకి తాకి నడచును. లయ కార్యములకు మంచిది. ఒకరిని ఘాత చేసి చెరుపుటకు, ఒకరిని సంహరించుటకు, పాపకృత్యమైన కార్యములు చేయుటకు మంచిది. కార్యహాని, మరణవ్యాధి పుట్టించును. విత్తనములు చల్లితే మొలవనేరవు. వివాహము చేస్తే విధవయగును. లేక చచ్చును. కూప తటాకములు త్రవ్వితే నీళ్ళు లేక పోవును.

వాయు తత్త్వము 4 అంగుళముల ప్రమాణము. నాశిక పుటమునకు అడ్డముగ నడచును. తీవ్ర కార్యములకు మంచిది. పారిపొయ్యేటందుకు, తాను దాగియుండేటందుకు, శత్రువులకు చిక్కబడకుండ యుండుటకు మంచిది. వాహనములు ఎక్కుటకు, లీలా వినోదములకు, స్తంభన మోహన ఉచ్చాటన ఆకర్షణ మొదలైన మంత్రోచ్చారణలు చేయుటకు, యుద్ధము చేయుటకు మంచిది.

ఆకాశతత్త్వము నాశికా పుటమునుండి ఝంకారమై నడచును. లక్షించి చూడగ లేకపోవును. దేవతార్చన మొదలైన పూజలకు, సమస్త విద్యలు అభ్యాసము చేయుటకు, సద్గురు సేవచేసి గురు కటాక్షమువల్ల జ్ఞానోపదేశము పొందుటకు మంచిది. ఆకాశ తత్త్వమున ప్రయాణము అయిపోతే మృత్యువు సంభవించును. లాభలోభములు లేనిది. యోగసిద్ధికి, గురుపూజ దేవపూజ మంత్ర జపధ్యానములకు, ముక్తిసాధనకు, ప్రతిష్ఠలకు, ఉపదేశములకు మంచిది.

సూర్య స్వరమున పృథివి అపోతత్త్వములు మంచివి. సంవత్సరాదియందు వచ్చు చైత్ర శుద్ధ పాఢ్యమి నాడు ఉదయం 4 గంటల నుండి 6 గంటల వరకు ఏ తత్త్వము నడచుచున్నదో చూడవలెను. పృథ్వీ ఆపోతత్త్వములైన సౌఖ్యము సంతోషము జలతత్త్వమైన

ఆరోగ్యము. తేజోతత్త్వమైన వర్షము తక్కువ. వాయుతత్త్వమైన రోగము ఆకాశతత్త్వమైన రోగములు ఉపద్రవములు కలుగును. అనగా ఆ సంవత్సరమున దేశస్థితి ఈ రీతిగ నుండునని తెలిసికొన వలెను.

ఈ తత్త్వముల ప్రమాణమును అనుభవ పూర్వకముగ తెలిసికొని ఆచరించిన లాభ పడుదురు, సుఖింతురు.

ఇదివరకు ముప్పై ఆరో తత్త్వమగు బ్రహ్మ చైతన్యమనబడు ఎఱుక తాను అని తెలిసికొనుటకు ఆరు విధములైన తత్త్వములతో కూడిన స్థూలశరీరమును సాధనయంత్రము నిర్మించిన విధానము, కమలములు, అధిదేవతలు చెప్పబడినవి. మరియు స్థూలశరీరములో ప్రాణ మనబడే శ్వాస రేచక పూరకములుగ నడమాడు విధానము కూడ చెప్పబడినది. ఇప్పుడు స్థూలశరీరమును సాధన యంత్రంగ నుపయోగించి ప్రాణాయామ ప్రక్రియ ద్వారా బ్రహ్మ చైతన్యము అనబడే ఎఱుకను తెలిసికొను విధానము చెప్పబడుచున్నది.

మనోనిగ్రహము ఒక్క యోగాభ్యాసము వల్లనే కలుగును. మనోనిగ్రహము లేకుండ సర్వశాస్త్రములు వల్లించినను మాటలు చెప్పుటకు ఉపయోగపడునే కాని తరించుటకు శక్యము కాదు. గృహమునకు పునాది వలె వైరాగ్యమునకు యోగము ప్రధానమైనది. ప్రపంచ విషయ వాంఛల నుండి తప్పించుకొనుటకు యోగము ముఖ్యము. అభ్యాసము వైరాగ్యములచే అంతఃకరణములను స్వాధీనము చేసికొన లేని వారికి యోగము అసాధ్యము. యోగాభ్యాసమును నిరంతరము చేయుచుండవలెను గాని మధ్య మధ్య మానుట వలన ఫలితము శూన్యము.

యోగాభ్యాసమును చేయుటకు పెక్కు నియమములను పాటింపవలెను. ఆహారమును అతిగా భుజించుట, ప్రయాసను కలుగ జేయు పనులను చేయుట, అధికముగ మాటలాడుట, నియమ గ్రహణము, నీచులతో సాంగత్యము, చపలత్వము అను ఈ ఆరును యోగాభ్యాసమునకు తగనివి. ఉత్సాహము, సాహసము, తత్త్వ జ్ఞానము, స్థిరబుద్ధి కలిగియుండవలెను. అహింస, సత్యము, ద్రోంగ లింపబడక యుండుట, బ్రహ్మచర్యము, ఇతరుల వలన బాధ కలిగి నపుడు ఓర్పు కలిగియుండుట, ధైర్యము కలిగియుండుట, స్థిర స్వభా వము, దయ, మితమైన సాత్త్విక ఆహారము, నావారు పరవారు అను భేదము లేకుండుట యను నీ పదియును యమము అనబడును. తపస్సు, సంతోషము, ఆస్తిక్యము, దానము, దైవభక్తి, మహాత్ము లచే చెప్పబడిన మాటలు వినుట, ధర్మవిరుద్ధములగు వ్యవహారము లలో ప్రవేశింపకుండుట, సత్కర్మలను వైదిక కర్మలను ఆచరించుట, జపము వ్రతము అను ఈ పదియును నియమము అనబడును. యోగా భ్యాసము నాచరించువాడు పై చెప్పిన యమనియమములను తుచ తప్పక పాటించవలయును. అప్పుడే యోగాభ్యాసము చేయుటకు మనస్సు అంగీకరించును. మనస్సు స్వాధీనములో నుండును.

తర్వాత ఆసనము. ఆసనము వలన రజోగుణము నశించును, రజోగుణము నశించుట వలన మనస్సున్ను శరీరమున్ను చలింపక యుండును. అందువలన స్థిరత్వము కలుగును. వ్యాధులు, అనర్హత. సంశయము, అజాగ్రత్త. ఆలస్యము, అసంతృప్తి, భ్రాంతి, జ్ఞానము కుదరకపోవుట, మనస్సు స్థిరముగ నుండకుండ పోవుట అను చిత్త వికారములు; తమోగుణము సకలమును ఆసనసిద్ధి వలన నశించును.

మరియు శరీరబలము, ఆరోగ్యము, ఆకలి కలుగును. ఏదో యొక ఆసనమున శరీరమును అణుమాత్రమైనను కదల్పక సుమారు మూడు గంటల కాలము నిశ్చలముగ కూర్చుండవలెను. అప్పుడే ఆసనసిద్ధి కలుగును. ఆసనసిద్ధి వలన ఉత్తీర్ణత చెందుటకు వీలుపడును. ఉత్తీర్ణత వలన బుద్ధి స్థిరత్వము కలిగి హృదయమున నిర్మలత్వమును, శాంతియు, అనంతమైన ఆనందమును కలుగును.

ఆసనములలో పద్మాసనము శ్రేష్ఠమైనది. ఈ పద్మాసనము వలన శ్వాసగతి మందమగును. కుంభకము వృద్ధియగును. దేహమున రక్తము బాగుగ ప్రసరించును. అందువలన సమస్త రోగములు నివారణ యగును.

ఆసనములో కూర్చొని యున్నప్పుడు నేత్రములను మూసికొని త్రికూటమున దృష్టిని కేంద్రీకరింపవలెను. అందువలన మనస్సు సులభముగ స్వాధీనమై ఏకాగ్రతను మనోనిశ్చలత్వమును పొందవచ్చును. ఆసనమున కూర్చొన్నప్పుడు శిరస్సును కంఠమును క్రిందకు వంపక నిటారుగ నుంచి, శరీరమును పొడిగించి, త్రికూటమున కన్నుల నిక్కి-చూచుచు ఠీవిగ కూర్చుండవలయును. ఆసనాభ్యాసమును ప్రతిరోజూ ఉదయం ఒకటిన్నరగంట సాయంకాలం ఒకటిన్నరగంట ఆచరింపవలయును. ఆసన సిద్ధి సుమారు మూడు మాసములకు కలుగును.

ఆసన సిద్ధి కలిగిన తర్వాత ప్రాణాయామమును ఆచరింపవలెను. సన్నని రంధ్రము గల నొక గదిలో ఒక అంగుళము ఎత్తు గల పీటపై దర్భ చాపను పరచి, దానిపై జింక చర్మమును పరచి, దానిపై తెల్లని బట్టను మడతతో నమర్చి, ఉత్తర ముఖంగ కూర్చుండి ప్రాణాయామ అభ్యాసమును ఆచరింపవలెను. అది ఎట్లనగా.

ఎడమముక్కున వాయువును కొన్ని మాత్రల కాలము పూరించి, అంతకు రెట్టింపు కాలము కుంభకమున నిల్పి, కుంభించి, ఆ కుంభించిన వాయువును కుడిముక్కున మెల్లమెల్లగ విడిచి, మరల కుడిముక్కున వాయువును కొన్ని మాత్రల కాలము మెల్లమెల్లగ పూరించి కుంభకమున నిల్పి కుంభించి ఆ కుంభించిన వాయువును ఎడమ ముక్కున మెల్లమెల్లగ విడువవలయును. ఈ విధంగ సుమారు అర్ధ గంటమైన చేయవలయును. ఈ విధంగ యథాశక్తిగ ప్రతిదినము ప్రాతఃకాలము మధ్యాహ్నము సాయంకాలము రాత్రి ఈ నాలుగు వేళలయందు అభ్యసించుచుండిన యెడల మూడు మాసములకు సులభముగ కొన్ని నిమిషముల కాలము వాయువును కుంభకము చేయుటకు శక్తి కలుగును. ఈ కుంభకము వలన శరీరములో అణగి యుండు సకల రోగములు నశించును. శరీర ఆరోగ్యము, బుద్ధిబలము కలుగును. రేచక పూరకములు లేని కేవల కుంభకము సిద్ధించు పర్యంతము ప్రాణాయామమును తప్పక చేయవలయును.

వాయువు (రేచకములు) చలించిన యెడల చిత్తము చలించును. వాయువు చలింపని యెడల చిత్తము చలింపకుండును. వాయువు చిత్తమును చలింప నప్పుడు యోగము సిద్ధించినదని అర్థము. యోగసిద్ధిని పొందినవాడు స్థిరమైన శాశ్వత జీవితమును పొందును.

ఏ యోగి చేత వాయువు (ప్రాణము) కట్టుబడుచున్నదో ఆ యోగి చేతనే మనస్సున్ను కట్టుబడుచున్నది. ఏ యోగి చేత మనస్సు కట్టుబడుచున్నదో ఆ యోగి చేతనే ప్రాణవాయువున్ను అనగా మనస్సు గాని వాయువు గాని ఈ రెండింటి యందు ఒకదానిని కట్టిన యెడల ఈ రెండును కట్టుపడును. మనస్సు స్థిరపడిన యెడల ప్రాణవాయువును స్థిరపడును. ప్రాణవాయువు స్థిరపడిన

యెడల శుక్ల శోణితము స్థిరమగును, శుక్లశోణితము స్థిరపడిన యెడల బలము, దేహస్థిరత్వము కలుగును. అందువలన మృత్యువును జయింపనగును. అనగా తన మృత్యువు తన స్వాధీనములోనే యుండును. ఎంతటి దుస్సాధ్య కార్యములనైనను అవలీలగ చేయ వచ్చును. గాంభీర్య శౌర్య శమ దమ శాంతి యాదిగాగల సుగుణము లలవడును. సూర్యచంద్రాదుల యొక్క గమనమును నిరోధింపవచ్చును. నిరంతర యోగాభ్యాసము వలన వాక్సిద్ధి, కామ రూపము (తలచిన రూపమును ధరించుట) అదృశ్యకరణి (ఎదుటి వార లకు కనబడకుండునట్లు ఉండుట), తన మలమూత్రములను ఇనుముపై రాచినచో అది బంగారుగ మారుట మొదలగు చిత్ర సామర్థ్య ములు కలుగును. అణిమాది సిద్ధులతో కూడి యుండుట వలన సర్వ లోకముల యందును విహరింప వచ్చును. ఒకప్పుడు తనంతట తానే దేవుడుగానై సర్వలోక వాసులచే పూజల నందుకొనవచ్చును.

మానవ మాత్రుడైనను తన కిష్టమైన ఎడల మరుక్షణముననే యక్షుడుగాను కావచ్చును. సింహ, వ్యాఘ్ర, గజ, అశ్వములు వగైరా జంతుజాలములు యోగి ఇష్టానుసారముగ ప్రవర్తించును. కణ్వమహర్షి ఆశ్రమంలో పసిబాలుడు భరతుడు సింహ శార్దూ లాలతో ఆడుకొనుచుండెననియు, విశ్వామిత్రుడు త్రిశంకు స్వర్గమును సృష్టించెననియు, సృష్టికి ప్రతిసృష్టి చేసెననియు పురాణాలలో యున్నవికదా. ఇవి అంతయు ఆ మహనీయులు కేవల కుంభక ప్రాణా యామము చేసి సిద్ధి పొందినందువలననే కలిగినది. ఈ ఆత్మశక్తి మహిమ చేతనే మన పూర్వీకులు బ్రహ్మర్షులుగను, సిద్ధులుగను, ముక్తులుగను, భక్తులుగను ప్రకాశించిరి. మరియు కేవల కుంభక మహిమ చేతనే విశ్వామిత్రాది మహర్షులు తమకు ఎన్నియో పర్యాయములు తపోభంగము కలిగినను సమర్థించుకొనగలిగిరి. ఈ

కేవల కుంభకము నందు నిపుణత పొందిన మహానుభావులే ఇప్పటికిని నక్షత్రమండలమున దివ్యజ్యోతి స్వరూపులై ప్రకాశించుచున్నారు. ఇంద్రాది అష్టదిక్పాలురును, నవగ్రహములును, అష్టవసువులును, ఏకాదశ రుద్రులును, ద్వాదశాదిత్యులును, సప్తర్షులును కేవలము కుంభకము వలన సిద్ధి పొందినందు వలననే ప్రస్తుత ఈ స్థితులలో యున్నారు ఈ కేవల కుంభక శక్తి చేతనే త్రిమూర్తులు సృష్టి స్థితి లయకార్యముల నిర్వర్తించు శక్తులను కలిగియున్నారు.

కండ్లను మూసికొని నాశికాగ్రము నందు దృష్టిని నిలిపి చూచుట ఖేచరి యను ముద్ర యనబడును. నేత్రములను తెరచి యుంచి నాశికాగ్రమున దృష్టిని నిలిపి చూచుట భూచరి యను ముద్ర యనబడును. భ్రూమధ్యమున దృష్టిని నిలిపి అంతర్లక్ష్యమున మనస్సును నిలుపుట మధ్యమ లక్ష్యము అనబడు ముద్ర యనబడును. చెవుల రంధ్రములను నాశికా రంధ్రములను చేతివ్రేళ్ళతో మూసియుంచి భ్రూమధ్యమున దృష్టిని నిలిపి చూచుట షణ్ముఖి అనబడు ముద్ర యనబడును. మనోమారుతములు రెండింటినీ బంధించి అంతర్లక్ష్యబాహ్యలక్ష్యముల దృష్టిలో చూచుట శాంభవి అనబడు ముద్ర అనబడును.

కేవల కుంభక సిద్ధి కలిగిన తర్వాత ఈ పంచముద్రల సాధనలను ఆత్మయందుండు పరబ్రహ్మ స్వరూపమును చూచు శక్తి లభించు వరకు పట్టు వదలక మొదట సాధింపవలెను. అటుపిమ్మట సూర్య చంద్ర నక్షత్రములలో నుండు బిందువును మలిన రాహిత్యమున దృష్టిచే నైక్యముచేసి బాహ్యమధ్య అంతర్లక్ష్యములతో సాధించి మండలత్రయము నందుండు ముప్పదిఎనిమిది కళలను చూచు సాధనమును ఆచరింప వలయును. ఈ విధానము తారక యోగము అనబడును.

పిమ్మట అమనస్కము అనబడు యోగవిధానమును అభ్యసించు విధానము చెప్పబడుచున్నది. ఆసనముపై కూర్చొని చూపులను త్రికూటమున నిల్పి ఎడమముక్కును మూసి కుడి ముక్కు ద్వారా లోనగల శ్వాసనంతయు మెల్లమెల్లగ ఓం ...... ఓం .. ... ఓం ...... అనుకొనుచు పూర్తిగ వదలి వెన్వెంటనే ఓం ... ... ఓం ...... ఓం ...... అనుకొనుచు మెల్లమెల్లగ శ్వాసను కుడిముక్కు ద్వారా హృదయములో గాలిసంచి నిండునంత వరకు పీల్చవలయును. తర్వాత ఈ శ్వాస బయటకు రాకుండు నటుల కంఠమును మూతపెట్టవలయును. ఇప్పుడు పీల్చిన శ్వాస కుంభకములో నున్నదికదా. సాధకుడు తనకు ఎంతవరకు వీలగునో అంత వరకు ఓం ...... అనుకొనుచు పీల్చిన శ్వాసను కుంభకములో నుంచుకొని ఇక వీలుకాదని తోచినపుడు నోటి దంతములను గట్టిగ బిగబట్టి ముందు కుడిముక్కున పీల్చిన శ్వాసను కుడిముక్కున వదలక, కుడిముక్కును మూసి, ఎడమముక్కులో సుమారు ఆరు అంగుళముల శ్వాసను ఓం ...... అని అనుకొనుచూ బయటకు వదలి వెన్వెంటనే ఆరంగుళముల శ్వాసను ఎడమ ముక్కున లోపలికి పీల్చి, ఎడమ ముక్కును మూసి కుడిముక్కున ఆరు అంగుళముల శ్వాసను బయటకు వదలి వెన్వెంటనే ఆరంగుళముల శ్వాసను కుడి ముక్కున లోపలకు పీల్చి ఈ విధముగ శ్వాసవేగము అణగునంత వరకు ఎడమ కుడి రెండుముక్కులను వ్రేళ్ళతో మార్చి మార్చి కుంభక వాయువును వదులుచూ పీల్చుచూ నుండవలెను. సుమారు పది నిమిషములకు శ్వాసయొక్క వేగము అణగును. ఇట్లు శ్వాస యొక్క వేగము అణగినంతనే యోగాభ్యాసము చేసినందు వలన కలిగిన శ్రమను తీర్చుకొనుటకు గాను 'సో' అని మనస్సున అనుకొనుచు గాలిని లోపలకు పీల్చుచు 'హం' అని మనస్సున అను

కొనుచు గాలిని బయటకు వదులుతూ సుమారు పది నిమిషముల వరకు సేద తీర్చుకొనవలెను.

మరల చూపులను త్రికూటమున నిలిపి ఎడమ ముక్కును మూసి కుడిముక్కు ద్వారా లోనగల శ్వాసను ఆరంగుళముల ప్రమాణమును మాత్రమే ఓం ... .. అని అనుకొనుచు బయటకు వదలి కుడిముక్కును మూసి ఎడమముక్కు ద్వారా ఆరంగుళముల ప్రమాణము గల శ్వాసను ఓం ..... అని అనుకొనుచు బయటకు వదలి ఎడమముక్కును మూసి కుడిముక్కు ద్వారా ఆరంగుళముల ప్రమాణము గల శ్వాసను మాత్రము ఓం ...... అని అనుకొనుచూ బయటకు వదలి ఈ విధంగ లోపలనుండు పాత శ్వాసనంతయు కుడి, ఎడమ ముక్కుల ద్వారా ప్రతి ద్వారములోను ఆరంగుళములు ప్రమాణము గల శ్వాసను మాత్రమే వదులుతూ కడపటి శ్వాసను కుడిముక్కు ద్వారానే వదలి, ఆ కుడిముక్కుతోనే వెన్వెంటనే ఆరంగుళముల ప్రమాణమంత శ్వాసను ఓం ... ... అని అనుకొనుచూ లోపలికి పీల్చి కుడి ముక్కును మూసి ఈ విధంగ ఆరంగుళముల పొడవంతటి శ్వాసను ఓం ...... అని మనస్సున అనుకొనుచూ కుడి ఎడమ ముక్కుల ద్వారా లోపలకు మార్చి మార్చి పీల్చి కడపటి శ్వాసను కుడిముక్కుననే పీల్చవలెను. ఇప్పుడు ఇరుముక్కులలో పీల్చిన గాలి కుంభకములో నున్నది. సాధకుడు తనకు ఎంతవరకు వీలగునో అంతవరకు ఓం ...... ఓం ...... ఓం ...... అనుకొనుచు పీల్చిన శ్వాసను కుంభకములో నుంచుకొని ఇక పీల్చుటకు వీలుకాదని తోచినప్పుడు నోటి దంతములను గట్టిగ బిగబట్టి కుడిముక్కును మూసి ఎడమముక్కులో ఆరంగుళముల ప్రమాణమంత శ్వాసను ఓం ...... అని అనుకొనుచూ బయటకు వదలి మరల ఆరంగుళముల ప్రమాణము గల

శ్వాసను ఓం ...... అని అనుకొనుచూ లోపలికి పీల్చి ఎడమ ముక్కును మూసి కుడిముక్కున ఆరంగుళముల ప్రమాణమంత శ్వాసను ఓం ...... అని అనుకొనుచూ బయటకు వదలి మరల ఆరంగుళముల ప్రమాణము గల శ్వాసను ఓం ...... అని అనుకొనుచూ కుడిముక్కుతో లోపలికి పీల్చి ముక్కును మూసి ఈ విధముగ శ్వాసయొక్క వేగము అణగునంతవరకు ఎడమకుడి రెండు ముక్కులను మార్చిమార్చి కుంభకపు వాయువును సుమారు పది నిమిషములు వదులుచూ పీల్చుచూ ఉండవలెను. ఈ విధముగ శ్వాసయొక్క వేగముఅణగినంతనే యోగాభ్యాసము చేసినందువలన కలిగిన శ్రమను తీర్చుకొనుటకుగాను 'సో' అని మనస్సున అనుకొనుచూ గాలిని లోపలికి పీల్చుచూ 'హం' అని అనుకొనుచూ గాలిని బయటకు వదులుతూ సుమారు పది నిమిషములు సేద తీర్చుకొనవలయును.

పై చెప్పిన యోగమును ఉదయ సాయం కాలములలో ఆసనము వేసికొని వారస్వరములు పాటించుచూ చేయవలెను అనగా ఆదివారము సూర్యవారము కద. ఆ రోజు ఉదయం కుడి ఎడమ కుడి ఎడమ కుడులు గాను అదే రోజు సాయంత్రం ఎడమ కుడి ఎడమ కుడి ఎడమల గాను చేయవలెను. సోమవారం చంద్రవారము కద. ఆ రోజు ఉదయం ఎడమ కుడి ఎడమ కుడి ఎడమలు గాను అదే రోజు సాయంత్రం కుడి ఎడమ కుడి ఎడమ కుడులు గాను సాధన చేయవలెను.

మొదటినుండి గురువు పర్యవేక్షణలో పై కుంభక విధానమును పాటించుట ఉత్తమము. గురువు లేకపోయినను పై విధానమును ఒకటికి నాలుగుమార్లు చదివి అర్థం చేసుకొని ఆచరించినను ఉత్తమము. కాని ఈ క్రింద చెప్పబోవు ప్రక్రియను గురువు పర్య

మనబడును. కావున ఈ అమృతము వల్ల ఆకలి దప్పి నిద్ర మొదలగు దేహావసరములు లేకనే యోగి సమాధి నిష్ఠలో ఎన్ని మన్వంతరము లైనను జీవించియుండును. ఇటువంటి యోగి బ్రహ్మ ప్రళయమున కూడ మృతి చెందడు. ఈ సమాధి స్థితియే పరమాత్మయందు ఐక్యము అగుట అనబడును. బ్రహ్మ సాక్షాత్కారము బడయుటయు యనబడును.

పై కనిన విధముగా యోగాభ్యాసము వలననే ముక్తి పొంద వచ్చును. అట్లు గాక భక్తి పారవశ్యములతో భజనలు చేసినను, తటాకములు త్రవ్వించినను, దేవాలయము కట్టించినను రాజ్యము లేలినను, అడవుల యందు సంచరించుచూ కొండ గుహాలయందు మోక్షమెచట లభించునో యని భూలోకములోని గొప్పగొప్ప క్షేత్ర ములను దర్శించినను, తీర్థములలో మునిగినను, కాశి బదరికాశ్రమము మొదలైన పవిత్ర స్థలములలో నివసించినను, భూమిపై చాలా కాలము బ్రతికినను, యజ్ఞయాగాది క్రతువులను ఆచరించినను సాంఖ్యహఠాది యోగములు చేసినను, వర్ణాశ్రమ ధర్మములను తప్పక అనుష్ఠించి వేదాంత శాస్త్రములు వల్లించి పండితుడని పేరెత్తినప్పటికిన్ని, త్రిమూర్తులను పూజించినప్పటికిన్ని ముక్తిని పొందలేరు.

పై చెప్పిన అమనస్క యోగము చేయునపుడు సాధకుడు తాను కుంభించిన పండ్రెండు అంగుళముల శ్వాసలో ఒక అంగుళము శ్వాసను లోపలనే నిలుపుకొని పదునొకండు అంగుళముల శ్వాసను మాత్రము బయట వదలిన యెడల ప్రపంచేచ్ఛ తొలగును. రెండ గుళముల శ్వాసను లోపల నిలుపుకొని పది అంగుళముల శ్వాస మాత్రము బయట వదలిన యెడల మనస్సు ఆనందమును పొంది జ్ఞానమును పొందును. మూడంగుళముల శ్వాసను లోపల నిలుపు

కొని తొమ్మిది అంగుళముల శ్వాసను బయట వదలిన యెడల వివేకి అగును. నాలుగు అంగుళముల శ్వాసను లోపల నిలుపుకొని ఎనిమిది అంగుళముల శ్వాసను మాత్రం బయట వదలిన యెడల దూరదేశ ములయందు జరుగుచుండెడి విషయములు చెప్పగలుగును ఆరంగుళ ముల శ్వాసను లోపల నిలుపుకొని ఆరంగుళముల శ్వాసను మాత్రము బయట వదలిన యెడల ఆకాశము నందుండు సకలమును కనుగొనవచ్చును. ఏడంగుళముల శ్వాసను లోపల నిలుపుకొని ఐదంగుళముల శ్వాసను మాత్రము బయట వదలిన యెడల శరీరము కాయసిద్ధిని పొందును. ఎనిమిది అంగుళముల శ్వాసను లోపల నిలుపుకొని నాలుగు అంగుళముల శ్వాసను మాత్రమే బయట వదలిన యెడల అణిమాది సిద్ధులు కలుగును. తొమ్మిది అంగుళముల శ్వాసను లోపల నిలుపుకొని మూడు అంగుళముల శ్వాసను మాత్రమే బయట వదలిన యెడల నవఖండముల యందు సంచరించును. పది అంగుళముల శ్వాసను లోపల నిలుపుకొని రెండు అంగుళముల శ్వాసను మాత్రమే బయట వదలిన యెడల పరకాయ ప్రవేశము చేయగలుగును. పదునొకండు అంగుళముల శ్వాసను లోపల నిలుపు కొని ఒక అంగుళము శ్వాసను మాత్రము బయట వదలిన యెడల తన ఆత్మయందు ఐక్యమగును. పండ్రెండు అంగుళముల శ్వాసను లోపల నిలుపుకొని యున్న ఆ శ్వాస పుట్టినచోటునే తిరుగుచుండును. ఈ స్థితి సమాధి నిష్ఠ, బ్రహ్మసాక్షాత్కారము అనబడును. అప్పుడు తానే సర్వస్వము సర్వము తానే యగును.

మహర్షులు ఆదిగాగల అవధూతలు ప్రాక్టికల్‌గ యోగాభ్యా సాన్ని అభ్యసించి విద్యనార్జించిరి. జ్ఞానాన్ని పొందిరి. ఆ జ్ఞానాన్ని లోక కల్యాణార్థం మనకు అందించిరి. మనకేమో ప్రాక్టికల్స్ లేదు. సాధన అసలే లేదు. పుస్తక జ్ఞానం మాత్రం ఏ కొద్దిమందికో

యున్నది. కావున నిష్ఫలు లౌతున్నాము. ఇందులకు ఉదాహరణగా నా స్వానుభవాన్ని మీ ముందుంచుట సమంజసమని నాకు తోస్తున్నది.

నా మాతామహుడు అవధూత. ఆయనకు నేను శుశ్రూష చేసేవాడిని. ఆయన నాపై కరుణించి ఆసన ప్రాణాయామములను నేర్పినారు. ఆయన ఎన్నెన్నో ఉపన్యాసముల నొసంగుచుండెడివారు. విన్నంతవరకే గాని ఈ ఉపన్యాసములు తర్వాత మరుక్షణం నుండి మనసులో ఏమీ ఉండదు. దీన్ని గురించి మాతామహుణ్ణి అడిగినాను. అందులకాయన ప్రాక్టికల్‌గా యోగాభ్యాసం చేస్తే, అన్ని విషయాలు మనసులో నాటుకొంటుందని నుడివినారు. పద్మాసనం వేసుకొని ప్రాణాయామం చేయ నారంభించితిని. పద్మాసనం వలన నా శరీరం నా స్వాధీనంలో నుండెడిది. మనస్సు నిలకడగ ఏకాగ్రతతో నుండెడిది. కోటిలో ఒకటవవంతు మాత్రం ఆయన ప్రాణాయామాన్ని నేను చేసినాను. ఈ హస్తిమశికాంతపు భేదము గల తపస్సుకే ఈ క్రింద కనిన ఫలితములు నాకు కలిగినవి.

1970-71 సంవత్సరంలో ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ పి. వి. నరసింహారావుగారు, భారతదేశ ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరాగాంధీగారు తిరుమలలో మకాం వేసినారు. శ్రీ వేంకటేశ్వరా విశ్వవిద్యాలయపు స్నాతకోపన్యాసమునకు ముఖ్యమంత్రిగారు సందేశాన్ని తయారుచేయవలసి యుండెను. ఇందులకుగాను తనకు ఒక మంచి స్టెనోటైపిస్టు కావలయునని జిల్లాకలెక్టరు శ్రీ బి. వి. రామారావుగారితో ముఖ్యమంత్రి అన్నారు. నేనప్పుడు జిల్లాకలెక్టరు క్యాంపు క్లర్కుగా పనిచేయుచుంటిని. షార్టుహేండు టైపురైటింగు రెండును హయ్యర్ గ్రేడ్ పాస్ అయి యుంటిని. ముఖ్యమంత్రి వద్దకు జిల్లాకలెక్టరుగారు నన్ను పంపినారు. ముఖ్యమంత్రిగారు నాకు

డిక్టేషన్ ఇచ్చి ప్రధానమంత్రి వద్దకు వెళ్ళినారు. పదహైదు నిమిషా లకు ముఖ్యమంత్రి నావద్దకు వచ్చినారు. నేను టైపు చేసిన మేటరును ముఖ్యమంత్రిగారు చదివి, కరెక్షనులుచేసి ఫేర్ కాఫీచేయుము అని మరల నాకు ఆదేశించినారు. ముఖ్యమంత్రిగారు పదినిమిషాలలో నేను టైపుచేసిన మేటరును కరెక్టుచేసినారు. ఆ గదిలో నేను ముఖ్యమంత్రి తప్ప ఎవ్వరమూ లేము. మేమిరువురము ఒకరికెదు రుగా నొకరు కుర్చీలలో కూర్చొనియున్నాము. ముఖ్యమంత్రిగారు కరెక్షనుచేయు పదినిమిషాలూ నా ఆత్మ "ముఖ్యమంత్రిగారు 1990 సంవత్సరంలో భారత దేశపు ప్రధాని అవుతారు" అని పదేపదే ఘోషిస్తున్నది. కానీ నేనీవిషయాన్ని ఆయనతో చెప్పలేదు. జంకినాను. 1990 సంవత్సరంలో నిజంగానే శ్రీ పి. వి. నరసింహా రావుగారు భారత దేశపు ప్రధానమంత్రి అయిన విషయం అందరూ జరిగినదే.

1981 సంవత్సరంలో భారత ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరా గాంధీగారు తిరుమల పర్యటన చేసినారు. దేవాలయంలో ఆమె కూర్చొని విమాన వేంకటేశ్వరుణ్ణి చూస్తున్నారు. చుట్టూ సెక్యూ రిటీ, మంత్రులు, ఉన్నతాధికారులు ఉన్నారు. నేను కూడ నా చేతిలో డైరీ షార్టుహేండ్ బుక్ పెట్టుకొని జిల్లాకలెక్టరుగారి క్యాంపుక్లర్కు హోదాలో నిలుచుకొని యుంటిని.

"1984 సంవత్సరం అక్టోబరునెల 30 వ తేదీనాడు నీ ప్రాణా నికి అపాయం వుంది కాన ఆ రోజు ఢిల్లీలో గాక తిరుమలకు రండి" అని ప్రధానమంత్రితో చెప్పవలసినదిగా నా ఆత్మ నన్ను వేయిసార్లు బలవంతపెట్టింది. నాకు నిలుచుండే దానికి వీలు కాలేదు. ఏమైనా కాని ఈ విషయాన్ని ఆమెకు (శ్రీమతి ఇందిరా గాంధీగారికి) చెప్పవలయునని ముందుకు జరిగినాను. ఇందిరాగాంధీగారి దృష్టి

విమానవేంకటేశ్వరుని నుండి నాపై బడినది. చుట్టూ ఉన్నవారి అందరి దృష్టి నాపై బడినది. నేను జంకి ఊరికేవుండిపోయాను. తర్వాత అందరూ బయలుదేరాము. 30—10—1984 నాడు శ్రీమతి ఇందిరాగాంధీగారు ఢిల్లీలో తన స్వంత సెక్యూరిటీ వలన హతమైన విషయం అందరికీ తెలిసిందే.

1981 సంవత్సరంలో ఒకనాడు అప్పటి ముఖ్యమంత్రి శ్రీ టి. అంజయ్యగారు చెన్నై వచ్చినారు. జిల్లాకలెక్టరు ముఖ్యమంత్రిగారిని మీనంబాకం విమానాశ్రయంలో రిసీవ్ చేసికొన్నారు. ముఖ్యమంత్రిగారు నేరుగా విమానాశ్రయం నుండి కంచికామకోటి పీఠాధిపతి వద్దకు వెళ్ళినారు. ఆ మఠంలో శ్రీ పీఠాధిపతి గారికి ముఖ్యమంత్రి, జిల్లామంత్రులు ఆరుగురు, ఎం.ఎల్.ఏలు తొమ్మిదిమంది, మిగిలిన నాయకులు వారు వీరు కలిపి సుమారు నలభై మంది శ్రీ పీఠాధిపతి గారికి సాష్టాంగ దండప్రణామాలు అర్పిస్తున్నారు. అచ్చట ఉన్న చిరు ఉద్యోగులకు ఇతరులకు పీఠాధిపతిగారికి ప్రణామం చేయుటకు ఎవ్వరూ ఆస్కారం ఇవ్వలేదు. అప్పుడు నా ఆత్మలో "ఈ ముఖ్యమంత్రిగారు ఒక వారం రోజులు మాత్రమే పదవిలో యుందురు" అని వేయిమార్లు అతీత శక్తి పలుకుచున్నది. ఆరోజు చెన్నైలో గల రాజభవన్‌లో పరుండి మరునాడు అందరం తిరుమల పోయినాము. సరిగ్గా ఒక వారానికి ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరాగాంధీ కుమారుడు (అప్పుడు లోక్‌సభ సభ్యుడు) శ్రీ రాజీవ్‌గాంధీ హైదరాబాదు వచ్చినారు. హైదరాబాదు సిటీలో ఘనంగ స్వాగత ఏర్పాట్లు చేసియుండిరి. ఈ పటాటోపానికి శ్రీ రాజీవ్‌గాంధీ ముఖ్యమంత్రిగారిని తీవ్రంగ మందలించినారు. అప్పటికప్పుడే నగరంలోగల స్వాగతద్వారాలను కూలద్రోసినారు. మరునాడు శ్రీ రాజీవ్‌గాంధీ, ముఖ్యమంత్రి

ఇరువురూ తిరుమలకు రావలసియున్నది. కాని శ్రీ రాజీవ్ గాంధీ ముఖ్యమంత్రిని తిరుమలకు రావద్దు అని నిక్కచ్చిగ చెప్పివేసినారు. శ్రీ రాజీవ్‌గాంధీ, రెవిన్యూమంత్రి శ్రీ N. జనార్థనరెడ్డి తిరుమలకు వచ్చినారు. శ్రీ రాజీవ్ గాంధీ ఢిల్లీకి పోయిన రెండు రోజులకే శ్రీ టి. అంజయ్యగారి స్థానంలో శ్రీ భవనం వెంకట్రామిరెడ్డిగారు ముఖ్యమంత్రి అయిన విషయం అందరికీ తెలిసిందే.

01—1—1981 నాడు జిల్లాపరిషత్తు మీటింగు హాలులో స్థానిక కవుల సన్మానం ఏర్పాటు చేశారు. జిల్లాపరిషత్ చేర్‌మెన్, జిల్లాకలెక్టరు, జిల్లా అధికారులు, స్థానిక శాసనసభ్యులు, పలుకుబడిగల వివిధ పట్టణ ప్రముఖులు ఈ కార్యక్రమానికి హాజరైనారు. జిల్లాకలెక్టరుగారి సతీమణిగారిని రిసీవ్ చేసుకొనేందుకుగాను నేను హాలు బైట ఉన్నాను. కార్యక్రమం ప్రారంభమైంది. మొదటగా సభాపతి అనుకవిని పిలిచినారు, సభాపతి తన స్థానమునుండి లేచి డయాస్ వద్దకు పోతున్నాడు. ఈయన తన స్థానమునుండి లేచినప్పటి నుండి నా ఆత్మలో ఇతను నాలుగవ తేదీన మరణిస్తాడని పదే పదే నా ఆత్మ చెబుతున్నది. ఈయన ముఖంలో చావుకళ నాకు స్పష్టంగ కన్పిస్తున్నది. జిల్లాకలెక్టరుగారి సతీమణి వచ్చినారు. నేను ఆమెను రిసీవ్ చేసి లోపల కూర్చుండబెట్టినాను. సుమారు రెండు గంటల పర్యంతం కార్యక్రమం జరిగింది. తర్వాత జిల్లాకలెక్టరు, ఆయన సతీమణి, నేను అందరం కలిసి కారులో బంగళాకు బయలుదేరినాము. కారు ప్రయాణంలో 'సభాపతి అను కవి నాలుగవ తేదీనాడు తప్పక చనిపోతాడు, అతని ముఖంలో చావుకళ స్పష్టంగ కన్పిస్తున్నదని' జిల్లా కలెక్టరు గారికి చెప్పవలయునని నేను ఎంతయో ప్రయత్నించినాను. కాని జిల్లాకలెక్టరు ఆయన సతీమణి తీరిక లేకుండ మాటల్లోబడి నాకా అవకాశం లేకుండ చేసినారు. బంగళా

నేను రెవిన్యూ డిపార్టుమెంటులో పనిచేయుచున్నాను. ఏదో కోపంలో ఒక అటెండరును 'నీవు రాబోయే గురువారం నాటికి మరణిస్తావు' అని అన్నాను. సరిగ్గ ఆ గురువారంనాడు ఆ అటెండరు జీపుప్రమాదంలో మరణించినాడు. ఒకడు నావద్ద సహాయం పొంది టైపిస్టుగ మా డిపార్టుమెంటులోనే చేరినాడు. ఒకనాడతను కలెక్టరు కార్యాలయానికి వచ్చి నా ఎదురుగానున్న గుమాస్తాతో మాట్లాడి వెళ్ళినాడు. నన్ను మర్యాదపూర్వకంగ కూడ పలుకరించలేదు. అప్పుడు నా ఆత్మలో అతడు మరునాడు మధ్యాహ్నం ఒంటిగంటకు మరణిస్తాడు అని పదేపదే చెబుతున్నది. మరునాడు ఒంటి గంటకు ఆ టైపిస్టు తను పనిచేయు కార్యాలయంలో మరణించినాడని ఫోన్ వచ్చింది. నా ఎదురుగావున్న గుమాస్తా చాలా కల్మషం మనిషి. ఏదో మనస్పర్థలు కలిగినవి. అతను ఆ రోజు నుండి రెండు సంవత్సరములు రెండు నెలలు, పదహారు రోజులకు మరణిస్తాడని నా ఆత్మ నాకు పదేపదే చెప్పింది. సరిగ్గ ఆరోజురానే వచ్చింది. ఇతను చనిపోయినాడు.

మా డిపార్టుమెంటు ఉద్యోగుల సంఘ ఎన్నికలు ఆగస్టులో వచ్చినవి నేను కూడ అందులో అభ్యర్థినే. నాతో పోటీకి నిలిచిన వాడు నాకన్న చిన్నవాడు. నా శ్రేయోభిలాషి. ఏకగ్రీవ ఎన్నికకు ప్రయత్నాలు జరిగినవి. కాని అతను ఒప్పుకోలేదు. అప్పుడు నాకు అతనిపై కోపం వచ్చింది. ఆనాటికి అతడు చనిపోతాడు అని నా ఆత్మలో నాకు పదేపదే చెప్పింది. సరిగ్గ ఆరోజు నాడు అతను చనిపోయినాడు.

ఈ విధంగ చెప్పుకొంటూ పోతే ఇంకా అనేకానేక ఉదాహరణలు చెప్పగలను. పై వాటిని గురించి తెలియునది ఏమంటే కోటిలో ఒక భాగం యోగప్రాణాయామాలు చేసిన నాకే భవిష్యద్వాణి తెలియవచ్చింది. అంటే యోగాప్రాణాయామాలను సంపూ

ర్ణంగ సాధించిన ఋషులు, మహర్షులకు ఎంతటి మహిమలు కలిగి నవో యను విషయం మనకు అర్థమగుచున్నది. విశ్వామిత్ర మహర్షి సృష్టికి ప్రతిసృష్టి చేసినాడనియు, త్రిశంకు స్వర్గాన్ని సృష్టించి నాడనియు చెప్పుట అన్నియు నూటికి నూరు శాతం నిజం అని నేను ధృవీకరించుచున్నాను.

మనం దేవునిగా ఆరాధించే శ్రీరామచంద్రుడు తల్లిగర్భం నుండే పుట్టినాడు. రాజసౌధంలో విద్యాభ్యాసం కావించినాడు. కాని విశ్వామిత్ర మహర్షి శ్రీరామచంద్రుని తీసికొనిపోయి అనంత మైన విద్యలనునేర్పి కల్యాణరామునిగ అయోధ్యకు చేర్చినాడు. ఈ అనంత విద్యలలో యోగాభ్యాస ప్రాణాయామములు కూడ యున్నవి. కావుననే శ్రీరామచంద్రుడు పితృవాక్య పరిపాలన, అన్నదమ్ముల అనుబంధం, ఏకపత్నీవ్రతం వగైరా మార్గదర్శ కాలతో ఆరాధ్యుడైనాడు. అదేవిధంగ తల్లిగర్భం నుండి పుట్టిన శ్రీకృష్ణుడు సాధారణ గోపబాలకుడై యుండినాడు. సాంధీప మహర్షివద్ద యోగాభ్యాస ప్రాణాయామములను నేర్చి అష్టసిద్ధులతో దేవుడై అసమాన లోకకల్యాణ కార్యాలను చేసినాడు. గుప్తంగ యుండిన యోగప్రాణాయామ విద్యను భారతయుద్ధ నెపంతో భగ వద్గీత రూపంగ లోకానికి అందించినాడు. శ్రీరామచంద్రుడు శ్రీకృష్ణుడు సాక్షాత్ విష్ణుమూర్తి అవతారాలైనను యోగప్రాణా యామముల నభ్యసించిరి. పూర్వకాలంలో ఋషులు ఘోరారణ్యా లలో పర్ణశాలలను నిర్మించుకొని శిష్యులకు విద్యాభ్యాసముల నేర్పుచుండిరి. వీరు నేర్పు విద్య యోగము ప్రాణాయామములు గాని వేరుకావు. ఇప్పటికిని యోగప్రాణాయామములలో నిష్ణాతు లైనవారు మాత్రమే అవతారపురుషులుగ, దేవదూతలుగ, సృష్టి స్వర్గానికి సంధానకర్తలుగ నున్నారు. ఇతరులకు ఇది అసాధ్యమ

# మోక్షము

పరాపరమందు పరం, పరమందు శివం, శివమందు శక్తి, శక్తియందు నాదం, నాదమందు బిందువు, బిందువునందు సదాశివం, సదాశివమందు మహేశ్వరం, మహేశ్వరమందు ఈశ్వరం, ఈశ్వరమందు రుద్రుడు, రుద్రునియందు విష్ణువు, విష్ణువునందు బ్రహ్మ, బ్రహ్మమునందు ఆత్మ, ఆత్మయందు దహరాకాశం, దహరాకాశము వలన వాయువు, వాయువునందు అగ్ని, అగ్నియందు ఉదకం, ఉదకమందు పృథివి, పృథివియందు ఓషధులు, ఓషధుల వల్ల అన్నం, అన్నంవలన నరమృగపక్షి పశుస్థావర జంగమాదులు ఉద్భవించెను. ఉద్భవించిన క్రమమున నైక్యమగును.

మనుష్యుడు తన అంగుళము చేత తొంబైయారు అంగుళముల ప్రమాణముగ నుండును. ఎనిమిది జానల పొడవు, నాలుగు జానల వలయమున్ను, ముప్పదిమూడు కోట్ల రోమద్వారములును, ముప్పదిరెండు మూరల పెద్దపేగున్ను, తొంబదిరెండు సంధులున్ను, డెబ్బది పెద్ద ఎముకలున్ను, ఎనిమిది పలముల గుండెయున్ను, నాలుగు పలముల రుధిరమున్ను, మూడు వందల ఇరువది పలముల మాంసమున్ను, సోలెడు పైత్యమున్ను, అర సోలెడు శ్లేష్మమున్ను, అర సోలెడు శుక్లమున్ను, ఇన్నిటితో కూడి యుండును మానవ శరీరము. ఇవన్నియు భేదములు. ఇన్నిటికి జీవుడు సాక్షియై యుండును. కావున పైవాని కన్నిటికీ కాంతి కలిగెను. అందువలన మనుష్య

ఆకారము కలిగెను. జీవునికి పరబ్రహ్మ సాక్షియై సకల భూతముల యందును కలడు. ఈ శరీరమునందు తొంబై ఆరు తత్త్వములు కలవు. వీటికి వివరము క్రింద చెప్పబడుచున్నది.

వాకిళ్ళు తొమ్మిది, శ్రోత్రాలు ఐదు, శబ్దాలు ఐదు, వాగ్వాదులు ఐదు, వచనాదులు ఐదు, వాయు సంబంధములు ఐదు, ఆకాశ సంబంధములు ఐదు, వాయువులు పది, ధాతువులు నాలుగు, రోగములు ఎనిమిది, ఆధారములు ఆరు, మండలములు మూడు, గుణములు మూడు, అవస్థలు ఐదు, తత్త్వములు తొమ్మిది. ఈ తత్త్వములకు రూపనామ ప్రక్రియలు ఏవనిన వాకిళ్ళు తొమ్మిది అనగా చెవి ద్వారములు రెండు, ముక్కు ద్వారములు రెండు, కంటి ద్వారములు రెండు, నోటి ద్వారము ఒకటి, మల ద్వారము ఒకటి, మూత్ర ద్వారము ఒకటి ఇవి నవద్వారములు. పదియవది బ్రహ్మ రంధ్రము. ఇది గోప్యముగ నుండును. శ్రోత్రములు ఐదు. అనగా జ్ఞానేంద్రియములు చెవులు, ముక్కు, కన్నులు, నాలుక, చర్మము. శబ్దములు ఐదు. ఇవిగాక అధ్యాత్మిక, అధిభౌతిక, అధిదైవతంబులు కలవు. చెవులు అధ్యాత్మకము, వినవచ్చే శబ్దము అధిభూతము, శబ్దరూపమైన వాయువు అధ్యాత్మకము. చర్మము అధ్యాత్మకము. చర్మనామవస్తు సంస్పర్శమయ్యేది ఏదికలదో ఆ వస్తువు అధిభూతము. ఈ వస్తువు నన్ను సోకెను గదా యను తెలివి అధిదైవతము. కన్నులు అధ్యాత్మకము. కానవచ్చు వస్తువు అధిభూతము. సూర్యు: అధిదైవతము. నాలుక అధ్యాత్మకము. పులుసు మొదలగు రసములు అధిభూతము. ఒక వస్తువు వలన రుచిననుభవించు జీవుడు అధిదైవతము. ముక్కు అధ్యాత్మికము. వాసన చూచుట అధిభూతము. భూమి అధిదైవతము. ఇవి జ్ఞానేంద్రియములు అను ప్రపంచము.

ఇక కర్మేంద్రియములను ప్రపంచమును పరికిద్దాం. వాగ్వాదులు ఐదు. అవి నోరు, చేతులు, పాదములు, గుదస్థానము, శిశ్నము. వీటికి విషయాదులు వివరింపబడుచున్నది. నోరు అధ్యాత్మకము. పలికే పలుకులు అధిభూతము. అగ్నిహోత్రుడు అధిదైవతము. చేతులు అధ్యాత్మికము. చేతులతో చేయు పనులు అధిభూతము. ఇంద్రుడు అధిదైవతము. పాదములు అధ్యాత్మికము, నడచునది అధిభూతము. విష్ణువు అధిదైవతము. గుదస్థానము అధ్యాత్మికము మలవిసర్జనము అధిభూతము. మిత్రుండు అధిదైవతము. శిశ్నము అధ్యాత్మికము. సంగమాదులవలన కలిగిన ఆనందము అధిభూతము. ప్రజాపతి అనే బ్రహ్మ అధిదైవతము.

ఇక అంతఃకరణము లనబడు ప్రపంచమును పరికిద్దాం. మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము ఇవి శరీరమునందుండు నట్టివి గావున అంతఃకరణములు అని వీటికి పేరువచ్చెను. బొడ్డు దగ్గర బుద్ధి ఉండును. హృదయమునందు మనస్సు ఉండును. కంఠమందు చిత్తముండును. నోటియందు అహంకారముండును. వీటికి అధ్యాదులు చెప్పబడుచున్నవి. మనస్సు అధ్యాత్మికము. ఏదో యొక వస్తువును చూచి ఆ వస్తువో ఈ వస్తువో యను సంశయము అధిభూతము చంద్రుడు అధిదైవతము. బుద్ధి అధ్యాత్మికము. సంశయించిన వస్తువును నిష్కర్షగా ఈ వస్తువే యని యథార్థమని నిశ్చయించిన నిశ్చయము అధిభూతము. పరబ్రహ్మము అధిదైవతము. చిత్తము అధ్యాత్మకము అనేక చింతలుచేయు చింత అధిభూతము. బ్రహ్మదేవుడు అధిదైవతము.. అహంకారము అనగా నేను అనే రెండు అక్షరములు అధ్యాత్మకము. నేను ఫలానాపనిని చేసితిని అనే గర్వము అధిభూతము. రుద్రుడు అధిదైవతము

పైని చెప్పిన సకలేంద్రియములు ప్రపంచమునకున్ను, తన యొక్క కాంతిచేత వాటికన్నిటికిన్ని కాంతి కలిగించి ఇంద్రియములు

చేత పుణ్యాపాపములు చేయించుచు తనకు అంటి అంటకుండ సాక్షీ మాత్రమై ఉపాధివశాన జీవుడు అనే పేరు కలిగిన పరబ్రహ్మమే జ్ఞాతృత్వము ఈ ఉపాధి కలిగిన జీవునకు సాక్షి పరబ్రహ్మనేత్ర రూపమైన సకలజీవములయందు ఉన్నాడు. అర్థం ఏమంటే నానావిధ చేష్టలు కలిగిన శరీరమునందు జీవుని ప్రతిష్ఠ మాయ కనుక శరీర మునకు ఏకత్వము కనబడే శరీరమే జీవుడు అనే భ్రాంతి కలిగెను. భ్రాంతి వలన అనేక జన్మములను ఎత్తి సుఖదుఃఖాదులను అనుభ వింపవలెను. ఈ శరీరము నేను కాదు గద, 'సాక్షి' రూపమై దీపము వలె ఇందులో ఉన్నాడు గద అని తనకు తాను సాక్షీ రూపమై యుండే విధము పరబ్రహ్మము. ఎముకలు, చర్మము, మాంసము, నరములు, వెంట్రుకలు పృథ్వి సంబంధములు. నేత్ర, శ్రోత్ర, శుక్ల, శ్లేష్మ, మేధస్సు ఇవి ఉదక సంబంధములు. ఆకలి, దప్పి, నిద్ర, సంగమము అగ్ని సంబంధములు చలనము, గమనము, తిమి, నిరోధము. ఇవి వాయు సంబంధములు.

ఈ శరీరము పంచభూతముల మయము కద. అంగములను వేర్వేరుగ విభజించి వాటి స్థితిగతులను తెలిసికొందాం. జ్ఞానము, ప్రాణవాయువు, చెవులు, శబ్దము, నోరు ఇవి ఆకాశము నుండి పుట్టినవి. మనస్సు, ధ్యానము, వాయువు, చలనము స్పర్శ, కాళ్లు, ఇవి వాయువు నుండి పుట్టునవి. బుద్ధి, ఉదానవాయువు, నేత్రములు, నేత్రముల రూపములు, చేతులు ఇవి అగ్నియందు పుట్టినవి. చిత్తము, సమాన వాయువు, నాలుక, రసములు, గుదస్థానము ఇవి నీటివలన పుట్టినవి. ముక్కు గంధము శిశ్నము భూమియందు పుట్టినవి.

పంచభూతములకు వర్ణములు, అధిపతుల స్థలములను తెలియ జేయబడుచున్నది భూమి పసుపువర్ణం, సదాశివుడు అధిదేవత,

పిక్కలయందు ఉండును. ఉదకము తెలుపువర్ణము, ఈశ్వరుడు అధి దేవత, తొడల దగ్గర ఉండును. అగ్ని శుద్ధ నలుపు, రుద్రుడు అధిదేవత, కడుపులో నుండును. వాయువు పసుపు వర్ణము, విష్ణువు అధిదేవత, కంఠమందు ఉండును. ఆకాశము ఇంద్రనీల వర్ణము, బ్రహ్మము అధిదేవత, ముఖము నందుండును. భూమికి శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు ఐదు; ఉదక మునకు శబ్ద, స్పర్శ, రూప, రసములు నాలుగు అగ్నికి శబ్ద, స్పర్శ, రూపములు మూడు; వాయువునకు శబ్ద, స్పర్శములు రెండు; ఆకాశమునకు శబ్దము ఒకటి ఇవి పంచభూతముల యొక్క పంచ తన్మాత్రలు. భూమికి రికారమాతృక, జ్ఞాన శక్తి; తేజస్సునకు ఱకారమాతృక. రేఖ ఇచ్ఛా శక్తి; వాయువునకు లకారమాతృక, ఆది శక్తి; ఆకాశమునకు అకారమాతృక, పరాశక్తి. ఇవి పంచ భూతముల నాశ్రయించుకొని యుండు క్రియాశక్తులు. మాతృకలనగా జాతి.

పరబ్రహ్మమును తెలిసికొను విధమును వివరింపబడుచున్నది. మూలాధారము, స్వాధిష్ఠానము, మణిపూరకము, అనాహతము, విశుద్ధము, ఆజ్ఞేయము ఇవి ఆరు చక్రములు కమలములు. కాలియొక్క ఎముకలు రెండు కుదురు ఎముకలు రెండు కూడిన చోట శిశ్నము ఉండును. శిశ్నస్థానమునకు గుదస్థానమునకు నడుమ చతురస్రముగా నుండును. అచ్చట పద్మాకారము ఉండును. పద్మాకారమునకు మధ్య త్రికోణము ఉండును. అచ్చట వ్రాసియుండు అక్షరములు 'వ, శ, ష, స.' ఈ చక్రము పసుపు వర్ణము, భూమి ముద్ర. విఘ్నేశ్వరుడు అధిదేవత. ఇదియే మూలాధార చక్రము. ఈ చక్ర మునకు రెండు అంగుళముల మీద స్వాధిష్ఠాన చక్రము ఉండును. దీనికి ఆరు రేకులు. అక్కడ యుండు అక్షరములు 'బ, భ, మ,

యి, ర, ల.' బ్రహ్మదేవుడు అధిదేవత. ఇది ఉదక చక్రము. దీని మీద ఎనిమిది అంగుళముల మీద మణిపూరక చక్రము ఉండును. ఇది కోడిగ్రుడ్డు వర్ణము. దీనియందు డెబ్బదిరెండువేల నాడులు నరములు ఉండును. ఈ నాడులకు వేరుగా చక్రముండును. అక్కడ యుండే అక్షరములు 'డ, ఢ, ణ, త, థ, ద, ధ, న, ప, ఫ' ఇది జీవ ముద్ర. విష్ణువు అధిదేవత. అగ్నిచక్రము. దీనిమీద పది అంగుళముల పైన అనాహత చక్రము ఉండును. ఇది హృదయ కమలము. పండ్రెండు రేఖలుగా నుండును. అక్కడయుండు అక్షరములు 'క, ఖ, గ, ఘ, చ, ఛ, జ, ఝ, ఞ, ట, ఠ.' రక్త వర్ణము. లింగముద్ర. రుద్రుడు అధిదేవత. వాయుచక్రము. ఇందు మీద పండ్రెండు అంగుళముల పైన విశుద్ధ చక్రము ఉండును. అక్కడ యుండు అక్షరములు 'అ, ఆ, ఇ, ఈ, ఉ, ఊ, ఋ, ౠ, ఌ, ౡ, ఎ, ఐ, ఒ, ఔ, అం, అః.' జీవుడు అధిదేవత. జ్యోతి వర్ణము. మత్స్యముద్ర. ఆకాశ కమలము భ్రూయుగమధ్య (కనుబొమల మధ్య) యుండును. రుద్రప్రకాశముద్ర. పరమాత్ముడు అధిదేవత. అందుండే అక్షరములు 'హం, క్షం' అనునవి. బంగారు కాంతి కలిగియుండును. ఇది మనః చక్రము. దీనిమీద కపాల పర్యంతము సహస్రార చక్రము వేయి రేకులు గల పద్మముగా నుండును. అక్కడ ఉండు అక్షరము 'అ' కారము ఉండును. ఇది మేరు శిఖరము. ఆకారముద్ర. దీనికి అధిదేవత గురుడు.

పైవిగాక ఇంకను మూడు మండలములు కలవు. అవి అగ్ని మండలము, ఆదిత్యమండలము, చంద్రమండలము అనునవి. అగ్ని దళము నాలుగుదళములు గల పద్మముగా నుండును. అందుమీద పంచాక్షరీ మంత్రముండును. 'ఓం హ్రీం హాం నం' ఇవి అగ్ని మండలము. సూర్యమండలము ఎనిమిది అంగుళముల ప్రమాణమున

నుండును. ఇది అధోముఖమై అరటిమొగ్గ వలె నుండును. ఈ దళ ముల మీద నుండు అక్షరములు 'య ర ల వ ష స హ' అనునవి బంగారువన్నె కలిగియుండును. దీని నడుమ మనోన్మని శక్తి నివా సమై యుండును. చంద్రమండలము కవిచంద్రాదిత్యుల ప్రభకలిగి శిరస్సు నడుమ నుండును. అదే యమృతకలశము, అగ్నిమండలము మీద సంతతోద్ధారక అమృతము కురియుచుండును. ఈ కమలము మీద సదాశక్తి నివాసమై యుండును.

మానవదేహమున స్థూలసూక్ష్మములుగ మూడుకోట్ల ఏబది లక్షల నాడులున్నవి. ఈ నాడులు మూలాధారము నాశ్రయించి కొన్ని ఊర్ధ్వభాగమునకు కొన్ని అధోభాగమునకు మరికొన్ని తిర్య గ్భాగమునకు వ్యాపించి యున్నవి. ఈ నాడుల నాశ్రయించి ఒక్కొక్క నాడికి ముఖముగ ఒక్కొక్క రోమము వున్నది. ఈ ముఖముల ద్వారానే చెమట స్రవించును. ఈ నాడులలో డెబ్బది రెండువేల నాడులు వాయుసంచార యోగ్యములై వాయుమార్గము ద్వారా పునరావృతి ప్రాపక కర్మరూప ఛిద్రవిశిష్టములై తిర్యగ్గత ప్రధాన భూతములుగ నుండును. నదులు జలములతో సాగరమును నింపునట్లు ఈ డెబ్బదిరెండువేల నాడులు మనిషి సేవించే అన్న పానాదుల యొక్క రసముచే దేహమును వృద్ధిచేయును. మూలా ధారమును ఆశ్రయించి పాదము మొదలు శిరము పర్యంతము వ్యాపించి యుండెడి ఈ నాడులు మృదువగు చర్మముచే కప్పబడి నట్లు మనుష్య దేహమున బంధింపబడి యున్నవి.

ఇక నడకల వివరమును తెలిసికొందాం గుదస్థానమునకు రెండంగుళముల పైన లింగస్థానమునకు రెండంగుళముల దిగువగల ప్రదేశము శరీర మధ్యభాగ మనబడును. ఇచ్చటనే మూలాధార మను చక్రము గలదు. మూలాధారము నుండి శిరోభాగము

నందలి సహస్రారము వరకు శరీరమునకు వెనుక భాగమున నరికిన వెదురుబొంగు వలె నుండు నొక ఎముక కలదు. దీనినే బ్రహ్మదండము, వెన్నుపూస అందురు. వీణకు తంత్రులవలె ఈ బ్రహ్మదండమునకు సమస్త నాడీమండలము అనుసంధానము చేయబడినది. ఈ బ్రహ్మదండము నందే మూలాధార, స్వాధిష్ఠాన, మణిపూరక, అనాహత, విశుద్ధ, ఆజ్ఞేయములను ఆరు చక్రములు గలవు.

మూలాధార చక్రము మొదలుకొని బ్రహ్మరంధ్ర పర్యంతము సుషుమ్న యను నొకనాడి గలదు. ఈ సుషుమ్న నాడి ప్రారంభ స్థానమైన మూలాధార చక్రమునందు తామర తూడులోని అతి సూక్ష్మమైన దారము వలె సర్పాకారము గల పరాశక్తి అధోభాగమందు పడగతోడను ఊర్ధ్వభాగమందు తోకయు గలిగి నిద్రించుచుండును. ఇదియే కుండలినీ శక్తి. సుషుమ్న నాడికి ఎడమప్రక్కన ఇడ అను నాడియు, కుడిప్రక్కన పింగళ అను నాడియు కలవు. చంద్ర సూర్య నాడులుగ ప్రసిద్ధిచెందిన ఈ రెండు నాడులు మూలాధారము మొదలుకొని ముక్కు కొనవరకు వ్యాపించి యుండును. ఈ నాడులు బయలుదేరు ప్రదేశము మూలాధారమే అయినప్పటికీ వీటి అసలు పుట్టుక మాత్రము నాడీచక్రమే. నాడీచక్రమనగా నాభిస్థానమందు కోడిగ్రుడ్డువలె నుండు నొక చక్రము.

నాభిస్థానమందు గల నాడీచక్రము నుండి బయలుదేరు పలు విధములైన నాడులలో గాంధారి, హస్తి జిహ్వా యను రెండు నాడులు కంటి కొనల వరకు వ్యాపించి యుండును. పూష, అలంపూష యను రెండునాడులు చెవుల వరకు వ్యాపించి యుండును. శుక్ల యను నాడి కనుబొమల మధ్య వరకు వ్యాపించి యుండును. ఈ స్థానమునకు భ్రూమధ్య మని పేరు. గంగ స్వరూపమైన ఇడా నాడి, యమున స్వరూపమగు పింగళనాడి, సరస్వతి స్వరూపమగు

సుషుమ్న నాడి భ్రూమధ్య స్థానమున కలియుట వలన ఈ స్థానమును త్రికూట మనియు, త్రివేణీ సంగమ మనియు చెప్పబడును. నాడీ చక్రము నుండి బయలుదేరిన నాడులలో సరస్వతి యను నాడి నాలుక కొనవరకు వ్యాపించి దేహధారులకు వాగ్రూపములైన క్రియా కలాపములను, వివిధ భోజ్య పదార్థముల యందలి రుచ్యారుచ్య విచక్షణా జ్ఞానమును కలిగించును. కంఠము వరకు వ్యాపించిన పయశ్విని యను నాడి వలన ఆకలిదప్పులు కలుగుటయే గాక స్వర భేదములందు, జలపానములందు సహకరించును.

నాడీచక్రము నుండి క్రిందుగా బోవు నాడులలో కర్త యనెడి నాడి శుక్లశోణితములను వెలికి ద్రోయును. మూత్రమును మాత్రమే వెలికి ద్రోయు నాడి సినీవాలి యనబడును. శంఖిని, ధామిని యను రెండు నాడులు భుజించిన ఆహారము నందలి సారమును గ్రహించి శిరస్సు వరకు గొనిపోయి ఆ సారమును అమృతముగా నొనరించును.

హృదయము నందు నూటయొక్క నాడులు కలవు. వీటిలో బ్రహ్మనాడి ఊర్ధ్వ గమనమై యుండును. ఈ నాడి పోవు మార్గమే మోక్ష మార్గము. బ్రహ్మదండమున కిరుప్రక్కల చేరి దేహ మంతయు విస్తరించిన డెబ్బదిరెండు వేల నాడులలో పై దెల్పిన నాడులు అతిముఖ్యములై దేహేంద్రియ వ్యాపార కార్యకలాప ములకు అంతర్ముఖంగ తోడ్పడుచు, మానసిక ఆజ్ఞానువర్తనులై మెలగును. ఈ డెబ్బది రెండువేల నాడుల కన్నింటికినీ మొదటి నుండీ తుదివరకు లోపల రంధ్రము లున్నవి. ఈ రంధ్రముల ద్వారానే దశవిధవాయువులు నిరంతరం సంచరించుచుండును.

శరీరమునందు పై జెప్పిన సప్తకమలములున్న గుదస్థానము వద్ద నుండి కపాలము వరకు నొకదానిమీద నొకటి దొంతికుండల వలె నుండును. ఈ కమలములు అన్నింటికిని వెనుక తలుపుల వలె

నంటుకొని గుదస్థానము మొదలు కపాలము పర్యంతము వీణాదండము వలె వెన్నెముక యుండును. వెన్నెముక తొర్రగా నుండును. దీనికి కుడి ప్రక్కన పింగళనాడి యుండును. ఈ పింగళనాడి మూలాధారము నుండి కపాల పర్యంతము వచ్చి తాకి అగ్ని నుండి అగ్నిహోత్ర మండలము వ్యాపించి అక్కడ నుండి దిగువకు దిగి కుడి ముక్కులో గుండా ఊపిరి పడి పోవును. ఎడమ ముక్కున ఇడానాడి యుండును. ఇది మూలాధారము నుండి కపాల పర్యంతము వచ్చి తాకి అక్కడ నుండెడి చంద్రమండలము వ్యాపించి అక్కడనుండి దిగువకు దిగి ఎడమ ముక్కులో గుండా ఊపిరి పడి పోవును. ప్రస్తుతము యోగమార్గమును విచారించుట సమంజసము. సుషుమ్న నాడి మూలాధారము నుండి కపాల పర్యంతము వచ్చి పగడపు తీగెగను, కాగిన బంగారుగను, కోటిసూర్య ప్రకాశముగను వెలుగు చుండును. ఇదియే బ్రహ్మనాడి మూలమైన విద్యయున్ను, సకల లోకములకున్ను త్రిమూర్తి స్వరూపము. ఈ సుషుమ్న నాడి సూర్య మండల పర్యంతము వచ్చి అక్కడనే యుండును. ఈ నాడి చివర సూక్ష్మమగు రంధ్రము కలదు ఇదియే బ్రహ్మరంధ్ర మనబడును. ఈ బ్రహ్మరంధ్ర మందు బ్రహ్మాండ మెల్ల వ్యాపించి యుండును. అది ఎట్లనగా

సూర్యుడు, చంద్రుడు, అగ్నిహోత్రుడు, పరమేశ్వరుడు, పంచమహాభూతములు, చతుర్దశ భువనములు, కాశీ మొదలగు పుణ్యక్షేత్రములు, సప్తసముద్రములు, యజ్ఞ శివ అర్చనాదులు, సప్తద్వీపములు, చతుర్వేదములు, మీమాంసాది శాస్త్రములు, చతుష్షష్టి కళలు, పంచాశ ద్వర్ణములు, షోడశ స్వరములు, గాయత్రి మొదలగు సప్తకోటి మంత్రములు, అష్టాదశ పురాణములు, రజస్సత్వతమో గుణములు, మూలప్రకృతియు, చతుర్వింశతి

తత్త్వములు, దశ ప్రాణవాయువులు, జీవుడుసుషుమ్నానాడీ మొదలైనవన్నియును ఆ త్రిఘు రంధ్ర మందుండును ఇందులకు ప్రమాణము ఈ బ్రహ్మరంధ్రము మహాగోప్యముగా నుండును. అది ఎట్లో తెలిసికొందాము చంద్రుడు, యమున, ఇడానాడి ఈ మూడున్ను ఎడమ ముక్కులో నుండి ఊపిరిగ చెల్లును. పింగళనాడి, సూర్యుడు, గంగానది ఈ మూడున్ను కుడి ముక్కులో నుండి ఊపిరిగ చెల్లును. అగ్ని, సరస్వతి, సుషుమ్న నాడి ఈ మూడున్ను బ్రహ్మనాడి యనబడును. ఈ మూడు నాడులు అనగా ఇడ, పింగళ, బ్రహ్మనాడులు నాశికాగ్రమునందు కూడియుండును. చెవుల రంధ్రములు రెండును అచ్చటనే కలియును. ముక్కు రంధ్రములు రెండును అచ్చటనే కలియును. ఈవిధముగ అమరియున్నందున సకలశాస్త్రములు కుండలి స్థానము అనబడును. ధ్యాతకాంతం, చతుష్పదం, త్రికూటం, ముక్తిద్వారం, నాదబిందు కళాతీతం, శృంగాటం పూర్ణస్థానం, మండలత్రయం, మండల ద్విదళచక్రం, అనబడునది ఈ కుండలి స్థానమునే. ఇందు 'హంస' ఉన్నాడు గనుక హంస స్థలము అని వేదశాస్త్రముల యందు చెప్పబడెను. ఇన్ని పేరులు కావున నాసాగ్రమందు కన్నులకు నడుమగా పైన చెప్పబడిన ప్రకారము బ్రహ్మరంధ్రముండును. హంస అనగా తన్ను నమ్మినవారికి సంసారమును హరించి మోక్షమిచ్చునట్టిది.

ఈ శరీరమందు పరమాత్మఉండే చోటు ఏది అనిన పైన చెప్పిన సుషుమ్నానాడీ సరిగ్గ బొడ్డువద్ద అరటిమొగ్గవలె అధోముఖమై ఒక కమలముండును. ఈ కమలము మధ్యయందు జ్యోతిరూపముండును. హృదయమందొక రూపుగా నుండును. అక్కడ కమలమందు సూర్యబింబు రూపముగా నుండును. ఈ కమలమందు హంస రూపముగా నుండును. శిరస్సు నడుమ వేయిరేకలు గల పద్మము

ఉండును. ఈ పద్మమందు బ్రహ్మ స్వరూపముగా నుండును. ఇట్టి బ్రహ్మస్వరూపమైన పరబ్రహ్మమును దర్శించిననే సంసార సముద్ర మును దాటి ముక్తుడగును.

పరబ్రహ్మమును దర్శించునట్టి విధానమును తెలిసికొందము. అందులకు గాను నాలుగు యోగములు, నాలుగు ముద్రలు అవలం బింపవలయును. షణ్ముఖి, ధ్యాన, శాంభవి, రాధాయంత్రము అను నది నాలుగు మంత్రములు. మంత్ర, లయ, హఠ, రాజము అనునది నాలుగుయోగములు. శుచియై ఒకచోట పద్మాసనము వైచికొని కూర్చుండి, దృష్టుల రెండింటిని నాశికాగ్రమునందుంచి కన్నులు మూసుకొని, తనకిష్టమైన దేవతను ప్రార్థనచేస్తూ, గాయత్రి మొద లైన మంత్రములను జపముచేసి తత్ఫలమును బ్రహ్మార్పణము చేయునది మంత్రయోగము. ఇదియే ధ్యానముద్ర అనబడును. ఈ మంత్రయోగి యోగీశ్వరులకన్న అధముడు, లయయోగమును తెలిసికొందము. దిగువ నాశికాగ్రమును చూచుచు తర్జనియనే రెండువ్రేళ్ళచేత రెండు చెవుల రంధ్రమును మూసినయెడల అక్కడ మహాధ్వనిగా నుండును. ఆ ధ్వనిని వినగా వినగా తొలుత గజ్జెల నాదము వలెను, ఆ వెనుక గొప్పగజ్జెల నాదము వలెను, మరీమరీ వినగా గంట, శంఖము, వీణ, తాళము, పిల్లనగ్రోవి, మద్దెల, భేరి, మేఘము, మొదలైన దశవిధ నాదములు వినబడును. ఇందులో మొదటి తొమ్మిది నాదములను పరిత్యజించి పదియవదియగు మేఘ నాదమును అభ్యసించిన యెడల అది మోక్షమునకు హేతువగును. ఈ నాదము ప్రణవనాదమని యనబడును. అకార ఉకార మకార ములు మూడు కూడి ప్రణవరూపమై అనాహత చక్రమందు పుట్టి అక్కడ నుండి ప్రజ్వరిల్లి కపాలమందు మహాధ్వని చేయు చుండును. చెవులు మూసికొనిన ప్రత్యక్షముగా వినవచ్చును. ఇయ్యది

రాధాయంత్రము మరియు లయయోగము. ఈ రాధాయంత్ర ఉపాసకుడు మంత్రయోగికన్న ఉత్తముడు శుద్ధయోగీశ్వరుల కన్న అధముడు.

ఎడమ కాలి మడిమ రెండు పిర్రల నడుమ నుంచి, గడ్డము రొమ్ముమీద నుంచి, అంగుష్ఠముల రెంటి చేత రెండు చెవులను మూసి, అనామికల రెంటి చేత రెండు కన్నులను మూసి, వాయువును రేచక పూరక కుంభకాదుల చేత సాధించి, మూలబంధ ఉడ్యాణబంధ జ్వాలంధరబంధములు అను మూడు బంధములను భేదించి, ఆరు కమలములను భేదించి, వాయువును సుషుమ్నము గుండ సహస్రార పర్యంతము తెచ్చి అక్కడవున్న జ్యోతి స్వరూపముగు జీవుణ్ణి వుంచేది ఏది కలదో అదియే హఠయోగము. ఇదియే షణ్ముఖముద్ర యనబడును. కేవల కుంభకము. ఇదియే సిద్ధాసనము. ఈ యోగి రాజయోగికన్న మధ్యముడు, పై యోగులకన్న ఉత్తముడు.

సకలమైన యోగములకు రాజువంటిదైన రాజయోగమును గురించి తెలిసికొందాం. ఈ యోగమునకు ఏడు పేర్లు కలవు. అవి ఉన్మన, మనోన్మని, అజస, సహజ, అమనస్క, జాడ్యనిద్ర, యోగ నిద్ర అనునవి. ఈ రాజయోగము మూడు విధములు. అవి సాంఖ్యము, తారకము, అమనస్కము. ఇందులో తారక యోగమును పూర్వయోగము, అమనస్కము అపరయోగము, తారక అమనస్కములలో కించిత్తు భేదమే గాని విశేషముగా భేదము కనబడదు. ఈ రాజయోగమును సాధించు క్రమమును తెలిసికొందాం.

ఈ శరీరమందు పై జెప్పిన పంచవింశతి తత్త్వములను క్రమముగా నేర్పరచి ఈ తత్త్వముల కన్నిటికీ ప్రధాన తత్త్వమైన పరబ్రహ్మము సూర్యచంద్ర అగ్ని మండలాల అంతర్వర్తియై నేత్ర

శక్తులు ప్రాప్తించును. అటుపిమ్మట కుండలినీ శక్తి వివిధ స్థానము లందు సంచరించు చున్నప్పుడు ఆయా స్థానముల ప్రభావము వలన సర్వసిద్ధులకు మూల కారణమైన అణిమాది సిద్ధులు ప్రాప్తించును. అవి ఏవి యనగా

1. అణిమ :- ప్రకృతిలోని పరమాణువు కంటెను సూక్ష్మముగ నుండుట

2. మహిమ :- ప్రకృతిలోని అతి గొప్ప వస్తువుల కంటెను గొప్పగా నుండుట

3. గరిమ :- ప్రకృతిలోని అతి భారమైన దానికంటెను భారముగా నగుట

4. లఘిమ :- ప్రకృతిలోని అతి తేలికైన దానికంటెను తేలికగా నుండుట

5. ప్రాప్తి:- తన ప్రయత్నము ఏమియు లేకుండగనే అన్ని విషయములు తనకనుకూలమై ఫలించుట.

6. ప్రాకామ్య:- తన మనో సంకల్పములన్నియు సంపూర్ణముగా నెరవేరుట, అతీతములైన విషయములందు తనకు స్పర్శ దర్శన సంచారశక్తి లభించుట.

7. ఈశత్వ:- భగవంతుని వలెనే సమస్తమును సృష్టించుట, కాపాడుట, నాశన మొనర్చుట.

8. వశిత్వ - భగవత్ సృష్టియగు ఈ సకల చరాచర ప్రపంచము నంతయు వశపరచుకొని శాసింప గలుగుట.

పై రాజయోగము చేత పరమాత్మను దర్శనము చేసేటందుకు హేతువైనది శాంభవిముద్ర అనిపించుకొనును. ఈ శాంభవీముద్ర వలన ధ్యానము చేయగా పుట్టిన చితాగ్ని పురుషుడు అనేక కోట్ల జన్మములెత్తిన దోషమును, బ్రహ్మహత్య, సురాపానాది మహా పాతకములను దహింపజేయును. కావున శాంభవీముద్ర సకలమైన ముద్రలలో ప్రసిద్ధమైనది.

శాంభవీముద్రలో లక్ష్యమును చూచెడి విధానము మూడు విధములుగా నున్నది. పున్నమి, అమావాస్య, పాడ్యమి యను మూడు విధములు కనురెప్పలు రెండును కదియ మూసి నాశికాగ్రమందు లోగా దృష్టి మనస్సున నుంచి చూచే చూపు అమావాస్య దృష్టి. ఇది షణ్ముఖి సాధన మైనందున అధమము. మూడు భాగములు వెలుపలి నాశికాగ్రము నందు దృష్టి పెట్టుకొని రెప్పపాటు లేకుండ చూచే చూపు పాడ్యమి దృష్టి. ఇది సార్థకమైన దృష్టి. మధ్యమము. మంచి శుచియైన స్థలమందు చేరి కృష్ణాజినమై నను, దర్భాసనమైనను పరచుకొని, ఆచారకట్టు కట్టుకొని, గురువును స్మరించి, మెడను కొంచెం ఎత్తి, నల్లగుడ్డు రెప్పక్రిందికి దిగిపోవునట్టు చేసి, అడుగు రెప్పల క్రిందనుండు తెల్లగుడ్డు వెలుపలకు కనబడునట్లుగా వుంచి, స్థిరమైన మనస్సు కలవాడై ఈ ప్రకారము దినదినము అభ్యాసము చేయగా చేయగా దృష్టి ఒక గంటకాలమైన లేక పదహైదు నిమిషముల కాలమైనా నిలిపినయెడల గాఢాంధకారముగ చీకటి యగును ఆ చీకటిని చూడగా చూడగా మునుపు చెప్పిన తారక చిహ్నములు కానబడును. అవన్నియు స్పష్టమైపోగా మంచి పండు వెన్నెల కన్పడును. మరీ చూడగా చూడగా ఆ పండు వెన్నెలలో సకల భువనములకు నాయకుడై, స్వతంత్రుడైన శ్రీ మన్నారాయణ స్వరూపమైన పరబ్రహ్మము కోటి సూర్య ప్రకాశముగా, ఆ చిహ్నము ఆకృతియై, తాలుమూల ద్వాదశాంశః (తాలువులు = దవడలు దీని మూలం కన్నులనుండే. ఎముకలు ద్వాదశాంశము = కనుబొమ్మలపైన నాలుగువేళ్ళ పొడవున నుండునట్టి ద్వాదశాంశము) నడుమ పరమాత్మ కానవచ్చును.

ఇది పున్నమి దృష్టి, శాంభవిముద్ర ఖేచరిముద్ర, అర్ధావలోకనము. ఖేచరిముద్ర యనగా ఖేచరి ఆకాశము ఆకాశమునందు

చరింపబడుచున్నది. ఆకాశము అనగా ఆకాశము కాదు. పరమాత్మ స్వరూపమైన దహనాకారము. ఇయ్యది నాశికాగ్రము నందుండును. అందులకు లక్ష్యము చూడవలెను. ఈ రాజయోగమే బ్రహ్మ రుద్రాదులకు జీవనము ఈ అర్ధావలోకమున కన్న ఎక్కువ యగు లోకము లేదు. ఈ యోగీశ్వరుడు ఎక్కడ వున్నను పరబ్రహ్మ స్వరూపుడే గాని సామాన్యయోగి కాదు. ఇది తెలియక ఎన్ని శాస్త్రములు చదివినను, ఎన్ని యాగాది క్రతువులు చేసినను, సత్కర్మము లాచరించినను, ఎంత సాహిత్యము నార్జించినను నష్టమేగాని ఫలము లేదు. గాడిద గంధపు చెక్కలను మోయుచున్నను తద్వాసన ఎరుగనట్లే అగును.

ఇపుడు పున్నమి దృష్టివలన పరంజ్యోతి కాన్పించుచున్నది గిది! ఈ రాజయోగము చేత నాలుగైదు సంవత్సరములకు గాని కానిపించదు. కావున ఏలాగుననైన నుత్తముడైన గురువును వరించి అతనికి మనోవాక్కాయ కర్మలయందు వంచన లేకుండ సేవ చేసిన ఆ గురువుకు కృపవచ్చి రాజయోగము మొదలైన అష్టాంగ యోగముల చేత కనబడే ఆత్మారాముని ఒక్క క్షణము లోపల దర్శనము చేయించును. అనేక సంవత్సరములు ప్రయాసపడగా కలుగనట్టిది అరక్షణములో కలుగును. ఇందుకు సందియము లేదు.

మనుష్యునికి అవసాన కాలము సమీపమైనప్పుడు జీవుడు వెళ్ళిపోవు విధమును తెలిసికొందాం. అహింసా రూపకమైన బ్రహ్మయజ్ఞములు మొదలుగాగల సత్కర్మలను చేసి, వాటిని బ్రహ్మార్పణము చేసిన పుణ్యపురుషులు కుడిముక్కున నుండు పింగళనాడి మార్గమున బ్రహ్మలోకమును చేరి ముక్తుడౌను. ఇదియే దేహమార్గము, శ్రవణ ముక్తిమార్గము, అర్చనాది మార్గము అనబడును. ఈ మార్గమున పోవునట్టి దినము లెఖ్ఖించినను ఉత్తరాయణము,

శుక్లపక్షము, పగలు, పూర్ణిమ మొదలగునవి. యోగములు మొద లైన ఉపాసనార్థములు కోరిచేసి అంత్యమందు ఏకమముకట్టన నుండు ఇడానాడి గుండా పోయి పుణ్యఫలముల కొద్ది స్వర్గనరకము లను పొంది మరల పునర్జన్మమునే పొందును. ఇదియే పునరావృత్తి మార్గము, పితృయానము అనబడును. ఈ మార్గమున పోవుటకు దినము లెవ్వియనిన దక్షిణాయనము, కృష్ణపక్షము, రాత్రి, అమా వాస్య మొదలగునవి.

ఇక సద్యోముక్తి మార్గమును గురించి తెలిసికొందాం. శ్రీమన్నారాయణుడు సగుణ నిర్గుణులదారమై యుండును. ఇదియే ఘోరమైన నరకమనిపించుకొనును. ఇదియే పేరుకలిగి పాతాళ లోకముల వరకు వ్యాపించియుండును. సూర్యలోకము మొదలు ధృవమండల పర్యంతము స్వర్గలోకము. బొడ్డువద్ద భూలోకముండును. కుక్షివద్ద భువర్లోకముండును. హృదయమందు సువర్లోకముండును. రొమ్ముమీద మహర్లోకముండును. కంఠమందు జనర్లోకముండును. కనుబొమ్మల నడుమ తపోలోకముండును. శిరస్సున బ్రహ్మలోక ముండును. ఈ ప్రకారము బ్రహ్మాండమంతయు పిండాండమైన శరీరము నందుండును. ఇదివరకు ఇడా పింగళ సుషుమ్న నాడుల గురించి చెప్పుకొన్నాము.

ఇక కడమ ఏడునాడుల విషయములను తెలిసికొందాం. గాంధారి, అస్థి. ఈ రెండు నాడులున్ను కన్నులయందుండును. జిహ్వా, ఆలంబ ఈ రెండు నాడులు రెండుచెవులలో నుండును. పూషయను నాడి నాభిస్థలమందుండును. కుకురు, శంఖిని యను నాడులు మలమూత్ర ద్వారముల నంటియుండును.

ప్రాణవాయువు ఈ నాడులన్నిటిని చుట్టి మూలాధారమందు 'ఓం' అని వెళ్ళి, నాభిచక్రమందు 'హం' అని తాకి 'సం' అని

ఇడా పింగళములోపల కపాలమును చుట్టి, అక్కడనుండి ముక్కులో నుండ వెళ్ళి, పండ్రెండంగుళముల ప్రమాణము వచ్చి నాలుగు అంగుళముల ప్రమాణము లయమై, ఎనిమిది అంగుళముల ప్రమాణము తిరిగి లోపలికి పోవును. వాయువు లయమందు కనుబొమ్మల నడుమగా నుండును. ఈ ప్రకారము ఇరువై నాలుగు గంటలున్న 21,600 శ్వాసలు నడచును. 2,200 శ్వాసలు నష్టమైపోవును. మిగిలిన 19 400 శ్వాసలు నిలుచును. ఈ విధముగ మనుష్యుడు మొదలగు సకల జీవులయందును ఆయువు క్షీణించును.

పై జెప్పిన విషయములు, విషయములందు వైరాగ్యము కలిగిననే గాని మోక్షమునకు హేతువుయగును. విషయములందాసక్తుడైన సంసారసాగర బద్ధుడగును. కనుక విషయములందు వైరాగ్య ముంచవలెను. విషయములందు వైరాగ్యము కలిగిన యొక ముక్తుడు ఏవిధముగా నుండును. మోక్షమునకు అర్థము ఏమి ఈ క్రింద నుదహరించిన చిన్న కథ తెలియజేయును.

ముక్తుడు, భగవద్భక్తుడు నగు నొక సాధువునకు ఒకనాడు భోజనము దొరకలేదు. ఆకలిగా నున్నను అతడెవరిని ఆశించలేదు. ఏదో ఇంటిలో సంతర్పణ జరిగినది. సంతర్పణానంతరం ఆ ఇంటి వారు వీధిమూలగా ఎంగిలి ఆకులను పారవేసినారు. ఒక కుక్క ఆ ఎంగిలి ఆకులను నాకుచూ అందులో గల ఎంగిలి పదార్థాలను తినుచున్నది. ఈ ముక్తుడు, భగవద్భక్తుడు, ఆకలిగొన్న సాధువు ఆ కుక్కకడకు పోయి "అన్నా! నాకు భాగమీయకుండ నీవు ఒక్కడవే తినుచున్నావా" యని ఆ కుక్కను కౌగలించుకొని దానితో కూడి ఎంగిలి ఆకులలో గల వాటిని తిననారంభించెను. ఆ సాధువు ఒక యన్నపు ముద్దను తన నోటిలో పెట్టుకొని, మరియొక ముద్దను కుక్క నోటిలో బెట్టుచు, ఇద్దరును మిత్రుల వలె జతగా

తినుచుండిరి. ఈ వింతను చూచుటకై చాలామంది జనులు వచ్చి అచ్చట గుమికూడిరి. వారిలో కొందరు ఆ మహానీయుని జూచి 'వట్టి పిచ్చివాడు' అని హేళన చేయుచు నవ్వనారంభించిరి. అందు మీదట ఆ మహానీయుడు వారితో ఇట్లనియెను. "ఎందుకు నవ్వెదరు?"

విష్ణు ఉపవిష్ణు డయ్యెను విష్ణు గూడి
విష్ణు వన్న మిడుచు నుండె విష్ణువునకు
విష్ణువా ఏల నవ్వెదు విష్ణు జూచి
విష్ణువే కద ఏది చూడ విష్టపమున"

అనగా విష్ణువు విష్ణువే అయి విష్ణువుతో కూడినాడు. విష్ణువు విష్ణువునకు అన్నమును తినుపించుచున్నాడు. ఓ విష్ణువా! విష్ణువును జూచి ఎందులకు నవ్వెదవు.? విశ్వములో ప్రతియొకటి విష్ణువేకద! ఇచ్చట ప్రశ్నించువాడు విష్ణువు, సాధువు విష్ణువు, కుక్క విష్ణువు, సకలము విష్ణువు అని అర్థము.

అంత నొకడు ఆ సాధువును జూచి "స్వామీ! నా కేమైన బోధ చేయుడు" అని కోరెను. అందులకా మహానీయు డీవిధముగ నతనికి బోధించును. "ఈ మురికి కుంటలోని నీరును, ఆ పావన గంగాజలమును నీ కెప్పుడు సమమై తోచునో; వేణుగానమున అల్లరిమూకల గోలయు నీకెపుడు సమానముగ తోచునో అపుడు నీవు బ్రహ్మ జ్ఞానమును పొందిన వాడగుచున్నావు."

సృష్టిలో ఎందరో అవధూతలు, యోగాలు పుట్టినారు, ప్రస్తుతము కూడ ఉన్నారు. వీరు ఈ సమదృష్టి కలిగియున్నందుః తమకంటూ ఏమియు లేక, నిస్వార్థంగ అహర్నిశలు మానవ సేవ పరమావధి యని పాటుపడుచున్న విషయం అందరూ ఎరిగినదే గద!

# ప్రాణశక్తి

ప్రాణము అనగా చేతనా శక్తి, క్రియాశక్తి, నడిపించు శక్తి, జీవము, జీవనాధారము. ఈ ప్రాణశక్తి నిగూఢము, నిర్వికారము, సూక్ష్మము, కారణము. ప్రాణశక్తియే పరబ్రహ్మ స్వరూపము. చరాచర సృష్టిలో చలనరహితముల నుండి జీవ రాశులగు యోనిజములు, అండజములు, స్వేదజములు, ఉద్భిజములు, జలచరములు, సకలము, ప్రాణశక్తి చేతనే మనగలుగుచున్నవి. ఈ ప్రాణశక్తి ఎక్కడున్నది ? ఏ విధముగ నున్నది ? ప్రాణశక్తి వాయువులో నున్నది. మహాశక్తివంతమై కూడా సూక్ష్మముగ నున్నది. కావుననే నక్షత్రములు, గ్రహములు, పంచభూతములు, సకలము వాయువులోనుండు నిగూఢమైన ప్రాణశక్తి వలన నియమిత స్థానాలలో నుండి తమతమ కార్యాలను సక్రమంగ ఫలాపేక్ష రహితంగ నెఱవేర్చుచున్నవి. ప్రాణశక్తి లేకున్నచో ఇవి యన్నియు గతులు తప్పి చరాచర మంతము అల్లకల్లోల మవుతాయి.

పంచభూతములు ఐదు. అవి ఆకాశము, వాయువు, అగ్ని, జలము, పృథ్వి. ఆకాశము అనగా అర్థము బయలు మరియు ఆచ్ఛాదనము. బయలు వున్నందు వలననే మిగిలిన నాలుగు భూతములు వాయువు, అగ్ని, జలము, పృథ్వి ఉన్నవి. ఇవి వుండుటకు చోటున్నది. ఆకాశము (చోటు) లేకున్నచో ఈ నాలుగు భూతములు

వుండజాలవు. అసలు సృష్టియే వుండదు. పంచీకరణ సూత్రము ననుసరించి ఆకాశతత్త్వములో వాయుతత్త్వము లేదు. వాయువు మిగిలిన నాలుగు తత్త్వములలో నున్నది. అనగా తన తత్త్వమగు వాయువు నందు, అగ్ని యందు, జలము నందు, పృథ్వి యందు ఉన్నది. అందువలన వాయువు తన ప్రాణశక్తితో ఈ నాలుగు భూతములలో నిగూఢమై యుండి ఎన్నో మహాత్కార్యములను చేయుచున్నది. అది ఎట్లో పరికింతము.

వాయుతత్త్వము నందు ప్రాణశక్తి యున్నందున సముద్ర జలము ఆవిరియై మేఘములై వర్షములు కురియు చున్నవి. చలన రహితములగు పర్వతములు, రాళ్ళు, జీవులగు యోనిజములు, అండజములు, స్వేదజములు, ఉద్భిజములు, జలచరములు వాయువును పీల్చి వదలు ప్రక్రియ చేయుటవలన అందులోగల ప్రాణశక్తిచే జీవించుచున్నవి, పెరుగుచున్నవి. ఈ ప్రాణశక్తి పోతే ఇవి మరణి స్తాయి. విజ్ఞానులు వాయుతత్త్వంలో గల ప్రాణశక్తితో రేడియో, టెలివిజన్, నిక్ నెట్, ఫాక్స్, ఫోటో, వైర్ లెస్, వగైరాలను కనిపెట్టినారు. రోదసీ ఉపగ్రహాలను ప్రయోగించుచున్నారు.

అగ్నితత్త్వములో వాయుతత్త్వమగు ప్రాణశక్తి యున్నందున అగ్ని ప్రజ్వరిల్లుచున్నది, వెలుతురు నిచ్చుచున్నది, చరాచరములకు ఉష్ణమునిచ్చి జీవించునట్లు చేయుచున్నది, ఆహారమును పచనము చేసి తినుటకు దోహదపడుచున్నది, నాభిలో జఠరాగ్నిగ నుండి ఆకలిని కలుగ జేసి తిన్నవాటిని జీర్ణింప జేయుచున్నది, వ్యర్థపదార్థాలను ఆహుతి చేసి మేలుచేయుచున్నది, యజ్ఞయాగాదుల ప్రక్రియలద్వారా ఇహాపరలోకములకు సంధానకర్తగ యున్నది.

జలతత్త్వములో వాయుతత్త్వమగు ప్రాణశక్తి యున్నందున సకల జీవరాసులు పెరిగేశక్తి కలిగియున్నవి మలినమును శుభ్ర

పంచు ప్రక్రియ చేయుచున్నది. సకల జీవరాశులకు దాహమును తీర్చుచున్నది, జగనాధారమై యున్నది. ఉద్భిజములకు ప్రాణాధారమై పంటలు పండించి అండజములకు యోనిజములకు జీవనాధారమైయున్నది. విజ్ఞానులు జలతత్త్వము నుండి ప్రాణశక్తి రూపమగు విద్యుచ్ఛక్తిని కనిపెట్టినారు.

పృథ్వీతత్త్వములో వాయుతత్త్వమగు ప్రాణశక్తియున్నందున భూమి నుండి ఉద్భిజములు పెంపొంది చల్లదనం పచ్చదనం కలుగజేస్తూ పంటలను పండించుట ద్వారా అండజములు యోనిజములు మనుగడ సాగించుటకు దోహదపడుచున్నది. బంగారు వెండి వజ్రములు వగైరా విలువైన లోహములు, రాగి, అభ్రకము, మాంగనీసు. ఇనుము, వగైరా లోహములు, బొగ్గు పెట్రోలు డీజల్ గ్యాసు వగైరా విద్యుచ్ఛక్తిని తయారుచేయు ముడిపదార్థములు తయారగుచున్నవి. ఈ ప్రాణశక్తి వలననే పృథ్వి ఆకర్షణశక్తిని కలిగియుండి యోగులు చేసే తపశ్శక్తిని ఆకర్షించి తనలో ఇముడ్చుకొంటుంది.

మానవ దేహంలో ప్రాణశక్తి ఏ విధంగ పనిచేయుచున్నదో తెలిసికొని అద్దానిని ఆచరించుట ప్రతి మానవునికి ఎంతైనా అవసరం ఉంది. ఈ ప్రక్రియను తెలిసికొనుట మనిషి అన్నవాడికి ఎంతో సముచితం. మానవ దేహంలో మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము, కామక్రోధలోభ మోహ మదమాత్సర్యములను, ఆకలి దప్పులను, నిద్రను, సుఖదుఃఖములను కలుగజేయుచున్నది. దశవిధ వాయువుల రూపంలో ప్రాణశక్తి రక్తశుద్ధిని, రక్తప్రసరణలను కలుగజేసి నాడీమండలము పనిచేయుటకు దోహదపడుచున్నది. సామాన్య మానవుడు ప్రాణశక్తిని గురించి తెలియక దైనందిన జీవితంలో దీనిని సామాన్య పనులకు వినియోగించు చున్నాడు.

విజ్ఞానులు తమ మేధోశక్తితో వైర్‌లెస్, రేడియో, టెలివిజన్, ఫాక్స్ నిక్‌నెట్, ఫోటో, విద్యుచ్ఛక్తి, రైళ్ళు, మోటార్లు, విమానాలు, రాకెట్‌లు వగైరాల విజ్ఞానం రూపాలలో ప్రాణశక్తిని అందరికీ అందించినారు. యోగులు వాయువును కుంభించి తద్వారా లభించు ప్రాణశక్తితో దివ్యశక్తులను పొంది ఆరోగ్యవంతులై, చిరంజీవులై, జ్ఞానాన్నిపొంది లోకకల్యాణానికి అర్పించిరి. మరియు దివ్యశక్తులను పొంది దైవస్వరూపులై మోక్షాన్ని పొందిరి. వరాలను శాపాలను ఇవ్వగలిగిరి. వాయువును కుంభించి ప్రాణశక్తిని వినియోగించుట వలన జ్ఞానం, నిత్యానందం, తన్మయత్వం కలుగుతాయి. ప్రస్తుతమున్న విజ్ఞాన మంతయు జ్ఞానంతోనే కలిగినాయి. జ్ఞానం రూపరహితం విజ్ఞానం వస్తురూపం.

ఎన్నో జన్మలనుండి ఆర్జించిన పుణ్యఫలము వలనను, తల్లిదండ్రులు చేసిన పుణ్యఫలము వలనను ఉత్తమమైన మానవ శరీరం ఏర్పడింది మానవ శరీరం ఒక్కటే జ్ఞానవిజ్ఞానముల సముపార్జనకు అనువైనది అర్హమైనది. ఉచ్ఛ్వాసనిశ్వాసములు, నాడీమండలక్రియ, రక్తప్రసరణము, జీర్ణప్రక్రియ, మలమూత్ర విసర్జన మొదలగు అంతఃక్రియ లన్నియు వాయువులోని ప్రాణశక్తి వలననే కలుగుచున్నవి. స్థూలసూక్ష్మకారణ శరీరములలో సూక్ష్మశరీరము ప్రాణశక్తి. స్థూలకారణ శరీరములకు సూక్ష్మశరీరము అనబడునది ఒక గొలుసు (కొక్కి) వంటిది. ప్రాణశక్తి అనబడు సూక్ష్మబంధము ఎప్పుడైతే విడిపోవునో అపుడు స్థూలశరీరము చేతనారహిత మగును. ఈ చేతనా రహిత స్థితియే ప్రాణము పోవుట, మరణము కలుగుట అనబడును. అనగా ప్రాణశక్తి నశించినదని అర్థము. ఉచ్ఛ్వాస నిశ్వాసములు తనంతట తానుగ జరుగుచుంటుంది. ఈ కార్యనిర్వహణకు ఎలాటి ప్రయత్నం అవసరంలేదు. అట్లుగాక

ఉచ్ఛ్వాస నిశ్వాసములను తన ఇచ్ఛానుసారం నడిపించి శ్వాస ప్రక్రియను తన అధీనంలో నుంచుకొంటే ప్రాణశక్తి తన అధీన ములో నుండును. అందువలన ఎన్నో ఇహపర లాభాలు కలుగు తాయి. ఇందులో మొట్టమొదటిది దేహారోగ్యం బాగుంటుంది. ఇదివరకున్న రోగాలు నయమౌతాయి. క్రొత్తరోగాలు ఏమియు రావు. వాయువును కుంభించి తద్వారా లభ్యమగు ప్రాణశక్తితో అష్టసిద్ధులు పొందవచ్చును, త్రిమూర్తులకన్న అధికుడు కావచ్చును, పరబ్రహ్మ స్వరూపుడగును. ముక్తిని పొందవచ్చును.

పై వాటిని సాధించుటకు కొన్ని నియమాలు పాటించాలి. ఇందులో మొదటిది ప్రేగులను శుద్ధిచేయుట, రెండవది అమృతా హార సేవనము, మూడవది ఆసనాభ్యాసము, నాల్గవది నాడీశుద్ధి. ఒక్కొక్క ప్రక్రియను ఏ విధంగ ఆచరించవలయునో వివరంగ తెలిసికొందాం.

## 1. ప్రేగులను శుద్ధిచేయుట

కుటుంబంలో సంఘంలో ఆహారపుటలవాట్లు విచ్చలవిడిగ మన్నవి. మాంసాహారం, మసాల దినుసులు, మత్తుపానీయములు, పొగత్రాగుట వగైరాలు ప్రేగులలో మాలిన్యం ఏర్పరచి, ఆ మాలి న్యం రాళ్ళవలె గట్టిపడి దశవిధ వాయువుల రూపంలోనుండే ప్రాణ శక్తి ప్రవాహానికి అవరోధాలు కలిగిస్తున్నవి. ప్రాణశక్తి తన పనిని తాను చేసికొని పోవుటకు ఈ మలములు ప్రతిబంధకములుగనున్నవి. ఇవి ప్రేగులలో పేరుకుపోయి క్రుళ్ళి దుర్వాసనను కలిగిస్తూ వివిధ రోగాలను కలిగిస్తున్నవి. రోగాలు ఎక్కడనుంచో రావటంలేదు, ప్రేగులలో పేరుకుపోయిన మాలిన్యాలే రోగాలను కలుగజేస్తు న్నాయి, రోగాలకు మూలకారణాలై యున్నవి. వైద్యరంగం ఎంతో అభివృద్ధి చెందింది. కోటానుకోట్లు ధనాన్ని వైద్యసేవకు

వినియోగిస్తున్నారు. దీని అర్థం రోగులు అధికసంఖ్యలో దినదినాభి వృద్ధి చెందుచున్నారు, వైద్యరంగం వీరిసేవకు చాలటంలేదు. విజ్ఞానం వలన కనిపెట్టబడిన వైద్యం రోగనివారణ చేయలేక పోతు న్నది. కొన్ని రోగాలకు తాత్కాలిక ఉపశమనమే గాని శాశ్వత నివారణ లేదు. క్రొత్తరోగాలు పుట్టుకొస్తున్నాయి. కొన్నిరోగా లకు వైద్యరంగంలో జవాబులేదు. ప్రేగులలో గల మాలిన్యాలను శుద్ధిచేసుకొంటే శరీరం ఉల్లాసంగ ఉత్సాహంగ తేలికగ ఉంటుంది. ఆరోగ్యం బాగుంటుంది. వైద్యులతో వైద్యరంగంతో పనిలేదు.

ప్రేగులను శుద్ధిచేయు ప్రక్రియను పరికిద్దాం. అమావాస్య రోజు తర్వాత పౌర్ణమి రోజుకు ముందుగా మంగళ శనివారాలు కాకుండ తను పుట్టినవారం కాకుండ ఏదైనా ఒకరోజు ఉదయం ఎనిమిది గంటలకు పూర్వమే పరగడుపున ఈ క్రింది రెండు ప్రక్రియ లలో ఏదైనా ఒకదానిని చేయవలెను.

1. పదిగ్లాసుల చన్నీటిలో పదిచెంచాల ఉప్పును కలుపుము. అర్ధగంట సమయం లోపల అప్పుడప్పుడు ఒకగ్లాసు చొప్పున పది గ్లాసుల నీటిని త్రాగుము. నిలువబడి గుదకండరములను పైకి లాగి ఉదరమును కుడినుండి ఎడమకు ఎడమనుండి కుడికి మరియు పైకి క్రిందికి త్రిప్పుచుండుము ఈ విధంగ పది నిమిషములు త్రిప్పిన చాలును. త్రాగిన నీరు ప్రేగులలో గల మురికిని సడలించి బయటకు నెట్టును. ఉప్పుగుణము ఏమనగా గట్టిగా ప్రేగులకు అతుకుకొని యుండు మలినములను బలవంతంగ ఊడబెరికి వెలికి త్రోయును. కడుపులోనున్న నీరంతయు వచ్చువరకు దొడ్డికి పోవలెను. కడుపు ఖాళీఅయి తెల్లటి శుభ్రపునీరు బయట వచ్చువరకు దొడ్డికి పోవలెను. అప్పుడే ప్రేగులు శుద్ధియైనవని అర్థము.

2. మందుల కొట్టులలో ఎనిమా డబ్బా అమ్మెదరు. దీనితో మూడు అడుగుల పొడవు రబ్బరు ట్యూబును కూడ ఇచ్చెదరు. ఈ డబ్బా ఒక లీటరు నీరు పట్టును. డబ్బాను చన్నీటితో నింపి రబ్బరు ట్యూబును గుదములో జొనిపి వెల్లకిలా పరుండుము. డబ్బాలో నున్న నీరంతయు ఉదరములో ప్రవేశించిన తర్వాత ట్యూబును గుదము నుండి తీసివేసి నిలుచుండి గుదకండరములను పైకి లాగి ఉదరమును కుడినుండి ఎడమకు ఎడమనుండి కుడికి మరియు పైకి క్రిందికి త్రిప్పుచుండుము. ఈ విధంగ పది నిమిషములు త్రిప్పిన చాలును. లోపలికి పోయిన నీరు ప్రేగులలోగల మురికిని సడలించి బయటకు నెట్టును, కడుపులోగల నీరంతయు వచ్చువరకు దొడ్డికి పోవలెను. కడుపు ఖాళీ అయి కడపట శుభ్రపు నీరు బయటవచ్చును. అప్పుడు ప్రేగులు శుద్ధి యైనవని అర్థం.

పై జెప్పిన రెండు ప్రక్రియలలో ఏదైనా నొకదానిని రెండు మాసములకు ఒక మారు మాత్రం ఆచరింపవలెను. పై విధంగ ప్రేగులను శుద్ధిచేయుట వలన వాత పిత్త శ్లేష్మ దోషములు తొలగును, ఉదర సంబంధములైన రోగములు, మలమద్ధకము, ప్లీహము, మూత్రకోశ అస్వస్థతలు, మూలవ్యాధి వగైరాలు తొలగును. శరీరము సన్నబడును. దేహము తేలికగా చురుకుగా నుండును.

## 2. అమృతాహార సేవనం

ప్రకృతి సిద్ధంగ లభించే పండ్లు, కాయలు, ఆకుకూరలు ప్రాణ శక్తితో నుంటాయి వీటిని యథాతదంగ ఆరగిస్తే వాటిలో గల ప్రాణశక్తి మనకు లభిస్తాయి వాటిని పచనం చేస్తే వాటిలో గల ప్రాణశక్తి నశిస్తుంది, వ్యర్థపదార్థం మిగులుతుంది. వ్యర్థపదార్థాలను తింటే కడుపు నిండుతుంది. వ్యర్థపదార్థాలను జీర్ణింప జేసేందుకు

మనలోయున్న ప్రాణశక్తి చాలదు. వీటిని జీర్ణింప జేయుటకు ఎక్కువ ప్రాణశక్తి కావలసి వస్తుంది. లేని ప్రాణశక్తి ఎక్కువగా ఎక్కడనుండి వస్తుంది? రాదు. కావున ఉన్న ప్రాణశక్తితోనే జీర్ణప్రక్రియ జరుగుతుంది. అందువలన మనకున్న ప్రాణశక్తి తొందరగ తరిగి పోవుతుంది. క్రమేపీ నిస్సత్తువ ఆవరిస్తుంది. వ్యర్థ పదార్థాలు తిన్నందువల్ల దేహంలోను ప్రేగులలోను మలినం పేరి పోతుంది. రోగాలు వస్తాయి. ముసలితనం తొందరగాను ఆపై మరణం తప్పవు.

పూర్వకాలాలలో ఋషులు అరణ్యాలలో పర్ణశాలలను నిర్మించుకొని ప్రకృతి సిద్ధంగ లభించే కాయలు, పండ్లు, ఆకుకూరలను, యథాతథంగ తింటూ తపశ్చర్యలు చేసిరి. ముసలితనం, రోగాలు, మరణాలకు దూరమైరి. చాలాకాలం జీవించగలిగిరి. ఋషులు తపస్సుకు కూర్చుంటే కొన్ని నెలలు, సంవత్సరాలు సమాధిలోనే యుండెదరు. ఎప్పుడో ఒకప్పుడు వారికి స్పృహ వచ్చినపుడు లేచి కండ్లు నులుముకొని కొంతసేపటికి చుట్టుప్రక్కలలో ఎండి రాలి పోయిన ఆకులను నాలుగు తీసి, దోసిట్లో వేసి నలిపి, నోట్లో వేసుకొనెదరు. తర్వాత సహజసిద్ధంగ పారుచుండు సెలయేళ్ళలో గల చల్లటి నీటిని నాలుగు గ్రుక్కలు త్రాగి మరల తపస్సు చేయుటకు కూర్చొందురు. జీవించుటకు గాను ఆహారాన్ని తీసికొనవలెను గాని ఆహారాన్ని తీసికొనుటకు గాను జీవించరాదు.

ఆరోగ్యం మహాభాగ్యం అన్నారు. ఆరోగ్యం ఉంటే దేనినైనా చేయుటకు శక్తి, శ్రద్ధ, ఉత్సాహం కలుగుతాయి. ఎటువంటి కష్టతరమైన పనిని కూడ పట్టుదలతో సాధింపవచ్చు. కావున ఆహారపు టలవాట్లను క్రమబద్ధీకరించుకొని జీవితాంతం కొనసాగించ

వలెను. ఈక్రింద తెలిపిన అమృతాహార సేవనమును ప్రేగులు శుద్ధి చేసుకొన్న రోజు నుండి కొనసాగించవలెను.

పండ్లు, కాయలు, ఆకుకూరలు వీటిని యథాతథంగ భుజించాలి. పండ్లు, కాయలు ఆకుకూరలు పుష్కలంగ లభ్యమౌతాయి. ఖర్చు తక్కువ ప్రయోజనం ఎక్కువ. అనాస, అరటి, సపోటా, బొప్పాయి, నారింజ, చీనీ, కొబ్బరి, కర్బూజ, దోస, కీరదోస, ద్రాక్ష, మామిడి, దానిమ్మ వగైరా పండ్లను మితంగ తినవలెను. అప్పటికప్పుడు తయారు చేసుకొన్న పండ్లరసాలను త్రాగవలెను. వివిధరకాల పండ్లతో ఫ్రూట్ సలాడ్ చేసి తినవచ్చును. ఆయా ఋతువులలో లభ్యమగు పండ్లను తప్పక వాడవలెను. ఏ పండు తిన్నను వెంటనే ఒకగ్లాసు చన్నీటిని త్రాగవలెను. అందువలన వేడిగాని, జలుబుగాని కాకుండ శరీరపు శీతోష్ణస్థితులు సమపాళ్ళగ నుండును. ఉప్పు, కారం, పులుపు, మసాలదినుసులు సుతరామూ వాడరాదు. కూరగాయలలోను ఆకుకూరలలోను సహజ సిద్ధంగ రుచివున్నది. ఉప్పుకూడ వున్నది. కావున మనం తయారుచేయు ఆహారంలో ఉప్పువేయ నవసరంలేదు. అట్లుగాక తప్పక కావలయు నన్న యెడల మామూలుగ వాడేంతలో పదిశాతం ఉప్పు వేసుకొన్న చాలును. తాళింపు చేసేటప్పుడు మచ్చుకుగాను నూనె వాడవలెను. ఒకటి లేక రెండు మిరపకాయలు గిల్లి తాళింపుచేసిన యెడల కలుగు కారం చాలును. తినేటప్పుడు తాళింపులోగల మిరపకాయ ముక్కలను తీసివేయవలెను. సాంబారు, రసం వాడవచ్చును. కాని కారం అతి తక్కువగా నుండవలెను. నిమ్మరసాన్ని పులుపుకు బదులుగ వాడవలెను. ఇది చాలా రుచికరము, ఆరోగ్యదాయకము. పెరుగు, మజ్జిగ, నెయ్యి ఎక్కువగ వాడవలెను. బెల్లం, తేనె వాడవచ్చును.

ప్రతి కాయకూరను తురిమి, తురిమిన కొబ్బరిని జతచేస్తే రుచి ఉంటుంది. కొన్నిరకాల కాయకూరలకు ఆకుకూరలకు కొద్ది మోతాదులో కారం, నిమ్మరసం, ఉప్పు వేస్తే బాగుంటుంది. మొలకెత్తిన పెసలు కలిపితే కొన్ని కాయకూరలు, ఆకుకూరలు బాగుంటాయి అనుభవం పైన వీటిని తయారు చేసుకోవాలి. ప్రయత్నిస్తే అనుభవం వస్తుంది. బార్లీ, గోధుమలు, పెసలు, పెసల పప్పు, అటుకులు, ఉప్పిడిబియ్యం వాడవలెను. గోధుమ, జొన్న, సజ్జ, రాగిరొట్టెలు, సంగటి వాడవలెను. అటుకులు, రవ్వ శ్రేష్ఠమైనవి. వీటిని తయారుచేసే పద్ధతులు తెలియలేదని బాధపడ నక్కరలేదు. ఒకవారం రోజులు ప్రయోగాలు చేస్తూవుంటే అనుభవజ్ఞులు అవుతారు.

ఆహారాన్ని వండితే అందులోగల ప్రాణశక్తి నశిస్తుంది. కావున వండిన ఆహారానికి 'మృత' ఆహారమని పేరు. ప్రకృతి సిద్ధంగ లభించే ఆహారాన్ని వాటి సహజస్థితిలో తీసుకొనేది 'అమృత' ఆహార మనబడును. కొన్ని కాయగూరలను, ఆకుకూరలను పచ్చివే తీసికొనవచ్చును. కొన్నిటిని అలాగే తీసికొనుటకు వీలుపడదు కావున పై చెప్పిన విధంగ చాలా తక్కువ ఉప్పు, కారం, నిమ్మరసంతో మొదటి ఆవిరి వచ్చు వరకు ఉడికించిన చాలును

ప్రతిరోజూ ఎనిమిది గ్లాసుల మంచినీరు, రెండు గ్లాసుల నిమ్మరసం, రెండు గ్లాసుల మజ్జిగ తీసికొనవలెను. ఉదయం పరగడుపున ఒకటి లేక రెండు గ్లాసుల మంచి నీరు త్రాగవలెను. చన్నీటి స్నానం ఉత్తమం, వెచ్చని నీటి స్నానం మధ్యమం, వేడినీటి స్నానం అధమం. వారానికి ఒక రోజు మంచినూనెతో దేహం మర్ధన చేసి, తలంటుకొని స్నానం చేసిన యెడల చర్మవ్యాధు లుండవు. అమృతాహారాన్ని అర్ధకడుపు మాత్రం తీసికొనవలెను.

మిగిలిన అర్ధకడుపులో సగభాగం నీరు నింపి, మిగిలిన భాగాన్ని వాయువు సంచరించుటకు వదలి వేయవలెను.

అమృతాహారాన్ని తీసికొంటే దేహం తేలిక అవుతుంది, ఉత్సాహం కలుగుతుంది, మేధోశక్తి పెరుగుతుంది, ఏ కార్యాన్నైనా చేయుటకు శ్రద్ధ పట్టుదల కలుగుతాయి. శరీరం మలిన రాహిత్యమై పరిమళంగ ఉంటుంది. రోజుకు నిద్ర ఆరు గంటలే అవసర మౌతుంది. బుద్ధి వికాసం కలుగుతుంది. అరిషడ్వర్గాలు అంతిమౌతాయి. అహంకారం అసలే ఉండదు. జ్ఞాన విజ్ఞానాల సముపార్జనకు దోహదపడుతుంది.

## 3. ఆసనాభ్యాసము

సకలలోక వ్యాప్తమును, చరాచర జీవులకు ప్రాణాధారమును నైన వాయువు మానవుని దేహంలో ఉచ్ఛ్వాసనిశ్వాస రూపంలో నడయాడు చున్నది గదా. ఈ వాయువే ప్రాణము, శక్తి, సత్తు అనబడును. ఉచ్ఛ్వాసనిశ్వాస రూపంగ మానవ శరీరంలో నడయాడు వాయువును ఏ విధంగ ఉపయోగించి ప్రాణశక్తిని పొంద గలమో పరికింతము. ఈ విధానములో మూడు ప్రక్రియలు గలవు. ఇందులో మొదటిది ఆసనములు, రెండవది ముద్రలు, మూడవది కుంభకము.

ఆసనములు అన్ని రోగాలకు మూలమైన మాలిన్యాలను నాడుల నుండి బహిష్కరిస్తాయి. ప్రతి నాడియు సన్నని రంధ్రమును కలిగి యుండును. ఈ రంధ్రముల ద్వారా రక్త ప్రసరణము జరుగును. దశవిధ వాయువులు నాడులలో ప్రవహించి వాటివాటి కార్యములను చేయును. ప్రతి ఆసనము కొన్నికొన్ని అవయవములపై ఒత్తిడి తెచ్చి ఆయా అవయవములకు రక్తప్రసరణమును బాగుగ జరిపించును. ఆసనాభ్యాసము వలన నాడీమండలము శుద్ధియై రక్తప్రసరణము

బాగుగ జరుగుట వలన రోగములు అన్నియు నయమగును. క్రొత్త రోగములు దరిచేరవు. అమృతాహార సేవనంతో బాటు ఆసనాభ్యాసాన్ని ఆచరించిన యెడల సత్ఫలితాలు త్వరితగతిని పొంద వచ్చును. జీవులు ఎనుబదినాలుగులక్షలు. ఆసనములు కూడ ఎనుబది నాలుగు లక్షలు. అన్ని ఆసనములను ఆచరించుటకు వీలుపడదు, జీవితకాలం చాలదు. అన్ని ఆసనాలూ ఎవరికీ తెలియవు. కావున మనకు సులభమైనవి, సుఖమైనవి, అవశ్యకమైన కొన్ని ఆసనాలను మాత్రము ప్రతిరోజూ ప్రాతఃకాల సంధ్యాసమయాలలో ఆచరించిన చాలును. ఆసనాభ్యాసములపై తర్ఫీదులు ఇచ్చుచున్నారు. ఆసనాభ్యాసములను నేర్పేవారు గాని ఆసనముల గురించి పుస్తకములు గాని ఆసనములను క్రమపద్ధతిలో ఆచరించు మార్గములను తెలుపుట లేదు. క్రమ పద్ధతిలో ఆసనములను వేయుట అత్యంతావశ్యకము. మూడు నెలలు ఆచరించిన ఆసన సిద్ధి కలుగును. ఆసనాభ్యాసానికి మడత వేసిన ఒక మెత్తని బెడ్ షీటును వాడవలయును. మడత వేసిన బెడ్ షీట్ పై కూర్చుండి లేక పరుండి ఆసనములను అభ్యసింపవలెను. ఆసనాభ్యాసమునకు ముందు పరగడుపు యుండవలెను

ఆసనాభ్యాసములకు పూర్వము ఈ క్రింద తెలిపిన సులభాసనములను ఆచరింపుము, ఈ సులభాసనాలను ఆచరించుట వలన శరీర కండరములు వదులుకాబడి, కీళ్ళు నొప్పి లేకుండ తతిమ్మ ఆసనములను ఆచరించుటకు దోహదపడతాయి. శరీరం తేలికగ ఉంటుంది. తతిమ్మ ఆసనములు సునాయాసంగ వేయుటకు వీలు కలుగుతుంది.

1. నిటారుగ నిలువుము. రెండు చేతులను రెండు వైపులా బార్లా చాపుము. ఎడమవైపునకు నడుమును, శిరస్సును, చేతులను తిరిగేంత వరకు త్రిప్పుము. శిరస్సు ఎడమ భుజమువైపు వచ్చునట్లు,

ఎడమచేయి వీపు వెనుకకు వచ్చునట్లు, కుడిచేయి రొమ్ముభాగమును దాటునట్లు కాళ్ళు కదలకుండ ఒకేమారు త్రిప్పుము. వెంటనే ఎడమవైపు నుండి కుడివైపునకు నడుమును, శిరస్సును, చేతులను ఒకేమారు త్రిప్పుము. శిరస్సు కుడి భుజము పైకి వచ్చునట్లు, కుడి చేయి వీపు వెనుకకు వచ్చునట్లు, ఎడమచేయి రొమ్ముభాగమును దాటునట్లు కాళ్ళు కదలకుండ త్రిప్పుము. ఈ విధంగ ఎడమ కుడి ప్రక్కలకుచేయు ప్రక్రియ ఒకసైకిలు అనబడును. ఇటువంటి సైకిళ్ళు పదిచేయుము. తర్వాత ఒకనిమిషం విశ్రాంతి తీసికొనుము.

2. నిటారుగ నిలువుము. గుదికాళ్ళను దగ్గరగా నుంచి పాదములను 'V' ఆకారములో నుంచుము. రెండు చేతులను పైకెత్తి తలకిరువైపులా ఆకసము వైపు ఎత్తుము. అరచేతులను నీకెదురు దిక్కువైపు త్రిప్పుము. మెల్లగా నడుమును ముందుకు వంచుచూ చేతివ్రేళ్ళతో పాదపువ్రేళ్ళను తాకుము. చేతివ్రేళ్ళతో కాలి బొటనవ్రేళ్ళను పట్టుకొనుము. అభ్యాసము కాను కాను కాలి వ్రేళ్ళు, బొటనవ్రేళ్ళు సులభముగా అందును. మరల మెల్లగా నడుమును చేతులను పైకి లేపి నిటారుగ నిలువుము. ఈ ప్రక్రియ ఒకసైకిలు అనబడును. వంగునపుడు లేచునపుడు మోకాళ్ళు వంగ రాదు. సైకిళ్ళు పదిచేయుము. తర్వాత ఒకనిమిషం విశ్రాంతి తీసికొనుము.

3. నిటారుగ నిలువుము. గుదికాళ్ళను కొంచెము దూరముగా నుంచి మోకాళ్ళను వంచక ముందునకు నెమ్మదిగా కుడి చేతితో ఎడమకాలి బొటనవ్రేలును పట్టుకొనుము. నెమ్మదిగా పైకిలేచి ముందుకు వంగి ఎడమచేతితో కుడికాలు బొటనవ్రేలును పట్టుకొనుము. మెల్లగా పైకిలేవుము ఈ ప్రక్రియ ఒకసైకిలు అన బడును. ఇటువంటి సైకిళ్ళు పదిచేయుము. తర్వాత ఒకనిమిషం విశ్రాంతి తీసికొనుము.

4. నిటారుగ నిలుచుండుము. రెండు కాళ్ళను ఒక అడుగు దూరంలో నుంచుము. నడుమును చేతులను మెల్లమెల్లగ వెనుకకు వాల్చుము. వీలైనంత వరకు వాల్చుము. తొందరపడవద్దు. అర చేతులు భూమిపై ఆనునట్లు నడుమును వాల్చుటకు ప్రయత్నము చేయుము. మరల చేతులను నడుమును నెమ్మదిగ పైకి లేపి నిటారుగ నిలుచుండుము. ఇది ఒక సైకిలు అనబడును. ఇటువంటి సైకిళ్లు పది చేయుము. తర్వాత ఒకనిమిషం విశ్రాంతి తీసికొనుము.

5. కాళ్ళను చాపి కూర్చుండుము. ఎడమకాలిని మడచి దగ్గరకు తీసికొనుము. కుడిచేతి వ్రేళ్ళతో ఎడమచేతి వ్రేళ్ళను, చేయిని, భుజమును, అనగా చేతిలోని ప్రతి అణుభాగమును నలుపుతూ భుజము నుండి హృదయ స్థానము వరకు ఒత్తుము. తర్వాత కుడి ఎడమ రెండు చేతివ్రేళ్ళతో ఎడమకాలి వ్రేళ్ళను, పాదమును, గుదికాలును, మీగాలును, మోకాలును, తొడను, పిరుదులను అనగా ఎడమకాలి ప్రతి అణు భాగమును నలుపుతూ పొత్తికడుపు ద్వారా హృదయ స్థానము వరకు ఒత్తుము. ఎడమకాలిని నిటారుగ నుంచి కుడికాలిని మడచి దగ్గరకు తీసికొనుము. ఎడమచేతి వ్రేళ్ళతో కుడిచేతి వ్రేళ్ళను, చేయిని, భుజమును అనగా చేతిలోని ప్రతి అణు భాగమును నలుపుతూ భుజమునుండి హృదయ స్థానము వరకు ఒత్తుము. తర్వాత కుడిఎడమ రెండు చేతివ్రేళ్ళతో కుడికాలి వ్రేళ్ళను, పాదమును, గుదికాలును, మీగాలును, మోకాలును, తొడను పిరుదులను అనగా కుడికాలి ప్రతి అణు భాగమును నలుపుతూ పొత్తికడుపు ద్వారా హృదయ స్థానము వరకు ఒత్తుము.

అదేవిధంగ రెండు చేతివ్రేళ్ళతో పొత్తికడుపు, నాభిస్థానము, రొమ్ముభాగమును ప్రతి అణువును ఒత్తుచూ హృదయ స్థానమున ఒత్తిడిని ఆపవలెను తర్వాత తల నెత్తిభాగము, కనుబొమలు,

ముక్కు, దవుడలు, పెదవులు, గడ్డము, మెడ ఒత్తుచూ ఒత్తిడిని హృదయ స్థానము వద్దకు తీసికొని వచ్చి ఆపుము. మరల తల పై భాగమును నొసటినుండి నడినెత్తి ద్వారా వెనుక వరకు, చెవులు, మెడ వెనుక భాగము ప్రతి అణువునూ ఒత్తుచూ ఒత్తిడిని హృదయ స్థానము వద్దకు తీసికొనివచ్చి ఆపుము. తర్వాత కుడిచేతిని భుజము మీదుగ వీపుపైకి, ఎడమచేతిని వెనుకకు వంచి వీపు అడుగు భాగమునకు పెట్టి రెండు చేతులకు అందినంత వరకు వీపు భాగమును ఒత్తవలెను అదేవిధంగ ఎడమ చేతిని భుజము మీదుగ వీపుపైకి, కుడిచేతిని వెనుకకు వంచి వీపు అడుగు భాగమునకు పెట్టి రెండు చేతులను అందినంత వరకు వీపుభాగమును ఒత్తవలెను. అంతిమంగ శవాసనంలో విశ్రాంతి తీసికొనవలెను.

6. శవాసనంలో పరుండుము. కాలివ్రేళ్ళను బిగించుము. అర్ధనిమిషం తర్వాత సడలింపుము. పాదములను బిగించుము, అర్ధ నిమిషం తర్వాత సడలింపుము. పాదము నుండి మోకాళ్ళ వరకు బిగింపుము. అర్ధనిమిషం తర్వాత సడలింపుము. మోకాళ్ళ నుండి తొడల వరకు బిగింపుము. అర్ధనిమిషం తర్వాత సడలింపుము. రొమ్ము భాగమును బిగింపుము. అర్ధనిమిషం తర్వాత సడలింపుము. చేతులను బిగింపుము. అర్ధనిమిషం తర్వాత సడలింపుము. తలను బిగింపుము. అర్ధనిమిషం తర్వాత సడలింపుము. తర్వాత కాలివేళ్ళ నుండి తల వరకు గల మొత్తము శరీర భాగమును బిగింపుము. అర్ధనిమిషం తర్వాత సడలింపుము. అంతిమంలో శవాసనంలో ఒక నిమిషం విశ్రాంతి తీసికొనుము.

పై తెల్పబడిన 6 ప్రక్రియలు చేయుటవలన నరములు, కండరములు, కీళ్ళు వదులు అయి రక్తప్రసరణము బాగా జరుగును. ప్రతి

ప్రతి అణువును ఉత్తేజమగును. ఏవిధమైన ఆసనమును వేయుటకును శరీరము సిద్ధముగా నుండును. మనస్సు విశ్రాంతమై ఆహ్లాదకరముగ నుండును.

**సర్వాంగాసనము :-** శవాసనం నుండి రెండుకాళ్ళను ఒక్కేమారు 30° పైకి లేపుము. తర్వాత రెండు చేతులను రెండు పిరుదులపై నుంచి రెండుకాళ్ళను పైకి లేపుము. వెన్వెంటనే రెండు చేతులను నడుము క్రిందికి పోనిచ్చి నడుమును పైకి లేపుము. నడుము, కాళ్ళు 90° నిటారుగ నుండవలెను. గడ్డము ఎదకు ఆని యుండవలెను. రెండు నిమిషముల తర్వాత రెండుకాళ్ళను సైకిలు త్రొక్కునట్లు పదిమార్లు సైకిలింగ్ చేయుము. తదుపరి కత్తెరవలె రెండుకాళ్ళను ఒకదానిపై నొకటి వేసి రెండు నిమిషము లుండుము. మరల రెండుకాళ్ళను నడిచే విధంగ కాళ్ళను పదిమార్లు ఆడించుము. ఆపై రెండుకాళ్ళను ఇరువైపులా బార్లా చాపుము. రెండు నిమిషముల అనంతరము రెండుకాళ్ళను దగ్గరకు చేర్చి పద్మాసనము వేయుము. రెండు నిమిషముల తర్వాత పద్మాసనము నుండి కాళ్ళను విడదీసి పైకి నిటారుగ నుంచి, మెల్లమెల్లగా నడుము క్రిందికి చేతులను పిరుదులకు తెచ్చుకొనుచూ, కాళ్ళను క్రిందికి దింపుచూ పిరుదుల నుండి చేతులను తీసివేసి కాళ్ళను భూమిపై నుంచుము. శవాసనంలో రెండు నిమిషములు విశ్రాంతి తీసికొనుము.

**హలాసనం:-** శవాసనం నుండి సర్వాంగాసనం చేయుము. మెల్లమెల్లగా రెండు చేతులతో నడుమును పైకి ఎత్తుతూ రెండు కాళ్ళను తలవైపు భూమిపై ఆనించుము. గడ్డం ఎదపై సంపూర్ణంగ ఆనుకొనును. రెండు చేతులను భూమిపై నుంచి నిటారుగ నుంచుము. రెండు నిమిషముల తర్వాత కాళ్ళను పైకి లేపి,

సర్వాంగాసనమునకు వచ్చి, సర్వాంగాసనము నుండి శవాసనమునకు వచ్చి, రెండు నిమిషములు విశ్రాంతి తీసికొనుము.

**కుడి అర్ధ పశ్చిమోత్తానసనము:-** శవాసనం నుండి లేచి కూర్చుండుము, రెండు కాళ్ళను చక్కగా చాచుము. ఎడమ కాలును కుడితొడకు ఆనించుము. ఎడమ చేతిని నడుము వెనుకకు పోనిమ్ము. నెమ్మదిగా ముందుకు వంగి కుడి చేతితో కుడి కాలి బొటన వ్రేలిని పట్టుకొనుము. రెండు నిమిషములు అలాగే యుండుము. అనంతరం నెమ్మదిగా నడుమును పైకి లేపి ఎడమ చేతిని వెనుక నుండి తీసికొని వచ్చి రెండు నిమిషములు విశ్రాంతి తీసికొనుము.

**ఎడమ అర్ధపశ్చిమోత్తానసనము:-** రెండు కాళ్లను చక్కగా చాచుము. కుడి కాలును ఎడమ తొడకు ఆనించుము. కుడి చేతిని నడుము వెనుకకు పోనిమ్ము. నెమ్మదిగా ముందుకు వంగి ఎడమ చేతితో ఎడమ కాలి బొటనవ్రేలిని పట్టుకొనుము. రెండు నిమిషములు అలాగే యుండుము. అనంతరము నెమ్మదిగా నడుమును పైకి లేపి కుడిచేతిని వెనుక నుండి తీసికొనివచ్చి రెండు నిమిషములు విశ్రాంతి తీసికొనుము.

**పూర్ణ పశ్చిమోత్తానసనము:-** రెండు కాళ్ళను చక్కగా చాపుము. నడుమును నెమ్మదిగా వంచి మోకాళ్లమీద తలను ఆన్చి రెండు చేతులతో రెండుకాళ్ళ బొటనవ్రేళ్లను పట్టుకొనుము. రెండు నిమిషములు అలాగేయుండి తర్వాత నెమ్మదిగా పైకిలెమ్ము. శవాసనంలో రెండు నిమిషములు విశ్రాంతి తీసికొనుము

**పద్మాసనము:-** శవాసనం నుండి లేచి కూర్చుండుము. ఎడమ కాలును కొద్దిగా మడిచి పెట్టుము. రెండు చేతులతో కుడి పాదమును ఎత్తి ఎడమ కాలు తొడపై నుంచుము. మరల రెండు చేతులతో ఎడమపాదమును ఎత్తి కుడికాలు తొడపై నుంచుము.

మడమలను రెండింటికీ గజ్జలను అదుముకున్నట్లు ఆనించుము. నడుము, తల నిటారుగ నుండవలెను. కుడిచేతిని కుడికాలిని మునుకు పైనను ఎడమచేతిని ఎడమకాలి మునుకుపైనను ఉంచుము. అరచేతులు పైకి కనబడునట్లును చూపుడు వ్రేలు బొటనవ్రేలు రెండింటినీ కలుపుము. మిగిలిన మూడు వ్రేళ్ళను నిటారుగ నుంచుము. రెండు నిమిషముల తర్వాత పద్మాసనము నుండి విడివడి విశ్రాంతి తీసికొనుము.

**వజ్రాసనం:-** మోకాళ్ళను వంచి రెండు పాదములు వెనుకకు పెట్టి మడమలపై పిరుదులను ఆనించి కూర్చొనుము. మోకాళ్ళకు మధ్య మూడు అంగుళముల సందు యుండవలెను. శరీరము యొక్క బరువంతయు మోకాళ్ల మీదను చీలమండలముల పైనను యుండవలెను. చేతులను మోకాళ్ళపై ఆనించి పెట్టవలెను. మూడు నిమిషములు కూర్చుండుము. తర్వాత ఏదో ఒక వైపునకు తిరిగి ఆ వైపునగల చేతిని భూమికి ఆనించి ప్రక్కకు ఒరిగి తద్వ్యతిరిక్తపు కాలును నెమ్మదిగా ముందుకు తియ్యుము. తరువాత ఇంకొక కాలును కూడ ముందుకు తీయుము. రెండు నిమిషములు విశ్రాంతి తీసికొనుము.

**మకరాసనము:-** బోర్లా పరుండుము. ఎడమ చేతిని ముఖము క్రింద పెట్టి అరచేతిని భూమిపై నుంచుము. కుడి అరచేతిని ఎడమ చేతిపై నుంచుము. తలను ఎడమవైపు త్రిప్పి పరుండుము. ఎడమ కాలి పాదమును కుడికాలి తొడకు ఆనించుము. ఇది ఒక పద్ధతి. కుడి అరచేతిని భూమిపై నుంచుము. ఎడమ అరచేతిని కుడిచేతిపై నుంచుము. తలను కుడివైపు త్రిప్పి పరుండుము. కుడికాలి పాదమును ఎడమకాలి తొడకు ఆనించుము. ఇది ఇంకొక పద్ధతి. సాధకుడు దేనినైనను అభ్యసింపవచ్చును. రెండు నిమిషములు చేయుము. విశ్రాంతిగ నుండుట తప్ప ఈ ఆసనంలో చేయునదేదియు లేదు.

**భుజంగాసనము :-** మకరాసనము నుండి లేవవలెను. అనగా బోర్లా పరుండుము. నడుమునకు ఇరువైపులా అరచేతులను భూమిపై ఆనించవలెను. రెండు కాళ్ళను బిర్రబిగువగ సాచి యుంచుము. రెండు చేతుల మీద నడుమును పైకి లేపుము. రెండు మోచేతుల పైనను నడుము పైనను శరీర భారము నుంచుము. మెడను నింగిని చూచు విధముగ పైకి లేపుము. కండ్లు తెరచుకొని చూపులను భ్రూమధ్యమున నుంచుము. శరీరము పాము పడగవలె నుండును. రెండు నిమిషముల అనంతరం నెమ్మదిగి తలను వాల్చి, నడుమును క్రిందికి తీసికొనివచ్చి చేతులను తీసి మకరాసనానికి రావలెను. రెండు నిమిషములు విశ్రాంతి తీసికొనుము.

**శలభాసనము:-** మకరాసనము నుండి లేవవలెను. అనగా బోర్లా పడుకొనుము. చేతులను తొడల క్రిందకు తెచ్చి చేతివ్రేళ్ళను మడచి గుప్పిట బిగించుము గడ్డమును నేల మీద ఆన్చుము. మొదట కుడికాలును పైకి లేపుము. నిటారుగ లేపుము. పిమ్మట కుడిచేతి గుప్పిటితో తొడక్రింద నుండి తొడను పైకి లేపుము. ఒక్క నిమిషము అట్లేయుండుము. తరువాత నెమ్మదిగా కాలును క్రిందికి దించుచూ కాలిక్రిందగల పిడికిలిని తీయుము. తరువాత ఎడమ కాలును పైకి లేపుము. నిటారుగ లేపుము. పిమ్మట ఎడమచేతి గుప్పిటతో తొడక్రింద నుండి తొడను పైకిలేపుము. ఒక్క నిమిషము అట్లేయుండుము. తరువాత నెమ్మదిగా కాలును క్రిందికి దించుచూ కాలు క్రింద గల పిడికిలిని తీయుము. మరల రెండు కాళ్ళను పైకి లేపుము. రెండు తొడల క్రింద నుండి రెండు పిడికిళ్ళతో రెండు తొడలను పైకి లేపుము. రెండు నిమిషములు అట్లే యుంచుము. పిమ్మట నెమ్మదిగా రెండు కాళ్ళను క్రిందికి దించుచూ, రెండు తొడల క్రింద గల పిడికిళ్ళను తీసిన తర్వాత, రెండు కాళ్ళను

భూమిపై ఆనించుము. వెంటనే మకరాసనంలో ఒక నిమిషం విశ్రాంతి తీసికొనుము. ఈ ఆసనము ప్రతీ పద్ధతిలోను తలను పైకి ఎత్తవలెను. కాళ్ళు తల ఎత్తినపుడు సమముగ నుండవలెను.

**ధనురాసనము:-** మకరాసనము నుండి లేవవలెను. అనగా బోర్లా పరుండుము. చేతులను ప్రక్కలకు చేర్చుము. మోకాళ్ళ వద్ద నుంచి కాళ్ళను పిరుదుల వైపు వంచుము. ఎడమచేతితో ఎడమ కాలి చీలమండను, కుడిచేతితో కుడికాలి చీలమండను పట్టుకొనుము. నాభిభాగము భూమిని ఆనునట్లు చేసి నడుము భాగము నుండి శిరస్సు వరకు పైకి ఎత్తి, శిరస్సు ఆకసమును చూచునట్లు ఉంచుము. కాళ్ళు చేతులు ఒకదానిని మరొకటి లాగుచుండును. ధనుస్సు ఆకారము కలుగును. రెండు నిమిషములు అలాగే యుండుము. తర్వాత నెమ్మదిగా చేతులను కాళ్ళపట్టును వదిలి ఛాతి భూమి మీదకు తెచ్చి చేతులను ప్రక్కలకు తీసి కాళ్ళను వెనుకకు తీసి మకరాసనమునకు రావలెను. మకరాసనంలో రెండు నిమిషములు విశ్రాంతి తీసికొనుము.

## 4. నాడీ శుద్ధి.

మనము పీల్చి వదలు ఉచ్ఛ్వాస నిశ్వాస రూపమగు వాయువులో ప్రాణశక్తి యున్నదని తెలిసికొన్నాము. ఈ ప్రాణశక్తిని మానవుడు పొందు ప్రక్రియ ప్రాణాయామము అనబడును. ప్రాణాయామము అనగా వాయు విరామము. దీని అర్థం తన శరీరము నందుండు ప్రాణమును తన స్వాధీనము చేసికొనుట. హృదయ స్థానమున అధోముఖముగ నుండు ప్రాణవాయువును మూలాధారములో ఊర్ధ్వముఖముగ నుండు అపానవాయువును రెండింటిని ఒకదానిలో నొకటి ఐక్యము చేయుటను ప్రాణాయామ మనబడును.

మనము పీల్చు వాయువు పూరకము, పీల్చిన గాలిని స్తంభింప జేయుట కుంభకము, లోపల నుండు గాలిని బయటకు వదలుట

రేచకము, గాలిని లోనికి పీల్చక యుండు స్థితి శూన్యకము అన బడును

స్థిరముగ పద్మాసనము లేక వజ్రాసనములో కూర్చుండుము. కుడినాశికా రంధ్రముపై కుడిచేతి బొటనవ్రేలును, ఎడమ నాశికా రంధ్రముపై కుడిచేతి తర్జనివ్రేలును ఉంచుము. కుడినాశికా రంధ్రమును మూయుము. ఎడమ నాశికా రంధ్రము ద్వారా గాలిని మెల్లమెల్లగ పీల్చి కుంభించి, ఎడమనాశికా రంధ్రమును మూసి, కుడినాశికా రంధ్రము ద్వారా మెల్లమెల్లగా గాలిని వదలుము. తదుపరి ఎడమనాశికా రంధ్రమును మూసి కుడినాశికా రంధ్రము ద్వారా మెల్లమెల్లగా గాలిని పీల్చి నీకు వీలైనంత వరకు కుంభించి, కుడినాశికా రంధ్రమును మూసి ఎడమనాశికా రంధ్రము ద్వారా మెల్లమెల్లగా గాలిని వదలుము. ఇది ఒక సైకిలు అనబడును. ఈ విధంగ ఇరవై సైకిళ్ళు చేయుము. అనగా ఉదయం ఇరవై సైకిళ్ళు సాయంత్రం ఇరవై సైకిళ్ళు చేయవలెను. పూరక కుంభక రేచకములు చేయునపుడు శబ్దము లేకుండ చేయవలెను. నెమ్మది నెమ్మదిగా గాలిని పీల్చి కుంభకము తర్వాత నెమ్మది నెమ్మదిగా వదలవలెను. గాలిని పూరించునపుడు ఓం ... అని ప్రణవమును మనసులోనే ఉచ్ఛరించవలెను. కుంభక సమయంలో ఓం ... అని ప్రణవమును మనసులోనే ఉచ్ఛరించవలెను. రేచకమప్పుడు ఓం ... అని ప్రణవమును మనసులోనే ఉచ్ఛరించవలెను. దృష్టిని భ్రూమధ్యమునన నుంచవలెను.

తర్వాత వజ్రాసనం లేక పద్మాసనంలో కూర్చుండుము. ఈ ఆసనంలో ముద్రల సాయంతో ప్రాణాయామం చేయవలెను. కనిష్ఠ విభాగ ప్రాణాయామం, మధ్యమ విభాగ ప్రాణాయామం, జ్యేష్ఠ విభాగ ప్రాణాయామం, చిన్ముద్ర, చిన్మయముద్ర, ఆదిముద్ర,

మేరుదండముద్ర. అనువాటిని ఆచరింపవలెను. ఒక్కొక్క దానిని ఆచరించు విధానమును తెలిసికొందము.

**కనిష్ఠవిభాగ ప్రాణాయామము:-** రెండు చేతులను నడుముపై నాభిస్థానమున కిరువైపులా నుంచుము. బొటన వ్రేలును వెనుకకును, మిగిలిన నాలుగు వ్రేళ్లను ముందుకు భూమిని చూచునట్లుంచవలెను. పూరక కుంభక రేచక ప్రక్రియలను పై తెల్పిన విధముగ చేయుము. పది సైకిళ్ళు చేయుము. ఈ విధంగ చేయుటవలన శరీరముయొక్క నాభికి క్రిందిభాగములో గల పెద్ద నాడులన్నియు శుద్ధియై వాటిలో ప్రాణశక్తి ప్రవహించి ఉత్తేజములగును.

**మధ్యమ విభాగ ప్రాణాయామము:-** తదుపరి రెండుచేతులను రొమ్మువద్ద నుంచుము. రెండు చేతులను సమానముగ నుంచుము. అరచేతులు భూమిని చూడవలెను. బొటనవ్రేళ్ళు వెనుకకు మిగిలిన నాలుగు వ్రేళ్ళు ముందుకు నుండవలెను. పూరక కుంభక రేచకములను పదిసైకిళ్ళు చేయుము. ఈ విధంగ చేయుటవలన శరీరముయొక్క నాభికి పై భాగము హృదయమునకు క్రింది భాగములలో గల పెద్దనాడులన్నియు శుద్ధియై, వాటిలో ప్రాణశక్తి ప్రవహించి ఉత్తేజములగును.

**జ్యేష్ఠ విభాగ ప్రాణాయామము:-** తదుపరి రెండు చేతులను పైకిఎత్తి అరచేతులను బాగా తెరచి తలకుఇరువైపులా ఆ చేతులు వెనుకకు చూచునట్లు వీపుపై ఆనించుము మోచేతులు ఆకాశమును చూచునట్లుంచుము. వాయువును పూరింపుము. వెంటనే గడ్డమును ఎదకు ఆనించుము. కుంభకము అయిన తర్వాతగడ్డమును పైకి ఎత్తి రేచకమును చేయుము. ఈ విధంగ పదిసైకిళ్ళు చేయుము. ఈవిధంగ చేయుట వలన శరీరముయొక్క :

రంధ్రము వరకు శరీరము పైభాగములలో గల పెద్దనాడులన్నియు శుద్ధియై వాటిలో ప్రాణశక్తి ప్రవహించి ఉత్తేజములగును.

పై మూడు విభాగ ప్రాణాయామములను పద్మాసనము లేక వజ్రాసనములోనే చేయవలెను. పై విభాగ ప్రాణాయామములు చేయుటవలన శరీరములో ఉష్ణము ఉత్పత్తియై శరీరము వేడియగును. ఈ వేడిని పోగొట్టుకొనవలెను. అదెట్లనగా ఆసనములోనే యుండవలెను. వాయువును పూరకము చేయుచూ తలను వెనుకకు పోనిచ్చి పూరకముఅయినవెంటనే నోటిద్వారా వాయువును రేచకము చేయుచు ముందుకు వంగి నొసలు భూమిపై తాకునట్లుంచవలెను. ఈ విధంగ వాయురేచకము చేయునపుడు రేచకమును ఐదుమార్లు చేయవలెను. మొదట రేచకమప్పుడు 60 శాతం, రెండవ రేచకమప్పుడు 20 శాతం మూడవ రేచకమప్పుడు 10 శాతం, నాలుగవ రేచకమప్పుడు 5 శాతం ఐదవ రేచకమప్పుడు వాయువును వదలవలెను శూన్యకావస్థలో ఒక నిమిషముండవలెను. రెండుచేతులను వెనుకకు తీసి నడినెత్తి భూమినిఆనుకొనునప్పుడు వదులుగావదలవలెను. తలను పైకి లేపినపుడు చేతులను వెనుక నుండి ముందుకు తీసికొనవలెను ఈ విధంగ మూడు లేక ఐదు సైకిళ్లు చేయవలెను శరీరంలో గల ఉష్ణమంతయు వెలుపలికి పోవును. ఈ ప్రక్రియకు 'దాతి' అనిపేరు.

ఆ తర్వాత నోటిలో గల దంతములను బిగించి పెదవులు తెరచి వాయువును పూరించవలెను. పెదవులను మూసి నాశికముల ద్వారా వాయువును బయట వదలవలెను, ఈ ప్రక్రియవలన చల్లని వాయువు లోనికి ప్రవేశించి కడుపు దేహము చల్లగా నుండును. ఈ ప్రక్రియను 'శీతలి' యని పేరు.

చిన్ముద్ర: ఆసనములోనే యుండుము. చేతి చూపుడు వ్రేలును బొటనవ్రేలును కొసలందు జతచేర్చుము. రెండువ్రేళ్ళ

**మేరుదండముద్ర:-** ఆసనములోనే యుండుము చేతి నాలుగ వేళ్లను అరచేతిలోకి మడువుము. బొటనవ్రేలును నిటారుగ ని పెట్టుము. రెండు చేతులతోను చేయుము. ఇట్టి చేతులను తొడలపై నుంచుము. అనగా పిడికిలిని చిటికెన వేలు క్రిందివైపు తొడలపైనను బొటనవ్రేలు పైనను నుండునట్లును ఉంచవలెను. బొటన వ్రేలు ఆక మును చూడవలెను. ఈ స్థితికి మేరుదండముద్ర యని పేరు, పూర కుంభక రేచకములను పది సైకిళ్ళు చేయుము, ఈ విధంగ చేయ టవలన వీపులోగల వెన్నుపూస మొత్తము శుద్ధియై, అందులో ప్రాణశక్తి ప్రవహించి వెన్నుపూస ఉత్తేజమగును.

**కపాల భాతి :-** ఆసనములో నుండుము. మొండెము, త నిటారుగ నుంచి చేతులను మోకాళ్ళపై నుంచుము. నేత్రములన మూసికొని పూరక రేచక ప్రక్రియలను త్వరత్వరగా ఆచరింపుమ దీనిని తీవ్రముగ చేయవలెను. ఇందులో కుంభకము లేదు, పూర సమయములో ఉదరకండరములను వదులు చేయుము, రేచకములో ఉదరమును పైకి లాగి కుంభించుము. ఈ ప్రక్రియలో రేచకమ ప్రధానముగ నుండును. ఈ పూరక రేచక ప్రక్రియను పది నిమిష ములు చేయుము. ఇందువలన శ్వాసకోశమును, నాశికాగ్రమున పూర్తిగ శుద్ధియగును. ఊపిరితిత్తులలోని కొనభాగములకు ప్రా వాయువు వ్యాపించి అందులోని బొగ్గుపులుసువాయువును నిర్మూ లించును. క్షయ, ఆస్మా, ఉబ్బసములకు మూలకారణములగ సూక్ష్మక్రిములు నశించును.

**ఆసనముల వలన ప్రయోజనములు:-** శవాసనం దేహామ స్సులను సడలించి సంపూర్ణ విశ్రాంతి నిచ్చును. సర్వాంగాసనమ థైరాయిడ్ గ్రంథిని అభివృద్ధిపరచి ఊపిరితిత్తులను గుండెను బలపర వెన్నెముకకు స్థితిస్థాపకత్వము నిచ్చును. అకాల వృద్ధాప్యమును

ఖుతు దోషములను, స్వప్నస్ఖలన దోషములను పోగొట్టును, హాలాసనము వలన నడుము, వీపు, మెడలలో అన్యపదార్థములు చేర కుండ నాడులన్నియు శుభ్రముగ నుండును. కండరములకు చక్కని వ్యాయామము కలిగి ఉదరకండరములన్నియు మడవబడుట వలన ఉదరసంబంధ వ్యాధులు, మలబద్ధకములు హరించును. పశ్చిమోత్తా సనము వలన మోకాళ్ళవెనుక కండరములకు, ఉదర కండరములకు, గర్భకుహర కండరములకు, గర్భాశయ అవయవములకు ఒత్తిడి కలిగి కాలేయము, ప్లీహము, జీర్ణకోశములు, మూత్రపిండములు, ప్రేగులు ఉద్దీపనము చెంది స్వధర్మమును నిర్వహించును. పద్మా సనము వలన కాళ్ల కండరములు సంకోచము చెంది కటిభాగమునకు రక్తప్రసరణము బాగుగా జరుగును. జఠరాగ్ని వృద్ధియై ఆకలి అధికమగును. బ్రహ్మచర్యమును పాటించుటకు సహకరించును. కుండలినీ శక్తిని సులభముగ మేల్కొల్పును. వజ్రాసనము వలన ఆంత్రములలో గల మలము విడిపోయి మలబద్ధకవ్యాధి నశించును. హఠయోగము చేయుటకు ఈ ఆసనము చాలా అనువైనది. కుండ లినీ శక్తిని సులభముగ మేల్కొల్పును. ఉదరము పెరుగుట, పొత్తి కడుపున కంటిన సమస్త రోగములు, నడుములకు సంబంధించిన నొప్పులు పోవును.

మకరాసనము దేహమనస్సులను సడలించి సంపూర్ణ విశ్రాంతి నిచ్చును. భుజంగాసనము వలన గర్భకుహరములోని కండరములు బాగుగా సాగి రక్తప్రసరణము చక్కగా పారును. ఛాతి విస్తృత మగును, ఊపిరితిత్తులు వ్యాకోచించును. మలబద్ధకము పోగొట్టి జఠరాగ్ని వృద్ధియై ఆకలి అధికమగును. శలభాసనము వలన గర్భకుహర అవయవములపై తీవ్రమైన ఒత్తిడి కలిగి గర్భకుహర రక్తనాళములందు గల నిలువరక్తము అధిక చలనము పొంది హృద

యోన్ముఖమై ప్రవహించును. కావున గర్భకుహర అవయవములు ఉద్దీపన చెంది బలిష్ఠములై ఆంత్రములో ఎండి చిట్టము కట్టుకొని రాళ్ళవలె స్తంభించిన మలము అధోన్ముఖమగును. కాలేయము, ప్లీహము, వృక్కము వగైరా గర్భకుహర అవయవములు ఉద్దీపన చెంది గర్భకుహరమునకు సంబంధించిన వ్యాధులు నివారింపబడి చురుకుగా పనిచేయును, ధనురాసనము వలన ప్రేగులలోని వికారము బహిష్కరింపబడి జీర్ణప్రక్రియ వృద్ధిచెందును. బద్ధకము పోయి, కఫము బహిష్కరింపబడి మలవిసర్జన సులభముగ జరుగును. మజ్జానాడులు, వెన్నుపూసల యందుండు స్వతంత్రనాడులు ప్రక్కలలోగల పెద్దకండరములు నూతనరక్తముచే నింపబడును. స్థితిస్థాపక శక్తిని పొంది శరీరము కోమలత్వమును పొందును, వాతపు నొప్పులు కీళ్లనొప్పులు, నడుము నొప్పులు పోవును. ఉదరమునకు సంబంధించిన దీర్ఘవ్యాధులు పోవును.



# కుండలినీ శక్తి

ప్రపంచము సృష్టి, స్థితి, లయములు గలది. జీవులు జరా మరణములు గలవి. వీటిని అధిగమించేది జ్ఞానం. సకల జీవరాసులలో వీటిని అధిగమించే శక్తియుక్తులు మానవునికి మాత్రం కలదు. ఎందువలనంటే మానవశరీర నిర్మాణము తదనుగుణంగ ఏర్పరుపబడింది. సుషుమ్ననాడి కుండలినీ శక్తులు మానవ దేహానికే పరిమితం. మానవుడు కుండలినీ శక్తిని చైతన్యవంతం చేసికొనుట వలన జరామరణాలను, సృష్టి స్థితి లయాలను అధిగమించ గలుగుచున్నాడు. కుండలినీ శక్తిని సాధించుటయే బ్రహ్మవిద్య యనబడును. ప్రాణశక్తి పాఠములో చెప్పిన అమృతాహార సేవనం, ఆసనాభ్యాసం, నాడీశుద్ధి ప్రక్రియల వలన యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహారములు అబ్బుతాయి. కుండలినీ శక్తిని చైతన్యవంతం చేయుటవలన ధారణ, ధ్యాన, సమాధులు అబ్బుతాయి.

మానవ దేహంలో మూడున్నరలక్షల నాడులున్నవనియు, వాటిలో మనకు తెలిసిన డెబ్బదిరెండువేల నాడులు ప్రధానమైనవనియు, వాటిలో పదినాడులు ముఖ్యమైనవనియు, వాటిలో ఇడ, పింగళ, సుషుమ్న అను నాడులు అతి ముఖ్యమైనవనియు, వీటిలో సుషుమ్ననాడి మరీ ముఖ్యమైనదనియు ఇదివరకే తెలిసికొన్నాము. వెన్నుపూసకు బ్రహ్మదండమని కూడ పేరుకలదు.

ఈ బ్రహ్మదండమునందు సుషుమ్ననాడి కలదు. మూలాధార చక్రమునందు తామరతూడు లోని అతి సూక్ష్మమైన దారము వలె సర్పాకారము కలిగిన పరాశక్తి (పరబ్రహ్మము) అధోభాగమునందు తోకను కలిగి మూడున్నర చుట్టలు చుట్టుకొని నిద్రించు చుండును. ఈ కుండలినీశక్తి బహు సూక్ష్మమున సుషుమ్ననాడికి క్రింది భాగములో నుండును. సమస్తమైన ఇంద్రియాలు జరిపే పనులకు కావలసిన ఆదేశాలు, అనుభూతులు కుండలినీ శక్తి కేంద్రస్థానంగ మనసు నడుస్తుంది.

ప్రాణాయామ ప్రక్రియ ద్వారా ప్రాణవాయువు, అపాన వాయువులను సంయోగపరచి కుంభకస్థితిలో గలుగు ఒత్తిడి వలన కుండలినీ శక్తి జాగృతమై చైతన్యవంత మగును. అనువగు ముద్రల ద్వారా మూలాధారపు ఊర్ధ్వభాగమున కుంభించిన (ఒత్తిడి చేసిన) యెడల ప్రాణ అపానవాయువులు ఏకమై వేడిని కలిగించి కుండలినిపై ప్రసరించును. ఈ వేడికి కుండలిని మేల్కొని ఊర్ధ్వముఖముగ లేచి సుషుమ్ననాడి యందు ప్రవేశించి షట్చక్రముల ద్వారా బ్రహ్మరంధ్రమును సహస్రార చక్రమును చేరును.

కుండలినీ శక్తిని సాధించుటకు నిరక్షరాశ్యులు కూడ అర్హులు. భారత భాగవత అష్టాదశ పురాణముల రచయిత, వేదవిభజకుడు వ్యాసమహర్షి ఏ గురువు వద్ద విద్యాభ్యాసం చేయలేదు. వడలూరు జ్యోతిరామలింగస్వామి, కైవారం అమరనారాయణ, సిరిడి సాయి బాబా, పుట్టపర్తి శ్రీ సత్యసాయిబాబా, బ్రహ్మంగారు ఇంకా అనేకానేకులు నిరక్షరాశ్యులే. కుండలినీ శక్తిని సాధించుట వలన వీరు మహిమాన్వితులైరి. ఏ సాధన యందైనను ఆటంకములు సహజంగ కలుగుచుంటవి. పట్టుదల శ్రద్ధ కలిగి ధైర్యమైన బుద్ధితో కుండలినీ శక్తిని సాధన చేసి సాధించవలెను.

కుండలినీ శక్తిని ప్రజ్వలింప జేయుట అనగా నేమి? కుండలిని మూడున్నర చుట్టలుగ వుంటుంది అని అనుకొన్నాము గదా. అర్ధ చుట్ట కుండలిని యొక్క ముఖము కుంభించిన వాయువు కుండలిని ముఖముపై ఒత్తిడి చేస్తుంది. అదెట్లనగా కట్టెల పొయ్యిని ఊదు బుర్రతో ఊదితే ఆ యొక్క ఊదే ఒత్తిడినల్ల పొయ్యి బాగా మండు తుంది. అదేవిధంగ కుంభకము వల్ల కలుగు ఒత్తిడి కుండలినీ ముఖము పై బడి, కదలించి, నిద్రాణము నుండి తట్టి లేపుతుంది. సుషుమ్న నాడికి ఎడమ ప్రక్కన ఇడ నాడియు, కుడి ప్రక్కన పింగళ నాడియు మూలాధారము మొదలుకొని ముక్కు వరకు వ్యాపించి యుంటాయి. ఈ రెండు నాడుల ద్వారా పూరించు వాయువు కుంభకములో నున్నప్పుడు కుండలినీ శక్తి ప్రజ్వలింపబడి అది సుషుమ్ననాడి ద్వారాను, షట్చక్రముల ద్వారాను సహస్రార చక్రమును చేరుతుంది.

కుండలిని శక్తిపై ఒత్తిడిని కలుగజేయు విధము ఏలాగున అనగా స్తోత్రాలు మంత్రాలు పారాయణ జపమును చేయునపుడును దైవకీర్తనయు భజనలు చేయునపుడు 'ఓం' కారము ప్రారంభము లోను, విసర్గము (ః) ను అంత్యములో ఉచ్చరింపబడుతుంది. 'ఓం' కారములోగల 'మ్' అను ధాతువును, విసర్గములో గల 'హ' అను ధాతువును ఒత్తి పలుకబడుతాయి. ఈ ఒత్తిడుల వలన కుండలినికి జాగృతి కలుగుతుంది. ఈ కుండలినీ జాగృతి వలన మనస్సు పని చేస్తుంది. మనస్సు పనిచేయుటవలన ఇంద్రియాలు పనిచేస్తాయి. బుద్ధి ప్రకాశవంతంగ వుంటుంది.

రుద్రనమకం చమకం, విష్ణుసహస్రనామం, లలితా సహస్ర నామం, ఆంజనేయదండకం ఆదిగాగల వాటిని ఇతర్రతా సంస్కృత శ్లోకాలను ఉచ్ఛరించువారి కుండలినీశక్తి జాగృతమై యుంటుంది.

ఎందువలననగా వీటి ప్రారంభంలో ఓంకారాన్ని అంత్యంలో ఓంకారము లేక విసర్గాన్ని ఉచ్చరించేందువలన ఆ ఉచ్చారణలలో గల 'మ్' 'ః' అను ధ్వని ఒత్తిడి వలన కుండలిని నిత్యజాగృతమై యుంటుంది. సాధారణంగ బ్రాహ్మణులు యజ్ఞయాగాది క్రతువులలోను, వివాహ వివాహేతర కార్యాలలోను, దేవాలయాలలో అర్చక సేవనములోను వీరు మంత్రోచ్చారణలు చేయుటవలన వీరికి కుండలినీ శక్తి జాగృతమై యుంటుంది. వీరి ముఖము తేజస్సుగా నుంటుంది. వీరి బుద్ధి ఆధ్యాత్మిక వికాసానికి అనుసరణీయంగ వుంటుంది. జ్ఞాన విజ్ఞానాల సముపార్జనకు నిచ్చెన వేస్తుంది.

ఇప్పుడు నిద్రాణమైయున్న కుండలినీ శక్తిని జాగృతం చేసి చైతన్యవంతం చేసే విధానాన్ని తెలిసికొందాం. ప్రాణశక్తి పాఠంలో చెప్పిన ఆసనాభ్యాసాలలో పద్మాసనం లేక వజ్రాసనం ఏదోయొక దానిని ఎంచుకొని ఆ ఆసనంలో కనీసం ఒకగంట కాలము స్థిరంగ వెన్నెముక వాసి కూడ కదలక కూర్చొను అభ్యాసము అలవడిన తర్వాతనే ఈ కుండలినీ శక్తిని సాధించుటకు ప్రయత్నించవలెను. ఈ సాధనా ప్రక్రియలో ఆసనము, ముద్రలు ముఖ్యభూమికను నిర్వహిస్తాయి. దృష్టిని భ్రూమధ్యంలో నుంచుకొనవలెను. కుంభక ప్రాణాయామం మామూలే. వీటి ఆచరణ వివరాల్ని విశదంగ తెలుసుకొందాం. ప్రాణశక్తి పాఠంలో చెప్పిన ముద్రలు ప్రాణశక్తి సముపార్జనకు కుండలినీశక్తి సముపార్జనకు ఈ క్రింద తెలిపిన ముద్రలు ఆచరింపవలెను.

షణ్ముఖి ముద్ర:- పద్మాసనంలో కూర్చుండి ఆ పూరక రేచక కుంభకములను ప్రతి రోజూ ఉదయం యాభై పర్యాయములు, సాయంత్రం యాభై పర్యాయములు ఆచరింపవలెను. ముప్పది పర్యాయములు ఆచరించిన వెనుక ముప్పది ఒకటవ పర్యా

యము నుండి యాభయ్యవ పర్యాయం వరకు షణ్ముఖి ముద్రను ఆచరింపవలెను. అదెట్లనగా రెండుచేతుల బొటనవ్రేళ్ళను రెండు చెవులలో నుంచుము. రెండుచేతుల మధ్యవ్రేళ్ళను రెండు కను బొమలపై నుంచుము. రెండుచేతుల తర్జనివ్రేళ్ళను రెండు ముక్కు-పుటములపై నుంచుము. ఇపుడు రెండుచెవులు, రెండుకండ్లు, రెండుముక్కులు, మూయబడినవి. అనగా మొత్తం ఆరు ద్వార ములు మూయబడినవి. ఇదియే షణ్ముఖిముద్ర యనబడును.

**మూలాధార బంధము:-** ఆసనములో కూర్చుండుము. గుద కండరములను పైకిలాగి యుంచుకొనుము. ప్రాణాయామ ప్రక్రియ యాభై మార్లు పూర్తి అగువరకు ఈ విధంగ నుంచుకొనుము. ఈ ప్రక్రియవలన అపానవాయువు ఊర్ధ్వముఖమై జఠరాగ్నిని ప్రజ్వలింప జేసి కుండలినిపై వేడిని ప్రసరింపజేసి శీఘ్రగతిని కుండలిని లేప తుంది.

**ఉడ్యాన బంధము:-** వజ్రాసనంలో కూర్చుండి వాయు పూరకము చేయుచూ కంఠస్థానమును మూయుటయే ఉడ్యాన బంధము అనబడును.

**జాలంధర బంధము:-** ఉడ్యాన బంధము కాగానే వెన్వెంటనే మెడను క్రిందికి వంచి గెడ్డమును ఎద భాగమునకు ఆనించుట జాలంధర బంధ మనబడును.

పద్మాసనంలో కూర్చొనుము. దృష్టిని భ్రూమధ్యమున నిలుపుము. వాయువును పూరకము చేయునపుడు 'హం' అను అక్షరమును జపించుచూ పూరకమును చేయుము. వాయువు కుంభకంలో నున్నప్పుడు 'హం' అక్షరంలోగల 'మ్' అను శబ్దము కుండలినిపై ఒత్తిడి తెస్తుంది. మూలాధార బంధము చేయుము. ఈ మూలాధార బంధన సాధన ప్రారంభము నుండి సాధన ముగింపు

వరకు ఉండవలెను. కుంభకము తర్వాత వాయువును రేచించవలెను. వాయువును రేచించునపుడు 'సో' అను అక్షరమును జపించుచూ రేచకమును చేయవలెను. 'సోహం' అనునది అజపగాయత్రి అనబడును ముప్పై కుంభకములు అయిన తర్వాత షణ్ముఖి ముద్రను వేయుము. ముప్పైఒకటవ కుంభకము నుండి యాభైయవ కుంభకము వరకు షణ్ముఖిముద్రలో నుండుము. యాభై కుంభకముల తర్వాత ఆసనము నుండి లేచి పదహైదు నిమిషములు విశ్రాంతి తీసికొనుము. ఈ ప్రక్రియను ఉదయము ఒకమారు సాయంకాలం ఒకమారు చేయుము.

వజ్రాసనంలో కూర్చొనుము. దృష్టిని భ్రూమధ్యమున నిలుపుము, వాయువును పూరకము చేయుము, వాయువును పూరకము చేయునపుడు 'హం' అను అక్షరమును జపించుచూ పూరకము చేయుము. ఉడ్యానబంధనముద్ర వేయుము. వెంటనే జాలంధర బంధనముద్ర వేయుము, మూలాధార బంధనముద్ర వేయుము. మూలాధార బంధనముద్ర సాధన ప్రారంభము నుండి సాధన ముగింపు వరకు ఉండవలెను. కుంభకము తర్వాత వాయువును రేచింపవలెను గదా. ఎదపై నుండు గడ్డమును పైకి ఎత్తి వాయువును రేచింపుము. వాయువును రేచించునపుడు 'సో' అను అక్షరమును జపించుచూ రేచకమును చేయవలెను. ఈవిధంగ యాభై కుంభకములు చేయుము. తర్వాత ఆసనము నుండి లేచి పదహైదు నిమిషములు విశ్రాంతి తీసికొనుము. వజ్రాసనంలో చేయు ప్రాణాయామ ప్రక్రియ హఠ యోగ మనబడును.

కుంభకములను యాభై సంఖ్యలు చేయువలయు ననుకొన్నాము గద. వీటిని లెక్కించే విధానం చెప్పబడు చున్నది. ప్రతి వ్రేలికి మూడు గెణుపులున్నవి. బొటనవ్రేలిని చిటికెనవ్రేలు కొనగెణుపు

పై నుంచిన 1 అగును. మధ్య గెణుపుపై నుంచిన 2 అగును. క్రింది గెణుపు పై నుంచిన 3 అగును. గెణుపు అడుగు భాగము (అరచేయిపై) నుంచిన 4 అగును. ఈ విధంగ బొటనవ్రేలితో మిగిలిన నాలుగు వ్రేళ్ళను లెక్కించిన 4×4=16 అగును. తర్వాత చూపుడు వ్రేలితో బొటనవ్రేలు గెణుపులను లెక్కించిన 4 అగును. 16+4=20 అయింది. ఈ విధంగ లెక్కించుచూ యాభై కుంభక ములు లెక్కించవలెను. ప్రతి రేచక కుంభక పూరకము కలిపి ఒక ప్రాణాయామ మనబడును. ప్రతి ప్రాణాయామానికి రెండు నిమిష ముల సమయం పడుతుంది యాభై ప్రాణాయామములు చేస్తే వంద నిమిషము లౌతుంది. కుంభకము ఎక్కువ కాలం ఉంటే ఈ సమయం 120 నిమిషములు కూడ కావచ్చును. అనగా 1½ నుండి 2 గంటల సమయంలో 50 ప్రాణాయామములు జరుపవలెను. ఉదయం సాయంసమయం రెండుపూటలా కలిపి 100 ప్రాణాయామ ములు చేయుటవలన ఆరునెలల కాలంలో కుండలినీ శక్తిని జాగృ తము చేయగల శక్తి కలుగుతుంది.

కుండలినీ శక్తిని మూలాధార స్వాధిష్ఠానములను దాటించు వరకు సాధకుడు ఆధ్యాత్మిక పరమైన భ్రాంతికి లోనై యుండును. ఎప్పుడైతే కుండలినీశక్తి స్వాధిష్ఠాన చక్రమును చేరునో ఆ క్షణమే సాధకునికి ప్రపంచ భ్రాంతి తొలగును. కుండలినీశక్తి మణిపూరక చక్రమును ప్రవేశించినంతనే స్థూలశరీరము నాదికాదు అని నిశ్చయ మగును. కుండలినీశక్తి అనాహత చక్రమును ప్రవేశింపగానే దివ్యానుభూతులు కలిగి, దశవిధ నాదములు వినిపించును. దశవిధ నాదములు అనగా జలనాదం, భేరీనాదం, చిణీనాదం, మృదంగ నాదం, కాహళనాదం, కింకిణీనాదం, వేణునాదం, భ్రమరనాదం, ఘంటానాదం, మేఘనాదం. కుండలినీశక్తి విశుద్ధ చక్రమునందు

ప్రవేశింపగనే జరామరణములు ఆకలిదప్పులు నశించును. కుండలినీ శక్తి ఆజ్ఞేయచక్రమును ప్రవేశింపగనే అణిమ, మహిమ, గరిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్య, ఈశత్వ, వశిత్వ మనబడు అష్టసిద్ధులు కలుగును సకలసృష్టి సాధకుని యొక్క కనుసన్నలలో జరుగును. కుండలినీశక్తి సహస్రార చక్రమును ప్రవేశించినంతనే సాధకుడు సర్వము తానై, తానే సర్వమునై గాలినే ఆహారముగా (కుంభక ములో నుండు స్థితి) సమాధి స్థితిలో నుండును.

పై తెల్పిన ప్రాణాయామ ప్రక్రియ రాజయోగ మనబడును. ఇందు సాంఖ్యము, తారకము. అమనస్కము అను మూడు భాగ ములు కలవు ఈ దేహమందు గల ముప్పదియారు తత్త్వములలో ప్రధాన తత్త్వమైన పరబ్రహ్మము నందు భక్తి కలిగి యుండుట సాంఖ్యయోగ మనబడును.

రెండు కన్నుల దృష్టిని వెలుపల నాశికాగ్రమందు లేక భ్రూమధ్యమున నుంచి చూడుము. మొదట కన్నుల నీరు కారును. నరుగు కట్టును. కన్నులు మండును. చలనము లేకుండ దృష్టిని నిలిపిన యెడల ధూమము కప్పినట్లుండును. అట్లు ధూమములో చూచుచుండగా కొంత సేపటికి అగ్నిజ్వాల వేడిమి కన్నులను తాకి నట్లుండును. తదుపరి అది గాఢాంధకార మగును. కొన్ని రోజుల అభ్యాసా నంతరం ఆ చీకటి విచ్ఛిన్నమై ఆకాశము కనబడును. క్రమక్రమముగ నక్షత్రములు, మెరుపులు, దీపము, అగ్ని మంట యును, చంద్రబింబమును అందుపైన వెన్నెల తేజమును ఆదిగా గల ఆత్మ ప్రక్రియలు కనబడును. ఇదియే తారకయోగ మనబడును.

రెండు కన్నులను ఊర్ధ్వమునకు త్రిప్పి అనగా నల్లగ్రుడ్డు రెప్ప దిగువకు వెళ్ళేటట్లుచేసి చూడవలెను. ఈ చూపు దినదినము క్రమక్రమముగా అలవాటు చేయవలెను. తొందరపడిన యెడల

కన్నులు నొప్పియగును. ఇట్లు అభ్యాసము చేయగా దృష్టి కొంత సేపటికి నిలుచును. అప్పుడు మొదటివలె గాఢాంధకారము కలుగును. అభ్యాసము వృద్ధిగాను కొద్దిరోజులకు చీకటిపోయి, మొదట చెప్పిన తారక చిన్నెలన్నియు కనబడును. తర్వాత ఇది తొలగి తీవ్రమగు సూర్యకాంతివంటి తేజము పుట్టును. అప్పుడు నవద్వారములు కప్పుకొని అతి భయంకరమగు మేఘనాదము పుట్టును. ఆ సమయంలో ఊహించుటకు సాధ్యము కాని యొక తేజము కలుగును. అక్కడ నుండి చూచునదియు, చూడబడునదియు లేదు. ఆ తేజము పూర్ణచంద్రునివలె నుండుననుటకు చంద్రుడు కాడు, సూర్యుడు కాదు, వేయిసూర్యుల తేజముతో నుండును. ఇదియే అమనస్కయోగమనబడును.

భ్రూమధ్యమందు దృష్టిని నిలిపి లక్షించువారికి అధోలోకములైన అతల వితల, సుతల, మహాతల, తలాతల, రసాతల, పాతాళ లోకములు ఏడున్ను, ఊర్ధ్వలోకములైన భూలోక, భువర్లోక సువర్లోక, మహర్లోక, జనర్లోక, సత్యలోక, తపోలోకములు ఏడున్ను అనగా పదునాలుగు లోకములున్న సమస్త బ్రహ్మాండమున్ను సాధకుడు ప్రత్యక్షముగ చూడగలడు. అనంతకోటి బ్రహ్మాండములు అణుమాత్రముగ కనబడును.

సాధారణంగ గురువు లేనిదే ఏ విద్యయు సక్రమంగ అబ్బదు. పై జెప్పినది బ్రహ్మవిద్య. కావున గురువు తప్పనిసరిగ యుండవలయును. పూర్వకాలాలలో గురువులుండిరి. ఆధ్యాత్మికాన్ని, కుండలినీశక్తిని నేర్పుచుండిరి. ఈ కాలంలో ఈ విద్య తెలిసిన గురువులు చాలా అరుదు. కావున గురువులు లేరు పుస్తక జ్ఞానంతో ఆచరించితే అపాయాలు కలుగుతాయి అని వెనుకాడ వలసిన పనిలేదు. గురువులు కూడా చిరకాల శుశ్రూషానంతరం బ్రహ్మ

విద్యను ఒకే ఒక నిమిషం నేర్పేది. ప్రాణశక్తి, కుండలినీశక్తి పాఠములను ఒకటికి పదిమార్లు బాగా అవగాహన అయ్యేంత వరకు చదవండి. సందేహాలను సూక్ష్మబుద్ధితో పరిష్కరించుకోండి. ముందుకు సాగండి.

కుండలినీ సాధన చేయువారు ఇంటిలోని వారికి విషయం తెలిపి ఆచరించండి వెన్నను సదా ఇంటిలో నుంచండి. ఒక్కొక్కప్పుడు కుంభకవాయువు సహస్రారంలోనో, దేహంలో ఏదో యొక అవయవం వద్ద స్థిరంగ నిలిచి పోతుంది. చాలా సేపటివరకు శ్వాస యథాస్థితికి రానప్పుడు ఇంటిలోని వారెవరైన వెన్నను రెండు స్పూనులు చేతితో తీసి నడినెత్తిపై నుంచి మర్దన చేయవలెను. వెన్న యొక్క చల్లదనానికి, సహస్రారంలో యుండే వాయువు మెల్లగ అధోగతియై షట్చక్రములద్వారా క్రిందికి దిగి యథా ప్రకారం ఉచ్ఛ్వాసనిశ్వాసలు నడయాడుతాయి.

శూన్యకావస్థయే పరంబ్రహ్మం అని అనుకొన్నాము గదా. ఈ శూన్యకావస్థ సకల చరాచర వ్యాపకం. మనిషి తల వెంట్రుక నొకటిని నిలువుగా పదివేల ఖండములు చేస్తే ఎంత పరిమాణం కంటుందో అంత సూక్ష్మాతి సూక్ష్మ పరిమాణంతో పరంబ్రహ్మం అనంతంలో వ్యాపించి అణగియుంటుంది. ఈ ప్రతి సూక్ష్మ పరిమాణమునకు ఆత్మ యని పేరు. జీవులలో నున్నందున జీవాత్మ యని పేరు. శాస్త్రజ్ఞులు వెంట్రుక పరిమాణమును అణువనియు, వెంట్రుకలో పదివేల ఖండములో నొక భాగమును పరమాణువు అంటారు. అణువు పరమాణువులు వస్తు రూపంగ ఎంతటి బలీయమైన శక్తి గలవో అందరికీ తెలిసిందే. ఆత్మ ప్రాణంగలది కావున పరమాణువున కన్న పదివేల రెట్లు ఎక్కువ శక్తి గలది. మానవ శరీరంలో

సుషుమ్నానాడి యొద్ద మూడున్నర చుట్టలు చుట్టుకొని యుండు కుండలినీ శక్తియే ఆత్మ యొక్క స్థానము

కుండలినీ శక్తి నిగూఢంగ నిర్వికారంగ చేతనా రహితంగ యుంటుంది. మౌనం పాటించిన వారికి ఇది లోబడుతుంది. మౌనం అనగా ఆలోచనలను సృష్టించరాదు, తనంతతానుగ వచ్చు ఆలోచనలతో కూడియుండరాదు. వెళ్ళిపోవు ఆలోచనలను వెంబడించరాదు. ఇటువంటి ఆలోచనా రహిత స్థితి పరంబ్రహ్మ స్వరూపం. కావున త్రిగుణాలూ, పంచభూతాలూ చరాచర సృష్టి యంతయూ మౌనం స్వాధీనంలో నుంటాయి. ఇటువంటి నిర్వికార స్థితియగు మౌనాన్ని పాటించుట అసాధ్యం. ఎందువలననగా శ్వాసప్రక్రియ జరిగేంత వరకూ ఆలోచనలు ఉండనే ఉంటాయి. శ్వాసప్రక్రియను బంధించుటకు ప్రాణాయామాన్ని ఆచరించవలెను సమాధి స్థితిలో శ్వాసప్రక్రియ జరగదు. సమాధి స్థితిలో సర్వం సమానంగా యుండు స్థితి కలుగుతుంది. తానే ఆత్మస్థితి నుండి పరంబ్రహ్మ స్థితి ఎదుగుతాడు, తానే పరంబ్రహ్మం అవుతాడు. పరంబ్రహ్మమునకు కావలసినది ఏమి? ఏమియు లేదు. ఎందుకనగా పరంబ్రహ్మం నుండియే త్రిగుణములు, పంచభూతములు, సృష్టి జరిగినవి.

పరంబ్రహ్మ స్థితిని పొందిన వశిష్ఠుడు పర్ణశాలలో కాపురమున్నను కాయకసురులతో కాలం గడుపుచున్నను గాధి రాజుకు (విశ్వామిత్రుడు) అతని అపార సైన్యానికి మృష్టాన్న భోజనం పెట్టినాడు. గాధిని గాధి సైన్యాన్ని ఒకే దర్భపుల్లతో ఓడించినాడు. గాధి తన రాజ్యాన్ని కుటుంబాన్ని త్యజించి బ్రహ్మర్షి యైనాడు. ఎందుకు? రాజ్యము ఐహికము, జీవితము అనిత్యము, బ్రహ్మర్షి స్థితి నిత్యానందము శాశ్వతము, కావున యోగికి పరంబ్రహ్మ స్థితి వలన లభించిన సకల సిద్ధులను స్వార్థానికి ఉపయోగించడు, విశ్వామిత్రుడు

సృష్టికి ప్రతి సృష్టి చేసియుండకపోతే ఆహార కొరతను విపరీతంగా ఎదుర్కొని యుండేవారము. ఏమి ఆశించి విశ్వామిత్రుడు సృష్టికి ప్రతిసృష్టి చేసినాడు? నిస్వార్థంగా లోకకల్యాణం లక్ష్యంగా ఈ కార్యాన్ని చేసినాడు. వేదవ్యాసుడు వేద విభజనను అష్టాదశ పురాణాలను భారత భాగవతాలను రచించినాడు. మన అందరికీ అందించినాడు. ఇందులో వ్యాసునికి స్వార్థం ఏమీ లేదు. లోక కల్యాణమే పరమావధి.

మానవ సేవయే మాధవసేవ అంటారు. ఏలాటి శక్తి యుక్తులు లేని నిస్సహాయులుగా నుండు దీనులు మానవులు. శక్తి యుక్తులు గలవారు ప్రజలు కావున ప్రజాసేవకన్న మానవసేవనే చేయవలెను మరియు ప్రజలలో కూడ అవసరం ఉన్నవారు వుంటారు. వారి అవసరాలను న్యాయబద్ధంగా తీర్చుట కూడ మాధవ సేవ యనబడుతుంది. మానవసేవ చేయుటకు కారుణ్యము కావలెను. మహాత్మాగాంధీ ఈ కోవకు చెందిన మహాపురుషి. తాని జీవితం గడుపు భారతీయులకు స్వాతంత్ర్యం సంపాదించి ఇచ్చినాడు. స్వాతంత్ర్యానంతరం ఎటువంటి పదవులూ ఆశించలేదు. మదర్ థెరిస్సా రామకృష్ణ పరమహంస, వివేకానందుడు, రవీంద్రనాథ ఠాకుర్ సిరిడి సాయిబాబా పుట్టపర్తి సాయిబాబా వగైరాలు మహర్షుల క్రిందే లెక్క. వీరు చేసిన మానవ సేవలకు గుర్తింపుగా వీరి విగ్రహాలకు గుళ్ళుకట్టి అర్చన ఆరాధనలు చేస్తున్నాం. ప్రజాసేవ చేయువారు తాత్కాలిక కీర్తిని పొందవచ్చును. వీరి తదనంతరం వీరి విగ్రహాలను నడిరోడ్డు కూడళ్ళలో నుంచెదరు. ఎండకు వానకు ప్రకృతి వైపరీత్యాలకు ఈ విగ్రహాలు విలవిల లాడుతాయి. అప్పుడప్పుడు వీటిని కక్ష్యలతో ధ్వంసంచేయుట కూడ జరుగుచున్నది. ఖజానా డబ్బుతో ప్రజాసేవచేయుట కాకిని కొట్టి గ్రద్దకు వేయు విధము.

ఫలితం కష్టం వ్యర్థమవుతుంది. సొంతడబ్బుతో సేవచేయుట మానవ సేవ అనబడుతుంది. ఫలితం పుణ్యం పురుషార్థం, జన్మసార్థకం, ఉత్తమగతులు కలుగతాయి. కావున ప్రజాసేవకన్న మానవసేవయే ఉత్తమం.

మానవసేవ చేయువారు ఋషుల క్రిందేలెక్క. ఋషులు తమకంటూ ఏమీ దాచుకోలేదు. ఏమి చేసినను లోకహితమే గాని స్వార్థం లేదు. ఈ నిస్వార్థ గుణం అలవడాలంటే యోగప్రాణాయామాలు చేయవలసిందే. ఇదే ఏకైక మార్గం.

మలమూత్ర విసర్జన చేసే దేహం నిరర్థకం నిష్ప్రయోజనం. సంతుష్టుగ భోంచేస్తే మలమూత్ర విసర్జన జరుగుతుంది. అరిషడ్వర్గాలకు లోబడినందున సుష్టుగ భోంచేయవలసి వస్తుంది. ప్రాణాయామంలో సఫలీకృతులైన వారు ఆహార పానీయాలను ముట్టరు. ఒకమారు కుంభించిన వాయువును దేహం లోపలనే యుంచుకొని వారాలు, నెలలు, సంవత్సరాలు, యుగాలు నిశ్చలంగ సమాధి స్థితిలో యుండుట వలన 'గాలి' ఆహారంతో యోగి జీవిస్తాడు. కావున మలమూత్ర విసర్జన ప్రశ్నేరాదు. సుష్టుగ భోంచేయుట వలన శరీరం బాల్యం, కౌమారం, యౌవనం, వార్ధక్యం అనే అవస్థలు పొందుతూ మరణం కారణంగ నశిస్తుంది. అదే గాలిని ఆహారంగ పొందువారి దేహం పరిమళంగ, సువాసన భరితంగ, నిత్య యౌవనంగ, మన్మథాకారంతో కళకళ లాడుతుంది.

సృష్టిలో గల ప్రతీ వస్తువుకు నీడ యున్నది. నీడ ఎక్కడ నుండి వస్తుంది? ఆ వస్తువులోనే నీడ యున్నది. కావున ఆ వస్తువు నుండే నీడ వస్తుంది. అదే విధంగ మానవ శరీరం కూడ ఒక వస్తువు. సృష్టికి ఆట వస్తువు. శరీరం వస్తువైనందున శరీరం నుండి కూడ నీడ వస్తుంది. ఈ నీడ ఎందుల కున్నది? మానవుడు చేయు

నిత్య కర్మలకు సాక్షీభూతమై నీడ మానవుని వెంటాడుతుంది. మానవుని కర్మలకు సాక్షి ఎక్కడనుంచో ఎవరో వచ్చి చెప్పనవసరం లేదు. సాక్షి తన్ను నిత్యం వెంటాడే యున్నది. ఆ సాక్షియే 'నీడ.' నీడ లేని శరీరం పొందగలిగితే ఆ శరీరమే ధన్యజీవి అనబడుతుంది. వెలుతురుకు నీడ లేదు, సూర్యునికి నీడ లేదు, నక్షత్రాలకు నీడ లేదు, ఎందువలననగా వెలుతురు స్వయంప్రకాశం, కావున నీడ యుండదు.

అందువలననే పూర్వపు ఋషులు, మహర్షులు, అవధూతలు నీడ లేని శరీరాన్ని పొందవలయునని యోగప్రాణాయామాలు ఆచరించి, నక్షత్రాలుగ ఖగోళంలో స్థిరంగ యున్నారు. ఎందువలననగా నీడ కలిగిన శరీరం పాపపుణ్యాల కలయిక, కర్మజీవి, స్వార్థపరం. ఈ మూడు గుణాలూ లేనిది వెలుతురు. ఇతరులకు ఫలాపేక్ష రహితంగ సదా వెలుతురును ప్రసాదించి ఆ ఇతరుల నిత్య మనుగడకు దోహదం చేస్తుంది. ఈ విధమైన నీడ లేని శరీరాన్ని పొందుటే మన లక్ష్యం కావలయును. ఈ విధానంవల్లనే సర్వేజనా సుఖినోభవంతు సాధింపబడుతుంది. ఎన్నెన్నో జన్మలలో పుణ్యకార్యాలు చేసి పుణ్యాన్ని ఆర్జించినందు వలననే ఈ మానవ దేహం మనకు లభించింది. మానవ దేహం కన్న ఉత్తమమైన దేహం నక్షత్రం. కావున ఉత్తమమైన మానవదేహం నుండి సర్వోత్తమమైన నక్షత్ర దేహాన్ని పొందవలయును గాని, పాపపుణ్యాలు చేసి అధోగతుల పాలై నీచజన్మలు ఎత్తరాదు. వేరే జన్మలను అసలే ఎత్తరాదు. మలమూత్ర విసర్జన చేసే పశుపక్ష్యాదులూ మనమూ ఒక్కటేనా? ఆలోచించండి. యోగ మార్గాన్ని అనుసరించండి. తరించండి.

# గ్రహములు

పరబ్రహ్మం నుండి త్రిగుణాలు, త్రిగుణాల నుండి త్రిమూర్తులు పంచభూతములు పుట్టినవి. త్రిమూర్తుల నుండి పంచభూతముల నుండి సకల దేవతలు రాక్షసులు పుట్టినారు. అప్పుడు కాల చక్రం అనేది లేకుండ యుండినది. అనగా పరిపాలన లేని అస్తవ్యస్త స్థితి నెలకొని యుండినది. దేవతలకూ రాక్షసులకూ ఎల్లప్పుడూ పోరు జరుగుతూ వుండినది. ఒకరిపై నొకరు ఆధిపత్యం వహించుటకు మార్గాలను అన్వేషించుచుండిరి. పాలసముద్ర మథనం చేస్తే అమృతం లభిస్తుందని, అమృతాన్ని త్రాగినవారు మృతులు కాకుండ చిరంజీవులుగ నుందురని, అమృతాన్ని సంపాదించుటకు గాను దేవతలు రాక్షసులు కూడబలుక్కొని ఆ ప్రయత్నం చేసినారు. మేరుపర్వతాన్ని కవ్వంగ చేసికొని పాలసముద్రాన్ని దేవతలు రాక్షసులు చిలకనారంభించినారు. పాలసముద్ర మథనం జరుగుతూనే యున్నది. త్రిమూర్తులకుగాని దేవతలకుగాని రాక్షసులకుగాని కాలం ఎంత అయిందీ తెలియరాలేదు ఈ పాలసముద్ర మథనంలో కాలకూట విషం నుండి ఎన్నెన్నో అమూల్యమైన వస్తువులు, ప్రాణులు ఒక్కొక్కటిగ ఉద్భవిస్తూ వచ్చినవి. వీటితో పాటు చంద్రుడు కూడ ఉద్భవించినాడు. చంద్రుడు పెరిగి పెద్దవాడైనాడు. విద్యాబుద్ధులు నేర్చినాడు. అశ్వని ఆదిగాగల ఇరవై ఏడు నక్ష

త్రాలను వివాహమాడాడు. తర్వాత చంద్రుడు దేవగురువు (బృహస్పతి) యొక్క భార్యయగు తారతో కాపురంచేసి ఒక మగ బిడ్డకు తండ్రియైనాడు. ఆ మగబిడ్డపేరు బుధుడు. చంద్రుడు తన మామగారిచే శపింపబడి క్షయ రోగగ్రస్తుడైనాడు. బుధుడు కూడ పెరిగి పెద్దవాడైనాడు, విద్యాభ్యాసములు నేర్చినాడు, యుక్తవయస్కుడైనాడు.

ఇచ్చటేమో పాలసముద్ర మథనం జరుగుతూనే యున్నది. కడపట అమృతం ఉద్భవించింది అమృత పానమునకు సకలదేవతలు ఒక పంక్తిలో కూర్చొన్నారు. అప్పుడు చంద్రుడు, అతని పుత్రుడు బుధుడు కూడ ఆ పంక్తిలోనే కూర్చొన్నారు. రాక్షసులు రెండవ పంక్తిలో కూర్చొన్నారు. మహావిష్ణువు అమృతాన్ని తొలుత దేవతల పంక్తికి పంచుటను ప్రారంభించినాడు. మహావిష్ణువు ఏదో మోసం తలపెట్టియుంటాడని ముందుగానే ఊహించిన రాహువు అను రాక్షసుడు దేవతారూపం ధరించి రాక్షసుల పంక్తినుండి లేచి దేవతల పంక్తిలో కూర్చుంటాడు. మహావిష్ణువు రాహువును గుర్తించక అతను కూడ దేవత అనుకొని అతనికి కూడ అమృతాన్ని ఇస్తాడు. దేవత రూపంలోనున్న రాహువు అమృతాన్ని ఆరగిస్తాడు. మహావిష్ణువు తన పనిని తాను చేసుకొని పోతున్నాడు. అంతలో సూర్యుడు, చంద్రుడు అను దేవతలు రాహువుయొక్క మాయను గ్రహించి ఆ విషయాన్ని మహావిష్ణువుకు తెలుపుతారు. వెంటనే మహావిష్ణువు తన సుదర్శన చక్రంతో రాహువుయొక్క శిరస్సును ఖండిస్తాడు. శిరస్సు వేరేగ మొండెం వేరేగ పడినాయి. అమృత పానం వలన శిరస్సుకుగాని మొండేనికిగాని చావు లేకుండపోయింది.

పాలసముద్ర మథనము ఎంత కాలము జరిగినదో త్రిమూర్తులకుగాని దేవతలకు గాని తెలియలేదు. దీనిని క్రమబద్ధం చేయుటకు

కాలనిర్ణయం చేయాలని అనుకొన్నారు. కావున మేషము, వృషభము, మిథునము, కటకము, సింహము, కన్య, తుల, వృశ్చికము, ధనుస్సు, మకరము, కుంభము, మీనము అనబడు పన్నెండు రాసులను సృష్టించినారు. భూమధ్యరేఖ నుండి సూర్యుడు ఉదయించునట్లు నిశ్చయించినారు. సూర్యుడు ఉదయించు ప్రదేశమును తూర్పు దిక్కుగ నిశ్చయించి మిగిలిన తొమ్మిది దిక్కులను నిశ్చయించిరి. సూర్యుడు భూమిపై బడు సమయము ఏది ఉన్నదో ఆ నిర్దిష్ట పరిమాణమగు రెప్పపాటు కాలాన్ని క్షణం అన్నారు. మనిషి పీల్చి వదిలే ఒక శ్వాసకు నాలుగు క్షణాలు, పదహైదు శ్వాసలు ఒక నిమిషం, అరవై నిమిషములు ఒక గంట, సూర్యోదయము నుండి సూర్యాస్తమయము వరకు గల పన్నెండు గంటలు ఒక పగలు, సూర్యాస్తమయం నుండి సూర్యోదయం వరకు గల పన్నెండు గంటల కాలము ఒక రాత్రి, ఒక పగలు ఒక రాత్రి కలిపి ఒక దినంగ నిర్ణయించిరి.

ఇక దినములను లెక్కకట్టేందుకు గాను త్రిమూర్తులు దేవతలు ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చిరి. అదేమంటే కొందరు దేవతలకు ఒక్కొక్క రోజును కేటాయించి ఆయా దేవతల పేర్లతో ఆయా రోజులను పిలిచే పద్ధతి. ఇందులకు గాను సూర్యుడు, చంద్రుడు, కుజుడు, బుధుడు, గురువు, శుక్రుడు, శని అనే ఏడు దేవతలను ఎన్నుకొని ఒక్కొక్కరికి ఒక రోజు చొప్పున కేటాయించిరి. దీని ఫలితమే ప్రస్తుతము వాడుకలో నున్న ఆదివారము, సోమవారము, మంగళవారము, బుధవారము, గురువారము, శుక్రవారము, శనివారము అనబడే ఏడు రోజులు. ఇప్పుడు అదనంగ రాహుకేతువు లనబడు రెండు దేవతలు కూడ పుట్టుకొచ్చినందన వీరిరువురికి కూడ ఈ ఏడు రోజులలో భాగము కల్పింపవలసిన పరిస్థితి ఏర్పడింది.

కావున ప్రతి రోజులోనూ రాహు కేతు గ్రహము లుండునట్లు ప్రతి రోజు యొక్క కాలాన్ని విభజించినారు. ఇవే రాహుగ్రహ కాలమగు రాహుకాలము కేతుగ్రహ కాలమగు యమగండము అనునవి. రాహు కేతువుల తలను మొండెమును కలిపితే ఒకే ఆకారము గనుక ఈ ఒక ఆకారాన్ని లెక్కకు తీసికొని ఈ గ్రహం ప్రతిరోజూ ఉండు ఇరవై నాలుగు గంటలలో ఒక్కొక్క గ్రహానికి మూడు గంటలు కేటాయింపబడినవి. రాహు కేతువులకు కేటాయించిన కాలం మూడు గంటలు, ఇందులో రాహువుకు ఒకటిన్నరగంట కేతువుకు ఒకటిన్నర గంట, మిగిలిన ఏడు గ్రహాలకు ఒక్కొక్కరికి మూడు గంటల చొప్పున ఇరవై ఒక్క గంటలు మొత్తం ఇరవై నాలుగు గంటలు గ్రహాలకు కేటాయింపబడినది.

ఇక్కడ మనకు ఒక సందేహం కలుగవచ్చును. దేవతలు ముప్పైమూడు కోట్లమందికదా. అందులో ఈ ఏడుగురిని మాత్రం గ్రహములుగ నియమించుటకు కారణమేమి అని. అందరికీ అర్థం అయ్యేందుకు ఒక ఉదాహరణను ఇచ్చుచున్నాను. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో ఒక మంత్రియుండెను. కాలగమనంలో మంత్రి పదవీ కాలం అయిపోయింది. పదవిలేక ఆయన ఉండలేడు. పదవిరాదు. కావున పదవి వచ్చుటకు ఏదో ఒకటి చేయవలెను. అందువలన ప్రత్యేక తెలంగాణా రాష్ట్రం కావలయునని ఉద్యమం లేవదీసినాడు. ఈ ఉద్యమం అత్యాచారాలు, లూటీలు, దహనకాండలుగ రూపాంతరం చెందింది. ఈ ఉద్యమాన్ని అణజడిని, అరాచకాన్ని అణచేందుకు ప్రభుత్వం శతవిధాలా ప్రయత్నించి విఫలమైంది. అందుచే ఈ ఉద్యమానికి మూలకారణం ఆ మాజీమంత్రికి పదవీకాంక్ష అని తేలింది. కావున వెంటనే ఆ మాజీ మంత్రిని ఒక రాష్ట్రానికి

గ వర్ణరుగా నియమించినారు. అసలు ఉద్యమం రూపు రేఖలు లేకుండ నీరుగారిపోయింది. ఈ విషయం అందరికీ తెలుసును.

అదేవిధంగ దేవతలయొక్క గుణాగణములను బట్టి గ్రహములు అనే పదవులు వారికి ఇవ్వబడినవి. అదెట్లనగా సూర్యుడు ఉదయించి అస్తమించితేనే కాలగమనం జరిగేది సూర్యుడు ఆదిదైవం, నిత్యం ప్రత్యక్షమయ్యే దైవం. ఈ సూర్యునికి గ్రహపదవి ఇవ్వకపోతే కాలగమనం జరుగదు. అదియునుగాక సూర్యుడు తాను పోయిన చోట్లంత తన వేడిమితో ఎదుటివారిని మలమల మాడ్చును. కావున సూర్యునికి అందరు దేవతలకన్న ముందుగానే గ్రహము అనే పదవిని కట్టబెట్టారు.

తర్వాత చంద్రుడు. ఇతడు అభివృద్ధి చెందుట క్షీణించుట అనే శాపమును పొందినందువలన పౌర్ణమి అమావాస్యలు, తిథులు ఏర్ప డుటకును అనుకూలముగా నుండునని యొక కారణముచేత నైతేనేమి, దేవతల గురువగు బృహస్పతి(గురువు) భార్య తారను బలాత్కారముగ తన ఇంటికి గొనిపోయి ఆమెతో ఒకసంవత్సరము కాపురం చేసి బుధు డను సుతునకు తండ్రియై అక్రమసంబంధం కలిగినాడని చెడ్డపేరు యున్నందునను ఇతని సహవాసము చేస్తే ఇతర దేవతలు కూడ ఇతని వలెనే తయారై దేవతలందరు చెడిపోదురనియు, ఇటువంటి వానిని ప్రత్యేకంగ ఉంచవలయుననియు నిశ్చయించి చంద్రునికి గ్రహము అనే పదవిని ఇచ్చిరి.

ఇక బుధుడు. ఇతడు చంద్రుడు తారల అక్రమ సంబంధం వలనకలిగిన సంకరుడు మరియు నపుంసకుడు. నపుంసకుణ్ణి దేవతలలో నుంచితే దేవతలలో చాలామందికి ఇతని బుద్ధులు రావచ్చునని కావున ఇతనిని దేవతలనుండి ప్రత్యేకముగ నుంచవలెనని నిశ్చ యించి గ్రహము అనే పదవి నొసంగిరి. దేవతల గురువు (బృహస్పతి)

ఉండీ ప్రయోజనం లేదు లేకా ప్రయోజనం లేదు. ఎందువలననగా రాక్షసులు ఎన్నోమార్లు దేవతలపై దండెత్తి దేవేంద్రుని పదవీ చ్యుతుని చేసియున్నారు. విధిలేని పరిస్థితిలో దేవేంద్రుని కుమారుడు కచుడు రాక్షసుల గురువు శుక్రాచార్యుని వద్ద మహామృత్యుంజయ మంత్రాన్ని నేర్చుకొని వచ్చిన తర్వాత దేవతలు తమ ఉనికిని కాపాడుకొనిరి. కావున గురువు అప్రయోజకుడని తేలింది. అదియును గాక తన సతి తారను చంద్రుడు లేవనెత్తుకొనిపోయి ఒక సంవత్సర కాలం కాపురం చేసి బుధుడనే సుతుని కనిన తర్వాత గురువు నెఱపిన రాయబారాలు విఫలమై తుదకు మహావిష్ణువే చంద్రునితో యుద్ధము చేసి అపజయం పొందవలసి వచ్చింది. తుదకు బ్రహ్మ దేవుడు జోక్యం చేసుకొని చంద్రునికి నచ్చజెప్పి తారను విడిపించి గురువునకు అప్పగిస్తాడు. ఇటువంటి వాడు దేవగురువుగ వున్నను ఒకటే లేకున్నను ఒకటే అని నిశ్చయించి అతనికి గ్రహము అనే పదవిని అంటగట్టి వెలివేసినారు.

శుక్రుడు ఈశ్వరుని శుక్లంనుండి పుట్టినవాడు. ఏ తల్లిగర్భం నుండీ పుట్టలేదు, ఇతను రెండవ ఈశ్వరుడుగా ప్రతీతి. సకల వేద ములు, శాస్త్రములు, మంత్ర తంత్రములు తెలిసిన మహానీయుడు, మృత్యుంజయ మంత్రంతో, చనిపోయిన రాక్షసులను బ్రతికించి మరల దేవతలపైకి యుద్ధానికి పంపేవాడు. ఇతనిని వదలివేస్తే దేవతలు సర్వనాశనం అయ్యేది, రాక్షసులు బలపడేదీ ఖాయం. కావున ఇతనికి పని కల్పిస్తే పీడా విరగడౌతుంది. అందుచే శుక్రునికి గ్రహము అనే పదవి నొసంగిరి. సూర్యునికి ఇద్దరు కుమారులు. మొదటివాడుయముడు. దక్షిణదిక్పాలకుడుగ నియమింప బడినాడు. రెండవవాడు శని, ఇతను ఇతరులను పీడించే స్వభావం, ఇతరుల కష్టం తన సుఖంగా నెన్నువాడు. ఇతనిని అలాగే వదలివేస్తే

స్వజాతిలో నుండు దేవతలను అష్టకష్టాల పాల్జేసేది ఖచ్చితం, వీడు దేవతా వంశానికే చీడపురుగు. ఎట్లంటే మనలో కొందరు తోటి ఉద్యోగులపై నిందారోపణ అర్జీలను పై అధికారులకు పెట్టి, అందు వల్ల కలుగు కష్టనష్టములను చూచి ఆనందించే మూర్ఖులు ఉన్న విషయం అందరికీ తెలిసిందే. కావున ఇతని పీడ వదిలించుకొంటే దేవతలు సుఖపడతారు. అందుచే శనికి గ్రహము అన్న పదవిని అంటగట్టిరి. ఇక రాహుకేతువులు అమృతపానం చేసిన రాక్షసులు. రాక్షసుల బలం పెరిగినట్లే లెక్క. వీరిని ఇలాగే వదిలేస్తే దేవ దానవ యుద్ధం ఎల్లకాలాలూ జరుగుతుంటాయి. ఈ అవాంతరాన్ని తొలగిస్తే దేవతలు శాశ్వతంగ సుఖపడతారు. కావున రాహుకేతు వులకు గ్రహములనే పదవులను బలవంతంగ అంటగట్టిరి.

మనకు ఒక దేశం ఉన్నది, ఈ దేశంలో కొన్ని రాష్ట్రా లున్నవి. దేశానికి అధిపతిని రాష్ట్రపతి అంటాము. ఈ రాష్ట్రపతి ఎవరు నియమిస్తారు? ఎవరూ నియమించరు. కాని రాష్ట్ర అసెంబ్లీ లకు చెందిన శాసన సభ్యులు, రాజ్యసభ, లోక్‌సభలకు చెందిన పార్లమెంటు సభ్యులు అందరూ కలిసి రాష్ట్రపతిని ఎన్నుకొంటారు. ఎన్నుకొనుట నియమించుట అనేవి రెండూ ఒకటే. ఈ రాష్ట్రపతికి విస్తృతాధికారాలున్నాయి. తనను రాష్ట్రపతిగా ఎన్నుకొన్న రాష్ట్రఅసెంబ్లీలను గాని లోక్‌సభను గాని రద్దు చేసే అధికారం ఉంది. అనగా తనను ఈ ఉన్నత పదవికి ఎన్నుకొన్నవారి భవిష్యత్తు (జాతకం) రాష్ట్రపతి చేతిలో ఉంది. శాసన సభ్యుల, లోక్‌సభ సభ్యుల ప్రవర్తన వర్తనాలు, వారి మెజారిటీ వర్తనాలను ఎప్పటి కప్పుడు రాష్ట్రపతి వేయి కన్నులతో గ్రహించుకొంటూ యుంటారు. దారి తప్పిన శాసనసభలను, లోక్‌సభను సస్పెండు చేయుటో, రద్దుచేయుటో రాష్ట్రపతి చేస్తుంటారు. అదేవిధంగ త్రిమూర్తి

లాదిగా గల దేవుళ్ళు కూడ పై సూర్యాదులను ఎన్నుకొని గ్రహ ములుగ నియమించినను వీరందరు నవగ్రహముల ఫలితాలకు లోబడే తమ తమ కార్యాలను నిర్వహించెదరు, కాలగర్భంలో కలిసి పోయెదరు.

చంద్రుడు క్షయరోగ పీడితుడైనను అమృతపానం వలన అమరుడైనాడు. కావున ఈ రోగాన్ని సద్వినియోగం చేసుకోవాలని నిర్ణయించినారు. చంద్రుడు పదహైదు రోజులు వృద్ధిచెందునట్లు పదహైదు రోజులు క్షీణించునట్లు చంద్రుని శాపాన్ని, సర్దినారు. ఈ సర్దుబాటు వలన చంద్రుడు ఉదయించు రోజు పౌర్ణమి అనియు ఆ పదహైదు రోజులు శుక్లపక్ష మనియు, చంద్రుడు అస్తమించు రోజు అమావాస్య యనియు ఆ పదహైదు రోజులు కృష్ణపక్ష మనియు నిర్ణయించిరి.

పై తెలిపిన రెండు పక్షములతో కూడిన ముప్పైరోజులు ఒక మాసమనియు, చైత్రము, వైశాఖము, జ్యేష్టము, ఆషాఢము, శ్రావణము, భాద్రపదము, ఆశ్వయుజము, కార్తీకము మార్గశీర్షము, పుష్యము, మాఘము, ఫాల్గుణము అను పన్నెండు మాసములు ఏర్పరుపబడినవి. ఇందులో ప్రతి రెండు మాసములు ఒక ఋతువుగ నిశ్చయించిరి. అవి వసంత ఋతువు, గ్రీష్మ ఋతువు, వర్ష ఋతువు, శర ధృతువు, హేమంత ఋతువు, శిశిర ఋతువు లనునవి. ఇందులో వసంత ఋతువు, వర్ష ఋతువు, హేమంత ఋతువు చంద్రునివి. గ్రీష్మ ఋతువు, శరధృతువు, శిశిర ఋతువు సూర్యునివి. మరల మూడు ఋతువులు కలిపి ఒక ఆయనంగ, రెండు ఆయనములు ఏర్పరుపబడినవి. అవి ఉత్తరాయణం, దక్షిణాయనం, అనునవి.

సూర్యుడు గమనాన్ని తన భూమధ్యరేఖ నుండి ఉత్తర దిశగా ప్రయాణం చేసేది ఉత్తరాయణం, భూమధ్య రేఖ నుండి దక్షిణ

దిశగా ప్రయాణం చేసేది దక్షిణాయనం అనబడతాయి. ఈ రెండు ఆయనములు చేరి ఒక సంవత్సరం అవుతుంది. ఈ సంవత్సరాలను మరల యుగాలుగ విభజించినారు. 17,28,000 సంవత్సరములు కృతయుగ మనియు, 12,96,000 సంవత్సరములు త్రేతాయుగ మనియు, 8,46,000 సంవత్సరములు ద్వాపరయుగమనియు, 4,32,000 సంవత్సరములు కలియుగమనియు నిర్ణయించిరి. ఈ నాలుగు యుగములు ఒక కల్పమనియు. 14,40,00,000 కల్పములు బ్రహ్మ ఆయుఃప్రమాణమనియు, బ్రహ్మదేవుడు ఒక్కడు గడిచినచో మహావిష్ణువుకు ఒక దినమనియు, మహావిష్ణువు ఒక్కడు గడచినచో రుద్రున కొక్క దినమనియు, రుద్రు డొక్కడు గడచినచో మహేశ్వరుని కొక్క దినమనియు, మహేశ్వరు డొక్కడు గడచినచో సదాశివున కొక్క దినమనియు, సదాశివుని జీవితము గడచిన యెడల శివున కొక్క దినమగును. శివుని దినాంతమున ప్రళయము సంభవించును, బ్రహ్మాండము నశించును.

పై తెలిపిన నవగ్రహాలకు ఇదివరకే చెప్పబడిన పన్నెండు రాసులలో స్థిరనివాసములు ఏర్పరుపబడినవి. అవి సూర్యగ్రహమునకు సింహరాసి, చంద్రగహమునకు కటకరాసి, కుజగ్రహమునకు మేషము మరియు వృశ్చికరాసులు, బుధగ్రహమునకు మిథునము మరియు కన్యారాసులు, గురుగ్రహమునకు ధనుస్సు మరియు మీనరాసులు, శుక్రగ్రహమునకు వృషభ మరియు తులా రాసులు, శనిగ్రహమునకు మకర మరియు కుంభరాసులు, రాహు గ్రహమును బుధునితో కూడ కన్యారాసిలోను, కేతుగ్రహమునకు గురుగ్రహముతో మీనరాసిలోను యుండునట్లు నిశ్చయించిరి. ఈ విధంగ రాసులలో గ్రహాలకు స్వక్షేత్రాలు కేటాయించినప్పుడు కొన్ని గ్రహాలకు ఒక్కొక్కరాసి, కొన్నిగ్రహాలకు రెండేసిరాసులు.

కొన్ని గ్రహాలకు ఇతర గ్రహాలతో కూటమి ఏర్పడినవి. ఈ వ్యత్యాస మును సరిదిద్దేందుకు అన్నిగ్రహములూ తమ తమ స్వక్షేత్రములను వదలి ప్రక్కనుండు రాసులకు మారుతూ నిరాటంకంగా సంచరించు నట్లు నిర్ణయింపబడింది

గురుశుక్రులు బ్రాహ్మణులు, సూర్యకుజులు క్షత్రియులు, చంద్రబుధులు వైశ్యులు, రాహువు చండాలుడు, కేతువు సంకరుడు. సూర్య కుజ గురువులు పురుషులు. చంద్రశుక్ర రాహువులు స్త్రీలు, బుధశని కేతువులు నపుంసకులు. సూర్యునకు తూర్పుదిక్కు, చంద్రునకు వాయవ్యము, కుజునకు దక్షిణము, బుధునకు ఉత్తరము, గురునకు ఈశాన్యము, శుక్రునకు ఆగ్నేయము, శనికి పశ్చిమము, రాహువుకు నైరుతి దిక్కులు కేటాయింపబడినవి. సూర్యకుజులు ఎరుపు రంగు, చంద్రశుక్రులు తెలుపు రంగు, బుధుడు ఆకుపచ్చ రంగు, గురువు పసుపు రంగు, శని నీలవర్ణపు రంగు, రాహుకేతువులు ధూమ్ర వర్ణమును కలిగియుందురు.

పై కాలనిర్ణయం జరిగిన తర్వాత జీవరాసులు మొదలగు తతిమ సృష్టి ప్రారంభమైంది. ఇప్పుడు గ్రహాలకు పని కల్పించవలెను. పని కల్పించినప్పుడు బాధ్యతలుండవలెను. పని బాధ్యతలు రెండూ ఉన్నప్పుడు అధికారాలు కూడ ఉండవలెను. గ్రహము అనగా గ్రహించునది. ఏమి గ్రహిస్తాయి? జీవులు చేయు పాపపుణ్య కర్మలను గ్రహించుట. ఇది పని. ఈ పాపపుణ్య కర్మలకు కంప్యూటరైజ్ చేసియుంచుట బాధ్యత. ఈ కంప్యూటరైజేషన్ ప్రారబ్దము అనబడును. కంప్యూటరైజ్ చేసిన ప్రారబ్ధము ద్వారా జీవులు మరు జన్మనెత్తెదరు. ప్రారబ్దానుసారం ఆయా రాసులలో పుట్టెదరు. గర్భంలో జీవి నవమాసము లున్నప్పుడు తల్లి మనసావాచా కర్మల చేయు కృత్యముల అనుభూతులు, జీవి బయటి ప్రపంచంలో గల

విషయాలను ఆకళింపు చేసుకొన్న వాటిని ఈ తొమ్మిది గ్రహాలు గ్రహించి గర్భస్థ శిశువు నొసట భూతభవిష్యద్వర్తమానాలను వ్రాస్తాయి. దీనినే తలవ్రాత అందురు. శిశు జననానంతరం పై పన్నెండు రాసుల చక్రములో ఏఏ గ్రహాలు ఏఏ రాశిలో యున్నవో లెక్కకట్టితే శిశువుయొక్క తలవ్రాత అర్థం అవుతుంది. సూర్య గ్రహం దివారాత్రులు కాలాన్ని దొర్లిస్తూ పోతుంది. సూర్యునితో సహా అన్ని గ్రహాలూ రాసినుండి రాసికి మారుతూ ఆయా రాసులలో నిర్ణీత కాలాలలో నుండుటవలన తలవ్రాత ప్రకారం సత్ఫలితాలను దుష్ఫలితాలను జీవికి ఒనగూరుస్తాయి. కాలాన్ని నడిపేది గ్రహాలే గదా. కావున కాలాన్ని నడిపే గ్రహాలకు సృష్టి లోబడి తన సృష్టి కార్యాన్ని నెరవేరుస్తుందని దీని అర్థం.

అందువలననే రాశిచక్రము, గ్రహస్థితి, నక్షత్రాలు, లగ్నం తిథి, వారం ఆధారంగ జ్యోతిషశాస్త్రం వెలువడింది. జ్యోతిష శాస్త్రం మనుషులకే కాదు దేశాలకు సముద్రాలకు పరిపాలకులకు జీవరాసులకు జలచరాలకు ఇంతేల యావత్ సృష్టికి సంబంధించిన భూతభవిష్యద్వర్తమాన శాస్త్రం. సప్తగ్రహ కూటమి, అష్టగ్రహ కూటమి వగైరాలుజరిగితే సృష్టికి చేటువస్తుందనే విషయం అందరూ ఎరిగినదే. సకలచరాచర సృష్టియొక్క భూతభవిష్యద్వర్తమానములు ఈ నవగ్రహముల యొక్క గమనాగమనముల పైననే ఆధారపడి యున్నది. ఈనవగ్రహాలు మీనరాసిలో కలిసినప్పుడు సృష్టి లయ మౌతుంది. పంచభూతములు త్రిగుణాలు పరంబ్రహ్మంలో ఐక్యమౌ తాయి. తరువాత ఇవి విడిపోయి రాసులలో సంచరిస్తే సృష్టి ప్రారంభమౌతుంది.

త్రిమూర్తులు ఆదిగాగల దేవుళ్ళు కూడ ఈ నవగ్రహముల ఫలితాలకు లోబడే తమ తమ కార్యాలను నిర్వహించెదరు. రాము

రావణ యుద్ధమును ప్రారంభించుటకు గాను మహావిష్ణువు అవతార మైన శ్రీరాముడు జ్యోతిష శాస్త్రమును ఆశ్రయించి, గ్రహస్థితిని కనుక్కొని శుభలగ్నమును నిర్ణయించుకొని ఆ శుభలగ్నంలోనే యుద్ధమును ప్రారంభించి జయమును పొందెను. అదేవిధంగ మహా భారత యుద్ధమును ప్రారంభించుటకు దుర్యోధనుడు సహదేవుని వద్ద గ్రహస్థితిని చూచుకొని, శుభలగ్నమును నిర్ణయించుకొని ఆ శుభ లగ్నము నందే యుద్ధమును ప్రారంభించెను. మాయావి కపటనాటక సూత్రధారి యై శ్రీకృష్ణుడు దుర్యోధనుడు నిర్ణయించుకొన్న శుభ లగ్నమును తారుమారు చేసిన యెడల దుర్యోధనుడు యుద్ధములో ఓడిపోవునని నిశ్చయించి అందులకొక పథకం వేసినాడు. అమా వాస్య రేపు అనగా ఈ రోజే సంధ్యావందనం ఆచరించి సూర్యునికి అర్ఘ్యం వదులుతాడు. అప్పుడు సూర్యుడు చంద్రుడు ఇరువురూ శ్రీకృష్ణుని చెంతకు వచ్చి అమావాస్య రేపు కదా ఈ రోజే అర్ఘ్యం వదలుటకుగల కారణం ఏమని అడుగుతారు. అందులకు శ్రీ కృష్ణుడు సూర్యచంద్రులిరువురూ కలిస్తే అమావాస్య ఏర్పడుతుంది. ఇపుడు మీా రిరువురూ నా ఎదుట కలిసినారు. కాన ఇప్పుడే అమావాస్య అన్నాడు. శ్రీ కృష్ణునియొక్క ఈ కార్యం వలన గ్రహములయొక్క గతులు తప్పినవి. గ్రహముల యొక్క గతులు తప్పినందున దుర్యో ధనుడు నిర్ణయించుకొన్న శుభలగ్నం దుర్లగ్నంగ మారింది. మహా భారతయుద్ధం పాండవులకు అనుకూలమైంది. సాక్షాత్తు మహావిష్ణువు యొక్క అవతారమైన శ్రీకృష్ణుడు బలరామునితో గ్రహస్థితి బాగా లేనందున యాదవుల వినాశనం త్వరలో జరుగుతుందని నుడివినాడు. ఒకప్పుడు సంపూర్ణ సూర్యగ్రహణం జరిగితే బలరామ కృష్ణులు తీర్థ యాత్రలు చేసి గ్రహశాంతిని చేస్తారు. గ్రహగతులు బాగా లేనందున శ్రీ కృష్ణునికి యాదవులకు చెడు జరుగునేమో యనియు, కలి ప్రవే

శించ గలదనియు, ధర్మము నశిస్తుందనియు ధర్మరాజు అర్జునితో అంటాడు. పై ఉదాహరణల వలన తెలియునదేమనగా దేవుళ్ళు అవతార పురుషులు అవధూతలు అందరూ తాము చేసిన చేసుకొన్న పుణ్యాపాపముల ఫలితాలను బట్టి గ్రహస్థితికి లోబడి జీవనం సాగిస్తారనియు, వీరందరూ గ్రహముల శక్తులవద్ద నిమిత్తమాత్రులేయనియు నిశ్చయముగ తేటతెల్లమగుచున్నది.

కాలాన్ని నడిపేది గ్రహాలు అని అర్థమైంది. కావున దేవుళ్ళకూ కాలాలకు సంబంధం లేదు అని కూడ అర్థం కద. ఈ దేవుళ్ళు కూడ కాలగమనంలో కలిసిపోతారనేది పచ్చి నిజం.

గ్రహముల యొక్క సంచారముల ఆధారంగ వ్రాయబడినది జ్యోతిష శాస్త్రము. ప్రస్తుత విజ్ఞానులు జ్యోతిష శాస్త్ర ఆధారంగానే గ్రహస్థితులను వాటి గమనాలను లెక్కించి ఖగోళ శాస్త్రాన్ని కనుగొనిరి. ఖగోళశాస్త్ర ఆధారంగానే వ్యోమనౌకలను వ్యోమగాములను ఆయా గ్రహాలకు పంపుతున్నది కూడ. గ్రహాల గమనాల ఆధారంగానే అవతార పురుషుల జనన మరణాలు రాజులు రాజ్యాలు వారి భవిష్యత్తులు, వరదలు, భూకంపాలు, యుద్ధాలు, ధర్మ అధర్మముల సంచారం, కరవుకాటకాలు, ప్రాణికోటి భవిష్యత్తులు చెప్పగలుగుచున్నది.

ఖగోళంలో గ్రహాలకు పై భాగమున సుదూరంలో నక్షత్రాలున్నాయి. కావున గ్రహములదృష్టి నక్షత్రాలు పై బడవు. నక్షత్రాలు అంటే ఏమి? ప్రాణాయామ ప్రక్రియలో ఉత్తీర్ణులైనవారు యోగులు అనబడెదరు వీరు తమ అంతిమ శ్వాసను బ్రహ్మరంధ్రము ద్వారా వదలెదరు. ఈ యోగి నక్షత్రరూపంగ తేజోమండలంలో యుంటాడు. ధృవుడు, ధ్రువనక్షత్రంగ సప్తర్షులు సప్తర్షి మండలంగ తేజోమండలంలోయున్న విధివిధానం ఇదే. గ్రహముల ప్రభావాలను అధిగమించాలంటే ఏమిచేయాలి? ఈ ప్రశ్నకు

కాలగమనాన్ని నిరోధించుటే. ఇదే ఏకైక మార్గం. అది ఎట్లు అని సందేహం కలుగుతుంది. కాలం క్షణాల రూపంలో నిర్విఘ్నంగ నిరాటంకంగ నడకసాగిస్తున్నది గద. ఈ కాల గమనాన్ని నిరోధిస్తే గ్రహ ప్రభావాలను నిరోధించినట్లే లెక్క. కాలాన్ని ఏవిధంగ నిరోధించాలి? ప్రాణాయామ ప్రక్రియ ద్వారా ఉచ్ఛ్వాసనిశ్వాసములను నిలుపుదల చేస్తే కాలం నడువదు. ఈ ప్రాణాయామ ప్రక్రియలో కాలం స్థిరంగ స్థంభించి పోతుంది. అప్పుడు గ్రహముల ప్రభావం స్థంభించి పోతుంది.

మానవ శరీరంలో కాలగమనం ఉండేటట్లు శరీర నిర్మాణము గావింపబడింది. అది ఎట్లో తెలిసికొందాం. మూలాధార చక్రం భూమి. సుషుమ్న నాడి భూమధ్యరేఖ, ఇడానాడి ఉత్తరాయణం, పింగళనాడి దక్షిణాయనం. మూలాధారం వగైరా ఆరుచక్రాలు ఆరు ఋతువులు శ్వాస పీల్చునపుడు ఈ ఆరుచక్రముల ద్వారా పైకి పోతుంది మరల ఆరు చక్రముల ద్వారా రేచకంగ క్రిందికి వస్తుంది, కావున పన్నెండు మాసములైనవి. చక్రమునకు చక్రమునకు మధ్య గల ఖాళీ అమావాస్య, చక్రములు పూర్ణిమలు. నాలుగు క్షణములు ఒక శ్వాస, పదహైదు శ్వాసలు ఒక నిమిషం, రోజుకు నడిపే శ్వాసలు 21,600. కావున శరీర నిర్మాణం కాల గతిని అధిగమించేందుకు అనువుగా జరిగింది. ఈ శరీరనిర్మాణాన్ని సద్వినియోగం చేసుకొంటే పురుషార్థం, ధన్యం అవుతుంది.

దేవాలయాలలో గల హుండీలు, దేవుని ఆభరణములు, మూల విగ్రహాలు దొంగిలింప బడుచున్నాయి. దేవుని దర్శనార్థం పుణ్యక్షేత్రాలకు ప్రయాణించే వారిలో కొందరు ప్రమాదాలకు గురియై మరణించుచున్నారు. దేవుని దర్శనానికి గుళ్లల్లో యున్న భక్తులు తొక్కిసలాటలో చనిపోతున్నారు. పుణ్యక్షేత్రాలు చాలా

పవిత్రములైన ప్రదేశములని మనం అనుకొంటాం. కాని ఈ పవిత్ర ప్రదేశాలల్లో హత్యలు, మానభంగాలు, దోపిడీలు జరుగుచున్న విషయం మనమందరం ఎఱిగినదే. వీటన్నిటినీ దేవుడు నివారించ లేక పోతున్నాడు. ఎందులకు? గ్రహములు వీటన్నిటినీ చేయించుచున్నవి. కాలము పరంబ్రహ్మ యొక్క విరాట్ స్వరూపము. కాలాత్మకుడే సూర్యుడు. సూర్యుని పరిభ్రమణమే కాలము యొక్క పుట్టుక అగుచున్నది. కావుననే సూర్యుణ్ణి ఆదిదైవము, ప్రత్యక్షదైవము అని సూర్యనమస్కారాలు సంధ్యావందనాలు చేసేది. దేవుడు కారణ జన్ముడు. జన్మించినాడు కావున కాల గర్భంలో కలిసి పోవలసిందే. పరంబ్రహ్మ జన్మించలేదు. కాలమునకన్న పూర్వమే పరంబ్రహ్మ యున్నది. కాలం పరంబ్రహ్మలోనే లయమౌతుంది. కాల గమనాన్ని అర్థంచేసుకోకుండ చేయు ప్రయత్నాలు అధోగతికి దారితీసేవే. పులికోసం అడవిలో వెదకే బదులు 'పులిపాఠం' గురించి కాగడాలతో పుస్తకంలో వెదికే విధం.

వివిధ దేవుళ్ళకు అర్చనలు, ఆరాధనలు, యజ్ఞయాగాది క్రతువులు, వ్రతాలు, నామజపాలు, ధ్యానాలు, వగైరాలు నిర్వహించేందువలనను, తీర్థయాత్రలు దానాలు చేయుట వలన మనస్సు నిర్మలమౌతుంది. తద్వారా మంచి పనులే చేస్తాం. మంచిపనులు చేయుట వలన పుణ్యం లభిస్తుంది. పుణ్యం ప్రారబ్ధ రూపంలో అదృష్టవంతమైన పునర్జన్మనిస్తుంది. ఆ పునర్జన్మలో చేసిన మంచి చెడు కర్మల ఫలితాలు మరల ప్రారబ్ధమై మరియొకమారు పునర్జన్మనిస్తుంది. దీనికి అంతే లేదు. ఎందుకనగా ప్రతి జన్మలోను కర్మలు చేయవలయును. మంచి కర్మగాని చెడు కర్మగాని ప్రారబ్ధమై వెంటాడుతూ జన్మల నిస్తూ పోతుంటుంది, కావున మంచి కర్మ

చేయవద్దు చెడు కర్మ చేయవద్దు. అసలు జన్మే వద్దు, యోగ ప్రాణా యామాల వలననే జన్మరాహిత్యం సాధ్యం.

మానవ శరీరం ఊరికేనే లభ్యం కాలేదు. ఎన్నో జన్మల పుణ్య కర్మల ఫలితంగ ఇది లభ్యమైంది. ఈ శరీరాన్ని సద్వని యోగం చేసుకొంటే గ్రహబాధ నుండి తప్పించుకోవచ్చును. దేవుళ్ళు కూడ మన మాదిరి తల్లుల గర్భాల నుండి జన్మించిన వారే. యోగప్రాణాయామాల వలన మనం కూడ దేవుళ్ళు కాగలము. దేవుళ్ళకు దేవుడైన పరంబ్రహ్మం కాగలము, దేవుళ్ళను అధిగ మించగలము.

గ్రహములు సర్వస్వతంత్రములు, జీవుల పాపపుణ్య కర్మల ఫలితములను కంప్యూటరైజ్ చేసి ప్రారబ్ధముగ జీవులకు మరు జన్మలో వాటి ఫలితాలను అనుభవింప జేస్తాయి. తల్లి గర్భంలో నున్నప్పుడు జీవుల తలవ్రాతను వ్రాస్తాయి. జీవుల భూతభవిష్య ద్వర్తమానాలను నడుపుతాయి వగైరాలను పరిశీలించాం. ఇప్పుడు గ్రహముల స్థితులు, రాసులలో వాటి గమనములు వగైరాలను క్లుప్తంగ అవగాహన చేసుకొనుట సముచితమని అనిపిస్తున్నది.

తొలుత రాసులగురించి తెలిసికొందాం. మేషము, మిథునము, సింహము, తుల, ధనుస్సు, కుంభ, రాసులు బేసి రాసులు. వృష భము. కటకము, కన్య, వృశ్చికము, మకరము, మీన రాసులు సరి రాసులు. మేషము, కటకము, తుల, మకర రాసులు చర రాసులు. వృషభము, సింహము, వృశ్చికము, కుంభ రాసులు స్థిర రాసులు. మిథునము, కన్య, ధనస్సు, మీన రాసులు ద్విస్వభావరాసులు. కటక, వృశ్చిక, మీనరాసులు బ్రాహ్మణజాతి, మేషము, సింహము ధనుస్సు రాసులు క్షత్రియజాతి. మిథున, తుల, కుంభ రాసులు వైశ్యజాతి. వృషభ, కన్య, మకర రాసులు శూద్రజాతి. మేషము,

మిథునము, సింహము, తుల, ధనుస్సు, కుంభ రాసులు పురుష రాసులు. వృషభ, కటక, కన్య, వృశ్చిక, మకర, మీన రాసులు స్త్రీ రాసులు. మేషము, సింహము, ధనస్సు రాసులు ఎఱుపు రంగు. మిథునము, కన్య, మకర రాసులు పసుపు రంగు. వృషభము, కటకము, తుల రాసులు తెలుపు రంగు. మేష రాసికి తూర్పు దిక్కు, సింహ, ధనుస్సు రాసులకు ఆగ్నేయపు దిక్కు. వృషభ రాసికి దక్షిణ దిక్కు. కన్య, మకర రాసులకు నైఋతి దిక్కు. మిథునరాసికి పడమర దిక్కు. తుల, కుంభ రాసులకు వాయవ్య దిక్కు కటక రాసికి ఉత్తర దిక్కు. వృశ్చిక, మీన రాసులకు ఈశాన్యపు దిక్కు కటక, మకర మీన రాసులు పూర్ణజల రాసులు. వృషభ, ధనస్సు, కుంభ రాసులు అర్ధజల రాసులు. మేష, తుల, వృశ్చిక రాసులు పాదజల రాసులు. కన్య, మిథున, సింహ రాసులు నిర్జల రాసులు. ప్రారబ్ధ కర్మఫలముల ననుభవించుటకు ఆయా కర్మఫలముల ననుసరించి జీవి మరుజన్మలో ఆయా రాసులలో జనించును. అనగా రాసి యొక్క పై స్వభావములుగల జాతి, మనస్సు, బుద్ధి, గుణగణములు ఆరోగ్యము, వృత్తి, వివాహము, సంతానము, మరణము వగైరాలు గల ఫలితములను ఆయా రాసుల కధీనమై యుండునట్లు కలుగును. నక్షత్రముల గుణగణములు తూచా జీవికి వర్తిస్తాయి.

నక్షత్రములు ఇరవై ఏడు గదా! ఒక్కొక్క నక్షత్రానికీ నాలుగు పాదముల చొప్పున మొత్తం నూట ఎనిమిది పాదములు గలవు. అశ్విని భరణి నక్షత్రములు కృత్తికలో మొదటిపాదం మేష రాసికిని, కృత్తికలో 2, 3, 4 పాదములు, రోహిణి, మృగశిరలో 1, 2 పాదములు వృషభ రాసికిని; మృగశిరలో 3, 4 పాదములు ఆర్ద్ర, పునర్వసులో 1, 2, 3 పాదములు మిథున రాసికి; పునర్వసులో 4 వ పాదం పుష్యమి, ఆశ్లేష కటక రాసికి; మఖ, పుబ్బ, ఉత్తరలో

1 పాదం సింహారాసికి; ఉత్తరలో 2, 3, 4 పాదములు హస్త చిత్తలో 1 2 పాదములు కన్య రాసికి; చిత్తలో 3, 4 పాదములు స్వాతి, విశాఖలో 1 2, 3 పాదములు తులారాసికి; విశాఖలో 4 వ పాదం అనూరాధ జ్యేష్ఠ వృశ్చిక రాసికి; మూల పూర్వాషాఢ ఉత్తరాభాద్రలో 1 వ పాదం ధనుస్సు రాసికి; ఉత్తరాషాఢలో 2, 3, 4 పాదములు శ్రవణం ధనిష్ఠలో 1, 2 పాదములు మకర రాసికి; ధనిష్ఠలో 3, 4 పాదములు శతభిషం పూర్వాభాద్ర 1, 2, 3 పాదములు కుంభ రాసికి; పూర్వాభాద్ర 4 వ పాదము ఉత్తరాభాద్ర రేవతీలు మీనరాసికి కేటాయింప బడినాయి. ఈ నక్షత్రాలు ఇరవై నాలుగు గంటల నుండి ఇరవై ఆరు గంటల వరకు ఒక్కొక్క రాసిలో యుంటాయి.

- అదేవిధంగ చంద్రుడు ఒక్కొక్క రాసిలో అరవై గంట లుంటాడు. జీవి జననమైనపుడు చంద్రుడు ఏ రాసిలో యుంటాడో ఆ రాసిలో జీవి జనించినట్లు అర్థం. ప్రారబ్ధానుసారం జీవి ఆయా రాసిలో బుట్టును. అదేవిధంగ లగ్నం. ఉదయం సూర్యుడు తన మొట్టమొదటి కిరణాన్ని భూమికి తాకు సమయం లగ్నం అనబడు తుంది. ఈ లగ్న సమయాలు సుమారు 1-30 గంటలకు ఒక్కొక్క రాసిలో యుంటుంది లగ్నాలు కూడ ఒక్కొక్క రాసికి మారు చుండుట వలన లగ్నాలు పన్నెండు. తిథి అనగా అమావాస్య, పూర్ణిమల ప్రారంభ సమయం. శిశు జనన మప్పుడు ఏ రాసి ఏ లగ్నములో కలుగునో ఆ నిర్దిష్ట సమయంలో నవగ్రహములు ఏ ఏ రాసులలో నుండునో చక్రము వేసి చూడవలెను. బాగా అర్థం అయ్యేందుకు ఒక ఉదాహరణ. ఒక శిశువు సింహారాసి సింహా లగ్నములో పుట్టెను గత జన్మలో ఈ శిశువు అధికారము దర్ప ములతో జీవించే ననుటకు సింహారాసి నిదర్శనము. ఈ శిశువు

ముఖాకృతి శరీర నిర్మాణము సింహము వలె నుండును. అనగా గత జన్మలో మృగరాజు సింహము వలె బ్రతికెనని యర్థము. కాని ఈ జన్మలో పూర్వజన్మ అధికారాలు ఆర్భాటాలు చెలామణి కావు. ఏల యనగా ఇది పూర్వజన్మ వాసన మాత్రమే. మరియు జనశక్తు లుడిగిన ముసలి సింహము. అదే సింహలగ్నమైనందున ఈ జన్మలో ఎవరినీ ఖాతరు చేయని వ్యక్తిత్వము, తను చిరు ఉద్యోగి యైనను గృహిణి యైనను ముక్కు సూటిగా ప్రవర్తించుచూ ఇతరుల గుండె లలో నిద్రించుచూ ఋజుప్రవర్తనము కలిగియుండును. ఇతరులు ఈ వ్యక్తిని వేలెత్తి చూపని విధంగ నడచుకొనును. వీడు కనులతో చూచిన యెడల ఉరిమి చూచునట్లుండును. ఉరిమి చూచిన యెడల ఎదుటి వారూ చల్లబడి పోతారు.

పై దానివలన తెలియునదేమనగా ఏ రాసిలో జన్మనెత్తైవరో ఆ రాసియొక్క జాతి, స్వభావము, లింగము, మేనిరంగు, పూర్వ జన్మవాసన కలిగియుంటారు. ఏ లగ్నములో జనింతురో ఆ లగ్నము యొక్క మూర్తిత్వమును, గుణగణములను కలిగియుండును. జన్మించునపుడు గ్రహములు ఏ ఏ రాసులలో యుండునో ఆయా ఫలితములను జీవికి గ్రహములు అందిస్తాయి. రాసి, లగ్నము, నవగ్రహములు జన్మించినపుడు ఏవియో అవి జీవితాంతము శాశ్వ తంగ ఆయా ఫలితాలనే ఇస్తాయి.

మరియు నవగ్రహములు రాసి నుండి రాసికి మారుతూ ఆయా రాసిలో ఆయా ఫలితాల నిస్తుంటాయి. దీనినే దశాభుక్తి అంటారు. దశ అనగా భవిష్యత్తులో కలుగబోవు భుక్తి అనగా ఫలితములు అని అర్థం. సూర్యుడు 6 సంవత్సరములు, చంద్రుడు 10 సంవత్సరములు, కుజుడు 7 సంవత్సరములు, బుధుడు, 17 సం వత్సరములు, గురువు 16 సంవత్సరములు, శుక్రుడు 20 సంవత్సర

ములు, శని 19 సంవత్సరములు, రాహువు 18 సంవత్సరములు, కేతువు 7 సంవత్సరములు రాసి నుండి రాసికి మారుతూ దశాభుక్తి ఫలితాలను ఇస్తాయి.

ఈ నవగ్రహములుకూడ మిత్రులను, శత్రువులను, సమానులను కలిగియున్నవి. అది ఎట్లో పరికింతము. సూర్యునకు చంద్ర కుజ గురువులు మిత్రులు, శని శుక్రులు శత్రువులు, బుధుడు సముడు, చంద్రునకు సూర్యుడు బుధుడు మిత్రులు, కుజ గురు శుక్ర శనులు సములు, శత్రువులు లేరు. కుజునకు సూర్యుడు చంద్రుడు గురువు మిత్రులు, బుధుడు శత్రువు, శుక్రుడు శని సములు. బుధునకు సూర్యుడు శుక్రుడు మిత్రులు, చంద్రుడు శత్రువు, గురువు కుజుడు శని సములు; గురువునకు సూర్యుడు చంద్రుడు కుజుడు మిత్రులు, బుధుడు శుక్రుడు శత్రువులు, శని సముడు; శుక్రునకు బుధుడు శని మిత్రులు, సూర్యుడు చంద్రుడు శత్రువులు, కుజుడు గురువు సములు; శనికి బుధుడు శుక్రుడు మిత్రులు, సూర్యుడు చంద్రుడు కుజుడు శత్రువులు, గురుడు సముడు, రాహువునకు శుక్రుడు శని మిత్రులు, సూర్యుడు చంద్రుడు కుజుడు శత్రువులు, బుధుడు గురువు సములు; కేతువునకు సూర్యుడు చంద్రుడు కుజులు మిత్రులు, శుక్రుడు శని శత్రువులు, బుధుడు గురువు సములు. ఇవిగాక గ్రహములు కోణములు కేంద్రములలో నుండిన వేరే ఫలితముల నిచ్చును.

రాసిచక్రములో ఒకటే గ్రహం అనగా సూర్యుడు మాత్రం ఉన్నాడనుకొంటే వేరేవేరే జాతకాలలో ఒక్కొక్క రాసిలో ఉండటం వలన పన్నెండు రాసులలోను సూర్యుడు పన్నెండు రకాల ఫలితాల నిస్తాడు. ఇందువలన పన్నెండు రకాల జాతకాలు ఏర్పడతాయి. అదేవిధంగ ఇంకొక గ్రహం ప్రతిరాసిలోనూ వేరువేరు ఫలితాలనిస్తూ పై తెలిపిన సూర్యుని ఫలితాలతో కలిస్తే ఏర్పడే

రకాలు 12 × 12 = 144, చంద్రుడు రాసిని చూచిస్తాడు కాబట్టి చంద్రుని వదలి మిగిలిన ఎనిమిది గ్రహాలకు ఈ విధంగా లెక్కకడితే 53 74,77,120 రకాల గ్రహస్థితులు ఏర్పడతాయి నిష్టతో చేస్తేనే ఈ గ్రహస్థితులను వ్రాయవచ్చును. ఒకట జాతకాన్ని తీసికొని అందులో నవగ్రహాలూ, లగ్నం లెక్కించి రాసిచక్రం చేయవలెను. లగ్నం మూడువందల అరవై డిగ్రీలు కలిగియుంటుంది, కాని జ్యోతిష్యులు అరవై డిగ్రీలు మాత్రం లెక్కకట్టి ఫలితాలను చెప్పెదరు. కావున ఈ ఫలితాలు రమారమిగ సరిపోవులయు లేక ఫలితాలే తప్పు అనిపిస్తాయి.

జ్యోతిషశాస్త్రంలో పాండిత్యం పొందాలంటే ముందుగా అష్టాదశపురాణాలు, ఉపనిషత్తులు, వేదాంగములు, భారతభాగవత ములు, చదివి జ్ఞాపకం యుంచుకొనవలెను. ఎందువలననగా నవ గ్రహముల పుట్టుపూర్వోత్తరములు, వారి శక్తి యుక్తులు, అవి అను భవించిన ఆటుపోట్లు తెలుస్తాయి. వీటిని మనస్సులో పెట్టుకొని జాతకచక్రం చూసి జ్యోతిషం చెప్పిన చెప్పించుకొన్నవారు సంతృప్తు లయ్యెదరు.

పురాణాలు వగైరాలు చదివి ఆకళింపు చేసుకోవలయునని ఎందుకు చెప్పినానో ఈ క్రింది ఉదాహరణ మీకు బాగా అర్థం అవుతుంది. లగ్నం నుండి రాసులను ఎంచితే ఏడవరాసి వివాహ సంబంధమును సూచిస్తుంది. అనగా మగవాని జాతకమైతే రాబోయే భార్య ఏ కులమునకు చెందినది, ఎటువంటి గుణగణములు కలది యనే విషయాన్ని తెలుపుతుంది. ఈ ఏడవరాసిలో ఏ గ్రహాలూ లేకపోతే అది శుద్ధజాతక మాతుంది. అనగా ఈ జాత కునికి రాబోయే భార్య తన కులమునకు చెందినదిగాను, మంచి నడ వడికలు గలదిగాను యుంటుంది. అట్లుగాక లగ్నం నుండి లెక్కిం చితే వచ్చు ఏడవరాసిలో ఏదైనా గ్రహం యుంటే కులాంతర

వివాహం జరుగుతుంది. ఆ గ్రహ గుణములు ఆ అమ్మాయికి ఉంటాయి. ఆ గ్రహ కులమునకు చెందినదిగా అమ్మాయి యుంటుంది.

ఒక జాతకాన్ని పరిశీలించినాను. ఆ జాతకదారులు నాకు చాలా కావలసినవారు. శూద్ర కులస్థులు. ఆ జాతకం వారి కుమార్తెది. లగ్నం నుండి ఏడవ రాసిలో శుక్రగ్రహం ఉన్నది. అనగా ఈ అమ్మాయి వివాహం కులాంతర వివాహం. వరుడు బ్రాహ్మణ కులమునకు చెందినవాడు. ఈ పిల్ల పెరిగి పెద్దదైంది. ఉన్నతవిద్య నభ్యసించింది. ఉద్యోగంలో చేరింది. సహ ఉద్యోగిని ప్రేమించింది.

ఇతడు బ్రాహ్మణ కులమునకు చెందినవాడు, ఆరుమాసముల అనంతరం ఈ పిల్ల తన తల్లిదండ్రులతో తన ప్రేమకలాపాన్ని తెలిపి, అతనినే వివాహం చేసుకొంటానని పట్టుబట్టింది. తల్లి దండ్రులు మొదట్లో ఒప్పుకోలేదు. రానురాను తల్లి ఈ పిల్లను వెనకవేసుకొని వస్తూ భర్తను నిందించసాగింది. బంధువులు కొందరు పిల్లకు, పిల్ల తల్లికి నచ్చజెప్ప ప్రయత్నించి విఫలులైరి. తుదకు ఘనంగ ఈ ప్రేమికులకు వివాహం జరిపించిరి.

ఇక్కడ శుక్రగ్రహం యొక్క పూర్వాపరాలను విచారించవలెను. శుక్రుడు బ్రాహ్మణుడు. కావున బ్రాహ్మణ కులస్థుడు వరుడైనాడు. శుక్రుడు మృత్యుంజయ మంత్రం కూడ తెలిసిన బలశాలి. కావున మధ్యవర్తిత్వాలు విఫలమైనాయి. శుక్రుడు స్త్రీ గ్రహం కావున పిల్ల తల్లి పిల్లను వెనకేసుకొని వచ్చింది. శుక్రుడు తెలుపు వర్ణము. కావున వరుడు బాగా తెలుపు వర్ణంతో నున్నాడు. శుక్రునకు ఆగ్నేయదిక్కు. అమ్మాయి వాళ్ళ ఊరికి ఆగ్నేయ దిక్కులో వరుని స్వగ్రామం.

లగ్నం నుండి ఈ శుక్రుడున్న ఏడవరాసి సింహరాసి. సింహము అజేయము, అరివీర భయంకరము కావున మధ్యవర్తనములు ఏమియు ఈ జాతకాన్ని మార్చేందుకు వీలుపడలేదు. ఆదేవిధంగ సింహరాసి స్థిరరాసి. శుక్రుడు స్థిరరాసిలో తిష్టవేసినాడు. కావున ఈ గ్రహ ఫలాన్ని అధిగమించేందుకు ఎవరితరమూ కాలేదు. సింహ రాసి పురుషరాసి అనగా సర్వస్వతంత్రుడు, స్వశక్తికలవాడు. ఇన్ని బలీయమైన కారణాలున్నందుననే ఎవరూ ఏమీ చేయలేక రాసి గ్రహ ఫలితములకు తలలు వంచి వివాహకార్యాన్ని నెఱవేర్చిరి. మరియు ఈ అమ్మాయిది కుంభరాసి, స్థిరరాసి, ధనిష్ఠా నక్షత్రం మూడవపాదం. నక్షత్ర రీత్యా ఈ పిల్ల నిష్కర్షమైన స్వభావము గలదియు, ధైర్యము గలదియు, న్యాయమును నిరూపించెడు స్వభావము గల సద్గుణములు కలిగినందున ప్రేమించినవాడితో లేచిపోక తల్లిదండ్రులకు విషయాన్ని తెలిపి, వారికి నచ్చచెప్పి తన కార్యాన్ని సాధించుకొన్నది.

పై వాటిని గూర్చి మనకు తెలియున దేమనగా నవగ్రహములు జీవి యొక్క భూతభవిష్యద్వర్తమానములను నడిపిస్తాయి. మంత్రతంత్రాలు, దేవుళ్ళు, దెయ్యాలు ఏమీ చేయలేవు అని నిర్ధారణ కలిగింది. డబ్బు, పదవులు అసలే పనిచేయవు. కావుననే వేమనయోగి మానవ జీవితాలను గ్రహాలు నడిపిస్తాయి, మనిషి నిమిత్తమాత్రుడని ఈ క్రింది విధంగ చెప్పినాడు.

1. వ్రాత కొలది గాని వరమీడు దైవంబు<br>చేత కొలది గాని వ్రాత లేదు<br>వ్రాత కజుడు కర్త చేతకు తాకర్త<br>విశ్వదాభిరామ వినుర వేమ.

2. ధర గ్రహములు రాసి చరియించు చుండిన<br>మంచి చెడుగు కానుపించుచున్న<br>పురుష యత్నమనుచు బొంకుదు వేలరా<br>విశ్వదాభిరామ వినుర వేమ.

---

# కర్తవ్యం

ఈ ప్రస్తుత సృష్టి అనాది నుండి అవిచ్ఛిన్నంగాను ఉత్తరోత్తరాభిముఖంగాను సాగుచున్నది. నాగరికత, సంపద, వైభోగం అనంతంగ యున్నది. కాని సృష్టి ప్రస్తుతం పూర్వ వైభోగం పూర్వ ధర్మపథంతో సాగుట లేదు. ఉన్నవాడు చాల లేదంటున్నాడు, లేనివాడు లేదే అంటున్నాడు. అశాంతి ప్రతి కుటుంబంలోను, గ్రామంలోను, దేశంలోను, దేశాలమధ్యను విలయతాండవం చేస్తున్నది, ప్రపంచంలో ఆయా మతములకు సంబంధించిన గుళ్ళు గోపురాలు లెక్కకు లేవు. ఉత్సవాలు పండుగ పబ్బములు అన్ని మతస్థులూ చేస్తున్నారు. తీర్థయాత్రలు చేస్తున్నారు. కాని మనశ్శాంతిని పొందలేక పోతున్నారు. ఇందులకు కారణం తమ దైవదత్తమైన జీవితాన్ని బుద్ధి ప్రకారం కాకుండ మనస్సు ప్రకారం నడుపుటవలననే. సృష్టిని ధర్మపథంలో నడుపుట మానవులమైన మన విధి, ఈ లక్ష్య సాధనకు సమస్త మానవులూ ఒకే మాటపై నిలిచి ఒకే బాటపై నడిచి తమ ప్రథమ కర్తవ్యాన్ని విధ్యుక్త ధర్మాన్ని నెరవేర్చవలెను.

లోకోద్ధరణ కోసం ద్వాపర యుగాంతమున భగవద్గీత బోధింపబడింది. కలియుగ వాసులను దృష్టిలో నుంచుకొనియే భగవద్గీత అవసరం ఆనాడు ఏర్పడింది. దుష్టశిక్షణ శిష్టరక్షణ యనునవి ద్వాపర యుగంనాటి విషయాలు. కలియుగంలో అందరు మానవులూ

సమానులే. రాజ్యాంగం, చట్టం వగైరాలను ఏర్పరచుకొని వాటి గొడుగు నీడలో అనేకానేకులు తప్పుదోవలో నడుస్తున్నారు. కలియుగంలో అధర్మం నాలుగు పాదాలతో నడుస్తుందని భారత భాగవతాలు చెప్పుచున్నవి. అనగా మానవులు ధర్మాన్ని విసర్జించి విచ్చలవిడిగ ప్రవర్తిస్తారు అని అర్థం. కావుననే ఏసుక్రీస్తు 'పాపులను రక్షిద్దాం' అని బోధించినాడు, దీని అర్థం మానవులందరూ తప్పులు చేయువారు. కావున మానవులనందరిని సన్మార్గంలో పెట్టవలయునని కదా. ఈ 'పాపులను రక్షిద్దాం' అనే సిద్ధాంతం కూడ ఆచరణలో ఫలితాలను ఇవ్వటం లేదు. కలియుగ ప్రారంభం నుండీ ఈ సుమారు 5,100 సంవత్సరములుగా భగవద్గీతోపన్యాసములు, అద్దాని పఠనములు ఎందరో గావించిరి. కాని ఫలితం ఆశించినంతగ లేదు. భగవద్గీతలో చెప్పిన యోగప్రాణాయామాలను ఆచరించిన ఏ కొద్ది మందో బాబాలుగ, అవధూతలుగ లోకకల్యాణం చేసినారు. ఇంకను కొందరు చేయుచున్నారు. మిగిలినవారు శ్రవణం, పఠనం వరకే తమ బుద్ధిని నిలుపుదలచేసి నిజజీవితంలో ధర్మాన్ని ఆచరించుట లేదు. దీనికి కారణం ఉపన్యాసాలను విన్నంతవరకు, వాటిని చదివినంతవరకు ఆ విషయాలు బోధపడినట్లు అనిపిస్తాయి తర్వాత మరు క్షణం నుండి ఏ విషయమూ మనసులో యుండదు. ఈ విధంగ ఎందుకు జరుగుచున్నదని పరిశీలిస్తే ఒక విషయం అర్థమౌతుంది. అభ్యాసము లేనందువలన శ్రవణమననాదులు నిష్ఫలము లగుచున్నవి. అభ్యాసము కూసువిద్య. అభ్యాసము లేని విద్య ఒంటపట్టదు.

అదేవిధంగ బుద్ధుడు శరణువేడుమని నుడివినాడు. బౌద్ధమత స్థలలో కూడ శాంతిలేదు. ఎందులకు ? అభ్యాసము లేని మతబోధక పుస్తక జ్ఞానం మాత్రం అన్నిమతాలలో యున్నది. కావున శాంతి 'తృప్తి' అనేవి పుస్తకాలు ఉపన్యాసాల వరకు పరిమితమైనవి. అను

భవంలో అరిషడ్వర్గాలే విలయతాండవం చేస్తున్నవి. ఈ అరిషడ్వ ర్గాలను సంతృప్తి పరిచేందుకు త్రేతాయుగంలో వివిధ ఆయుధాలను సమంత్రకంగ కనుగొని తమవద్ద చాలామంది ఉంచుకొన్నారు. జీవి పుట్టితే మరణం తథ్యం. అదేవిధంగ ఈసమంత్రకమైన మారణాయు ధాలు కూడ నశించవలసినదే. కావుననే రామరావణ యుద్ధం జరిగి సమంత్రకమైన మారణాయుధములన్నియు నశించినది. మరల ద్వాపరయుగంలో సమంత్రకమైన ఆయుధములు విచ్చలవిడిగ యోగ్యులు అయోగ్యులు అనే తరతమ భేదం లేకుండ ఎవరెవరో పొంది విర్రవీగుచుండిరి. మహాభారతయుద్ధం నెపంతో ఈ సమంత్రక మారణాయుధాలు నశించినాయి. తర్వాత కలియుగంపుట్టింది. కలియుగంలో క్షిపణులు, అణుబాంబులను తయారుచేసి దేశదేశ స్థులు ఒకరి మనుగడకు ఒకరు తలనొప్పియైనారు, ఈ ఆయుధము లన్నియు నశించవలసినదే. ఇవి ఊరికే నశించవు. ప్రయోగింపబడి సర్వనాశనం చేసి తర్వాత నామరూపాలు లేకుండ పోతాయి.

05-2 1962 నాడు అష్టగ్రహకూటమి జరిగిన విషయం అందరికీ తెలిసిందే. ఈ అష్టగ్రహకూటమి ఎందులకు ఏర్పడింది? ప్రపంచయుద్ధాన్ని తెచ్చి క్షిపణులు అణుబాంబులను నాశనం చేయు టకుగాను అష్టగ్రహకూటమి ఏర్పడింది. ప్రపంచయుద్ధం ఎప్పుడు వస్తుంది? జూలై నెల 1999 లో ప్రారంభమై 2009 సంవత్స రంలో అంతమౌతుంది, ఎప్పుడో 1962 సంవత్సరంలో వచ్చిన అష్టగ్రహకూటమి అప్పుడే తన ప్రభావాన్ని చూపకుండ ఎప్పుడో 1999 సంవత్సరంలో చూపుటకు కారణం ఏమిఅని సందేహం కలుగవచ్చును. గాంధీమహాత్ముడు పుట్టింది 02-10-1869 నాడు ఆయన పెరిగిపెద్దవాడై సుమారు 60 సంవత్సరములు పోరాడి భారతదేశానికి స్వాతంత్ర్యాన్ని సంపాదించి ఇచ్చినాడు. ఆయన

పుట్టినదే స్వాతంత్ర్యాన్ని సంపాదించలేదు. అదేవిధంగ 1962 సంవత్సరంలో సంభవించిన అష్టగ్రహకూటమి తన ప్రభావాన్ని 1999 - 2009 A. D. లో చూపుతుంది.

ఈ అష్టగ్రహకూటమి ప్రభావం వలన అణునిరాయుధీకరణ, అణువిచ్ఛిన్న కార్యక్రమాలు నెరవేరుట లేదు. ఆయా దేశాలకు వారివారి కారణాలు వారికి ఉన్నాయి. సంధులు పొసగుట లేదు. పశ్చిమ రాజ్యాలలో అవిచ్ఛిన్నంగ అక్కడక్కడ యుద్ధాలు 1962 సంవత్సరం నుండి జరుగుతూనే యున్నాయి. ఎన్నో లక్షలమంది సైనికులు, సాధారణ ప్రజానీకం చచ్చిన విషయం అందరూ జ్ఞాపకం చేసుకొండి. ఇంకను అక్కడక్కడ యుద్ధాలు సామ్రాజ్య వాద పోరులు జరుగుచునే యున్నవి. ఇవి అన్నీకలసి ఏకమై 1999 సంవత్సరం ప్రపంచయుద్ధంగ రూపాంతరం చెందుతుంది. ఫలితం ప్రపంచంలోగల సర్వమారణాయుధాలు నాశనమౌతాయి. ప్రపంచ జనాభాలో మూడింట రెండు భాగాలు నశిస్తుంది. తర్వాత 2010 సంవత్సరంలో శాంతి ఏర్పడుతుంది. విశ్వసాభ్రాతృత్వం నెల కొంటుంది.

తెలిసి చేజేతులా సర్వం నాశనం అయిన తర్వాత ఏర్పడే శాంతి సుస్థిరతలు శ్మశాన నిశ్శబ్దంగాని మరియొకటి కాదు. రాబోయే ప్రపంచయుద్ధాన్ని బుద్ధిబలంతో నివారించవచ్చును. ఏవిధంగ అని సందేహం కలుగుతుంది.

వర్షం ఎడతెరపి లేకుండ కురుస్తున్నది. నేను కార్యాలయా నికి పోవలెను. వర్షం కురుస్తున్నదని కార్యాలయానికి పోకుండ నిలిచిపోతానా ? వర్షకారణంగ కార్యాలయానికి రాలేదు అంటే అధికారి ఊరకుంటాడా. కావున గొడుగును తీసికొని ఆ గొడుగు సాయంతో వర్షంలో తడువకుండ కార్యాలయాన్ని చేరుతాను,

ఇది బుద్ధిబలంతో చేయుపని. అదేవిధంగ ఎక్కడనో యుద్ధంవస్తే నాకేమి అనియో, వాడు తప్పు చేసినాడు కావున వాణ్ణి నేను శిక్షిస్తాను అనియో దేశాలు, దేశాధినేతలు, ప్రజలు పంతాలు పట్టింపులకు లోనుకాకుండ ఆత్మరక్షణ ఒకప్రక్క చేసుకొంటూ ఇంకొకప్రక్క శాంతి ప్రయత్నాలు చేయవలెను,

స్త్రీ పురుష తారతమ్యం లేకుండ ప్రతిమానవుడూ యోగ ప్రాణాయామాలను ఆచరించితే అష్టగ్రహకూటమి ప్రభావం తొలగి పోతుంది. యోగప్రాణాయామాల వలన సర్వులు ఆత్మతృప్తి మనశ్శాంతి కలిగియుంటారు. క్రొత్తగా మారణాయుధాలను తయారు చేయరు, ఉన్నవాటిని తమకు తామే నాశనం చేస్తారు. ఈ యోగప్రాణాయామాలు విశ్వజనావళి శ్రేయస్సుకు, లోకకల్యాణానికి దోహదపడతాయి. ఇందులకుగాను ఈ క్రింది పద్ధతులను అనుసరించవలసినదిగా నా మనవి.

**విద్య:-** సూర్యచంద్రుల వలె స్వచ్ఛత నాపాదించుకొన్న నిశిత దృక్కుల నిర్మలహృదయులు, లేగులాబి గుప్పిట భావి జీవితాన్ని భద్రపరచుకొన్న పసిడి బొమ్మలు చిన్నారిపిల్లలు. శోక మోహాఘాచ్ఛిన్నమైన ఈ విశాల విశ్వమందు నిత్యం చిరునవ్వుల వెన్నెలలు ప్రసరించే ఆనందదీపికలు ఈ పిల్లలు. విద్యాభ్యాసంకోసం బడులకు పోయే పిల్లలు ఏమి అభ్యసిస్తున్నారు? ధనార్జన, ఉన్నతమైన పదవులుపొందే విద్యనభ్యసించు చున్నారు. అనగా అరిషడ్వర్గాలను రూపాంతరంగ పిల్లలు అభ్యసిస్తున్నారు. విద్యాలయాలు అరాచకాలకు కులమత కలహాలకు సంఘవిద్రోహ శక్తులకు నిలయములుగ నున్నవి. క్రమశిక్షణారాహిత్యం, నైతికవిలువలకు తిలోదకాలిచ్చుట, నీతినియమాలకు విఘాతం కలిగించుట విద్యార్థుల లక్ష్యంగ యున్నది. తమ బంగారు భవిష్యత్తును, తమలను నమ్మి

కొన్నవారిని వమ్ముచేయుట వీరి ఆశయముగా నున్నది. ప్రతి సంవత్సరం విద్యాలయాలు పట్టభద్రులను ఉత్పత్తిచేసి సంఘానికి అందజేస్తున్నాయి. ఈ పట్టభద్రులు ఈర్ష్యాద్వేషాలకు లోనై, తమను, తమ గమ్యస్థానాన్ని, కర్తవ్య నిర్వహణను, స్వధర్మాన్ని, లోకధర్మాన్ని విస్మరించి ప్రవర్తిస్తున్నారు. ఇటువంటి విద్యార్థులు విద్యాభ్యాసానంతరం తమ తల్లిదండ్రులకుగాని, సంఘానికిగాని, దేశానికిగాని, విశాల విశ్వానికిగాని చేసేది ఏమీ ఉండదు.

ప్రపంచానికి భావిపౌరులు బాలబాలికలే. కావున వీరిని మంచిపౌరులుగ తీర్చిదిద్దే విద్యాభ్యాసం అవసరం. ప్రస్తుతమున్న విద్యను సంస్కరించాలి. పెద్దబాలశిక్ష చదివినవారు ఎందరో మహనీయులైరి. పట్టభద్రులైన వారెందరో నిరర్థకులైరి. జాతి జీవన విధానాన్ని, జీవకళను సమగ్రరూపంలో నొనగూర్చే విద్య ఈనాడు ఎంతైనా అవసరం, కర్తవ్యనిర్వహణ, స్వధర్మాచరణ, ధర్మమునకు విరుద్ధముకాని కార్యములను నిష్కామముగ నాచరించుట, సుఖదుఃఖముల యందు సమభావము కలిగియుండుట వగైరాలను విద్యార్థులకు సోదాహరణంగ నేర్పాలి. ఎటువంటి విపరీత పరిస్థితులు ఎదురైనను అంతయు తన మంచికే అని స్థిరబుద్ధి కలిగియుండు విధానాన్ని అభ్యసింప జేయాలి.

యోగాభ్యాసాన్ని ప్రాథమిక తరగతుల నుండియే విద్యార్థులను అభ్యసింపజేయాలి. ఆసనాభ్యాసం వలన బుద్ధి వికాసత, మంచి ఆరోగ్యం, చురుకుదనం కలుగుతాయి. పదునైదవ ఏట నుండి ప్రాణాయామాన్ని అభ్యసింపజేయాలి. విద్యాభ్యాసానంతరం ఈ విద్యార్థులు సంఘంలో మెళకువగ నడచుకొందురు. మానవ జీవిత లక్ష్యాన్ని తమ గమ్యాన్ని గుర్తించుకొని పదుగురు శ్రేయస్సు కోసం, లోకకల్యాణం కోసం, పరమపదం కోసం నిజజీవితంలో

పాలుపడెదరు. ప్రకృతీ ప్రపంచం వీరికి అతి స్వల్పమైన ఆటవస్తువు లుగ అర్థమౌతుంది. ఆశాపాశములు ఉండవు. మనస్సు చిత్తము బుద్ధి ఏకాగ్రత వహించి కర్తవ్య నిర్వహణ ధర్మప్రవృత్తి అలవడి ఆచరణలోకి వస్తాయి జ్ఞానం తనిచ్చగ యథేచ్ఛగ కలుగుతుంది. విజ్ఞానం విశ్వమానవ శ్రేయస్సుకు దోహదపడుతుంది.

2. స్త్రీలు:- మనిషికి ఏ చక్షువైనా ముఖ్యమే. అదేవిధంగ సమాజానికి స్త్రీపురుషు లిరువురూ చక్షువుల వంటివారు, సమానులు. స్త్రీపురుషు లిరువురికీ మాతృస్థానమైన స్త్రీ, పురుషుని ఆధీనంలో యుండవలసినదే. అప్పుడే సృష్టి కార్యము సక్రమంగ జరుగుతుంది. ఈనాడు ఇంతటి అద్వితీయమైన విజ్ఞానం వుండి కూడ ప్రపంచంలో సుఖశాంతులు లేవంటే, ఆ బాధ్యత స్త్రీజాతిదే, ఇదివరకే పుట్టి ఇప్పుడు జీవిస్తున్న వారిని మనం మార్చలేము. పుట్టుకతో వచ్చిన బుద్ధులు పుడకలతో పోవలసిందే. ఇక పుట్టబోయే సంతానాన్ని గురించే మనం ఆలోచించ వలసినది. భావి సంతానం సుఖశాంతు లతో మనగలగాలంటే స్త్రీజాతి త్రికరణశుద్ధిగ కుటుంబ జీవితం గడిపేటట్లు ప్రచారసాధనాల ద్వారాను, ఉపన్యాసాల ద్వారాను స్త్రీలను చైతన్యవంతం చేయుటకు ప్రత్యేక ఉద్యమం కార్యాచరణ ప్రణాళికలు తేవలెను. సాంఘిక కట్టుబాట్లకు, సంస్కృతి సంస్కార ములకు దర్పణములుగ యుండునట్లు స్త్రీజాతిని తీర్చి దిద్దవలెను, శాస్త్రాలలోని మడులు, ఆచారాలు, వ్రతములు, పండుగ వేడుకలను స్త్రీలు తూచ అనుష్టించునట్లు చేయవలెను. ఇది మొదటిది.

రెండవది ప్రసూతి గృహములు. ఇవి కోకొల్లలుగ స్థాపింపబడి యున్నది. ఈ ప్రసూతి గృహాలను "సత్సంతాన కేంద్రాలు"గ నామకరణం చెయ్యాలి. ప్రతి ప్రసూతి గృహంలోను అనేక సద్గ్రంథాలుండునట్లు వ్యక్తులుగాని, సంస్థలుగాని, ప్రభుత్వముగాని

ఏర్పాట్లు చెయ్యాలి. గర్భం ధరించిన స్త్రీలను మొదటిమాసం గర్భంనుండి సత్సంతాన కేంద్రాలలో నుంచి 'గుణగణములు' శీర్షికలో చెప్పబడిన విధంగ గర్భిణీ స్త్రీలను బహుజాగరూకతతో కాపాడుకొనుచూ రావలెను. సత్సంతాన కేంద్రాలలో గర్భిణీ స్త్రీలను చేర్చుటకు ఇష్టపడనివారు తమ ఇండ్లలోనే గర్భిణీ స్త్రీలకు సద్గ్రంథాలను అందుబాటులో నుంచి గర్భిణీస్త్రీలు వాటిని చదువునట్లు తప్పక చూడవలెను. ఈ విధాన అవలంబనవలన జనించిన సంతానం లోకోద్ధారకులు, లోకకల్యాణకారకులునై యుండి తల్లిదండ్రులకూ, వంశానికీ, గ్రామానికీ, దేశానికీ, ఖ్యాతిగడించి, యావత్ మానవకోటికీ ఆదర్శపరులుగ నుందురు. త్యాగానికీ, కష్టాలు భరించడానికి మూర్తీభవించిన క్షమాదేవతలు స్త్రీలు. ఓరిమి వీరి పెన్నిధి. కావున స్త్రీలను బహు జాగరూకతతో కాపాడుకొనుచూ రావలెను.

సినిమాలల్లో హింసాత్మక దృశ్యాలు ఉన్నవి. వీటిని గర్భిణీ స్త్రీలు చూడరాదు. పౌరాణిక నాటకాలు, వాటికి సంబంధించిన ఇతివృత్తాలు అవతార పురుషుల జీవితచరిత్రలకు సంబంధించిన దృశ్యాలు, ఆధ్యాత్మిక ఉపన్యాసములు, పీఠాధిపతుల ప్రవచనాలు, దేవాలయములలో జరిగే బ్రహ్మోత్సవాలు, పూజాదికాలు, వగైరాలను దూరదర్శన్‌లో ప్రతిరోజూ కనీసం మూడు గంటలన్నా ప్రసారం చేయవలెను. ఆధ్యాత్మిక సంబంధమైన విషయాలను ప్రసారం చేయుటకు ప్రత్యేకంగా ఛానల్ పెట్టుట మరీమంచిది. అదేవిధంగ వార్తాపత్రికలలో దోపిడీలు, హత్యలు, మానభంగాలు,

ఆక్సిడెంట్లు గురించి ఇందరు చచ్చినారు, అందరు చచ్చినారు అని విరివిగా వార్తలు ప్రచురితమౌచున్నవి. ఇటువంటి వార్తలను ప్రత్యేకంగా లోపలి పేజీలో ఏదోయొక పేజీలో ప్రచురించితే, గర్భిణీస్త్రీలు ఆ ప్రత్యేక పేజీని చదువకుండ యుండగలరు. తద్వారా ఈ చెడు వార్తల ప్రభావం గర్భస్థ శిశువుపై బడకుండ యుంటుంది.

3. ఇతరులు.- లోకంలో ధర్మరక్షకులూ, ధర్మభక్షకులూ మగవారే. లోకాన్ని నడిపించేదీ వీరే, జన్మనిచ్చిన స్త్రీని అబలను చేసిందీ వీరే, సాంఘిక రాజకీయ ఆర్థిక అసమానత్వాలకూ, అశాంతికీ కారణం వీరే. చరిత్ర పుటలను తిరగవేసిన యెడల మగవారి అకృత్యాలు, వినాశకర ప్రవృత్తులు కోకొల్లలుగ మగవారి వలననే జరిగినదని రూఢియగుచున్నది. కనీసం పదిశాతం మగవారు క్రమశిక్షణ కలిగియుంటే సువర్ణయుగాన్ని చేపట్టవచ్చును. క్రమశిక్షణను సాధిస్తే త్రికాలాలను ఆకళింపుచేసుకొని కష్టనష్టాలను, సుఖదుఃఖాలను సమభావంతో చూస్తూ అల్పానికి అత్యాశకు అందరానిదానికి పాకులాడరు. ఆత్మసంతృప్తుడౌతాడు. ఆత్మసంతృప్తి పొందాలంటే భూనభోంతరాళాలను క్షణంలో చుట్టిరాగల మనస్సును స్వాధీనపరచుకోవాలి. మనస్సును స్వాధీనపరచుకోవాలంటే యోగాభ్యాస సహిత ప్రాణాయామ్నా నియమాఆచరించాలి. అప్పుడు పురుషుడు సద్యోమార్గాన నడుస్తాడు, ధర్మాన్ని రక్షిస్తాడు.

కావున యౌవనం దాటిన ఆడ మగ అందరినీ, వారు కార్యాలయంలో వుండనీ, కర్మాగారంలో వుండనీ, కారాగారంలో వుండనీ,

నిరుద్యోగిగా యుండనీ, అందరినీ యోగ ప్రాణాయామములు ఆచరించునట్లు చేయవలెను. వీరికి దైనందిన కార్యక్రమాలలో స్వాధ్యాయనమును మరువకుండుట, సత్యమునే పలుకుట, వంశమును నిలుపుకొనుటకు గాను సత్సంతానమును బడయుట, అనింద్యకర్మలను అవశ్యమైననే ఆచరించుట, కుశలము నుండి కల్యాణకర్మల నుండి ప్రమాదము నొందకుండుట, యమనియమకర్మ రాజయోగముల నాచరించుట మున్నగు వాటిని నిక్కచ్చిగ నాచరించునట్లు చేయవలెను. ఈ విధంగ తర్ఫీదు పొందిన వారు ధర్మాధర్మ నిర్ణయ సమర్థులు, కర్మ స్వాతంత్రులు, పరమ సౌమ్యులు, ధర్మ కాములు నగుదురు. అందువలన విశ్వశాంతి, విశ్వసౌభ్రాతృత్వం, ఆత్మతృప్తి, అభివృద్ధి ఒనగూడుతాయి.

1999 సంవత్సరంలో ఎటూ మూడవ ప్రపంచయుద్ధం వస్తుంది. పది సంవత్సరములు నిరాఘాటంగ సాగుతుంది. సర్వనాశనం ఖాయం. దీనిని నివారించాలంటే ఏకైక మార్గం యోగ ప్రాణాయామాలే. ఇక్కడ అనుభవ పూర్వకమైన అందరికీ తెలిసిన ఉదాహరణ ఒక్కటి మీముందుంచుతాను. 1984 సంవత్సరంలో భోపాల్ నగరంలో అతిపెద్ద గ్యాస్‌లీక్ ప్రమాదం జరిగింది. ఈ విషగాలికి ఎటుచూచినా కుప్పలితిప్పలుగా జనం మరణించినారు. ఎందరో శాశ్వత అనారోగ పీడితులైనారు. కాని ఒక మహారాష్ట్ర వ్యక్తి కుటుంబం ఈ గ్యాస్‌లీక్ బారిన పడలేదు. ఎందుకనగా ఈ కుటుంబం నిత్యం తమ ఇంటిలో యజ్ఞం చేస్తుండేది. ఈ యజ్ఞ

ఫలితం ఈ కుటుంబాన్ని కాపాడింది. ఈ గ్యాస్‌లీక్ భూమిపై గల కర్మాగారం నుండి వచ్చినందున వేలకొలది చనిపోయినారు. నిత్యం యజ్ఞం చేసేవారిని ఏమీ చేయలేకపోయింది. కాని ప్రపంచ యుద్ధంవస్తే ఆకాశం నుండి రాకెట్లు, క్షిపణులు, అణుబాంబులు వేయబడతాయి. యజ్ఞయాగాదులు ఈ విపత్తును అడ్డుకోలేవు. ఏలంటే యజ్ఞయాగాదులు వాతావరణం శుద్ధిచేయుట వలన, గ్యాస్ లీక్ యొక్క విషవాయువు శుద్ధికాబడి యజ్ఞంచేసిన కుటుంబం ప్రమాదం నుండి బయటపడింది. క్షిపణులు, అణుబాంబులు ఆకసమునుండి వేయబడుటవలన కొన్ని కిలోమీటర్లు క్షణంలో సర్వనాశనం చేస్తాయి. యోగప్రాణాయామాలు చేస్తే అణుబాంబులు వేయిబడినా యోగిని ఏమీ చేయలేవు. ఎందుకనగా యోగి పరబ్రహ్మస్వరూపం. పరబ్రహ్మకు భిన్నరూపమే వికృతరూపమైన అణుబాంబు. కావున అణుబాంబులు, క్షిపణులు యోగప్రాణాయామం చేసేవారిని ఏమీ చేయలేవు.

కావున అందరూ యోగప్రాణాయామాన్ని ఆచరిద్దాం. కలియుగాన్ని శాంతియుగంగ మార్చుదాం. అందరూ సుఖిద్దాం.



ఓమ్







వర్షం బొట్టులు అనేకానేకం కలిసి ఏరులై, నదులై ప్రవహిస్తాయి. అదేవిధంగా కాలం నడుస్తుంది. క్షణాలు సెకండులుగా, సెకండులు నిమిషాలుగా, నిమిషాలు గంటలుగా, గంటలు రోజులుగా, రోజులు పక్షములుగా, పక్షములు మాసములుగా, మాసములు ఋతువులుగా, ఋతువులు ఆయనములుగా, ఆయనములు సంవత్సరములుగా, సంవత్సరములు యుగాలుగా నడక సాగిస్తుంది. కాని ఏమి జరిగినా క్షణములోనే జరుగుతుంది. ఈ జరుగుట అనేది ముందుగానే నిర్ణయింపబడిన 'కాల నిర్ణయం' ఎవరూ దీనిని అధిగమించలేరు. క్షణాన్ని అర్థం చేసుకొని నిమిత్త మాత్రులుగా నుండుటే ఉత్తమం. కష్టాలు సుఖాలు వస్తూపోతూవుంటాయి. కష్టాలకు క్రుంగిపోరాదు, సుఖాలకు పొంగిపోరాదు. అన్నీ కాలనిర్ణయమేయని తెలిసికనివారు స్థితప్రజ్ఞులవుతారు.

నాకు అన్యాయం జరిగింది. నిష్పక్షపాతంగా వ్యవహరించవలసిన అధికారులే దొంగతనానికి కూడా పాల్పడి నాకు తీరని అన్యాయం చేశారు. ఈవిధంగా ఎందుకు జరిగిందని పరిశీలిస్తే 'కాలనిర్ణయం' గా తేలింది. వివిధరకాలైన గుణగణములు గలవారు ఎందుకు పుట్టెదరు? అందరూ మంచిగుణాలు గలవారుగా ఎందుకు పుట్టరు అని మౌనంలో తరచి చూడగా ఎన్నెన్నో ఆవేశపూరితమైన విషయాలు తెలిశాయి. గుణగణములు, ఆయుష్షు, అదృష్టం, తలవ్రాత వగైరాలు భిన్నంగా మానవులకు కలిగిన విధం బోధపడింది. వీటన్నిటికి కారణం కర్మఫలమే అని నిశ్చయమైంది. కాల నిర్ణయం చేసేది కాలం కాదు మానవుడే. ఇది నిజం.

రచయిత.